# అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు

## తులనాత్మక అధ్యయనం

# అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు
## తులనాత్మక అధ్యయనం

ప్రొఫెసర్ ఎస్. గంగప్ప

శశీ ప్రచురణలు
సి/73, శ్రీనివాసనగర్ కాలనీ
గుంటూరు - 522 006

అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు తులనాత్మక అధ్యయనం

(A Comparative Study of Annamacharya with Famous Saint-singers)


రచయిత

ప్రొఫెసర్ ఎస్ గంగప్ప, ఎం.ఏ., పిహెచ్.డి
తెలుగు, ప్రాచ్యభాషావిభాగం,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జుననగర్ - 522 510, గుంటూరుజిల్లా





ప్రథమ ముద్రణ అక్టోబర్ 1992

ప్రతులు 1000

వెల రూ. 80/-

ముఖచిత్ర చిత్రణ శ్రీ శీలా వీర్రాజు

ప్రతులకు

శ్రీమతి ఎస్ పార్వతమ్మ
శశి ప్రచురణలు
సుధర్మ, సి/73, శ్రీనివాసనగర్ కాలని,
గుంటూరు - 522 006

---

ముద్రణ శ్రీలక్ష్మీగణపతి ప్రింటర్స్, 2/4, అరండల్ పేట, గుంటూరు

# విషయసూచిక

# కృతజ్ఞతలు

నా పరిశోధన కొనసాగించడానికి, ఈ గ్రంథరూపం ధరించడానికి సీనియర్ రీసర్చి ఫెలోషిప్పు ప్రదానం చేసి సహాయ సహకారాలందించిన కేంద్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల (ప్రస్తుతం మానవ వనరుల) శాఖ వారికి

నా ఈ గ్రంథ ముద్రణకార్యం ఆర్థిక సాహాయ్యం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణ మండలికి

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం గ్రంథాలయం వారికి, నాగార్జున విశ్వవిద్యాలయం గ్రంథాలయాధిపతి శ్రీ సుందర కోటేశ్వరరావు గారికి, వారి సిబ్బందికి

నా పరిశోధన కవసరమైన అపూర్వ గ్రంథాలు తమ సొంత గ్రంథాలయం నుంచి అందించిన ప్రసిద్ధ సంగీత విదుషీమణి శ్రీమతి చల్లా కామేశ్వరి (విజయవాడ ఆకాశవాణి సంగీతం ఆడిషన్ కమిటీ సభ్యురాలు) గారికి

నా కృతజ్ఞతలు !

శ్రీమతి చల్లా కామేశ్వరిగారి గ్రంథాలు తెచ్చిఇవ్వడంలో సహకరించిన సంగీత సాహితీ విదుషీమణి డా॥ మంగళగిరి ప్రమీలాదేవికి

ఉపయుక్త గ్రంథాల పట్టిక తయారుచేసి యిచ్చిన మా అల్లుడు చిరంజీవి డా॥ గుమ్మా సాంబశివరావుకు

ముఖపత్ర చిత్రణ గావించిన ప్రసిద్ధ రచయిత, చిత్రకారుడు శ్రీ శీలా వీర్రాజు గారికి

ఈ గ్రంథాన్ని ముద్దుగా ముద్రించిన శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్ అధినేతలు శ్రీ బి వి.ఎస్ శాస్త్రి, శ్రీ వేంకటేశ్వరరావు, శ్రీ కోటేశ్వరరావులకు

నా అభినందనలు !

ఎస్. గంగప్ప.

This Book is Published with the Financial Assistance of
Tirumala Tirupati Devasthanams under their Scheme
"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

# ప్రస్తావన

తులనాత్మక అధ్యయనం ఆధునిక సాహిత్య విమర్శ పద్ధతుల్లో ప్రాముఖ్యం వహించింది. ఆ మార్గంలో ప్రముఖాంధ్ర వాగ్గేయకారుడు తాళ్ళపాక అన్నమాచార్యులను సంస్కృతం, ఔత్తరాహ దాక్షిణాత్య భారతీయ సాహిత్యాలలో ముఖ్యులైన వాగ్గేయకారులతో పోల్చి పరిశీలించి, తెలుగులోని ఇతర ముఖ్య వాగ్గేయకారులతో తులనాత్మక అధ్యయనం చేయాలన్నది నా చిరకాలవాంఛ. ఆ ప్రయత్న ఫలితమే నా "అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు తులనాత్మక అధ్యయనం" (A Comparative Study of Annamacharya with Famous Saint-Singers) అనే గ్రంథం. సుమారు ఒక దశాబ్ది సాహిత్య పరిశోధనా కృషి ఫలం.

నాకోరిక గ్రంథరూపం ధరించడానికి సహకరించింది కేంద్రప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ (Department of Cultural Affairs, Govt of India, New Delhi) 1983-85సం లకు పై సాంస్కృతిక వ్యవహారాలశాఖ నాకు సీనియర్ రిసర్చి ఫెలోషిప్ ప్రదానంచేసి నామనోరథం కార్యరూపం ధరించడానికి ప్రోత్సాహమిచ్చింది. ఆ సహాయసహకారాల మూలాన్నే నేనీగ్రంథరచన చేయగలిగాను.

నా ఈగ్రంథంలో నేను గావించిన తులనాత్మక అధ్యయనంలో కొన్ని పరిమితులు లేకపోలేదు. కొంత విస్తృతి లేకపోలేదు. ఈ అధ్యయనంలో అత్యంత ప్రముఖవాగ్గేయకారుడు, కేంద్రబిందువు తాళ్ళపాక అన్నమాచార్యులు. ఆ మహామునిని - సంకీర్తనసాహిత్యాన్ని గూర్చి విపులంగా వివరింపవలసి వచ్చింది. ఈ వాగ్గేయకారునితో తెలుగులో వెలసిన ప్రముఖ వాగ్గేయకారులు క్షేత్రయ్య, తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు, చినతిరుమలాచార్యుడు, రామదాసు, సారంగపాణి, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, త్యాగరాజులతోపాటు కృష్ణమాచార్యులను, ఆయా పదకర్తల సాహిత్యాన్ని తులనాత్మకంగా అధ్యయనం చేయడం నాగ్రంథ లక్ష్యం. దీనికి నేపథ్యంగా సంస్కృతంలో, ఔత్తరాహభాషల్లో, దాక్షిణాత్యభాషల్లో ఈ పదకవిత అంచే గీతికీర్తిని పరిపోషించిన జయదేవ, లీలాశుక, నారాయణ తీర్థులనే సంస్కృత వాగ్గేయకారులను, మరాఠీ, బెంగాలీ, హిందీ సాహిత్యాలలోని నామదేవ జ్ఞానదేవులను, వల్లభచైతన్యులను మీరాబాయి, సూరదాసులను, తమిళంలోని పన్నిద్దరాళ్వారులను, కన్నడంలోని పురందర కనకదాసులను - గూర్చి తులనాత్మకంగా పరిశీలించడం జరిగింది. అయితే ఈ పరిశీలన కొంత అతివ్యాప్తి, అవ్యాప్తికిలోనయింది. ఇందుకు కారణం లేకపోలేదు. మరాఠీ నామదేవ జ్ఞానదేవులను గూర్చి జీవిత విశేషాలతో సరిపుచ్చుకోవలసివచ్చింది. బెంగాలీలోని వల్లభాచార్య, చైతన్యస్వాములను గూర్చి

అంతే హిందీలోను తులసీ, కబీర్, విద్యాపతి, చండీదాసాదులను వదలి మీరా, సూరదాస్‌ల అధ్యయనంతో సంతృప్తిపడడం ఇందులో జరిగింది పన్నిద్దరాళ్వారు లను గూర్చిన ద్వితీయాకరాలతోనే సరిపుచ్చుకోవలసి వచ్చింది ఇందుకు హేతువు ఆయా భాషాసాహిత్యాల్లో నాకంతగా ప్రవేశం లేకపోవడమేగాక సమయాభావమూను కన్నడంలో నాకున్న స్వల్ప ప్రవేశంమూలాన్నే పురందరదాస, కనకదాసులను గూర్చిన తులనాత్మకాధ్యయనంలో మూల ఆకరాల ఆధారంగా కొంతకుకొంత విపుల వివరణ సాధ్యమైంది

ఈ గ్రంధంలో రెండు భాగాలున్నాయి ప్రథమభాగంలోని నాలుగు ప్రకరణాల్లో భూమిక, అన్నమాచార్యుల, ఇతరవాగ్గేయకారుల జీవితరేఖలు, అన్నమాచార్యుల శృంగారం, భక్తి, మధురభక్తి, ఆధ్యాత్మికత, నీతి, వైరాగ్యాలు, సంగీతాభినయాలు వివరించబడ్డాయి ద్వితీయభాగం తులనాత్మక అధ్యయనం ఐదో ప్రకరణంలో అన్నమాచార్యులకు సంస్కృత, ఔత్తరాహ, దాక్షిణాత్య వాగ్గేయకారులతోను, ఆరో ప్రకరణంలో తెలుగులోని ప్రముఖ వాగ్గేయకారులతోను తులనాత్మక అధ్యయనం ప్రాముఖ్యం వహిస్తుంది చివర పదకవుల భావసామ్యం - అంటే భాషలు వేరైనా భావాలు ఒక్కటే అని - నిరూపితం ఈ అధ్యయనం జాతీయసమైక్యానికి దోహదం చేస్తుంది

తెలుగులోని ప్రముఖవాగ్గేయకారులతో అయినా నాచేసిన తులనాత్మక అధ్యయనం పరిపూర్ణంగాదని నేనెరుగుదును నాకున్న వనరుల్ని, పరిమితుల్ని పురస్కరించుకొని ఈరీతిగా అధ్యయనం చేసే అవకాశం నాకు లభించినందుకు నేనెంతో సంతోషాన్ని ప్రకటిస్తున్నాను కారణం ఈ తులనాత్మక అధ్యయన మార్గంలో నేను ప్రథముణ్ణి కాకపోయినా, తెలుగు ప్రముఖవాగ్గేయకారుల గూర్చి చేసిన తులనాత్మక అధ్యయనంలో ద్వితీయుణ్ణి మాత్రం కాననీ, ఇది తదితర భావి సాహిత్య పరిశోధకులకు - ముఖ్యంగా తులనాత్మక అధ్యయనకారులకు - మార్గదర్శకం కాగలదనీ గంపెడాస నాకుంది నాయీ ఆశ, ఏ కొశమైనా ఫలిస్తే నేను ధన్యుణ్ణని భావిస్తాను!

ఎంత జాగరూకత వహించినా ముద్రణ స్ఖాలిత్యాలు కొన్ని వదలలేదు పుట 20 చివరి పంక్తిలో 1408 అని ఉండవలసింది 1458 అని తప్పుగా ముద్రితమైంది పుట 41 మొదటి పంక్తి మొదటనే 'పల్లభాచార్యులు'కు బదులు 'చార్యులు' అని అచ్చయింది ఇలాంటి అల్పదోషాలు మరికొన్ని అక్కడక్కడా దొర్లాయి వాటిని సహృదయ పాఠకులు గమనించి మన్నించగలరని భావిస్తున్నాను

సుధర్మ
విజయదశమి
6-10-93

ఎస్. గంగప్ప

# PREFACE

At piesent, Comparative study of Literatures has become popular among students of Literature It is true that the comparison of one or more literatures gives an understanding that the feelings of all poets are one and the same and there by we find that one-ness and commonness among all literatures Thus comparative study of literatures will help different people of different anguages to achieve this goal of unity and integration of our nation

In 1982, I have taken up a Research project on a topic entitled "A Comparative study of Annamacharya with Famous Saint-Singers-' with an idea of studying comparatively Annama charya with the saint-singers and poets like Jayadeva in Sanskrit in addition to Northern saint - singers like Namadeva, Jnanadeva, Vallabha, Chaitanya, Meera and Surdas, Southern saint - singers like Panniddaralwars in Tamil and Purandaradasa and Kanakadasa in Kannada to be a back drop for my study in general and Krishnamacharya, Tallapaka Peda Tirumalacharya, China Tirumalacharya, Kshetrayya Ramadas, Sarangapani, Munipalle Subrahmanyakavi and Thyagaraja in Telugu in particular Annamacharya, a great and famous Vaggeyakara in Telugu flourished in the fifteenth century and hailed from Tallapaka Village of Cuddapah District in Andhra Pradesh He, being a staunch devotee of Sri Venkateswara, lived in his life time at Tirumala, the Seven Hills, which is the abode of Lord Sri Venkateswara He composed 32,000 Sringara and Adhyatma Sankeerthanas with Sri Venkateswara Mudra He propagated Visishtadwaita Philosophy founded by Sri Ramanujacharya

At a critical time when it was felt that without any financial assistance, it might not be possible for me to continue this research project, I was awarded a senior Research Fellowship for Literary Criticism by the Department of Cultural Affairs, Government of India, New Delhi (now merged with the Department of Human Resource Development) for two years to carry on my research project My thanks are due to the Department for the

timely help and encouragement to bring out this work in this form My thanks are also due to The Tirumala Tirupati Devasthanams Tirupati, for providing me with Financial Assistance for publication of this work

This book is devided into two parts which are sub-devided into seven chapters with an initial zero chapter of Preface which gives an idea of brief origin and development of Padakavitha (lyrical poetry) in Indian Languages in general and in Telugu in particular

The first chapter in the Part one is an important one in which short life sketches of Annamacharya and others are described Second to Fourth chapters are devoted to evaluate Sringara, Bhakti, Madhura Bhakti, Adhyatmikatha, Neethi, Vairagya and Sangitha and Abhinaya which are present in the Sringara and Adhyatma Sankeerthanas of Annamacharya as he is a towering personality among Vaggeyakaras and Saint - singers

The remaining three chapters form part two in the fifth chapter, the Sanskrit Saint–singers Jayadeva, Lilasuka and Narayana Thirtha and Northern and Southern Saint-singers are compared and contrasted where as in the sixth chapter, the important Telugu lyrical poets-Saint singers- are compared and contrasted. The seventh chapter is a concluding one in which my study has been summed up

This being the first of its kind, I hope, will help for further study in this field in particular and students of comparative literature in general Through this study, we can achieve unity and integration of our nation along with emotional integration among the people of our country

**Sudharma,**
**Vijaya Dasami**
**6-10-1992**

**Prof S Gangappa**

# అంకితం

వందనమిదె - పద్మనాభ ! హరి !
అందుకొమ్మ - సుందర సురుచిర ! ॥పల్లవి॥

చెరలోన బుట్టి - చీకట్లు బాపి
అరవిరైన మనసు - లానందింపగ
చెరనుండి తొలగ - జేసితి రక్షణ
త్వర నుగ్రసేన - నరపాలకులను ॥వంద॥

గీత బోధించి, జి - గీషువైన నరుని
చేత భీష్మాదుల - సిలుగుల వడ జేసి
భీతి బాపినావు - ప్రీతినొసగినావు,
ప్రాతమార్చి, జగ - ద్రక్షకా ! మురళీ ! ॥వంద॥

వెలయించినాడ - వి మర్శకశోధనము
తులనాత్మకము, న - తుల పదకర్తల పద
ము లల్లితి హార - ముగ, గైకొమ్మదే
బలరామానుజ ! - ప్రకీర్తిత యదురాయ ॥వంద॥

ఎస్. గంగప్ప.

# 0.0. భూమిక

తులనాత్మక అధ్యయనం ఆధునికయుగంలో ఆరంభమై, ప్రత్యేక ప్రతిపత్తిని సంతరించుకొన్నది కొన్ని విశ్వవిద్యాలయాల్లో తులనాత్మక అధ్యయనానికి ప్రత్యేక విభాగాలు ఏర్పాటై ఆ దిశలో అధ్యయనం, పరిశోధనలు కొనసాగుతున్నాయి తద్వారా తులనాత్మక అధ్యయనం ప్రత్యేక విశిష్టతని సాధించింది సాహిత్యాధ్యయనం రెండు విధాలుగా-అంటే - కాలక్రమానుగుణంగా గాని, తులనాత్మకంగా గాని - చేయ వచ్చు ఇది ఒకే సాహిత్యానికైనా, అనేక సాహిత్యాలకైనా సంబంధించినదై ఉండ వచ్చు అయితే అనేక వాఙ్మయాల తులనాత్మకాధ్యయనమే అధిక లాభకారి, ఉపకారి. ఒకటికంటె ఎక్కువ సాహిత్యాలను తులనాత్మకంగా అధ్యయనంచేసే సమయంలో, వాటిని పరిపోల్చి పరిశీలించినపుడు వాటి సంబంధబాంధవ్యాలు సామ్యవైషమ్యాలు, స్పష్టమవుతాయి. ఇంకా అనేక నూతనాంశాలు వ్యక్తమవుతాయి ప్రత్యేకించి అనేక సాహిత్యాల తులనాత్మక అధ్యయనం వల్ల వాటిలో కనిపించే సాదృశ్యాలమూలంగా వాటి సన్నిహిత సంబంధ బాంధవ్యాలు, భేదాలమూలంగా వాటికి సంబంధించిన ప్రత్యేకతలూ మనకు స్పష్టమవుతాయి ఇంతవరకు తెలుగు కన్నడం, తెలుగు తమిళం జానపద గేయాల తులనాత్మక అధ్యయనం[1], వేమన సర్వజ్ఞుల తులనాత్మక అధ్యయనం[2] జరిగిన సంగతి మనకు తెలుసు. అయితే అన్నిటికంటే ముందు ముఖ్యంగా ద్రావిడభాషల తులనాత్మక అధ్యయనంచేసిన ఘనత కాల్డ్వెల్ పండితునికి[3] దక్కుతుంది ఆ వెనుక తెలుగులో కోరాడ రామకృష్ణయ్యగారు,[4] ఆచార్య గంటి జోగి సోమయాజిగారు[5] భాషాసంబంధి తులనాత్మక అధ్యయనం చేసిన విషయ సర్వపండిత లోకానికీ సువిదితమే

ఈనాడు అన్ని సాహిత్యప్రక్రియల్లోను తులనాత్మక అధ్యయనం జరుగవలసిన అవసరం ఎంతైనా ఉంది ఇంతేగాక తెలుగు తదితర ద్రావిడభాషల తులనాత్మక అధ్యయనమేగాక, సంస్కృతం, ఔత్తరాహ భాషల తులనాత్మక అధ్యయనం సైతం ఎంతగానో ఉపకరిస్తుంది ఇందులో ముఖ్యంగా తెలుగులోని పదకవిత్వ నిర్మాతలైన వాగ్గేయకారుల సాహిత్యసంబంధి తులనాత్మక అధ్యయనం ప్రస్తుతాంశం ఈ సందర్భంలో అటు సంస్కృతంతోపాటు ఔత్తరాహ సాహిత్యాలలోని ఇటు దాక్షిణాత్య సాహిత్యాలలోని పదకవితల తులనాత్మక అధ్యయనం స్థూలంగానైనా చేయడం అవసరం ఇది అన్నమాచార్యుల, ఇతర ప్రముఖ వాగ్గేయకారుల తులనాత్మక అధ్యయ

నానికి నేపథ్యంగా ఉంది, అధ్యయన అవగాహనకు సౌలభ్యం చేకూర్చగలదు ఈ అధ్యయనం మూలాన ఆయా భాషా సాహిత్యాల అన్నిటి సంబంధ బాంధవ్యాలను మరింత చక్కగా నిరూపించ వీలవుతుంది వాటిలోని సమానతల్ని సమీక్షించ సాధ్యమవుతుంది వైషమ్యాలు వింగడించి వివరించ వీలవుతుంది ఆమూలంగా ఆయా సాహిత్యాలను, వాటిలోని సూక్ష్మాంశాల్ని సమగ్రంగా చేసుకోవడానికి సాధ్యమవుతుంది ఈ దృక్పథంలో నా "తెలుగు పదకవిత"[6] గ్రంథంలో కొంత ప్రస్తావం చేయడం జరిగింది ఈ తులనాత్మక అధ్యయనం వలన పైని వివరించినట్లు ఆయా సాహిత్యాలలోని సూక్ష్మాతిసూక్ష్మాంశాల్ని తెలుసుకోవడం ఒక ఎత్తు కాగా, ప్రత్యేకించి జాతీయసమైక్యానికి ఎంతగానో తోడ్పడడం మరోఎత్తు తద్వారా భాషలు వేరైనా, వాగ్గేయకారులు వేర్వేరైనా, అన్ని భాషల, సాహిత్యాల, వ్యక్తుల భావాలు ఒక్కటే అనే ప్రధానాంశం ప్రస్ఫుటమవుతుంది

## 0.1. పద కవిత - ఆవిర్భావ వికాసాలు

తెలుగులోని వాగ్గేయకారులైన తాళ్ళపాక అన్నమాచార్యులు, ఇతర ప్రముఖ వాగ్గేయకారుల పదకవితల తులనాత్మక అధ్యయనమే ప్రస్తుతాంశమైనప్పటికీ, తమిళం, కన్నడం, అంతకంటే సంస్కృతం, హిందీ మొదలైన ఔత్తరాహ సాహిత్యాలలోని పదసాహిత్య పరిశీలనం కూడా అవసరమే ఈ అధ్యయనంవలన సంపూర్ణమూ, సమగ్రమూ అయిన అంగావాన కలుగుతుంది తన్మూలాన సముచితమైన విషయవివరణ సాధ్యమవుతుంది

ప్రపంచ భాషలన్నింటిలోను పదకవిత, పద్యకవిత అని రెండు విధాలు పాడుకోడానికి ఉపయోగించేది పదం పద్యం పండితులకు మాత్రమే పరిమితమైంది మన దేశంలో ఆర్యభాషలు, ద్రావిడ భాషలని రెండురకాలు సంస్కృతమూ, తదపభ్రంశమైన ప్రాకృత భాషలు ఆర్య భాషలు అవే ఆయా ఔత్తరాహభాషలుగా పరిణతి చెందాయి ముఖ్యంగా దక్షిణదేశంలో తెలుగు, తమిళం, కన్నడం ప్రముఖ ద్రావిడ భాషలు వీటిలో ముఖ్యంగా తమిళం కాలాంతకు ప్రారంభదశలో పదకవితగానే గుర్తించబడింది. వాస్తవానికి తెలుగు కన్నడ భాషలపై సంస్కృతం అన పెత్తనం నెరపింది కానీ తమిళం తత్ప్రభావానికి లొంగలేదు, పరిగా సంస్కృతాన్ని సైతం తనలోనే ఇముడ్చుకొని, తనదైన స్వశక్తిని ప్రదర్శించి నిలబెట్టుకొన్నది

ఇంతేగా ప్రధానంగా మనం గుర్తించవలసిన ప్రధానాంశం ఒకటుంది మనదేశంలో సాహిత్యం మార్గ దేశి అని ద్వివిధం ఆయాప్రాంతాల్లో ఆయా పామర

ప్రజలచేత వాడబడి, పాడబడుచూ పరివ్యాప్తమైంది దేశి లక్షణబద్ధమై పండితైక పరమైంది మార్గ ఈ మార్గ దేశి విభాగం మొదట సంగీత పరంగాను, ఆ వెనుక నృత్యపరంగాను, ఆ తరువాత సాహిత్యపరంగాను నిరూపించబడింది. బహుశః—

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం

ఏకనూపాత మధురం అన్యదాలోచనామృతం" — అనే శ్లోకమే ఈ సంగీత సాహిత్యాలకున్న సంబంధాన్ని స్పష్టం చేస్తూండడం గూడా ఒక కారణమై ఉండవచ్చు అంటే సామాన్యప్రజానీకంలో ప్రచారంలో ఉన్న సంగీతం లక్షణబద్ధ మైనట్లే సాహిత్యం సైతం లక్షణబద్ధమై మార్గ అయింది. ఈ మార్గ దేశి విభాగాన్ని సంగీత దర్పణమూ,[7] సంగీత రత్నాకరమూ,[8] నిరూపిస్తున్నాయి ఈ విభాగం దశరూపకంలో[9] నృత్యపరంగా చెప్పబడిఉంది దీనివలన తేలిన సారాంశం "నియమ బద్ధమై, శిష్ట సమ్మతమును, శాస్త్ర సమ్మతమును అయి ఉత్తమఫణితిని రచింపబడినదీ మార్గకవిత నియమరహితమై శాస్త్రమున కెక్కక కేవల ప్రజారంజనమునకై రచింప బడినది దేశి కవిత"[10] దీన్ని మనం పద్యకవిత్వానికీ, పదకవిత్వానికీ సమన్వయించు కోవచ్చు పైచెప్పు పూర్వోక్తమైనట్లు ఇది తమిళంకంటే తెలుగు కన్నడ పదకవిత లకూ, అటు ఔత్తరాహ సాహిత్యాల్లోని పదకవితలకు సమంగా సరిపోతుంది.

సమస్త సాహిత్యాల్లోను పద్యంకంటే పదమే ముందు ఆవిర్భవించిందన్న విషయం సర్వ పండితాంగీకృతం అంతేగాక పదకవితనుంచే పద్యకవిత్వ ముద్భ వించిందనీ, పదమే ప్రాచీనమని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి అభిప్రాయం సము చితమైంది "మనదేశంలో చాలా ప్రాతపాటలు వేదసూక్తములు. మనుష్యజాతికి అవి మొదటిరచనలు అని యూహింపవలసినవి వాటి గానమందు తాళములేదు అన్నది మనమిక్కడ గమనింపవలసిన తత్త్వము రాగ తాళములు రెంటిని కలిపి హృదయంగమములైన భావములను వెలువరుచు భాషను అలంకరించుటయే పదరచ నకు పరిపూర్ణస్వరూపము దాని బరిపూర్ణానుభవమును మనకప్పుడే సతాళముగనో, వితాళముగనో కావ్యకళారసానుభవమును ప్రాచీన మనుష్యజాతి పాటరూపముననే అనుభవించి రసించినదని పండితులూహింతురు మన పద్యములన్నియు పదముల పరిణామములే అని భావించుటకు పెద్ద సూక్ష్మదృష్టి అక్కరలేదు "[11]

కాబట్టి పద పద్య కవితల్లో పదకవితయే ముందావిర్భవించింది ప్రాక్తన మానవుడు సుఖదుఃఖాది అనుభూతులను పొందినప్పుడు, తదనుగుణంగా ఆడిపాడు

కోవడంలోనే ఈ పదకవిత పుట్టింది అదే కాలాంతరంలో సంస్కరించబడి మరో విధంగా పద్యకావ్యంగా, ప్రౌఢకావ్యంగా, పండితకావ్యంగా అంగీకరించబడి, గౌరవపాత్రమైంది పదకవిత పండితామోదముద్ర నెంతమాత్రమూ పొందక పోయినా, విద్వద్గోష్ఠులలో ప్రస్తావించబడకపోయినా, రాజగౌరవం సంపాదించక పోయినా దాని దారిన ఆది నడుస్తూనే ఉంది అభివృద్ధి చెందుతూనే ఉంది సామాన్య ప్రజల మన్ననలకు పాత్రమవుతూనే వచ్చింది చివరికి రాజగౌరవం పొందడమేగాదు పండితాదరణకు సైతం పాత్రమైంది

ఈ పదకవితావిర్భావాన్నిగూర్చి మౌల్టన్ పండితుడు వెలిబుచ్చిన అభిప్రాయాలు సహజమూ, సర్వసమాదరణీయమూ

"The improvised lyrical song, communal or individual, popular or artistic, is probably the simplest and most spontanious form of lyrical expression The true song is primarily the instinctive outburst of emotion or emotional thought in language which by aptness of word and rythm echoes suggests the under lying emotion by melody of time and harmony of stanza is adapted to such modulations of the singing voice as naturally distinguish emotional utterance The song is, therefore, more than any other lyrical kind a musical cry"[12]

"That the popular or traditional ballad is folk poetry, ie, poetry that has originated usually oral form among a homogeneous, non literary people, and has been handed down among them by word of mouth, is generally conceded "[13]

అదేవిధంగా తెలుగులోను పదమే ప్రప్రథమంగా పుట్టింది నన్నయ్యకు ముందు ఎంతో దేశికవిత అనబడే జానపదకవిత ఉండివుంటుంది అది లిఖితంకాక కేవలం మౌఖికం (oral)గా ఉండి ఒక నోటినుంచి, మరో నోటికి, ఒక ప్రాంతం నుంచి మరోప్రాంతానికి పోయి ఎన్నో మార్పులకు చేర్పులకు లోనై ఎంతో కాల గర్భంలో కలిసిపోయింది. ఇది తెలుగుజాతికే దురదృష్టం తమిళంలో ప్రాచీన కవిత అంటే లిఖితమైన ఈ పదకవితలే దేశి అయిన తెలుగుకవిత నాలుగువిధాలనీ, అందులో మధురకవితారీతిలో చేరినది పదకవిత అనీ లాక్షణికోక్తి 'తెల్గుకవిత యాశు, మధుర, చిత్ర, విస్తరములని నాల్గు తెఱగుల గలదని లాక్షణికులనిరి ఆంధ్ర మధురకవిత యనగా పాటలు మొదలైనవి. లక్షణదీపికలోనీ విషయమిట్లు

చెప్పబడినది మధుర కవిత్వంబన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యాది దేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నల్లొట్లు, గీతప్రబంధములు, చతుర్భద్రికాష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, త్యాగఘోష, చతురతర సంఘటనలు, యక్షగానంబున వెలయు పదంబులు దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, సువ్వాలజోలలు, జక్కులరేకు పదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్పదాష్టపదులు నివి యాదిగా గల్గునవి "[14]

## 0.2. పద నిర్వచనం .

'పదం' అంటే సామాన్యార్థంలో పాట అనే వాడుక రాగ తాళ సహితమై ఉండవచ్చు. లేదా కేవలం స్వరసహితమూ కావచ్చు ఇది జానపదుల సాహిత్యంలో స్పష్టంగా తెలుస్తుంది కోలాటం, దంపుళ్ళ పాటల్లో తాళముంటుంది రాగంతోపాటు. విసర్రాయి, కపిలి పాటల్లో రాగమేగాని తాళానికి అవకాశంఉండదు అయితే రెండింట లయ ఉండి తీరుతుంది, 'పదం' పాడమన్నది జనవ్యవహారం.

భరతముని పద నిర్వచనం ఇలా ఉంది—

"గాంధర్వం యన్మయా ప్రోక్తం, స్వరతాళ పదాత్మకమ్
పదం తస్యభవేద్వస్తు స్వరతాళానుభావకమ్
యత్కించి దక్షరకృతం తత్సర్వం పదసంజ్ఞితమ్
నిబద్ధంచానిబద్ధంచ తత్పదం ద్వివిధం స్మృతమ్
అతాళంచ, సతాళంచ ద్విప్రకారంచ తద్భవేత్
సతాళంచ ధ్రువార్థేషు నిబద్ధం తచ్చపై స్మృతమ్"[15]

—స్వర తాళ పదాత్మకమైంది గాంధర్వమనీ, స్వరతాళానుభావకమైన పదమే వస్తువనీ, అర్థసహితమైన అక్షరాలతో కూడినది పదమనీ, ఈ పదం నిబద్ధం, అనిబద్ధం అని రెండువిధాలనీ, అవి అతాలము, సతాలమునని రెండు విధాలనీ భరతుని నిర్వచనం "నియతాక్షర సంబంధముకలిగి, ఛందోయతి సమన్వితమై తాలపాతము అతో కూడిన పదము నిబద్ధమనబడును యతిపాదనియమము లేనిదియును, అనియతాక్షరమును అగు పదము అనిబద్ధమనబడును"[16] "దేశీయవ్యవహారములలోని దరువు నుంచి ధ్రువ పదమనే లక్షణ నామంగాని, ధ్రువ పదంనుంచి దరువు అనే వ్యవ

హారంగాని వచ్చి ఉండవచ్చునని ప్రాజ్ఞుల అభిప్రాయము"[17] సంగీత పరిభాషలో ఈ పదాలు ప్రబంధాలనబడతాయి పైని భరతముని చెప్పిన విధంగానే మతంగుడు, శార్ఙ్గదేవుడు, చివరికి వేంకటమఖి వరకు అందరూ లక్షణాల్ని వివరించారు

పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అని ప్రసిద్ధిపొందిన తాళ్లపాక అన్నమాచార్యుడు సంస్కృతంలో 'సంకీర్తన లక్షణం' రచించాడు అది ప్రస్తుతం అలభ్యం కానీ అతని మనుమడు చిన తిరుమలాచార్యుడు దానిని తెలుగులోకి పద్యాత్మకంగా అనువదించాడు [18] భరతాదులు చెప్పిన రీతిలోనే పద నిర్వచనం ఉంది

"పదమగు సుప్తిజ్ఞన్తము
పదమవయవ, మవయవియును బదమనఁబరఁగున్
దుది నీ తెఱఁగులన్నియుఁ
బదకవితా మార్గసార్వభౌముఁడు దెలిపెన్ "[19]

ఈ పదాలు శృంగారవైరాగ్య పదాలని ద్వివిధం శృంగార పదాలు గ్రామ్యోక్తులతో కూడి ఉండవచ్చు

"పదములు శృంగార వధూ
మృదుమధుర మనోజ్ఞ వాక్యమిశ్రమములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ దొంకమెఱఁగి పలుకఁగఁ జెల్లున్"
"పల్లవ నాటీ ప్లేచ్ఛా
ద్యుల్లాన మనోజ్ఞ బంధురోక్తులు చవిమై
చెల్లును గ్రామ్యములైనను
హల్లీసకముఖ్య నాటకాదిక ఫణితిన్"[20]

అయితే శృంగార పదాల్లాగాక, వైరాగ్య పదాలు ఉదాత్తంగా ఉండడం అవసరం.

"వైరాగ్య వృద్ధికర గం
భీర పద శ్రేణి పొసఁగఁ బెనుపుచు నగ్రా
మ్యా రమ్య విష్ణు చరితో
దారములై యున్నఁ జాలు ధరణిన్వేలయున్"[21]

—వీటినే అధ్యాత్మ పదాలంటారు ఈ పదాలు సంస్కృతంలోనేగాక ప్రాకృతాది దేశ భాషల్లో చెప్పవచ్చు వీటికి పద్యాల్లాగా యతిప్రాసలు వర్తిస్తాయని భరతాదుల మతం. ఈ పదాలు వృత్త, నిబంధ, అనిబంధాలని మూడు విధాలు ఈ నిబంధ పదంలో నాలుగు పాదాల చరణ మొకటిగానీ, అంతకు మించిగాని ఉండవచ్చు ఇలాంటి చరణాల అర్థాన్ని వదలక అన్నిటికీ ఏక వాక్యతతో గుది గ్రుచ్చినట్లు మరల మరలా భాసిల్లునట్టి పల్లవి ఉంటుంది ఇది పల్లవి, శిఖా పదమని ద్వివిధం 'పద సమాన మాన పాద యుగ్మము కలది' పల్లవి అందులో నగం ఏకపాదం గలది శిఖాపదం ఈ నిబంధపదంలో పల్లవి ఉంటే శిఖాపదముండదు శిఖాపదముంటే పల్లవి ఉండదు. ఇలాంటి పల్లవి, శిఖాపదాలతో గూడిన నిబంధ పదం చతుర్ధాతుక, త్రిధాతుక, ఏక ధాతుకాలని చతుర్విధం కాని ఏకధాతుపదం అరుదుగా ప్రయుక్తమవుతుంది వృత్తాలు నాలుగుపాదాలతోను, జాతులు రెండు పాదాలతోను ఉన్నట్లే సంకీర్తనలు కూడా చతుష్పాద, ద్విపాదాకృతితో ఉంటాయి. ఇట్టి కీర్తనలతో దరువు, వాక్యం, అర్ధచంద్రిక ఏల, గొబ్బిళ్ళు, చందమామ పదాలు అనేవి రెండుపాదాలతో ఉంటాయి ఇవిగాక అష్టపది, పదమాలిక, శరభపాదం అనే పదవిశేషాలున్నాయి, ఇంక అనిబంధపదం అంటే అనిరుక్తపదం ఇది తాళబంధచ్ఛందో విరహితమై చూర్ణాఖ్యతతో ఉంటుంది దీనిని తాళగంధి అనిగూడా అంటారు ఇది సూక్ష్మంగా అన్నమాచార్యులు సంస్కృతంలో చెప్పిన సంకీర్తనలక్షణం దీనికిలక్ష్యంగా వేలసంఖ్యలో ఆతడు సంకీర్తనలు రచించి తరించాడు [22] ఈ పదలక్షణం అన్నిభాషలకు వర్తిస్తుంది

## 0.3 వాగ్గేయకారుడు

పైని వివరించిన పదకవులను పదకారులనీ, పదకర్తలనీ, వాగ్గేయకారులనీ అంటారు వాగ్గేయకారలక్షణాల్ని తెలుసుకొందాము

"తాళ్ళపాకవారి కాలమున సంకీర్తమునకే పదమనియు వ్యవహారము దానికే గేయమనియు నేటివ్యవహారము కృాత సంశబ్దనే- కీర్తించునది కీర్తనము సమ్యక్ కీర్తనము (గీయత ఇతిగీతం) పాడబడునది గీతము లేదా గేయము కాగా అవాఙ్మానసగోచరమగు దివ్యశక్తిని కీర్తించి పాడునది కీర్తనము లేక సంకీర్తనమైనది ఇట్లు గీయమానమగు కీర్తనమే భక్తుని హృదయమును పరమాత్మునిపాదసన్నిధికిఁగొంపోవునది 'పదగతౌ' అని అమరము. అందువలన అట్లు తీసుకొనిపోవునదే పదమనియు రూఢికెక్కినది ఇట్లు నాడు కీర్తనము, పదము అనబరగిన రచన సంగీత సాహిత్య

ముల సమ్మేళనరూపము ప్రాచీనలాక్షణికు లందలి సాహిత్యాంశమును 'వాక్' అనియు, సంగీతాంశమును గేయమనియు వ్యవహరించిరి వీనికే క్రమముగా మాతు' ధాతు సంజ్ఞలుకూడ కలవు"[23] పదంలోని మాతు లేక వాక్కు -సాహిత్యాన్ని, ధాతు లేక గేయాన్ని - సంగీతాన్ని రచనచేయగలవాడు వాగ్గేయకారుడు శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలో వాగ్గేయకారుని గూర్చి నిర్వచించిన వాటిని రజనీకాంతరావుగారు విపులంగా వివరించారు [24]

"వాఙ్మాతు రుచ్యతే గేయం ధాతురిత్యభిధీయతే
వాచం గేయంచ కురుతేయః సవాగ్గేయకారః

—కాగా ఈ వాగ్గేయకారలక్షణా లీ విధంగా చెప్పబడ్డాయి

"శబ్దానుశాసన జ్ఞాన మభిధానప్రవీణత
ఛన్దః ప్రభేద వేదిత్వ మలంకారేషు కౌశలమ్"

ఈ వాగ్గేయకార లక్షణాలు ఉత్తమకవికుండవలసిన లక్షణాలలో ఏ మాత్రమూ తీసిపోవనీ, పైపెచ్చు కవికంటే ఉత్తమ వాగ్గేయకారునిలో సంగీతాదికళల్లో పరిజ్ఞానముండాలనీ స్పష్టమవుతుంది వాగ్గేయకారుని 'బయకారు' దనడం వాడుకలో ఉంది. చతురకల్లినాధునకు, రామామాత్యునకు 'రాయబయకార' (రాజ వాగ్గేయకారుడు) అనే బిరుదు ఉన్నట్లు తెలుస్తూంది [25]

మాతూంశ్చ ధాతూ నుభయాన్ కరోతి
యస్తం విదుశ్చోభయంకార సంజ్ఞం
తమేవ లోకా బయకార నామా
వదం త్యపభ్రంశ పదేన సర్వే"

—అంటే మాతువు, ధాతువు, అనే రెంటిని చేయగలవాడు ఉభయకారుడనీ, కానీ ప్రపంచంలో ఉభయకారుడనడానికి బదులు అపభ్రంశమైన బయకారశబ్దంతో పిలుస్తున్నారనీ గోవింద దీక్షితులు శబ్దవ్యుత్పత్తిని వివరించారు [26]

## 0.4 సంస్కృతంలో పదకవిత

తెలుగులో వెలసిన పదకవితనుగూర్చి తెలుసుకొనే ముందు సంస్కృతం, ఔత్తరాహ భాషలు, తమిళకన్నడభాషలలో ఆరంభమై వికాసంపొందిన పద కవిత్వాన్ని

స్థూలంగా తెలుసుకోవడం అవసరం ఇది తరువాతి ముఖ్యమైన ఫలనాత్మక అధ్యయనానికి ఎన్నోరీతుల ఉపకరిస్తుంది

భక్తిభావన భారతీయ తత్వం భక్తితోపాటు పదకవిత ప్రారంభమైంది నిజానికి వేదసూక్తాలే మొట్టమొదటి పదాలన్న రాళ్ళపల్లివారి మాటలు పూర్వోక్తం సామవేదం గాన యోగ్యమైందన్న సంగతి సర్వపండిత లోకానికీ సువిదితమే భరతముని నాట్యశాస్త్రంలోను, శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకరంలోను, అభినవగుప్తాచార్యుడు అభినవభారతిలోను సంగీత విషయాలను వివరించారు క్రీ॥ శ॥ 12 శ॥ కాలంలో వెలసిన జయదేవుని గీత గోవిందం అష్టపదులలో రచితమైన సంస్కృతంలోని పద-గేయ కావ్యం ఆ వెనుక లీలాశుకుడు శ్రీకృష్ణకర్ణామృతం శ్లోకాల్లోనే రాసినా అందులోని శ్లోకాలు సంగీతసభల్లో వాడబడుతూనే ఉంటాయి

తెలుగులో ప్రథమ వాగ్గేయకారుడైన అన్నమాచార్యుడు సంస్కృతంలోను దాదాపు వంద పదాలు మనోహరంగా రచించి ఉండడం గమనించదగ్గ అంశం

శివనారాయణ తీర్థులు సంస్కృతంలోనే శ్రీకృష్ణ లీలాతరంగిణిని ఎంతో మనోజ్ఞంగా రచించారు

రామదాసు, నాదోపాసకుడు త్యాగరాజుగూడా సంస్కృతంలో పదరచనచేసి తమ పాండిత్యాన్ని ప్రకటించుకొన్నారు

ఇలాగా సంస్కృతంలో ఎందరో మహానుభావులు పదరచనచేసి భక్తిప్రవృత్తుల్ని వెల్లడించి తరించారు

## 0 5 ఔత్తరాహ భాషల్లో పదకవిత .

సంస్కృతంలోలాగే భారతీయ భాషల్లోను భక్తిప్రపూరితమైన గీతాలు రచించబడి ప్రచారంలోకి వచ్చాయి ఇందుకు జైన, బౌద్ధసిద్ధుల చాత్వికచర్యగీతాలు తమ ప్రభావాన్ని వెరపాయని శ్రీ రాఘవన్‌గారి అభిప్రాయంలో సామంజస్యముంది 'While in the West of India the Jain mystics were producing this kind of electric literature, in the East the Buddhist Siddhas of Sahaja cult were composing in symbolic language (Sandha-

2 ]

Bhasha) philosophical songs called Charya-gitas as Charya-gitas were all set 1 music and in a way, may be considered to have paved the way for the emergence of the Hindu Saints and their songs in the Indian Languages "[27] కృష్ణభక్తికి వంగదేశం ఆటపట్టు దీనికి మూలవిరాట్టు వల్లభాచార్యుడు వంగదేశంలో వల్లభాచార్యుని తరువాత కృష్ణభక్తి పారమ్యంపొందింది ప్రచారంచేసిన మహానియుడు చైతన్యస్వామి ఈ భక్తుడు సంస్కృతంలో రెండు స్తోత్రాలు మాత్రమే రచించి, ఆలపించినా, ఈతని శిష్యులు వంగభాషలోను, సంస్కృతంలోను అనెక కృష్ణభక్తిపూరిత పదాలు రచన చేసి పరిపుష్టం చేశారు వల్లభాచార్యుల శిష్యులు "అష్టఛాప్" అనిపేరు గడించిన ఎనమండుగురు అందులో ప్రముఖ భక్తాగ్రేసరుడు సూరదాసు

సూరదాసు కృష్ణభక్తిలో మైమరచి, మైమరపించిన మహాభక్తుడు, హిందీలో సూరదాసుతోపాటు దాసత్రయంలో తక్కిన ఇద్దరు కవిని, తులసిదాసులు అలాగే విద్యాపతి మైథిలభాషలో రాధాకృష్ణ భక్తిప్రతిపాదకాలైన ఎన్నోపదాలు రచించాడు ఇతడు మనక్షేత్రయ్యతో అన్నివిధాలా సరితూగగల వాగ్గేయకారుడు విద్యాపతి పదాలను చైతన్యస్వామి ఆలపించి తన్మయత్వం చెందేవాడట ఇక్కడే పేర్కొదగ్గ మరో పదకర్త చండీదాసు విద్యాపతి చండీదాసుల గూర్చి అరవిందులు ప్రశంసించారు "The deisre of the soul for God is there thrown into symbolic figure in the lyrical love cycle of Radha Krishna This accomplished lyrical form springs at once to perfect birth from the genious of the first two poets who used Bengali tongue, Vidyapathi, a consummate artist of word and line and the inspired singer Chandidas in whose name stand some of the sweetest and most poignant and exquisite love lyrics in any tongue "[28]

మహిళాలోకంలో రాజస్థాన్‌కి చెందిన మీరాబాయి మహాకృష్ణ భక్తురాలు ఈమె రాజస్థానీ, గుజరాతీ, వ్రజ, హిందీభాషల్లో సుమారు 240 కృతులు కృష్ణభక్తి పారమ్యంగా రచించి తరించింది శ్రీ అరవిందులే మీరాభక్తిని ప్రస్తుతించారు "Another type is created in the perfect lyrics of the Rajput

Queen, Mirabai in which images of Krishna symbol are more directly turned into a song of the love and persuit of the devine lover by the soul of the singer "[29]

ఇలాగే మహారాష్ట్రలో యాన్నైమంది మహాభక్తులుండేవారు వారిలో జ్ఞాన దేవ నామదేవులు క్రీ శ 13, 14 శ కాలంలో అభంగు లనబడే భావగీతాలు భక్తి పూరితంగా రచించి ఆలపించారు భక్త రామదాసు, భక్త తుకారామ్ పేర్కొనదగ్గ మహనీయులు వీరి అభంగులు సైతం పదాలే ఇందులోని సంగీతం, సంగీతం ద్వారా భక్తి ప్రచారంలోకి వచ్చాయి ఇలాగా ఉత్తరభారతంలో భక్తిప్రపూరితమైన పదకవిత విరాజిల్లింది

## 0 6 దాక్షిణాత్య భాషల్లో పదకవిత :

ఇలాగా సంస్కృతంతోపాటు ఔత్తరాహభాషల్లో పదకవిత ఆలస్యంగానే ఆరంభమైందని చెప్పవచ్చు. అంతకంటే ముందే దాక్షిణాత్యభాషల్లో అంటే ద్రావిడ భాషల్లో ముఖ్యమైన తమిళంలో చాలా ముందుగానే ఈ వైష్ణవ భక్తిపూరితమైన పదాలు రచితమైనట్లు తెలుస్తుంది తమిళం, కన్నడం, తెలుగు సాహిత్యాల్లో భక్తి, నీతి, వైరాగ్యపూరితమైన పదకవితలు కోకొల్లలుగా వెలిశాయి తెలుగులోని పద కవితల గూర్చి తెలుసుకొనేముందు తమిళం, కన్నడం సాహిత్యాల్లోని పదకవితల గూర్చి గ్రహించడం అవసరం

## 0 6 1 తమిళంలో పదకవిత

పూర్వోక్తమైనట్లు తమిళం ప్రాచీన కాలంనుంచి తనదైన పద్ధతిని, మౌలిక తని నిలబెట్టుకొన్న సాహిత్యం అందుకు ప్రభువులుసైతం సహకరించడం మెచ్చు కోదగ్గ అంశం "తమిళ ప్రదేశములో పండితులకు, కవులకు తగిన ప్రోత్సాహ మిచ్చుటకై, వారివారి రచనలు పరీక్షించి, ఆయా రచనల విలువలను నిర్ణయించు నిమిత్తమై, ఆ దేశప్రభువులు ఒక పండిత పరిషత్తు నేర్పఱచిరి ఆ పరిషత్తును 'సంఘమ్' అని వ్యవహరింపుచుండెడివారు తమిళ వాఙ్మయ చరిత్రనుబట్టి ఈ పరి షత్తు క్రీ పూ 500 సం॥ల నుండి, క్రీ శ 2వ శ వరకును అమలులో నున్నట్లు తెలియవచ్చుచున్నది ఇందువలన, ఆ నడుమగాగల కాలమంతయు 'సంఘకాలము'

అని వ్యవహరింపబడుచుండెడిది. అటు పిమ్మట 3వ శ నుండి 5 శ వఱకు గల కాలము 'సంఘోత్తర' కాలమనియు, "జైన, బౌద్ధ కాలమనియు చెప్పబడుచున్నది 6వ శ నుండి 9వ శ వఱకుగల కాలము భక్తికాల మనబడుచున్నది "[30]

ఈ భక్తి పదకవిత మొదట దక్షిణ దేశంలోనే ఆరంభమైనా, ఉత్తరదేశానికి వెళ్ళి, మళ్ళీ అటునుంచి దక్షిణాదికి తిరిగి వచ్చింది ఈ విషయాన్నే రాఘవన్ గారిలా పేర్కొన్నారు "The cycle came (from north) full round and reached South India again Through music, dance and dance-drama the influence of Jayadeva spread South-wards and in Telugu, Kannad, Tamil and Malayalam Universal stories and plays on devotional themes were composed in Sanskrit and these languages Kirtana and Bhajana flowed from Maharashtra chiefly and from Bengal some extent, so that on a soil already the seed-bed of Bhakti the flow of these fresh waters from other areas, fed to a rich new crop of devotional music and dance-drama "[31]

తమిళదేశంలో శైవవైష్ణవ మతాలు ప్రాచీనమైనవి శైవ సమయాచార్యులకు నాయన్మారులనీ, వైష్ణవమతాచార్యులకు ఆళ్వారులనీ పేరు ఆళ్వారులు పన్నిద్దరు ఉండేవారనీ తెలుస్తుంది మతసంబంధమైన వాదోపవాదాలు జరుగుతూ ఉండేవి ఆయా మతసంబంధి ఆచార్యులు రచించిన భక్తిరసగీతాలే తరువాతి కాలంలో గ్రంథరూపంలో వెలయించబడ్డాయి శైవగీతాలకు తిరుమర్తై అనీ, వైష్ణవ గీతాలకు నాలాయిర ప్రబంధమనీ పేర్లు నాయన్మారులు అంతకంటే ఆళ్వారులు భక్త్యుద్రేకంతో ప్రజల భాషలో పాడిన మధురగేయాలే ప్రాచీన కాలంనుంచి ప్రసిద్ధికెక్కాయి [32] నాయన్మారులలో ప్రసిద్ధుడైన మాణిక్యవాచకరు దేశికవితాలాపకు చెందిన ఉచ్చనగాయల పాటలు, గొబ్బిపాటలు, జోలపాటలు వంటి మధురకవితను వెలయించాడు ఆళ్వారుల గీతాలన్నీ మధురగీతాలే [33] ఈ విష్ణు భక్తిగీతాలు నాలుగువేలున్నాయి ఆళ్వారులలో నమ్మాళ్వారు శ్రేష్ఠుడు వీరిలో సుహావిష్ణు భక్తురాలు ఆండాళ్ (గోదాదేవి) పెరియాళ్వారు పుత్రిక, భక్తి పారవశ్యంతో ముప్పై పాశురాలు పాడింది [34] ఆండాళ్ కృష్ణభక్తిని గూర్చి శ్రీ అరవిందులు ప్రశంసించారు "This Krishna Bhakti) is given still more direct turn by a Southern poetess (Andal) is the image of herself as the bride of Krishna"[35] తమిళంలోని శైవ వైష్ణవ కవులు అనేక భక్తిపూరితాలైన పదాలు రచించడమూ, అవి గానాను

కూలంగా ఉండడమూ విశేషం [36] తమిళంలోని దివ్యప్రబంధాలు, తేవారమ్‌పదాలుగా దేవాలయాల్లో పరమపవిత్రంగా వాద్యాల తోడ్పాటుతో కీర్తించబడేవి [37] మలయాళం చాలాకాలంవరకు తమిళంతోనే కలిసి ఉండడంవల్ల అందులో అతి ప్రాచీన పదకవిత అని పేర్కొదగ్గ కవిత లేదేమో కానీ, జానపదకవితకు కొదవలేదు. అయితే 18వ శ లో ఆటకథ అనబడు కథకళి ఆరంభమైంది, 'కృష్ణనాట్టం' అన్నది 'గీతగోవిందం' ను అనుసరించి వ్రాయబడిందని విజ్ఞుల అభిప్రాయం.[38]

ఇలాగా తమిళంలో పదకవిత సహజమై, భక్తిపూరితమై అనాదినుంచి వ్యాప్తిలోనికి వచ్చిందన్న విషయం స్పష్టం

## 0 6 2 కన్నడంలో పదకవిత

కన్నడ సాహిత్యం 9వ శ లో ప్రారంభమైంది కానీ అంతకుముందు, సమకాలికంగానూ జానపద కవిత వెల్లివిరిసింది తమిళంలోలాగే, కన్నడంలోను శైవవైష్ణవ మతావలంబులు ఈ పదకవితల్ని వెలయించారు వచనకారుల్లో చెప్పుకోదగ్గ ప్రముఖుడు బసవేశ్వరుడు అంతకంటె ముందు కాశిమయ్య, ఆ తరువాత అక్కమహాదేవి వచన రచనచేసి దేశిసాహిత్యాన్ని పరిపోషించారు [39] ఇవి పేరుకు వచనాలేగానీ రాగయుక్తంగా పాడుకోదగ్గ పాటలే ఆ తరువాత కృష్ణభక్తిపూరిత పదరచన అంటే దాససాహిత్యాన్ని పేర్కొనవలసి ఉంది తమిళనాడులోని నాయన్మారులా, ఆళ్వారులా భక్తి కన్నడదేశానికి ప్రాకి అక్కడకూడా ఆయా మతాలు అభివృద్ధి చెందాయి 'The impulse spread from Tamilnadu to adjacent Karnataka where comparable to the Nayanmars and Alwars two groups of saints arose the Virasaivas or Lingayats and Haridasas,"[40] మతంతోపాటు పదరచన పరాంకోటికెక్కినది దాససాహిత్యంలోనే క్రీ శ 13వ శ లో ఉడిపి దగ్గర ద్వైతమత ప్రవక్తలైన మధ్వాచార్యులు అవతరించి శైవమతానికి బసవేశ్వరునిలాగా భాగవతధర్మాన్ని వ్యాప్తిలోనికి తెచ్చారు ఇతని శిష్యుడు పద్మనాభతీర్థులు ఇతని శిష్యుడే శ్రీపాదరాయలు కన్నడంలో 'దేవరనామము' లనబడే కీర్తనలను రచించి పూజాసమయంలో పాడించే పద్ధతిని ప్రారంభించిన ఘనత ఇతనికే దక్కింది [41] ఈ పదాల్లోని భక్తి శృంగారాదులు శ్రోతల్ని ఆకర్షిస్తూ ఉంటాయి శ్రీపాదరాయల ముఖ్యశిష్యుడు వ్యాసరాయస్వామి,

నూర్లకొలది మనోహరమైన కీర్తనల్ని రచించి వ్యాసకూటంతోపాటు, దాసకూటాన్ని ఉన్నతస్థితికి తెచ్చిన ముఖ్యుడు [42] వ్యాసరాయల ప్రియశిష్యులలో ప్రథమగణ్యుడు పురందరదాసు. వాగ్గేయకార చక్రవర్తి. కర్ణాటక సంగీతానికి తన పదరచనతో చక్కటి బాటలువేసిన కర్ణాటకసంగీతపితామహుడు తెలుగులో వేలకొలది పదాలు రచించిన అన్నమాచార్యుని సమకాలికుడు [43] "The great art of the Pada-singers of this school, Purandaradasa (1480-1564) is revered as founder of Modern Karnataka music His Padas, the model and source of inspiration for Thyagaraya, are remarkable for their devotion, moral teachings, popular sayings, wit and satire and philosophical truths "[44] అని అభివర్ణించిన డా॥ రాఘవన్‌గారి మాటలు స్మరించదగ్గవి

వ్యాసరాయ ప్రియశిష్యుల్లో మరో ఉత్తమ పదకర్త కనకదాసు గురువు వ్యాసరాయలచేతనె ప్రశంసించబడ్డవాడు ఇతడు ఇంకా గోపాలదాసు, విజయదాసు, జగన్నాథదాసు ప్రభృతులు పదరచనచేసి కన్నడసాహిత్యంలోని దాససాహిత్యానికే ఎంతో పుష్టిని తుష్టిని చేకూర్చిన పదకర్తలు వారినందరినీ స్మరించడం మన కర్తవ్యం

## 0.7 తెలుగు పదకవిత - వికాసం .

తెలుగుసాహిత్యం క్రీ శ 11వ శ లో వెలిసింది అయితే అతఃపూర్వమే దేశిసాహిత్య మనబడే జానపద సాహిత్యం విరివిగా ప్రచారంలో ఉండే ఉంటుంది. అది పండిత సాహిత్యమైతే ఇది పామర సాహిత్యం అందుకే తెలుగు సాహిత్యాన్ని పండిత సాహిత్యమూ, పామర సాహిత్యమూనని లేదా శిష్టసాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూనని వింగడించవచ్చు. శిష్టసాహిత్యంకంటే ముందే శిష్టేతర సాహిత్యం ఉద్భవించినా, ప్రామర్యం పొందినా అది సామాన్య ప్రజలకు మాత్రమే పరిమితమైంది రాజాదరణ లభించిన శిష్టసాహిత్యం పండితలోకంలో ప్రబలింది. లిఖితమై చాలావరకు నిలచింది పామరసాహిత్యం మౌఖికం కావడంవల్ల కాలగర్భంలో ఎంతో కలిసిపోయింది.

తెలుగుసాహిత్యంలోని శిష్టేతర కవితాస్రోతస్విని మూడుపాయిలుగా ప్రవహిస్తూ వచ్చింది మొదటిదికేవలం జానపదకవిత. దానిపుట్టుక అనాది. లిఖితం కాలేదు. కేవలం మౌఖికం మాత్రమే

రెండోది నన్నయకు పూర్వం శాసనాల్లో అక్కడక్కడా చోటుచేసుకున్నా పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైనది ద్విపదకవిత దీనికి మన జానపదులలో వ్యాప్తిలో ఉన్న ఏలలు, జోలలు మొదలైన జానపదరూపాలే ఆధారం [45] ద్విపదను గ్రహించడమేగాదు పాల్కురికి దీనికి కావ్యభాషా ప్రతిపత్తిని కల్పించాడు. అంటే పండితులుసైతం గౌరవించేట్టు పాటుపడ్డాడు [46] ఆనాడు 'పండితలోకంలో సంస్కృతానికేగాని, దేశి అయిన తెలుగుకు ప్రాధాన్యం లేకపోవడంవల్ల దాన్ని ప్రామాణికం చేయడంకోసం—

"తెనుఁగు మాటలనంగ వలదు, వేదముల
కొలదియ కాఁజూడు డిల నెట్టులనినఁ
బాటి తూమునకును బాటి యౌనేనిఁ
బాటింపఁగా సోలయును బాటికాదె," [47] — అని పట్టుపట్టి అంగీకరింపజేసినట్లు స్పష్టంగా తెలిసే విషయం ఇక్కడ ఈ ద్విపద శైవమత ప్రచారం కోసమే ప్రారంభమైనా, ఆ వెనుక తెలుగులో దీనికి పండితాదరణ లభించింది

మూడోది వైష్ణవమత ప్రాధాన్యంతో అన్నమాచార్యుని (1408-1503) తో ప్రారంభమైన పదకవిత ఈ పదకవితకు పూర్వం కృష్ణమాచార్యుడు (1268-1323) సింహగిరి వచనాలు రచించి తరించాడు ఇవి పేరుకు మాత్రమే వచనాలు కానీ పదంలా పాడుకోడానికి భక్తిప్రపత్తిని ప్రకటించడానికి ఉపకరించేవే వీటికి అంతగా ప్రచార, ప్రాధాన్యాలు రాలేదు అయినా అలాంటివే వేంకటేశ్వర వచనాలనే పేరుతో పెద తిరుమలాచార్యుడు తదనంతరకాలంలో రచించడం జరిగింది అనాది నుంచి పామరప్రజలను అలరిస్తూ వచ్చిన జానపదగేయరీతుల్ని గ్రహించి, అనేక పద కవితల్ని శిష్టకవితల్లో ఒక భాగంగా వెలయించి - పండిత ప్రశంసకు పాత్రమైన పద్యకవితా పీఠం పక్కనే పదకవితకు సైతం - సరిపీఠం వేసిన ఘనత అన్నమాచార్యునికే దక్కింది పై పెచ్చు — పూర్వోక్తమైనట్లు - సంస్కృతంలో 'సంకీర్తన

లక్షణం' రచించి, పదకవితకు విశిష్టతనీ, గౌరవ ప్రతిపత్తిని కలిగించి, ప్రామాణికతను సంప్రాప్తింప చేశాడు. అంటే దీనికి నిబద్ధతని నిరూపించాడు [48] ఈ పదాలు శృంగార, ఆధ్యాత్మికపదాలని రెండు విధాలు యాగంటివారి పదాలు తత్వాలు, వచనాలు వెలిశాయి అన్నమాచార్యుని పద్ధతిలోనే అతని పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు పదాలు రచించి, పదకవితకు ప్రాముఖ్యాన్ని తెచ్చారు

సంకీర్తన, పదమూ అని పిలువబడుతూన్న ఈ పదం క్షేత్రయ్య కాలంనాటికి శృంగార పదమనే ప్రసిద్ధికెక్కింది. దీనికి అభినయం జోడింపబడింది ఆనాటి నుంచి పదాభినయం ప్రారంభమైంది [49] రామదాసు కీర్తనలు రచించి భజనపద్ధతిని ప్రవేశపెట్టాడు సారంగపాణి శృంగారపదాలు, నీతివైరాగ్య సంబంధి అయిన ఆధ్యాత్మ కీర్తనలు రచించాడు [50] నాదోపాసనలో ముక్తిపొందిన త్యాగరాజు రచనలు కృతులు సాహిత్యంకంటే సంగీతమే ఇందు ప్రాధాన్యం వహించింది పోతులూరి వీరబ్రహ్మం, సిద్దయ్య ప్రభృతులు తత్వాలనబడే పదరచన చేశారు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి సైతం సంగీతంలో సాహిత్య ప్రాముఖ్యంగల పదరచన చేశాడు ఇలాగా ఎంతరో మహానుభావులు పదకవితలకి పట్టంగట్టి పరిపోషించి వాగ్గేయకారులుగా ప్రసిద్ధికెక్కారు

ఈ స్థూలపరిశీలన తదనంతర ప్రకరణాల్లో అన్నమాచార్యులతో ప్రముఖ వాగ్గేయకారుల పదకవితల తులనాత్మక అధ్యయనానికి ఉపకరించగలదు ఆయా సందర్భాల్లో అవసరమైన మరికొన్ని వివరాలతో పరిశీలించడానికి సైతం ఈ భూమిక అనుకూలిస్తుంది

## సూచికలు

1 i) సుందరం, ఆర్ వి యస్ తెలుగు కన్నడ జానపద గేయాలు
ii) ,, తెలుగు సాహిత్యంలో దేశికవిత
iii) గంగప్ప, ఎస్. జాతికి ప్రతిబింబం-జానపద సాహిత్యం

2 అప్పారావు, గంధం వేమన సర్వజ్ఞులు

| | | |
|---|---|---|
| 3 | Rt Rev Robert Caldwell | A Comparative Grammar of the Dravidian or South Indian Family of Languages III Edn 1956 |
| 4 | i) రామకృష్ణయ్య కోరాడ | దక్షిణదేశ భాషాసారస్వతములు. |
| | ii) రాధాకృష్ణశర్మ, చల్లా | దక్షిణభారత సాహిత్యములు |
| 5 | జోగి సోమయాజి, గంటి | ఆంధ్రభాషావికాసము |
| 6 | i) గంగప్ప ఎస్ | తెలుగులో పదకవిత |
| | ii) „ | 'తెలుగు, తమిళ, కన్నడ పదకవితలు' తెలుగు (సాహిత్యమాసపత్రిక) జూన్, 1987 |

7 "మార్గదేశవిభాగేన సంగీతం ద్వివిధం మతమ్
ద్రుహిణేన యదుద్దిష్టం, యదుక్తం భరతేనచ
తన్మార్గోహి యయోరీత్యా. యత్స్యల్లోకానురంజనం
దేశేదేశే సంగీతం తద్దేశిత్యభిధీయతే"
(సంగీతదర్పణము)

8 "దేశేదేశేజనానామ్ యదుచ్యా హృదయురంజకమ్
గీతంచ వాదనం నృత్తం తద్దేశిత్యభిధీయతే"
(సంగీతరత్నాకరము)

9 "ఆద్యం భావాశ్రయం నృత్యం, నృత్తం తాళలయాశ్రితమ్
ఆద్యం పదార్థాభినయోమార్గో దేశితథాపరమ్"
(దశరూపకము)

| | | |
|---|---|---|
| 10 | లక్ష్మీకాంతం, పింగళి | ఆంధ్రసాహిత్యచరిత్ర-పు 28-33 |
| 11 | అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి | సాహిత్యోపన్యాసములు - 3 క్షేత్రయ్య పదసాహిత్యము-పు 12,13 |
| 12. | ప్రభాకరశాస్త్రి, వేటూరి | సింహావలోకనము-పు 42 |
| 13. | Moulton, R G | Methods and Materials of literary Criticism- Pg 12,14 |

| | | |
|---|---|---|
| 14 | ,, | The Modern study of literature- An Introduction to literary Theory and Interpretation- P 605 |
| 15 | భరతముని | నాట్యశాస్త్రము-అధ్యా 32, శ్లో 25-47 |
| 16 | అప్పారావు, పి ఎస్ ఆర్ | నాట్యశాస్త్రము- అధ్యా 32-పు 809 |
| 17 | రజనీకాంతరావు బాలాంత్రపు | ఆంధ్రవాగ్గేయకారచరిత్రము-పు 56,57 |
| 18 | చినతిరుమలాచార్యుడు | సంకీర్తన లక్షణము vol I The Minor works of Thallapaka Poets- Ed. by V Vijaya Raghavacharya and G. Adinarayana Naidu-1935 |
| 19 | పైదే పద్యం 24 పు 141 | |
| 20 | పైదే ప 56,58 59 | |
| 21 | ఆనందమూర్తి, వేటూరి | తెలుగు సంకీర్తనలక్షణము - లక్ష్య లక్షణ సమన్వయము- భారతి, ఆగస్టు 1971, పు 11-16 |
| 22 | ,, | తాళ్ళపాకకవుల పదకవితలు- భాషా ప్రయోగవిశేషాలు- త్వి భా పు 2 |
| 23 | పై 17వ సూచికలోని దే పు 48-55 | |
| 24 | పైదే పు 33, 34, 37 53 | |
| 25. | గోవిందదీక్షితులు | సంగీతసుధ |
| 26 | Raghavan, V | The Great Integietors The Saint Singers of India- P 19 |
| 27 | Sir Aurobindo | The foundations of Indian Culture- P 361 |
| 28 | పైదే | |
| 29 | వరదాచార్యులు, ధనకుధరం | ఆళ్వారులు- దివ్య ప్రబంధములు- పు. 13, 14 |

| | | |
|---|---|---|
| 30 | పై 26వ సూచికలోనిదే పు 19 | |
| 31 | రాధాకృష్ణశర్మ, చల్లా | తమిళ సాహిత్యము- దక్షిణ భారత సాహిత్యములు- పు 24, 25 |
| 32 | పై 27వ సూచికలోనిదే పు 362 | |
| 33 | పై 31వ సూచికలోనిదే పు 27 | |
| 34 | పై 26వ సూచికలోనిదే పు 21, 22 | |
| 35 | వార్టి, కె యం | (అను) రాధాకృష్ణ శర్మ, చల్లా మల యాళ సాహిత్యము- దక్షిణ భారత సాహిత్యములు- పు. 116-133 |
| 36 | 1) సుందరం, ఆర్వీయస్ | కన్నడ సాహిత్యచరిత్ర-పు 215-220 |
| | ii) మరియప్పభట్ట, ఎం | సంక్షిప్త కన్నడ సాహిత్య చరిత్రె పు 189-197 |
| 37 | పై 26వ సూచికలోనిదే పు 24 | |
| 38 | చిదానందమూర్తి, ఎం | ఉగాభోగగళు మత్తు వచనగళు: ప్రబుద్ధ కర్ణాటక- సం. 46 క్రోధన. సం చైత్ర-సంచికే, మైసూరు విశ్వ విద్యాలయ, మైసూరు-1964-65 |
| 39 | రామకృష్ణశర్మ, గడియారం | కన్నడ సాహిత్య చరిత్ర- దక్షిణ భారత సాహిత్యచరిత్ర- పు 92-94. |
| 40 | 1) పైదే పు 94 | |
| | ii) పై 17వ సూచికలోనిదే పు 151 | |
| 41 | పై 26వ సూచికలోనిదే పు 25 | |
| 52 | గోపాలకృష్ణమూర్తి, శ్రీపాద | దేశి సారస్వత విభూతి- కిన్నెర (డిశంబర్ 1953)—పు. 553 |
| 43 | పైదే | |
| 44 | సోమనాథుడు, పాల్కురికి | బసవపురాణము- పు 8, 9 |
| 45 | వివరాలకు | నా "తెలుగులో పదకవిత"-పు.51-63 |
| 46 | వివరాలకు | నా "క్షేత్రయ్య పదసాహిత్యం" |
| 47 | వివరాలకు | నా "సారంగపాణి పదసాహిత్యం" |

# 1.0 అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు: జీవితరేఖలు

తాళ్ళపాక అన్నమాచార్యులను ఇతర ప్రముఖ వాగ్గేయకారులతో సరిపోల్చి తులనాత్మకంగా అధ్యయనం చేయ బూనుకొనే ముందు అన్నమాచార్యుల జీవిత చరిత్రను పరిపూర్ణంగా అవగాహన చేసుకోవడం అవసరం ఆ వెనుక ఆయా ప్రముఖ వాగ్గేయకారుల జీవితరేఖల్ని తెలుసుకొని, తద్వారా ఆయాపదకర్తలతో అన్నమాచార్యుల్ని తులనాత్మకంగా పరిశీలనచేస్తే అన్నమాచార్యులకు తదితరులకు గల సామ్యవైషమ్యాలు, భేదసాదృశ్యాలు స్పష్టమవుతాయి ఆప్రయత్నాని కిది నేపథ్యంగా ఉపకరించగలదు ఇదే సందర్భంలో ఇతర ప్రముఖులైన పదకర్తల జీవితరేఖలలో సంపదించే విశేషాల్ని సైతం మనం గుర్తించ గలుగుతాము

## 1.1 తాళ్ళపాక అన్నమాచార్యుడు(1408-1503) .

ఈ తులనాత్మకాధ్యయన ఆలయానికి మూలవిరాట్టు తాళ్ళపాక అన్నమాచార్యుడు తదితర వాగ్గేయకారులు ఉత్సవవిగ్రహాలు ఆ మూల విరాట్టు చుట్టూ ఈ ఉత్సవ విగ్రహాలను తిప్పుతూ ఊరేగించడమనే పరిశీలనమే ఈ ప్రస్తుత తులనాత్మక అధ్యయనం ఆ దేవతల ఊరేగింపులో ప్రేక్షకులైన భక్తుల హృదయాలను ఆనందింపజేయడమే ఈ సహృదయ విమర్శన లక్ష్యం

అన్నమాచార్యుల తండ్రి, తాతముత్తాతల నివాసం కడపజిల్లా, తాళ్ళపాక గ్రామం వీరు నందవరీక బ్రాహ్మణులు, ఋగ్వేదులు, అశ్వలాయన సూత్రులు, భారద్వాజ గోత్రులు ఇలాంటి వంశంలోని నారాయణసూరికి, అతని ధర్మపత్ని లక్కమాంబకు శ్రీవేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో "విరుదు గజ్జియల ముప్పిడి కరారంబగు నందకాంశమున వైశాఖ విశాఖా నక్షత్రమున, చక్కని గ్రహములచ్చ యమున మూడలర"[1] అన్నమాచార్యుడు జన్మించాడు ఈతడు 1424లో జన్మించి, 1503లో దివ్యధామం చేరినట్లు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నిర్ణయించారు [2] ఈ విషయాన్ని బలపరచారు డా॥ వేటూరి ఆనందమూర్తిగారు [3] కానీ అనేకాధారాలతో గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు అన్నమాచార్య జననం 1458 అని నిరూపించారు,

"అన్నమయ్య క్రీ శ 1424 క్రోధి సం వైశాఖశుద్ధ పూర్ణిమనాడు విశాఖానక్షత్ర మందు జన్మించినట్లు కీ శే ప్రభాకరశాస్త్రిగారు పేర్కొనియున్నారు శాస్త్రిగారే వేంకటేశ్వర వచనములకు పీఠిక వ్రాయుచు (1945 పీఠిక పు 12, 13) అన్నమయ్య జన్మకాలము క్రీ శ 1408 అనివ్రాసి, అన్నమాచార్య చరిత్రపీఠిక (1949 పీఠిక పు. 2, 3)లో దానిని సవరించి క్రీ శ 1424 అని వ్రాసినారు డా॥ వేటూరి ఆనందమూర్తిగారు 'తాళ్ళపాక కవులకృతులు- వివిధ సాహితీ ప్రక్రియలు. అనే గ్రంథమున (పు 60–65) దీనినే బలపరచుచు శ్రీసాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నిర్ణయమును, శ్రీ వాగంటి శేషయ్యగారి నిర్ణయమును త్రోసిపుచ్చిరి

"1408 విరోధి వైశాఖశుద్ధ పూర్ణిమ విశాఖానక్షత్రమున సబలు విరక్తుడగు అన్నమయ్య ఈ విధముగ లెక్కించెననుట సమంజసము '[4]

అన్నమాచార్యుడు కొండనెక్కే సమయానికి పదహారేండ్లవాడని చెప్పిన ప్రభాకరశాస్త్రిగారి మాటలను అంగీకరించక అన్నమాచార్యుని మనుమడు చిన్నన్న అన్నమాచార్య చరిత్రలో చెప్పినట్లు కొండనెక్కేనరికి ఎనిమిదేండ్లే అని భావించి ఐదోఏటనే ఉపనయనం జరిగినట్లు విశ్వసించి, దానికి తగిన ఉపపత్తులు గౌతమ ధర్మ సూత్రాలనుంచి ఉదాహరించి ఈ విధంగా స్థాపించారు రామసుబ్బశర్మగారు. "ఇక దుర్బలాహారులగు నేటివారు గూడ కాలినడకన ఎనిమిదవయేటనే కొండనెక్కు చుండుట ప్రత్యక్షమైన విషయమే అట్లు అన్నమయ్యయు, పుట్టినదాది యెనిమిదవ యేటనే కొండనెక్కియుండుట వింతగాదు

"ఈ లీల నెనిమిది యేడుల పిన్న
బాలుఁడయ్యును నిష్ఠఁబనిఁబూని యతఁడు

.

వితతవృత్తంబుల వేంకటపతికి
శతకంబు కుతుకంబు సమకూరజేసి
పదిరెండు నామముల్ బాగుగాఁదీర్చి
సదమలాచారుఁడై సనుదెంచి యతఁడు" (అన్నమాచార్య

చరిత్రము పు 23, 24) అని చిన్నన్న, తాతగారి చరిత్రమును దగ్గర దగ్గర కాలముకో విన్నవాడు చెప్పుచుండగా శ్రీ శాస్త్రిగారు కోమలమతులు అన్న మయ్యను సుకుమారునిగా భావించి ఎనిమిదవయేట కొండనెక్కించుటకు సంశ

హించిరి "[5] అని తెలుపడం సమంజసంగానే ఉంది కాబట్టి అన్నమాచార్యుని జననం 1408 అనడమే సముచితమని నేను సైతం భావిస్తున్నాను

ఇది ఇలా ఉండగా కాముశెట్టి శ్రీనివాసులు మరికొన్ని యుక్తులతో ఈ అభిప్రాయాన్ని బలపరచారు "పెద తిరుమలాచార్యుల సంకీర్తనల తొలిరాగి రేకుల లోని మాటలు కూడ పరిశీలింపదగినవి. 'శాలివాహన శకవరుషంబులు 1424 అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బ॥ ౧౨ మొదలుగాను, తాళ్ళపాక అన్నమాచార్యులుంగారు తమ కొమరుఁడు తిరుమలాచార్యులను దినమొక సంకీర్తన శ్రీవేంకటేశ్వరునకు ఒంకితముచేసి చెప్పుమనఁగాను, విన్నపముచేసిన సంకీర్తనలు' అని పెద తిరుమలాచార్యుల సంకీర్తన రచనా ప్రారంభముచే తెలుపడం జరిగింది ఈ దృష్టితో చూచినపుడు- తళ్ళపాక అన్నమాచార్యులు జన్మించినది శా శ 1330 (క్రీ శ 1408), వేంకటేశ్వరుడు ప్రత్యక్షమై సంకీర్తన రచనల కాదేశించినది శా శ 1346 (క్రీ శ 1424), అన్నమాచార్యుల నిర్యాణం శా.శ 1424 (క్రీ శ 1503) అని నిశ్చయానికి నేను రావడం జరిగింది శ్రీయుతులు సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, వాగంటి శేషయ్య, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, ఆచార్య బి ఎన్ రెడ్డి ఈ విషయాలను అంగీకరించారు . సదాశివరాయలు పరిపాలించే కాలంలో తాళ్ళపాక తిరువెంగళనాథుడు తిరుమల దేవాలయంలో ఒక శాసనం వేయించాడు. అది శా శ 1468 నాటిది తాళ్ళపాక అన్నమయ్యగారి జన్మనక్షత్రంనాడు వైశాఖ-విశాఖలో వేంకటేశ్వరస్వామికి రెండుపళ్లనుండలు ఉభయమిచ్చే వైనం తెలుపబడింది

"చిన్నన్న చరిత్ర, శాసనం అన్నమాచార్యుల జన్మతిథిని గురించి - మాస, నక్షత్ర నామాలనే తెలుపుతున్నవి ఉపలబ్ధాలైన ఆధారములనుబట్టి, రాగిరేకులలోని వాక్యరచనా విధానాన్నిబట్టి, పెద్దలూహించిన భావసరణిని బట్టి నా బుద్ధికందినంత వరకు 'అన్నమాచార్యులు శా శ 1330లో వైశాఖ మాసమున విశాఖ నక్షత్రయుక్త దినమున (సర్వధారినం నిజ వైశాఖ (వైయాసి) మాసమున శుక్లచతుర్దశి బుధ వారమున క్రీ శ 1408 మేనెల 9వ తేదీన) జన్మించె' నను సాధు సుబ్రహ్మణ్య శాస్త్రిలగారి వాక్యాన్నే నేను ప్రమాణంగా స్వీకరిస్తున్నాను "[6]

అన్నమాచార్యుడు శ్రీ వేంకటేశ్వరునిపై దినానికి ఒక సంకీర్తన చొప్పున రచించి సమర్పిస్తూ అతని జీవితకాలంలో ముప్పైరెండువేల సంకీర్తనలు రచింపా

దన్న సంగతిని అంగీకరిస్తూ, పరిశీలిస్తే గూడా అన్నమాచార్యుని జీవితకాలం 1408–1503 అని స్పష్టమవుతుంది.[7] ఇది బలవత్తర కారణమని చెప్పక తప్పదు అంచే అన్నమయ్య జననం 1408 సం అని సిద్ధాంతం.

చిన్నవయస్సులో అన్నమాచార్యుని తలిదండ్రులు, పదిన పసులు చెఱతూండగా చేస్తూ ఉండేవాడు యథారీతిగా ఒకరోజు పసులకోసం కసువుకోసి తెమ్మనగా, వెళ్ళి చేతివేలు కోసుకొని బాధపడి విసిగిపోయాడు తెలిసీ తెలియని వయసులోనె, శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనార్థం తిరుపతికి వెళ్ళుతూన్న భక్త బృందంతో కలిసి వెళ్ళిపోయాడు మోకాళ్ళ ముడుపువద్దకి చెప్పుల కాళ్ళతో నడచి వెళ్ళి అలసిపోయి భక్తులను వదలి రాతిబండమీద నిద్రపోయాడు అలివేలుమంగ వచ్చి అతని అలుపుతీర్చి వెళ్ళిపోతుంది అమ్మ ఇచ్చిన ప్రసాదం మూలంగా అతడు సరససాహిత్య పారీణుడై అలమేలుమంగాంబపై శతకం ఆశువుగా చెప్పాడు ఆ వెనుక పదాలు పాడుకొంటూ కొండమీదికి వెళ్ళి, కోనేరు మొదలైన వాటిని దర్శించి, స్నానాదులు ముగించి, శ్రీ వేంకటేశ్వరుని దర్శించి పులకితుడవుతాడు. అర్చకులు తీర్థప్రసాదాలు, శఠగోపం ఇచ్చి పంపుతారు పాపనాశనాదుల్లో అవగాహనుడై శ్రీ వేంకటేశ్వరునిపై శతకం చెప్పాడు స్వామిదర్శనానికి పోగా తలుపులు బిగించి ఉండడం గమనించి, ఆవేశంతో అంతకుముందే చెప్పిన శతకంలోని పద్యాలు మళ్ళీ చదవగానే తలుపులు వాటికవే తెరచుకొన్నాయి అర్చకులు ఆశ్చర్యచకితులయ్యారు స్వామివారి ముత్యాలపేరు అన్నమయ్య పాదాలపై బడుతుంది అచటి వైఖానసార్చకులు అబ్బురపడి, అతడు సామాన్యుడుకాడని, స్వామి అపరావతారమనీ కీర్తిస్తారు ఆవెనుక స్వామి ఆదేశానుసారం ఘనవిష్ణుయతి అన్నమయ్యను శంఖచక్రాంకితునిజేసి, పంచసంస్కారాలు గావించి, శరణాగతి ధర్మాన్ని బోధించి వైష్ణవ మతావలంబిగాచేసి పంపుతాడు.

తల్లిదండ్రులు పుత్రుని గానక బాధపడి ఎలాగో చివరికి తిరుపతి చేరి వెతికి అన్నమయ్యను ఇంటికి తీసుకొనిపోతారు అన్నమయ్య యుక్తవయస్కుడు కాగానే తల్లిదండ్రులు తిరుమలమ్మ, అక్కలమ్మలనే ఇద్దరుకన్యలతో అన్నమయ్య వివాహం చేస్తారు శఠకోప ముని వద్ద సకల వేదవేదాంత పఠనం పూర్తి చేసుకొంటాడు శ్రీ వేంకటేశ్వరునిపై భక్తితో పదరచనచేసి ఆడిపాడుకొంటూ ప్రసిద్ధి కెక్కుతాడు

ఇతని బాల్యమిత్రుడు సాళవనరసింగరాయలు పెనుగొండలో రాజ్యం చేస్తూండి, ఇతనిని పిలిపించి శృంగార పదాలు పాడించుకొని మురిసిపోతాడు. ఆనందంతో అన్నమయ్యను ఎంతగానో సత్కరిస్తాడు చివరికి తనపై సైతం అలాంటి శృంగార పదాలు చెప్పమని వేడుకోగా అన్నమయ్య తిరస్కరిస్తాడు హరి నామస్మరణంలో నానిన నాలుక నరునినామం స్మరించ లేదని గట్టిగాచెప్పాడు. కుపితుడైన రాజు అన్నమాచార్యుని శృంఖలాబద్ధుని గావిస్తాడు

"ఆకటి వేళల అలపైన వేళల
తేకువ హరినామమే దిక్కుమఱిలేదు" (5-100)—

అనే పదం పాడగానే సంకెళ్లు ఊడిపోతాయి వెంటనే అన్నమాచార్యుని మహిమను గుర్తించి పాదాక్రాంతుడవుతాడు రాజు ఆ వెంటనే ఘన సత్కారం చేసి పంపించివేస్తాడు అన్నమాచార్యుడు క్షమించి, శ్రీవేంకటేశ్వరుని సేవకై శేషజీవితాన్ని వినియోగించుమని దీవించి వెళ్ళిపోతాడు తిరుమలకు అక్కడ దినానికొక్క పదం చొప్పున రచనచేసి, ఆడిపాడి శ్రీవేంకటేశ్వరుని అర్చనలో కాలం గడుపుతూ ఉంటాడు. పుల్ల మామిడిని తియ్య మామిడిగా మార్చడం, నిరుపేద వివాహానికి ధనం సమకూర్చడం మొదలైన మహిమలు సైతం ప్రదర్శిస్తాడు సంసారిగా ఉంటూ శ్రీవేంకటేశ్వర స్వామి భక్తుడై 32 వేల అధ్యాత్మ శృంగార సంకీర్తనల్ని రచించి తరించాడు 1503లో దివ్యధామం చేరుతాడు పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ ప్రసిద్ధికెక్కాడు

ఈ మహనీయుని చరమదశలో పురందరదాసు దర్శించినట్లు అన్నమాచార్యుల మనుమడు చిన్నన్న రచించిన, 'అన్నమాచార్య జీవితచరిత్ర' అనే ద్విపద కావ్యంలో పేర్కొన్నాడు

"ఎనయ సంధ్యలకు నీళ్ళియఁ జేకొనుచుఁ
దనరు పురందర దాసాహ్వయుండు
పరమ భాగవతుఁడై పరగుమ నంద
వర కులాగ్రగణియైన వైష్ణవోత్తముఁడు
నవరించు మురవైరి సంకీర్తనములు
కువలయంబునఁ బేరుకొన్న మాత్రమున

తలఁచిన భూతభేతాళ పిశాచ
ములు పాఱిపోవ నిమ్ముల సఖం బెసఁగ
విని కనియును లోన వెఱఁగంది కొనుచు
చని, తాళ్ళపాక శాసనుఁడన్నమయ్య
వెన్ను నిఁగానె భావించి కీర్తించి
సన్నుతిసేయ నాచార్య వర్యుండు
నాతని విట్ఠలునిఁగా ననయంబు దలఁచి
ప్రతిచేని గతుల సంభావించె '[8]

ఇందులో తాతగారైన అన్నమాచార్యుని(1408-1503) జీవితచరిత్రని చిన్నన్న (1500-1558) రచించడంవల్ల ఎవిని మనం చారిత్రక సత్యంగా గ్రహించడంలో అసామంజస్యం లేదు

కానీ విద్యారత్న ఆర్ ఎస్ పంచముఖిగారు మాత్రం అన్నమయ్య పురందర దాసుల పరస్పర సందర్శనాన్ని శంకించారు అందుకు వారు చూపిన కారణాలివి చిత్తశుద్ధిగల మాధ్వుడైన పురందరదాసు, శ్రీవైష్ణవమతానుయాయి అయిన అన్నమా చార్యుని విష్ణువుగానే భావించి కీర్తించడం జరగడానికి వీల్లేదు విద్యానగరంలో వ్యాస రాయులవద్ద ఉపదేశం పొందిన వెనుక పురందరదాసనే పేరుతో పదరచన ప్రారం భించాడు 1500 తరువాతగాని వ్యాసరాయలు రావడం జరగలేదు గనుక, 1500 తరువాత శిష్యుడైన పురందరదాసు తిరుపతిలో అన్నమాచార్యుని దర్శించే అవకాశం లేదు [9] ఇవి సయుక్తికంగా లేవని డా॥ ఆనందమూర్తిగారు నిరూపించారు "వ్యాస రాయలవారు (క్రీ శ. 1446 - 1539) పంద్రెండేళ్ళపాటు తిరుపతిలో శ్రీనివాసుని యాలయమున నర్చకత్వము నెరపుచు క్రీ శ 1486-1498 నడుమ పలుమారులు విద్యానగరమునకు వెళ్ళివచ్చుచుండిన వారచే. 1498లో వెళ్ళి అక్కడే స్థిరపడిన వారును అందువలన ఆ పంద్రెండేండ్ల వ్యవధిలోగాని, కాదనుకొన్న పక్షమున క్రీ శ 1498లో గాని పురందరదాసు వ్యాసరాయల నుపదేశ గురువుగా భావించి గ్రహించియుండును అట్టియెడ చిన్నన్న వ్రాసినట్లు 'పరమ భాగవతు'డగు అన్నమ య్యను (అతని అవసాన కాలమగు) 1503లోఁగా నెన్నిదేని దర్శించియుండుటలో నసంభావ్య మేమియును లేదు" [10] దీనికి డా॥ ఆనంద మూర్తిగారు కన్నడంలోని

సోమనాథకవీశ్వర కృత 'వ్యాసయోగి చరిత్రము'ను, దానికి శ్రీ బి వెంకోబరావు రచించిన సమగ్ర పీఠికను ఆధారంగా గ్రహించారు కాని దీని ఆధారంగానే 1470 నుంచే వ్యాసరాయలు విద్యానగరంలో ఆధ్యాత్మికాధిపత్యం నెరపినట్లు డా॥ ఎం వి కృష్ణారావుగారు వివరించారు "He (Vyasaraja) was also the gaurdian saint of Vijayanagar Empaire and according to Somanatha's description, he spiritully dominated the empire from 1470 A D till his death in 1539 A D"[11] ఇంకా దీనికి తోడు సోమనాథుడు సైతం వ్యాసరాయల శిష్యుడని తెలుస్తుంది 'Chronologically, after Jayateertha, the most out-standing personality among Vaishnava pontiffs was Vyasaraja whose life has been vividly described by poet Somanatha in his Vyasayogi charitam Somanatha was himself a desciple of Vyasayogi whose Matha was the Principal university in the city of vijayanagar"[12] ఇలాగా వ్యాసరాయల శిష్యుడైనంత గురు జీవిత చరిత్రను "వ్యాసయోగి చరిత్ర మన్న పేరుతో రచించిన సోమనాథ కవి మాటలను మనం ప్రామాణికంగా గ్రహించడం సముచితం కాబట్టి 1470 నుంచి 1569 వరకు విజయనగరంలో ఆధ్యాత్మికాధిపత్యం నెరపిన వ్యాసరాయల శిష్యత్వం 1470-1539 మధ్యకాలంలో పొందిఉంటాడు పురందరదాసు అనడం సమంజసమే అన్నమాచార్యుని మరణం 1503లో కాబట్టి చివరి దశలో సందర్శించి ఉండవచ్చునని చెప్పవచ్చును కానీ ఒక చిక్కు ఉంది పురందరదాసు జీవితకాలం 1484-1564 అని పలువురు కర్ణాటక విద్వాంసుల అభిప్రాయం[13] సంపదన్ని పరిత్యజించి ఆలుబిడ్డలతో వెళ్ళి గురూపదేశం పొంది అన్నమాచార్యుని దర్శించడానికి తిరుపతికి వచ్చే సమయానికి పురందరుని వయస్సు పైని పేర్కొన్నట్లు కుదరదు అంటే 1484 న జన్మించిన పురందరుడు 1503 ప్రాంతంలో అన్నమయ్యను 20 ఏళ్ళ వయస్సులో దర్శించాడనడం సమంజసం కాదు కాబట్టి స్వగ్రామాన్ని, సంపదన్ని పరిత్యజించి పేదరికాన్ని కొని తెచ్చుకొని భగవంతునిపై భక్తి ప్రపత్తితో పదాలు పాడుతూ వెళ్ళి, గురూపదేశంపొంది, ఆ వెనుక శ్రీనివాసు, పురందరుడుగా మారి పదరచన చేస్తూ, పాడుతూ, ప్రజలకు భక్తి, జ్ఞాన, నీతి, వైరాగ్యాలను ప్రబోధిస్తూ విజయనగరంలో ఉంటూ అహోబిలం, కంచి, వెలూరు మొదలైన క్షేత్రదర్శనం చేసుకొంటూ[14] వెళ్ళి, తిరుపతిలో అప్పటికే ప్రసిద్ధుడైన అన్నమాచార్యుని సందర్శించి ఎంతో సంతసించి సన్య

మారంకాదు అంటే పూర్వోక్తమైనట్లు అన్నమాచార్యుని చరమదశలో పురందర దాసు సందర్శించి ఉండడనడంవల్ల పురందరదాసు వయస్సు అప్పటికి సుమారు 30 సం లు ఉండవచ్చు కాబట్టి మూడుదశకాల వయస్సు అనంతరం దర్శించా డనుకోవడంలో దోసగులేదు పైపెచ్చు సముచితం గూడా కాబట్టి సోమనాధకవి రచించిన తన గురుజీవితాన్ని 'వ్యాసముని చరితం' సత్యమని విశ్వసించినట్లే చిన్నన్న తన తాత జీవిత చరిత్ర 'అన్నమాచార్య జీవిత చరిత్రము'ను విశ్వసించి అన్నమా చార్య పురందరదాసుల సందర్శనం సంభావ్యమేనని భావించడం ఎంతైనాసమంజసం[15]

అన్నమాచార్యుడు ముప్పైరెండువేల పదాలు రచించినట్లు తెలుస్తోంది అవి శృంగార సంకీర్తనలు, అధ్యాత్మ సంకీర్తనలు అని రెండు విధాలు. సంకీర్తనాచార్యు డనీ, పదకవితా పితామహుడనీ ఈతనికి సార్థక బిరుదులున్నాయి ఇంకా శృంగార మంజరి, అలవేలుమంగాంబ పై చెప్పిన శతకమూ ప్రకటితం మరికొన్ని శతకాలు, ద్విపదలో రామాయణం, వేంకటాచల మాహాత్మ్యం(సంస్కృతం), సంకీర్తనలక్షణం (సంస్కృతం) అనెవి లభించడంలేదు సంకీర్తన లక్షణాన్ని చిన తిరుమలాచార్యుడు పద్యాత్మకంగా తెనిగించిన అంశం పూర్వోక్తం.

'ఆళ్వారులు (ద్రవిడపాశురములు) రచింపఁగా నరవమున ద్రావిడ వేదమనీ, పంచమాగమమనీ పేర్కొనఁబడు దివ్యప్రబంధము నాల్గువేల సంకీర్తనములు పాట్టులు (సినపద్యాదుల వంటివి) కలదికాగా, అన్నమాచార్యుఁ డొక్కఁడే రచించిన యంధ్ర వేదము ముప్పది రెండువేల పాటలు గలది. ఈ సంకీర్తనలు దివ్య ప్రబంధముల ననువర్తించియే పరమాత్మునకు, భక్తజీవులకు పతిపత్నీ భావము, నాయికా నాయక భావము కల్పించి యుజ్జ్వల రసానుభూతి నొదవించుచు, ననేక దేవాలయములలో యర్చామూర్తుల నభివర్ణించుచు, శరణాగతి మహత్త్వమును బ్రతిపాదించుచు నింక ననేక విధముల లోకనీతి ధర్మోద్బోధభూత దయాది విశేషాంశముల వెలయించుచు, నెంతో వింతగా వేడుకగా సంగీత సారస్యముతో నరవని భాషతో వేదవేదాంతేతి హాసాది సూక్తి తదర్థ ప్రతిపాదనములతో వెల్వరిసి, పెరియ వాచ్చాంబిళ్ళై వంటి మహా వ్యాఖ్యాత వెలసెనేని యఖండానంద తాండవముగాఁ పెదపెద్ద వ్యాఖ్యా చమ త్కారములు ప్రవహింపఁదగినట్లు విజ్ఞాన నిధులై విరాజిల్లుచున్నవి"[16]

"సంకీర్తన లక్షణంలో అన్నమయ్య, చిన తిరుమలయ్య జయదేవకవి గీత గోవిందంను కొనియాడారు అంతేకాదు అన్నమయ్య తెలుగు సంకీర్తనములే కాక

నూర్లకొలది సంస్కృత భాషలోకూడా సంకీర్తనములు వేంకటేశాంకితములుగా రచించాడు."[17]

కాగా అన్నమాచార్యుడు ఆనాడు జానపదుల వాడుకలో ఉండిన జానపదగేయ రీతుల్ని అనేకం తన పదాల్లో ఉపయోగించుకొన్నాడు అలాంటి వాటిలో జాజరలు, చందమామ పదాలు, తుమ్మెద పదాలు, సువ్వి, గొబ్బి, ఉయ్యాలల, లాలి, లాల, జోల, శోభన, మంగళపదాలు, మేల్కొలుపులు, తందనాలు, ఛాంగుభళాలు మొదలైన వెన్నో వాడుకొన్నాడు

"అన్నమాచార్యుడు అద్వితీయ ప్రతిభాశాలి, ఋషికల్పుడు. పదం యొక్క అనంతరూపాలను తన రచనలలో ప్రదర్శించాడు సంవాదగీతాలు అన్నమయ్య శృంగార వైరాగ్యాలను పరిపూర్ణంగా సమాన స్థాయిలో ఆరాధించాడు తన తర్వాతి పదకర్తలకు, కీర్తనకర్తలకు ఆయన మార్గదర్శి అయ్యాడు "[18]

అన్నమాచార్యుల భార్యలు తిమ్మక్క, అక్కలమ్మలలో తిమ్మక్క విదుషీ మణి. ఈమె మంజరీ ద్విపదల్లో 'సుభద్రాకల్యాణ' మనే గేయ కావ్యాన్ని రచించి తెలుగులో ప్రప్రథమ కవయిత్రిగా ప్రఖ్యాతి పొందింది.

అన్నమాచార్యులకు తిమ్మక్కకు పెద్ద నరసింగన్న జన్మించాడు ఇతడు వాగ్గేయ కారుడన్న ప్రసిద్ధిలేదు కవికర్ణ రసాయన ప్రబంధ కర్త ఇతడేనని విమర్శ కులంటారు అన్నమాచార్యులకు అక్కలమ్మకు కుమారుడుగా పెదతిరుమలాచార్యుడు జన్మించాడు తండ్రికి దీటైన పదకర్త పెద తిరుమలాచార్యుడు పెద తిరుమలా చార్యుని పెద్ద కుమారుడు చిన తిరుమలాచార్యుడు తాత తండ్రులలాంటి పదకర్త. శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు, సంకీర్తన లక్షణము రచించాడు పెద తిరుమలా చార్యుని నాలుగో పుత్రుడు చిన్నన్నగా ప్రసిద్ధ గాంచిన చిన తిరువేంగళనాథుడు పద రచన చేయకపోయినా, ద్విపదల్లో అన్నమాచార్య జీవిత చరిత్ర, పరమయోగి విలా సము, అష్టమహిషీకల్యాణము, ఉషా పరిణయము - కావ్యాలు రచించాడు పెద తిరు లయ్య తక్కిన రెండో, మూడో, ఐదో పుత్రులైన అన్నయ్య, పెద తిరువేంగళ నాథుడు, కోనేటి తిరు వేంగనాథుడు అనే వాళ్ళకు కవులుగాగాని, పద కర్తలుగాగాని పేర్లురాలేదు. చిన తిరుమలాచార్యుని పుత్రుడు తిరువేంగళప్ప రచన అమరుకం

ప్రకటితం కానీ ఇతని ఇతర రచనలైన బాల ప్రబోధిక, సుధానిధి అనేవి ప్రకటించ బడలేదు, ఇలాగా తాళ్ళపాక కుటుంబం మూడు నాలుగుతరాలు, కవితా కుటుంబం కావడం విశేషం

అన్నమాచార్యునితో ఆరంభమైన పదకవిత తదనంతర కాలంలో మూడు పూవులు, ఆరుకాయలుగా విలసిల్లింది అలాంటి వాగ్గేయకారులతో అన్నమాచార్యు లను తులనాత్మకంగా అధ్యయనంచేసి, అన్నమాచార్యులతోపాటు, ఆయా వాగ్గేయ కారుల సేవను వివరించి, అన్నమాచార్యుని విశిష్టతను స్థాపించడం ఈ నా ప్రయత్న ధ్యేయం

## 1 2 సంస్కృతం వాగ్గేయకారులు :

పూర్వోక్తమైనట్లు అన్నమాచార్యులతోపాటు ఇతర ప్రముఖాంధ్ర వాగ్గేయ కారుల గూర్చి తులనాత్మక అధ్యయనం చేయడానికి ముందు సంస్కృతంలో వెలసిన వాగ్గేయకారులను సైతం సంక్షిప్తంగా తెలుసుకొని అన్నమాచార్యులను వారితో పోల్చి చూడడం అవసరం అందుకై సంస్కృతంలో వెలసిన వాగ్గేయకారులు- ఎందరో కవిమాట వాస్తవమైన, ఉన్న ఒకరిద్దరిని— గూర్చి గుర్తించడం అత్యవసరం పూర్వ వాగ్గేయకారుల ప్రభావం తదనంతర వాగ్గేయకారులపై ఎలా ప్రసరించిందో స్పష్టమవుతుంది సంస్కృతంలో జయదేవ లీలాశుకులు, నారాయణతీర్థులు పేర్కొన దగ్గ వాగ్గేయకారులు

### 1 2.1 జయదేవుడు .

సంస్కృతంలో గీతికావ్య కవులలో జయదేవుడు ప్రథముడు మాత్రమేకాదు ప్రముఖుడుగూడా ఈ గేయ కావ్య రచనతో జయదేవుడు సాహిత్యంతోపాటు సంగీతాభినయాలకు చేసిన సేవ అనన్యసామాన్యం. అనితరసాధ్యం జయదేవ కృతమై ప్రపంచప్రఖ్యాతిగడించిన గీతగోవిందం ఒక రసవద్గేయకావ్యం సాహిత్యం పరంగా చూసినప్పుడు. సంగీతపరంగా ఆలోచిస్తే సంగీతరూపకం. అభినయపరంగా పరిశీలిస్తే ఒకమనోహర నృత్యరూపకం సంగీత, సాహిత్యాభినయ సమ్మేళనమే గీతగోవిందం పరిమాణంలో చిన్నదైనా పై విలువలన్నింటిలోను బృహత్కావ్యం వాని ప్రభావం విశిష్టమైనది అమరరాధామాధవప్రణయేతివృత్త నిరూపకమైన ఈ రచనలో శ్లోకాలు, అష్టపదులు సందర్భోచితంగా రచితమై కావ్యగౌరవమూ, అధ

రాశిమానాలు కంగడానికి అవకాశం కల్పిస్తున్నాయి ఆయాశ్లోకాలు, లేదా అష్ట పదులు వేటికవే విడివిడిగా చదువుకొన్నా వాటి ప్రాధాన్యం రసభావవ్యంజకంగాఉండి సహృదయ హృదయాలను అలరింపజేస్తాయి కృష్ణభక్తి జయదేవునితోనే ప్రారంభ మైందని చెప్పవచ్చు

'అది పంద్రెండవ శతాబ్దారంభం అప్పటికింకా భారతీయసంగీతంలో ఉత్తర హిందూస్థాన్, కర్ణాటకపద్ధతులనే విభికరాలేదు ఇంకా శార్ఙ్గదేవునిసంగీతరత్నాకరం వెలువడటాని కాశతాబ్దం పూర్తికావలసియున్నది చరిత్రకారులు అకాలాన్ని రాజ పుత్రయుగం అన్నారు అప్పుడు భారతదేశం అంతా ఖండఖండాలై వేర్వేరు రాజుల పాలనలో ఉంటోంది పడమట పాంచాలం మొదలు తూర్పున గౌడదేశం(బంగాళం) వరకు వేర్వేరు రాజ్యాలు, మహారాష్ట్ర కర్ణాటకాలలో పశ్చిమచాళుక్యులు, కళ్యాణి చాళక్యులు, ఆంధ్రదేశంలో తూర్పుచాళుక్యులు, దక్షిణానచోళులు తమతమ రాజ్య విస్తృతికి కట్టుబేసికొని దేశభాషలలో సాహిత్యకళలను ఉద్ధరించడానికి ప్రారంభిం చారు అప్పటికప్పుడే రాజరాజనరేంద్రుడు నన్నయభట్టుచేత మహాభారతం తెలు గులో వ్రాయించారు (1060)" [19]

కావ్యగీతిప్రియుడు, కవిపండితగాయకపక్షపాతీ, స్వయంగా సంగీతసాహిత్య పండితుడూ, ప్రబంధరచనాదక్షుడూ అయిన లక్ష్మణసేనుడనేరాజు గౌడదేశాన్ని 1116 నుంచి 1160 వరకు పరిపాలించాడు అతని ఆస్థానంలో పంచకవిరత్నాలన బడే అయిదుగురు కవులుండేవారనీ అందులో ఒక వరకవి జయదేవుడనే ప్రసిద్ధి ఉంది ఇతని జన్మస్థానం, కాలాల గూర్చి వాదాలున్నాయి బాలాంత్రపురజనీ కాంతారావుగారు జయదేవుడు 1090న జన్మించి 1153న పరమపదించినట్లు నిర్ణ యించారు [20] ఏ బి కీత్ పండితుడు లక్ష్మణసేనునికాలం 1180-1200 అనీ[21] ము వేంకటకృష్ణారావుగారు 1185-1206 అనీ[22], అనేక సంస్కృతకావ్యాలను, చారిత్రకాధారాలను బట్టి 'లక్ష్మణసేనుడు క్రీ శ 1185 నుండి 1206 వరకు నున్న ట్లును స్పష్టమగుచున్నది "[23] అని వివరించి, "లక్ష్మణసేనుడు పంద్రెండవ శతాబ్ది వాడనియు అతని ఆస్థానమందున్న జయదేవుడును పంద్రెండవ శతాబ్ది వాడనియు క్రీ శ 1180 ప్రాంతమున లక్ష్మణసేనుని ఆస్థానమందుండుటచే అంతకుపూర్వము పదునైదు ఇరువది వత్సరములకు పూర్వమందుగనే అనగా క్రీ శ 1160 ప్రాంతమున గీతగోవింద కావ్యమును జయదేవుడు రచించియుండవచ్చుననియు చెప్పవచ్చును

తన నలుబదవయేట ఆ కావ్యము రచింపబడినదని ఊహించినను జయదేవుని జనన కాలము క్రీ. శ. 1120 ప్రాంతము కావచ్చునని ఊహించుట అసమంజసముకాదని చెప్పవచ్చును "[24] అని నిర్ణయించారు డా॥ వైద్యుల కృష్ణారావుగారు. జయదేవుని జన్మస్థలం బిందుబిల్వం కానీ కొన్ని శ్లోకాల్లో కేందుబిల్వమనీ, కిందుబిల్వమనీ, తిందుబిల్వమని చెప్పబడింది [25] ఇది బహుశః వ్రాయసగాండ్ర పొరపాటున ఇలా అనేకవిధాలుగా ఉందేమో తెలియదు బిందుబిల్వం ఒరిస్సాలో జగన్నాథక్షేత్రానికి సమీపాన ఉంది కానీ వంగదేశంలోని దిది అంటారు కొందరు అక్కడ ఏటేటా జయదేవుని జన్మదినోత్సవం చేస్తారట కెందూలియందు జయదేవుని మఠమూ, అందు నిలవెత్తు రాధాకృష్ణులవిగ్రహాలు ఉన్నాయి [26] జయదేవుడు ఓఢ్రదేశంలో జన్మించి, వంగదేశంలో ఉత్తమ వాగ్గేయకారుడుగా ప్రసిద్ధికెక్కాడని విమర్శకుల అభిప్రాయం [27] కానీ డా॥ కృష్ణారావుగారు "ఈ విధముగా చారిత్రక ధారములను పరిశీలించినను, వాఙ్మయాధారమును చూచినను జయదేవుడు వంగదేశీయుడే లక్ష్మణ సేనుని ఆస్థానమునందలివాడే అనంతరకాలమున శ్రీజగన్నాథపురమునకు వచ్చి అందు శేషజీవితమును గడపియుండును [28] అని నిశ్చయించారు

జయదేవుని తల్లిదండ్రులు రామాదేవీభోజదేవులని గీతాగోవిందంవల్ల నే తెలుస్తూన్న విషయం

> శ్రీభోజదేవ ప్రభవస్య రామాదేవీసుత శ్రీజయదేవకస్య
> పరాశరాది ప్రియవర్గకంఠే శ్రీగీతగోవిందకవిత్వమస్తు" [29]

కొన్ని ప్రతులలో రామాదేవికి బదులు రాధాదేవి అని కనిపిస్తుంది ఏదిఎట్లున్నా జయదేవుడు గీతగోవిందకావ్యంవల్ల ప్రసిద్ధిచెందిన ఉత్తమ వాగ్గేయకారుడు గీతగోవిందం సంగీతసాహిత్యాభినయాల సమ్మేళనం జయదేవకవి ధర్మపత్ని పద్మావతి లని

> "వాగ్దేవతాచరిత చిత్రితచిత్తసద్మా
> పద్మావతీ చరణచారణ చక్రవర్తీ"[30]— అనే శ్లోకంవల్ల స్పష్టమవుతుంది

జయదేవుడు రాధాకృష్ణభక్తుడు, రాధాకృష్ణుల అమరప్రణయాన్ని ప్రబంధాలుగా భక్తి పూర్వకంగా గానం చేస్తూండగా పద్మావతి నాట్యంచేస్తూ ఆప్రబంధాల్లోని భావాల్ని అభినయిస్తూ భర్తకుప్రేరణ అయినదట ఆప్రబంధాలే క్రమగతిని గీతగోవిందమై

వెలిశాయి ఇందులో పండ్రెండుసర్గలున్నాయి 24 అష్టపదులున్నాయి కథాగతికి ఉపకరించేలా శ్లోకాలున్నాయి రాధాకృష్ణులు, సఖి ఇందలి పాత్రలు ఏకత్రకథగా భావిస్తే గీతగోవిందం రాధాకృష్ణుల ప్రణయకావ్యం విడివిడిగా ఏఅష్టపదికి ఆ అష్ట పదిగా భావిస్తే ప్రత్యేకంగా అన్నమాచార్యసంకీర్తనలలాగా భాసిస్తాయి ఇది ఇందు లోని విశేషం

"ఇతని (జయదేవుని) అష్టపదులలో కీర్తి ధవళము, మంగళాచరణము, భ్రమరపదము, గరుడపదము వంటి దేశిప్రబంధరీతులు కనిపిస్తాయి 'ప్రళయపయోధి జలే' అను దశావతారాష్టపది కీర్తిధవళము ఇది సంగీత లక్షణ కర్తలు ప్రబంధా ధ్యాయాలలో స్పష్టీకరించిన ధవళ ప్రబంధంగా మాత్రమేకాక, తెలుగు మధురకవితా రీతులలో ఒకటయిన ధవళంగా కూడా మనం గుర్తించవచ్చు అలాగే ద్వితీయాష్ట పది 'శ్రితకమలా కుచమండల' అనేది మంగళాచార ప్రబంధం భ్రమర పదాని కుదా హరణం- 'చందన చర్చితనీల కళేబర పీతవసన వనమాలీ', గరుడపదాని కుదా హరణ- 'పహతిమలయ సమీరే మదన హృదయమువనిధాయ',

రాధా గోవిందుల ప్రణయ, విరహ, విశ్లేష, కలహ, ఖండన, సానునయ, సమాగమ, సంధానముల ద్వారా జీవబ్రహ్మైక్య సంధాన వేదాంతం వ్యంజితమవు తోందని గీతగోవిందం పరమార్థం తెలిసిన పెద్దలు చెబుతారు".[31]

ఇంకా చంద్రాలోకం, రీతిమంజరి, కారకానాదం, తత్వ చింతామణి అనే గ్రం థాలకు కర్త జయదేవుడన్న ప్రతీతి ఉంది ప్రసన్న రాఘవ నాటక కర్తా, శృంగార మాధవీయ చంపూ రచయిత వేర్వేరు జయదేవ నామకులని, గీత గోవింద కర్త అయిన జయదేవుడు కాదనీ తెలుస్తూంది

## 1 2 2 లీలాశుకుడు

లీలాశుకుడు 'శ్రీకృష్ణకర్ణామృతము' అనే మూడాశ్వాసాల కావ్యరచనచేసి తన భక్తి తత్పరతని, అనంతంగా తానసుభవించి, ఆనందించిన ఆనందామృతాన్ని మనకు సైతం పంచి పెట్టిన మహనియుడు జయదేవాదులైన వాగ్గేయకారుల్లాగా రాగతాళా లతో పదరచన చేయలేదు అందులో అన్నీ శ్లోకాలే అయితే ఆ శ్లోకాలు చాలా వరకు లక్షణ కర్తలు చెప్పిన నిబద్ధ పదాల్లాంటివని సంగీతజ్ఞులు అంగీకరించారు

"జయదేవుని తరువాత యావద్భారత విఖ్యాతి పొందిన వాగ్గేయకారులలో లీలాశుకుడు అగ్రగణ్యుడు ఇతడు సంగీత శాస్త్రంలోగాని, గానంలోగాని ప్రత్యేకంగా కృషిచేసి ప్రసిద్ధి పొందినట్లు చెప్పడానికి తగిన ఆధారాలు లేవుగాని, ఈ మహాకవీ, పరమ భక్తాగ్రేసరుడూ రచించిన కృష్ణ కర్ణామృత శ్లోకాలు గానము చేయని సంగీత సభలుగాని, భజన గోష్ఠులుగాని ఈ నాటికి ఉత్తరభారతంలోగాని, దక్షిణభారతంలో గాని లేవని చెపితే అతిశయోక్తికాదు సభలలో రాగమాలికలుగా విద్వాంసులు గానంచేసే శ్లోకాలు మాత్రమే కాకుండా తాళలయాన్వితములై మృదంగాది వాద్యములతో సహా పాడతగినవి, నృత్యాభినయములతో సామాజికులకు పరవశము కలిగించేవి. నిబద్ధ గేయములనదగిన వృత్తచ్ఛందస్సు లీయన కృష్ణకర్ణామృతంలో నగానికి మించి ఉన్నాయి అందుచేతనె నారాయణ తీర్థుల తరంగాలనూ, క్షేత్రయ్య పదాలను (వాటితో లీలాశుకుని శ్లోకాలను) పాడి నృత్యాభినయ ప్రదర్శనల ద్వారా కూచిపూడి వారు తరతరాలుగా ఆంధ్రమహాజనులను భక్తి పరవశులను చేశారు వాగంటి శేషయ్యగారు ఆంధ్రకవి తరంగిణిలో లీలాశుకుడు 13వ శ లో ఉన్నవాడని వ్రాశారు జయదేవుని తర్వాత నూరేండ్ల వాడయిన లీలాశుకుడు ఆంధ్రదేశీయుడని చాలమంది విద్వాంసుల అభిప్రాయము" [32] అని పేర్కొని రజనీకాంతరావుగారు అనేకోపపత్తులను చూపించారు లీలాశుకుడు ఉత్కళుడని కొందరు తలంచినా, ఆంధ్రదేశీయుడనడానికి అవకాశాలున్నాయి లీలాశుకుడు తన కృష్ణ కర్ణామృత కావ్యాన్ని తెలుగు కవుల్లాగానే ఆశ్వాసాలుగా విభజించడంవల్ల, చింతామణి వేశ్య మూలంగా సన్యసించిన బిల్వమంగళుడే లీలాశుకుడన్న ప్రవాదం ఉండడం చేత, 16 వ శ లోని వెలుగుపూడి వెంగాగ్రణి కృష్ణకర్ణామృతాన్ని తెలుగులోనికి అనువదించడంవల్ల, అదే 16వ శ లోని తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యములో లీలాశుకుని శ్లోకాలు ఆంధ్రీకరించి ఉండడంవల్ల లీలాశుకుడు ఆంధ్రుడని రజనీకాంతారావు గారి భావన [33]

కానీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారీ విషయాన్ని అంగీకరించలేదు " ఇట్లే శ్రీ రజనిగారి అభిప్రాయాలను కొన్నిటిని యథావస్తుగా అంగీకరించడం కొందరికి సాధ్యం కాకపోవచ్చు లీలాశుకుడు ఆంధ్రుడనుకొనడానికి వారందించిన హేతువులు చాలా దుర్బలములుగా నాకు కానవచ్చుచున్నవి "[31] అయినా రజనీకాంతారావుగారి

ఉపపత్తులు లీలాశుకుడు ఆంధ్రుడనడానికి ఉపకరిస్తున్నాయనడంలో దోషంలేదు ఒక మహనీయుని మన తెలుగువాడుగా చెప్పుకొనడం తప్పుకాదనే భావిస్తున్నాను

ఇంత ప్రసిద్ధుడైన లీలాశుకుడు 1250-1350 మధ్యకాలంలో జీవించేఉంటాడని విమర్శకుల అభిమతం [34a] జయదేవుడే వందసంవత్సరాల తరువాత లీలాశుకుడుగా జన్మించిఉంటాడని కొందరి మతం భాగవత తత్వ ప్రచారకుడైన శుకయోగీంద్రుని అవరావతారమని మరికొందరు భావిస్తున్నారు శ్రీకృష్ణుని లీలావిశేషాలను భక్తి సమ్మోహితుడై సర్వదా గానంచేస్తూ ఉండేవాడు కావడంవల్ల అతనికి 'లీలాశుక'నే పేరు వచ్చిందని కొందరంటారు ఏమైనా లీలాశుకుని హృదయాన్ని బాలకిశోరుడు హరించినట్లే, సంగీత సాహిత్యాభినయజ్ఞులైన సహృదయ హృదయులను శ్రీ కృష్ణ కర్ణామృతంద్వారా ఆకర్షించిన మహాభక్తాగ్రేసరుడు లీలాశుకుడు శ్రీకృష్ణకర్ణామృతము మూడాశ్వాసాల కావ్యం ప్రథమా ద్వితీయ, తృతీయా శ్వాసాలలో నూటపదిచొప్పున శ్లోకాలున్నాయి సామాన్యంగా సంస్కృతంలో సర్గగాని, కాండగాని ఏ ఛందస్సులో ప్రారంభిస్తే, అదేఛందస్సులోనే చివరిదాకా నిర్వహించడం పరిపాటి. లేదా చంపూ, గద్యకావ్యాలున్నాయి కానీ లీలాశుకుడు అలాంటి సిద్ధాంతం అనుసరించినట్లులేదు మూడాశ్వాసాల్లో వివిధ వృత్తచ్ఛందస్సులలో రచన సాగించి ఉండడం ఒక విశేషం ప్రథమాశ్వాసంలో శ్రీకృష్ణ సాక్షాత్కారమూ, ద్వితీయాశ్వాసంలో వివిధ విధాలైన శ్రీకృష్ణలీలా విశేషాలనూ, తృతీయాశ్వాసంలో శ్రీకృష్ణ జీవితంలోని అనేక ఘట్టాలకు సంబంధించిన అంశాలను గూర్చి భక్తి పురస్సరంగా అభివర్ణించాడు ఈ మూడాశ్వాల్లోను శ్రీ కృష్ణ భక్తిని ఉత్తరోత్తరం రమణీయంగా, మధురాతి మధురంగా వర్ణించి తరించాడు అతని భక్తి అద్వితీయమూ, అనన్యసామాన్యమూను భక్తి, శృంగార, నీతి మార్గాలలో లీలాశుకుని కవిత కమనీయమై ఒప్పారుతూంటుంది

సంగీత సభలలో రాగమాలికలుగా గానం చేయడాని కుపకరించే శ్లోకాలున్నాయి. అభినయానుకూలమైన శ్లోకాలకు కొదవలేదు. గేయచ్ఛందో రీతిని రచితమైన నిబద్ధ పదాలంటే వృత్తపదాలు ఉన్నాయి

'సంస్కృత భాగవతం దశమ స్కంధంలోని వ్రేపల్లెలోని బాలకృష్ణుని లీలలు, గోపికాకృష్ణ నాయికా నాయక భావం ఆధారంగా వ్యంజితమైన జీవాత్మ పరమాత్మ సంబంధము రాసక్రీడా మొదలయిన రసవద్ఘట్టాలన్ని లీలాశుకుడు తన ప్రస్తా

జరిగిన సంఘటనలను స్వయంగాదర్శించి పారవశ్యం పొందినట్లుగానే కర్ణామృతంలో వర్ణించి మనకూ పారవశ్యాన్ని కలిగిస్తాడు "

"జయదేవుడు గీతగోవిందములో రాధాకృష్ణుల ప్రణయశృంగారంలో అవస్థా భేదాలను ప్రదర్శించి మానవ మనస్తత్వాను గుణమైన రూపక నిర్మాణం చేశాడు లీలాశుకుడు గోపికలతోపాటు తన్ను, మనలనుకూడా నాయికలనుచేసి, నాయకుడైన శ్రీ కృష్ణ కిశోరమూర్తి దివ్యమంగళ విగ్రహాన్ని తనివితీరా కోటిభంగులలో ప్రదర్శించడమే కాకుండా, ఆదర్శనంలో తనకూ మనకూ కూడా కలిగే సత్య సౌందర్య పరమావధియైన అధ్యాత్మికానందంద్వారా 'నిర్వాణాన్ని' ప్రసాదించిన వాడయాడు"

"ఇత్యాదిగా సంగీతానికీ, నృత్యానికీ, అభినయానికీ, చిత్రలేఖనానికీ, శిల్పానికీ ప్రదర్శన యోగ్యాలయిన గేయచ్ఛందస్సులు కృష్ణకర్ణామృతంద్వారా మనకు అందించిన లీలాశుకుడు శిశు సౌందర్యంలో పరబ్రహ్మను చూపి, భక్తి శృంగార పరమావధిలో ఆధ్యాత్మిక బ్రహ్మానందము కలిగించిన ప్రముఖ వాగ్గేయకారులలో అద్వితీయుడు" 35

## 1 2 3 నారాయణ తీర్థులు (1580-1680) ·

నారాయణతీర్థులనే శివనారాయణతీర్థులని గూడా అంటారు. తెలుగువాడై పుట్టి అనేక సంస్కృత గ్రంథాలకుకర్త అయిన మహాపండితుడు. సంగీతాభినయవేత్త ఎన్నో రచనలున్నా నారాయణతీర్థుల 'శ్రీకృష్ణలీలా తరంగిణి' ద్వారానే ప్రసిద్ధుడు. ఇతడు తెలుగులో 'పారిజాతాపహరణ' మనే యక్షగానం సైతం రచించాడు

నారాయణతీర్థులు 1580—1680 సం ల మధ్యకాలంలో జీవించినట్లు పరిశోధకుల నిర్ణయం "నారాయణతీర్థుల కాలనిర్ణయమును గురించి డాక్టర్ వి రాఘవన్‌గారు పరిశోధించి కొన్ని అంశాలు చెప్పారు తీర్థులవారి శిష్యుడు రచించిన పంచకోశమంజరి అను గ్రంథమొకటి తంజావూరు పుస్తక భాండాగారంలో ఉంది ఆ తాళపత్రప్రతి తులజాజీ మహారాజు వ్రాయించినది ఆయన కాలం 1765—82 నారాయణతీర్థులు అప్పటికి రమారమి 100 ఏండ్లకు ముందుండవలెను తీర్థుల వారి గురువైన శివరామతీర్థులు గురుచంద్రిక అనే సంస్కృతగ్రంథం వ్రాశారనీ, కంచిలో ఉండేవారనీ, వారికాలం విక్రమశకం 1718—30. అనగా క్రి శ 1675 ప్రాంతమనీ చెరువు లక్ష్మీనారాయణశాస్త్రిగారు వ్రాశారు దీనినిబట్టి తీర్థులవారు

అధమం క్రీ శ 1700 వరకు జీవించినట్లు తెలుస్తోంది మొత్తానికి ఆయన సుమారు 1580 ప్రాంతంన జన్మించి 1614 లోపుగానే దక్షిణాదికి వెళ్ళి, అక్కడ దాదాపు 1680 వరకు జీవించి ఉన్నట్లు చెప్పవచ్చు "[36]

నారాణతీర్థుల గురువు శివరామానందతీర్థులు నారాణతీర్థుల స్వస్థలాన్ని గూర్చి పలువురు పలువిధాలుగా చెప్పారు కొందరు శ్రీకాకుళమనీ, మరికొందరు శోభనాద్రి అనీ, ఇంకకొందరు కూచిపూడి అనీ,[37] ప్రొఫెసర్ సాంబమూర్తిగారు దక్షిణాదిన జన్మించినట్లు పేర్కొన్నారు [38] "తల్లావఝ్ఝల శివశంకరస్వామిగారు పైపండితుల వ్రాతలనన్నిటిని పరిశీలించి, వావిళ్ల షష్టిపూర్తి సంపుటంలో వ్రాసిన వ్యాసంలో తేల్చిన విషయం తండ్రి పేరు నీలకంఠశాస్త్రిఅయి, గాంధర్వదేవుడనేది ఆయనకు సంగీతంలో ప్రజ్ఞవలన వచ్చిన బిరుదనామం అయి ఉండాలి ఈ నీల కంఠశాస్త్రి గుంటూరు మండలంలోని కాజగ్రామంలో ఉండేవారు కాజగ్రామం పరం పరాగతంగా నేటికి తల్లావఝ్ఝలవారికి ఆటపట్టు తల్లావఝ్ఝల వారికి నాటినుండి అనేక తరాలుగా ముస్త్యాల ప్రభువుల ఆదరగౌరవాలు లభిస్తూండడం కద్దు తల్లా వఝ్ఝలవారి కుటుంబంలోనివారు నేటికీ తప్పకుండా కృష్ణలీలాతరంగిణిలో అధమం మూడు తరంగాలయినా పారంచెయ్యాలనే నియమం ఉన్నదట తీర్థులవారు తిరు నల్వేలి జిల్లాలోని శీర్ణమహాదేవి అనే గ్రామంలో నివసించి, అక్కడనుండి కాశీ వెళ్ళినట్లు కూడా ఒకప్రతీతి ఉన్నదట తీర్థులవారు కాజలో జన్మించి, పెరిగి, క్రమంగ దక్షిణ దేశంవెళ్లి, శీర్ణమహాదేవిలో నుండి, తిరిగి ఉత్తరదేశయాత్ర చేస్తూ ఆత్మీయులపై అభిమానం కొద్దీ కాజ, కూచిపూడి మొదలైన గ్రామాలలో మళ్ళీ సంచారంచేసి ఉండవచ్చుననీ, ఆయన సిద్ధిపొందిన స్థలం దక్షిణ దేశంలోని తిరుప్పందుర్తియే అని నిశ్చయంగా చెప్పవచ్చుననీ శివశంకరస్వామి వ్రాశారు "[39]

నారాయణతీర్థులే సిద్ధేంద్రయోగి అనే వాళ్ళున్నారు కానీ సిద్ధేంద్రయోగి నారాయణతీర్థుల శిష్యుడు సిద్ధేంద్రయోగి సైతం భామాకలాపమనే పారిజాతా పహరణం రచించాడు గురుశిష్యుల రచనలు వేర్వేరు నారాయణతీర్థులు కూచి పూడిలో నివసించినప్పుడు సిద్ధప్పను శిష్యునిగా స్వీకరించి సంగీతసాహిత్యాభిన యాలలో ప్రవీణుని గావించాడు సిద్ధప్ప ఆవెనుక సిద్ధేంద్రయోగి అయి పారిజాతా పహరణమనే భామాకలాపాన్ని అభినయించే పద్ధతిని ప్రారంభించాడు ప్రచారంలోకి తెచ్చాడు నారాయణతీర్థులకున్న ఆంధ్రధర్మ సన్యాసాంశం సిద్ధేంద్రయోగి విషయం లోనూ చెబుతారు,

నారాయణతీర్థులు కృష్ణలీలాతరంగిణి భాగవతపురాణ దశమస్కంధంలోని ప్రధాన రసవద్ఘట్టాలను తీసుకొని కొన్నిటిని సంగ్రహించి, కొన్నిటిని విస్తరించి పంద్రెండు తరంగాలు (అంకాలు)గా రచించాడు ప్రతి తరంగారంభంలోనూ అందలి కథను శ్లోకాలలో సూచించి, తరువాత పాటలలో, శ్లోకాలలో, సంధి గద్య లలో విపులీకరించాడు "ఆ తరంగాలన్నీ మహానాటకంలోని ఆయా సందర్భాల కనుగుణంగా సంభాషణలుగాను, వర్ణనలుగాను, రచింపబడినప్పటికీ, దేనికది స్వతంత్రముగా శ్రీకృష్ణ పరమైన సంకీర్తనముగా కృష్ణ పరతత్త్వ బోధకమైన ఆధ్యాత్మిక వివరణతోకూడి ఉండడమే దానికి కారణం. అంతేకాదు తరంగం అనే మాట ఆగ్రంధం ఆ ఒక్కొక్క కీర్తనకు ఉద్దేశించిన పేరు కానేకాదు కృష్ణలీలా చరిత్రకు సంబంధించిన పంద్రెండు అంకముల మహానాటకంలోని ఒక్కొక్క అంకమునూ ఒక్కొకకు తరంగంగా పేర్కొన్నడా మహాకవి ఆంధ్రుడై వెలసిన వాగ్గేయకారులలో అన్నమాచార్యులకు తర్వాత ఇతడు అద్వితీయ ప్రతిభాశాలి నృత్య సంగీత సాహిత్య వేదాంతాది బహుశాస్త్ర పారదర్శియై, నిసర్గ సరళమయిన శిల్పంతో నవ్యమార్గాన సంస్కృతాంధ్రములలో యక్షగానరచన సాగించాడు పరమభక్తాగ్రేసరుడు, యోగిపుంగవుడు, తత్వవేత్త, సంస్కృతంలో వేదాంతశాస్త్ర గ్రంథాలను కూడా రచించిన మధురవాచియైన దేశికుడు "[40]

శ్రీకృష్ణలీలా తరంగణిలో 156 కీర్తనలున్నాయి వాటికి వాడిన రాగాలు ముప్పైఆరు పంద్రెండు తరంగాలలోని కథావిభజనం. 1) శ్రీకృష్ణావతారం కంస దౌష్ట్యం. 2) శ్రీకృష్ణలీలలు - పూతనవధ, యమళార్జున భంజనం, మృద్భక్షణం, విశ్వరూపదర్శనం. 3) గోవత్సపాలనం, అఘాసురవధ, బ్రహ్మయజ్ఞపత్నులు కృష్ణునిస్తుతించడం. 4) కాళీయమర్దనం, ఖరప్రలంబాసురవధ, దావాగ్ని భక్షణం. 5) గోపికా వస్త్రాపహరణం, గోవర్ధనోద్ధరణం. 6) శ్రీకృష్ణ గోపీ సమాగమం, అధ్యాత్మతత్వ వివరణలు. 7) రాసక్రీడ, శ్రీకృష్ణా ద్వైతతోపదేశం. 8) గోపి కాగీతలు. 9) అక్రూర సందేశం. 10) రజకాది నిగ్రహం, కుబ్జా ప్రీణనం, చాణూర ముష్టికులవధ, కంససంహారం, పితృదర్శనం, 11) గోపికా విరహం, ఉద్ధవ సందేశం, కాలయవనవధ, ముచుకుంద స్తుతి ద్వారకా ప్రవేశం, 12) రుక్మిణీ కల్యాణకథ, అష్టమహిషీ కల్యాణం. ఇలా తీర్థులు విభజించుకొని రసవంతంగా రచించి తరించాడు,

"తీర్థులవారి గేయరచనలు తమకు పూర్వయుగ స్వభావమైన సంకీర్తన సౌరభాన్ని దట్టంగా పట్టుకొని, తర్వాతి యుగలక్షణమైన యక్షగాన స్వరూపం పరిపూర్ణంగా అవలంబించుకొని, జయదేవాదుల భక్తి శృంగార భావంతో కంటె భక్త్యాధ్యాత్మికతా భావంతో ఉదాత్తతరములై నారాయణతీర్థులను సంకీర్తన యక్షగాన సార్వభౌమత్వమనె అనితర సాధ్యమైన పదవికి అర్హునిగా జేశాయి"[41]

## 1 3 ఔత్తరాహ వాగ్గేయకారులు

ఇంతఃపూర్వం భూమికలో ఔత్తరాహభాషల్లో ఎలా భక్తి పదకవిత ఆరంభమై వికాసం పొందిందో తెలుసుకొన్నాము క్లుప్తంగా ఆ పదకవితలో కృష్ణ భక్తి ప్రాధాన్యం వహిస్తుంది భారతదేశమంతటా ఈ కృష్ణభక్తి అతిప్రాముఖ్యం వహించి సామాన్యునినుంచి అసామాన్యుని వరకు తన ప్రభావాన్ని నెరపింది తద్వారా మానవకోటి మనుగడ మాన్యమైంది ప్రస్తుతం ఔత్తరాహభాషలైన మరాఠీ, బెంగాలీ, హిందీ భాషలలో ప్రముఖ కృష్ణభక్తులు తమ పదకవితల ద్వారా ఎలా ప్రాముఖ్యం వహించారో పరిశీలిద్దాము.

## 1 3 1 మరాఠీభాషలో కృష్ణభక్తులు ·

మహారాష్ట్రలో భక్తిమార్గం ద్వారా కులం, మతం, వర్గం, వర్ణవిభేదాలు లేకుండా మానవులందరూ ఒకటేనని చాటిచెప్పిన మహాభక్తుడు జ్ఞానదేవ్ ఇతనికి కొంచెం వయస్సులో పెద్దవాడైన నామదేవ్ తరువాత పేర్కొదగ్గ వైష్ణవభక్తుడు జ్ఞానదేవ్ 1275లో జన్మించి మిక్కిలి తక్కువ కాలంలో 1296లో ముక్తి పొందిన మహనీయుడు అయినా అతని తరువాత సుమారు ఏడువందల ఏండ్లు తన మార్గాన్ని సుగమం చేశాడు జ్ఞానదేవుని తండ్రి విట్ఠలపంత్ విట్ఠలపంత్ వివాహితుడై సంసారాన్ని వదలి సన్యాసికాగా, ఒక గురువుచేత ప్రబోధితుడై మళ్ళీ సంసారిక జీవితం స్వీకరిస్తాడు నివృత్తి, జ్ఞానదేవ్, సోపాన అనే ముగ్గురు పుత్రులను ముక్త అనే పుత్రికను పొందుతాడు కానీ సంసారి సన్యాసి అయి మళ్ళీ సంసారిగామారి సంతానం పొందడం సంప్రదాయబద్ధులైన మహాశయులకు సమ్మతంకాక వెలివేస్తాడు ఆ వెనుక బాలుడైన జ్ఞానదేవ్ మతమౌఢ్యాంధులైన వారితో వాదించి గెలుస్తారు అయినా వారిలో దోషంలేదని అంగీకరించినా, వాళ్ల పరిశుద్ధాత్ములు కావాలనీ, అలా కావాలంటే, సర్వసంగపరిత్యాగులై, సంతానరహితులై ఉండిపోవాలని ఆజ్ఞాపించారు,

"The tradition encrusted religion and its rigid - minded, dogmatic custodiams, the high priests, were reduced by Jnanadeva to such a pulversing contempt that those who still keep on bracketing Jnanadeva with the traditional order of ritualistic religion, do not know what they are talking about "

"Defeated and ridiculed beyond measure, the high periests agreed to declare the four children of Vithalanatha free from the blemish attached to their father '[42] అయినా వాళ్ళు నలుగురు వివాహం చేసుకోకుండా సంతాన రహితులై వారితోనే ఆ దోషం పోగొట్టా లని శాసించారట మతాచార్యులు "This was the limit of the degradation of traditional Hindu Religion And the acute pain this must have caused to Jnanadeva ultimately matured into a compassion for humanity It was this passion for regeneration of suffering hamanity that spontaneously flowered into a new creation a new vision of Dharma - the Eternal Law of life It was this New vision that inspired all the literary worke of Jnanadeva"[43] అందు వల్లనే అనేక వృత్తులవాళ్ళు శిష్యులై విష్ణుభక్తి ప్రబోధకులయ్యారు

నామదేవుడు కుట్టుపనిచేసి జీవించేవాడు సవత తోటమాలి గోరా కుంభ కారుడు, నరహరి స్వర్ణకారుడు చొక్కా మెహర్ ఇలాగా సుమారు యాభైమంది దాకా ఉన్నారు వీళ్ళు జ్ఞానదేవ్ శిష్యులు వీళ్ల అభంగులనే పాటలు పాడుతు భక్తి, నీతి, వైరాగ్యాల్ని ప్రబోధించేవారు జ్ఞానదేవ్ 'అనుభవామృత', 'జ్ఞానేశ్వరి' అనే 'భావార్థ దీపిక' రచించాడు "Jnanadeva appears to be the only one after Buddha, the Enlightened One, Who propounded a way of direct approach to Reality, to toally free from the authority of tradition or sacred books "[45]

నామ్‌దేవ్ 1270లో జన్మించి, 1350లో దివంగతుడయ్యాడు జీవితాంతం అభంగులనే పాటలు పాడుతూ భక్తి, నీతి, వైరాగ్యాలను ప్రబోధించాడు "Nama-

dev was the greatest singer of times, with veena in hand singing, dancing with an acstasy that was most touching

"His songs before the home deity Kesaraja, with most devotional dance, were a great attraction to the people around He used to go in trance for hours together, sing and dance for day and night

"Namadev has many Abhangas, remarkable with simplicity and clarity, to his credit They had such a universal appeal that many of them have transcended barriers of narrow sects, having found acceptance among varying communities of people including Sikhs" [46]

జ్ఞానదేవ్, నామదేవ్‌ల అభంగులలోని భాష సామాన్యమైన మరాఠీ భాష, అందరికీ అర్థమయ్యే రీతిలో ఉంటుంది అందరికీ అర్థమయ్యే భాషలో భక్తి, నీతి, వైరాగ్యాల్ని బోధించారు తద్వారా ఎందరో భక్తుల్ని ఆకర్షించారు

'Namadev, under the inspiration of Jnanadev, put a new vitality in the old and decadent Bhakti Marga That is why the shrine at Pandarpur still remains a living symbol of God-Awareness throughout Maharashtra The Bhakti Marga revitalised by Jnanadeva and Namadeva, has come to be known as the 'Warkari Panth', which cuts through all barriers of birth, caste, creed, colour or religion Thousands gather at Pandarpur every year in huge congregations singing devotional lyrics written by Jnanadeva, Namadeva, Eknath and Tukaram, and other saints The panth is still in full vigour, even after the lapse of seven hundred years" [47]

## 1 3 2 బెంగాలీ భాషలో కృష్ణభక్తులు :

శ్రీ కృష్ణభక్తి ప్రతిపాదకమైన గీతాలు మహారాష్ట్రలో పైని వివరించినట్లు ప్రచారం పొందుతుండగా వంగభాషల్లో సైతం ప్రాధాన్యం వహించాయి. వంగ భాషలో కృష్ణభక్తిని ప్రప్రథమంగా ప్రచారంలోకి తెచ్చిన మహాభక్తుడు

చార్యుడు ఇతని కాలం 1473-1531 ఇతడు కృష్ణా, గోదావరీ మధ్య దేశంలో జన్మించిన తెలుగు వెలనాటి బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు ఇతని తల్లిదండ్రులు ఎల్లమ్మ లక్ష్మణ భట్టులు ఈశ్వరాంశలో జన్మించి చిన్నవయస్సులో సకల విద్యా పారంగతుడయ్యాడు కాశీలో విద్యాభ్యాసంచేసి, అలహాబాదు దగ్గర సాహిత్య సేవ చేసి, వ్రజ, వంగ భూముల్లో తన మతాన్ని ప్రచారం చేశాడు ఇతనిది శుద్ధాద్వైతం. దీన్నే 'పుష్టి మార్గం' అంటారు శంకర, మధ్వ, రామానుజుల జ్ఞాన, కర్మ, భక్తి సిద్ధాంతాలకు నూతన వ్యాఖ్యానాలు తెలిపి తన 'పుష్టిమార్గం'మనె సిద్ధాంతాన్ని స్థాపించాడు ఈ మతాన్ని కులం, వర్ణం, వర్గం, స్త్రీ పుంభేదాలు లేకుండా అందరూ అనుసరించ అర్హులే ఇది దీని ప్రత్యేకత గోపికలు లాగా పరిశుద్ధమూ, పరిపూర్ణమూ అయిన ప్రేమానురాగ స్నేహాలతో శ్రీ కృష్ణ పరమాత్మని పూర్ణరసానుభూతిని పొందడమే ఈ పుష్టిమార్గ విశేషం భాగవత ధర్మానుసారం సేవయే ప్రాముఖ్యం వహిస్తుంది పుష్టిమార్గంలో. దక్షిణదేశ యాత్ర చేసినట్లు, రాయల చేత కనకాభిషేకం పొందినట్లు తెలుస్తూంది [48]

వంగదేశంలో వల్లభాచార్యుని తరువాత కృష్ణ భక్తి పారమ్యం పొంది ప్రచారం చేసినవాడు చైతన్యస్వామి ఇతనికాలం 1486-1534 చైతన్యస్వామి సంస్కృతంలో రెండు స్తోత్రాలు మాత్రమే రచించి, పాడిన, ఆయన శిష్యులు వంగ, సంస్కృత భాషల్లో కృష్ణ భక్తి సాహిత్యాన్ని సృష్టించారు విద్యాపతి పదాలను చైతన్య స్వామి ఆలపించి తన్మయుడయ్యే వాడట వంగదేశంలో వైష్ణవ మతం, భక్తి చైతన్యస్వామితో ఆరంభమైందని వివరించారు పి శేషాద్రి అయ్యర్‌గారు

"The Bengalı school of Vaishnavism as we knɔw ıt to-day dates from Srı Chaıtanya, one of the greatest teachers of Bhaktı, Indıa has ever known He was born ın 1485 A D ın Novadvıpa, the lebrated seat of Naxya-Nyaya

"So he went through the formal ceremony of Sanyasa and came to be styled thence forth Srı Krıshna Chaıtanya the name gıven to hım by hıs Guru Keshava Bharathı"[49]

6 ]

ఆ వెనుక భారతదేశమంతటా ఆరు సంవత్సరాలపాటు పర్యటించి కృష్ణ భక్తిని ప్రచారం చేశాడు ఎన్నో భక్తి విషయాల్ని గ్రహించాడు అహోబలం, తిరుపతి, కంచి, కుంభకోణం, శ్రీరంగం, మధుర, రామేశ్వరం, కన్యాకుమారి, శృంగేరి, ఉడిపి, పండరీపురం (ఇక్కడికి దగ్గరలోని గ్రామంలో బిల్వ మంగళుని కృష్ణ కర్ణామృత ప్రతిని సంపాదించాడట), నాసిక్ మొదలైన క్షేత్రాలు దర్శించాడు ఆయన వెళ్ళిన ప్రతిచోటా అనేకులు కృష్ణభక్తులుగా మారడం విశేషం శేషజీవితాన్ని పూరిలో గడిపినట్లు తెలుస్తుంది కుల, మత, వర్గ, వర్ణవిభేదాలు లేకుండా భక్తులు వచ్చి భక్తి, జ్ఞానాదుల్ని పొందారు ఆయన ఎవరినీ తిరస్కరించకపోవడం గమనించదగ్గ అంశం [49]

"Sri Chaitanya was a uminque blend of the two fundamental and complementary aspects of the supreme God-head typically manifested in Krishna and Radha In his normal state, he faithfully mirrored the multifarious moods of Radha's soul evel thirsting for the vivid vision and intense enjoyment of the Lord But suddenly would come upon him the mood of utter self-identification with the Lord a state of divine conciousness so per-fectly complete and powerful that there none could approach him without instantly feeling its irresistable force and charm "[49]

' In the period from the fourteenth to the end of the seven-teenth centuries great Bhakti (enthusiastic and devotional) movement swept accross northern and eastern India, the Vaishnava lyrics of Bengal represent one of the ways in which this enthusiasm found expression They (The Bengali lyrics) are sung by Vaishnavas in a form of worship called Kirtana, which means simply, praise "[50]

ఇలాగా బెంగాలులో శ్రీకృష్ణ భక్తి ప్రచారంలోకి వచ్చింది ఇందులో భక్తి నీతి వైరాగ్యాలు, మధురభక్తి మనోజ్ఞమై, మధురమై ఒప్పుకుంటాయి

## 1 3. 3 హిందీభాషలో కృష్ణభక్తులు

పల్లభాచార్యునికి 'అష్టఛాప్' అనే ఎనమండుగురు మహాభక్తులు శిష్యులుగా

ఉండేవారు ఆ ఎనమండుగురు శిష్యులలో ప్రముఖుడు సూరదాసు సూరదాసు హిందీలో శ్రీకృష్ణభక్తి ప్రతిపాదకంగా పదాలు రచించి తన్మయత్వం చెంది, ఇతరులను మైమరపించిన మహనీయుడు బాలకృష్ణుని లీలావిశేషాలను మనోజ్ఞంగా ఆలపించిన భక్తుడు సూరదాసు పుట్టుగ్రుడ్డి. 1478లో జన్మించి 1583లో దివంగతుడయ్యాడు. ఆ మరణమూ శ్రీకృష్ణుని తన పదాలతో ఆరాధించి అమరుడయ్యాడు. "Born blind at Seerhi in 1478, Surdas met the saintbly Vallabhacharya, the expounder of Suddhadwaita, of a young age The Acharya heard Surdas sing some stray compositions and was charmed He then asked surdas to retell the Bhagavata legends in Braj Bhaasha, the dialect spoken by the Cowherd clan in which Krishna had been brought up Accordingly, Surdas spent his life composing and singing songs in the temple of Srinatha at Govardhan He is said to have composed about a lakh and ten thousand hymns of which about ten thousand are now extent In his own time, the blind poet of Agra is well known and Akbar seems to have met him "[51] హిందీ సాహిత్యాన్ని వాత్సల్యరసవాహినిలో ముంచిన మహనీయుడు సూరదాసు. సగుణనిర్గుణ భక్తితత్వాల్లో సగుణభక్తినే విశ్వసించిన భక్తుడు [51]

సూరదాసుతో పాటు తులసి, కేశవ, కబీర్‌లను విద్యాపతి, చండీదాసులను పేర్కొవడం అవసరం. విద్యాపతి, చండీదాస్‌ల గూర్చి మనం ముందే తెలుసుకొన్నాం ఇంతవరకు మనం భక్తులను గూర్చి తెలుసుకొన్నాము భక్తురాండ్రలో మీరాబాయి మహాభక్తురాలు ఇంతకు ముందే మీరాబాయిని గూర్చి తెలుసుకొన్నాము. మీరాబాయి బాల్యంనుంచే కృష్ణ భక్తురాలు తలిదండ్రులను కాదనలేక కుంభ రాణాతో వివాహం జరిగినా మహాభక్తురాలుగా సన్యసిస్తుంది వేలగీతాలు హిందీ, గుజరాతీ, రాజస్థాన్, వ్రజభాషల్లో మధురభక్తితోపాటు భక్తి, నీతి, వైరాగ్యాల్ని ప్రబోధిస్తూ రచించింది కృష్ణభక్తిలో మైమరచి తరించి, ఇతరులను తరింపజేసిన మహాభక్తురాలు మీరా

ఇలాగా ఉత్తరభారతంలో కృష్ణభక్తి అత్యంత ప్రచారంలోకి వచ్చింది.

## 1.4 దాక్షిణాత్య వాగ్గేయకారులు .

దక్షిణభారతంలో అనాదినుంచి శైవ వైష్ణవ మతాలు ఉండేవి అందులో వైష్ణవ మతం అత్యంత ప్రాచుర్యానికి వచ్చింది ఆళ్వారుల అండదండలతోనే ఈ ఆళ్వారులు పన్నిద్దరు- పండ్రెండుమంది తమిళంలో అతి ప్రాచీనకాలం నుంచి వైష్ణవం ప్రాబల్యానికి వచ్చింది అదే రీతిని కన్నడంలో బసవేశ్వరవచనాలలో మిక్కిలి ప్రచారం పొందిన శైవం తరువాత దాస సాహిత్యా విర్భావంతో వైష్ణవం అత్యంత ప్రాముఖ్యానికి వచ్చింది తమిళంలోని వైష్ణవ సాహిత్యమంతా పాడు కోడాని కుపకరించేదే దాస సాహిత్యంలోని కీర్తనలన్నీ రాగతాళయుక్తంగా అది పాడుకోడానికి ఉపకరించేవే తద్వారా సంగీతాభినయాలకు ఎనలేని ప్రచారం కలి గింది తమిళ కన్నడ భాషలలోని వాగ్గేయకారుల గూర్చి క్లుప్తంగా తెలుసుకొందాము.

### 1.4.1 తమిళంలోని పదకర్తలు :

తమిళంలో వైష్ణవభక్తి ప్రతిపాదకాలైన భక్తి గీతాల్ని ఆలపించిన వైష్ణవ భక్తులు పన్నిద్దరు వీరాలపించిన భక్తి గీతాలు నాల్గువేలుంటాయి వీటినే నాళాయిర ప్రబంధమంటారు వీటిని 'పాశురములు' అంటారు ఆళ్వారులు సంస్కృతవేత్తలైనా ప్రజల భాష అయిన తమిళంలోనే ఈ గీతాలను రచించి, పాడి, భక్తి పరవశు లయ్యారు. ఛందోబద్ధమైనా, ఇవి పాటలే పన్నిద్దరాళ్వారులు , పొయిగై యాళ్వార్, పూదత్తాళ్వార్, తిరుమళిశై యాళ్వార్, నమ్మాళ్వార్, మధురకవి యాళ్వార్, కుల శేఖరాళ్వార్, పెరియాళ్వార్, ఆండాళ్, తొండరడిప్పొడియాళ్వార్,తిరుప్పాణాళ్వార్, తిరుమంగై యాళ్వార్ అనే పండ్రెండుమంది [52]

ఆళ్వారుల పరంపరంలో మొదటి పొయిగై యాళ్వార్, పూదత్తాళ్వార్, తిరు మళిశై యాళ్వార్ - అనే ముగ్గురిని 'ముదలాళ్వారు' అంటారు పొయిగై యాళ్వార్ ఆదికవి ఇతడు నూరుపాశురాలు రచించాడు భక్తి పారవశ్యంతో భక్తి, తాత్వికత లతో రచింపబడిన ఈతని పాశురాలు శ్రీకృష్ణ బాల్యక్రీడల్ని మనోహరంగా వర్ణిం చాయి. ఇతడు తిరువన్దాది చందస్సులో రచించాడు పూదత్తాళ్వార్ సైతం ఇదే రీతిని వంద పాశురాలు తిరువన్దాది ఛందస్సులోనే రచించాడు. ఈ పాశురాల్లో భగ వద్వైభవం, భక్తితత్వం, శరణాగతి ప్రాశస్త్యం ప్రాముఖ్యం వహించాయి. పేయా

ళ్వార్ గూడా పై ఇద్దరిలాగే వంద పాశురాలు రచించాడు ఇందులో భక్తితాత్విక రహస్యాలు ప్రముఖమైన అంశాలు.

తిరుమళిసై యాళ్వార్ రచనల్లో పోయినవి పోగా మిగిలినవి రెండువందలాపదీ పాశురాలు ఇవి వివిధ రాగతాళ సహితమై వైష్ణవ ధర్మ ప్రతిపాదకాలై, భక్తి, మధురభక్తి ప్రతిపాదకాలై ఉన్నాయి నాయికా నాయక భావ పూర్ణమై ఉన్నాయి

ఆళ్వారులలో నమ్మాళ్వారుల రచనలు చాలా విశిష్టమైనవి ఈతని రచనలు మొత్తం 1296 పాశురాలు ఇందులో మొత్తం నాలుగు ప్రబంధాలు మొదటి ప్రబంధంలో మధుర భక్తి ఉంది రెండు మూడు ప్రబంధాల్లోని విషయాలు యజుర్వేద, అధర్వణ వేదాలతో సమానమై ఒప్పుతున్నాయి నాల్గో ప్రబంధం 'తిరువాయిమొళి' చాలా ప్రముఖమైంది ఇది తమిళంలోనేగాదు ప్రపంచసాహిత్యంలోనే గొప్పదని పరిగణించబడింది ఇందులో సామవేద సారమంతా ఇమిడిఉంది రాగతాళ సహితమై గానయోగ్యమైందని విజ్ఞుల ప్రశంస తమిళ వాఙ్మయంలో నమ్మాళ్వార్ కో విశిష్ట స్థానముంది అందుకే ఇతనికి 'శ్రీ వైష్ణవ కులపతి' అనే బిరుదుంది ఇతని శిష్యుడే మధురకవి ఆళ్వార్ నమ్మాళ్వార్ చరిత్రనే పదకొండు పాశురాల్లో ఆచార్య లక్షణాన్ని, భక్తి ప్రపత్తుల ప్రాముఖ్యాన్ని విశదీకరిస్తూ రచించాడు

కులశేఖరాళ్వార్ తమిళంలో 'పెరుమాళ్ తిరుమొళి' అనే నూట ఐదు పాశురాలు తమిళంలోను, 'ముకుందమాల' సంస్కృతంలోను రచించాడు శ్రీరంగంలో శిష్య సహితంగా నృత్యం చేస్తూ పాడినట్లు తెలుస్తుంది కౌసల్యాలోల, దశరథుని కరుణమయ విలాపం, రామాయణసంగ్రహం మధురభావ సంభరితమై ఒప్పుతున్నాయి

పెరియాళ్వారనబడే విష్ణుచిత్తుని 'తిరుపల్లాండు'లో పంద్రెండు పాశురాలు, పెరియాళ్వార్ తిరుమొళిలో నాలుగు వందలా అరవై ఒక్క పాశురాలున్నాయి మొదటి దానిలో గరుడనుమనిస్తుతి గానం చేయబడింది భగవత్సేవా ప్రాధాన్యాన్ని తెలిపే ఈ పాశురాలను వైష్ణవులు ప్రతిదినం పారాయణం చేస్తారు నీటికి ప్రత్యేకమైన స్థానముంది 'తిరుమొళి'లో బాలకృష్ణుని మధుర లీలల్ని వాత్సల్య భావస్ఫోరకంగా అత్యంత మనోహరంగా రచించి తరించాడు ఇందులో యశోదలోల, బాలకృష్ణుని ఆగడాలు, గోపికల విరహం మొదలైన సన్నివేశాలు మనోజ్ఞం 'పిళ్ళైత్తమిళ్' అనే

బాణీలనుగూర్చి పాటలో రచించిన ఖ్యాతి ఇతనిదే ఆ వెనుక ఈ పద్ధతిననుసరించి అనేకులు పాటలు రచించారు

పెరియాళ్వార్ కూతురు ఆండాళ్ అనబడే గోదాదేవి 'తిరుప్పావై' ముప్పై పాశురాలు, 'నాచ్చియార్ తిరుమొళి'లో నూటానలభైమూడు పాశురాలు రచించి విశ్వవిఖ్యాతి పొందిన కవయిత్రి తిరుప్పావై రాగతాళయుక్తంగా పాడదగిన పాటలు శ్రీకృష్ణ భక్తి ప్రతిపాదకంగా ఈ పాటలు రచించి, తాను తరించి, మానవులకు తరణోపాయం చూపింది జగన్మోహనుడైన శ్రీకృష్ణునికి తాను ప్రియురాలుగా భావించుకొని ప్రేమాతిరేకంతో మధురభక్తికి పరాకాష్ఠగా రచించిన గీతాలిపాశురాలు

తొండరడిప్పొడి యాళ్వార్‌నే విప్రనారాయణుడంటారు ఇతడు 'తిరుమాలై' లో నలభై ఐదు పాశురాలు, 'తిరుప్పళ్ళియెళుచ్చి'లో పది పాశురాలు రచించాడు ఇందులోని భక్తి అనన్య సామాన్యం కవిత్వం కమనీయం సుప్రభాత గీతాలున్నాయి రెండో దానిలో

తిరుప్పాణ్ ఆళ్వార్ ఒకే ఒక 'అమలనాది పిరాన్'అనే పాశురం శ్రీరంగేశుని సౌందర్య వర్ణనలో రచించి తరించాడు వేదాంతదేశికులు మురసిపోయి దీనిని వ్యాఖ్యానిస్తూ తమిళ సంస్కృతాలలో అనేక గ్రంథాలు రచించడంలో దీని విశిష్టత స్పష్టమవుతుంది

తిరుమంగై యాళ్వార్ పాశురాలు మొత్తం పాశురాలలో అధిక సంఖ్యలో ఉన్నాయి పెరియ తిరుమొళిలో 1084, తిరుకునాణ్ణకమ్‌లో ముప్పై పాశురాలు ఉన్నాయి ఇవిగాక ఇంకా అనేక పాశురాలు రచించాడు ఇతడు అనేక దివ్యక్షేత్రాలు దర్శించి యౌవనంలో చేసిన దుష్కృత్యాలకు పశ్చాత్తాపపడుతూ అనేక పాశురాలు భక్తి ప్రపత్తితో రచించిన భక్తుడు [53]

'తమిళ ప్రదేశమున వివిధ ప్రాంతములలో - వివిధ వర్ణములయందు - వివిధ సమయములలో నవతరించిన ప్రముఖ వైష్ణవభక్తులు పన్నిద్దఱు మాత్రమే ఆళ్వారులుగా నేడు వ్యవహరించఁబడుచున్నారు 'ఆళ్వారు' అను శబ్దమునకు భగవద్భక్తి యందు మునిగినవారనియు, భగవద్గుణములలో ఈదుపడిన వాడనియు రెండర్థము లున్నవి "[54]

ఈ పాసురాలు ఆయాగేయకర్తలు పాడుతూండగా నానంద గేయాల్లాగా ప్రజలలో ప్రచారంపొంది, పోయినవిపోగా తక్కినవాటిని భక్తులు కూర్చగా 'నాలాయిర ప్రబంధం'గా ఈనాటికి నిలిచిపోయాయి వర్ణ, వర్గ, కుల, స్త్రీ పుం భేదం లేకుండా ఈ పన్నిద్దరాళ్వారుల్లో మహాభక్తులుగా ఉండడమే విశేషం అతి ప్రాచీనమైనవిగా ఈ పాశురాలు చెప్పబడతాయి ఈ మహాభక్తాగ్రేసరుడే రామానుజాలకు సైతం భక్తి మార్గంలో అనుసరణీయులు

## 1. 4 2 కన్నడంలో పదకవులు

ఇతఃపూర్వమే మనం 'భూమిక'లో తెలుసుకొన్నట్లు కన్నడంలో పదకవులు అంటే దాససాహిత్యకారులైన పదకారులు లేదా వాగ్గేయకారులు మధ్వ మతవ్యాప్తికి పాటుపడ్డ మహనీయులు వారిలో శ్రీపాదరాయలు, అతని శిష్యుడు వ్యాసకూట నిర్మాత వ్యాసరాయలు, ఆ తరువాత ప్రసిద్ధులైన అతని శిష్యులు పురందరదాసు, కనకదాసు ముఖ్యులు వ్యాసరాయలు చాలా ప్రసిద్ధుడైనట్లు మనం ముందె అన్నమాచార్యుల జీవితచరిత్రలో తెలుసుకొన్నాము పైగా విజయనగరంలో హంపీలో నివసిస్తూ, కృష్ణదేవరాయలచే ప్రత్యేక సంరక్షకుడైనట్లు మనం తెలుసుకొన్నాము ఇతడు స్థాపించింది వ్యాసకూటం ఆ వెనుక పురందరదాసు వ్యాసరాయుని శిష్యుడైన వెనుక దాసకూట నిర్మాణం జరిగింది నరహరితీర్థుల దగ్గరినుంచి దేశి అయిన కన్నడభాషలో పదరచనచేసి దేవాలయాల్లో అర్చనసమయాల్లో పాడేవిధానం ప్రారంభమైంది. ఆవెనుక శ్రీపాదరాయలు, వ్యాసరాయలు 1447 - 1539 ఆ విధానాన్ని ద్విగుణీకృతంచేసి ప్రాముఖ్యమిచ్చారు మధ్వ మతమైన ద్వైతమతాన్ని ప్రచారం చేయడంలో వీరందరూ ఎంతో ప్రయత్నించారు ఆ పద్ధతికి లక్షల్లో పదాలు రచించి ప్రచారం తెచ్చిన మహనీయుడు పురందరదాసు

1 4 2 1 పురందరదాసు దాససాహిత్యానికీ, కర్ణాటక సంగీతానికి, చేసిన సేవ అనన్యసామాన్యం ఇతనికి కర్ణాటక సంగీతపితామహుడని బిరుదు. మహా వాగ్గేయకారుడు, "ఆయన వ్రాసినన్ని కీర్తనలు మరెవ్వరూ వ్రాయలేదు సూళాదులు 'ఉగాభోగము'లను కూడా అతడు రచించెను ఇవి ఒక విధమైన పాటలు పురందరదాసు కర్ణాటక సంగీతాభ్యాసమునకు చక్కని ప్రణాళిక నెర్పరచి దక్షిణ భారతంలో చిరస్మరణీయుడైనాడు "[55]

పురందరదాసుకు శీనప్ప, శ్రీనివాసనాయక్, తిరుమలరాయప్ప, కృష్ణనాయక్, పురందరవిఠల అనే పేర్లు ఉండేవని తెలుస్తుంది కాని వరదప్పనాయక పుత్రుడు శ్రీనివాసనాయక అన్నదే చాల ప్రసిద్ధమైన పేరు ఇతని జన్మస్థలం పురందర ఘడమని కొందరంటారు ఇది పూనా సమీపంలో ఉంది ఈ నాడిది మహారాష్ట్రలో ఉన్నప్పటికీ పూర్వం కర్ణాటక రాజుల పాలనలోనే ఉండేది మరికొందరు దీన్ని పురందరాలయమనీ, పాంశాసనపురమని అంటారు ఇది కొన్ని ఆధారాలతో శివమొగ్గజిల్లాలోని తీర్థహళ్ళి తాలూకాలోని 'పురందర' అనే గ్రామంగా నిర్ణయించడం జరిగింది పురందరదాస జీవితకాలం 1484 - 1564 లేదా 1480 - 1564 అని పలువురు పండితుల అభిప్రాయం [56] కాని పురందరదాసు జననకాలం ఇంకా ముందేనని తెలుస్తుంది అన్నమాచార్యుల గూర్చి వివరించిన సందర్భంలో పురందరదాసు అన్నమాచార్యుని (1408 - 1503) సందర్శించాడనీ, సందర్శించే సమయానికి పురందరదాసు వయస్సు ముప్పైఏండ్లయినా ఉంటాయని భావించడంవల్ల పురందరదాసు జననం సుమారు 1470 ప్రాంతం కావచ్చునని చెప్పడంలో దోషంలేదు. సమచితం గూడా. దివంగతుడైన సంవత్సరం 1564 అనుకోవడంలో వివాదంలేదు [57]

వరదప్పనాయక కమలాంబలకు అపురూపంగా పుట్టినబిడ్డ శ్రీనివాసనాయక వరదప్ప రత్నవ్యాపారి కుమారునికి సంస్కృత కర్ణాటభాషల్లో విద్యాసంపన్నుని చేశాడు రత్నవ్యాపారంలోను నిపుణుడయ్యాడు ఆతనికి పదహారుయేటనే సరస్వతీబాయితో వివాహం జరిగింది ఇరవయ్యోయేటనె తండ్రి మరణించడం వ్యాపారం తానెనడపి కోటికి పడగలెత్తడం జరిగింది 'నవకోటి నారాయణ' అని బిరుదు వహించాడు అయితే పిల్లికి బిచ్చంపెట్టని లోభి. అనుకోని సంఘటన జరిగింది ఒక వృద్ధ బ్రాహ్మణుడు ఒక బాలునితో వాచ్చి ఆతని ఉపనయనం కోసం సాయం చేయుమని అడిగాడు తిరిగివేసారిపోయి, చివరికి సరస్వతీబాయి వద్ద అడిగి ముక్కెర దానం తీసుకొనివచ్చి శ్రీనివాసనాయకునికిచ్చి, దానికి వెలగట్టి డబ్బిమ్మన్నాడు అది తన భార్య ముక్కెర అని అనుమానించి, వెంటనె ఇంటికి వెళ్ళి భార్యనీ విషయం అడిగాడు దైవగృహంలోంచి ఆవిడ భయంతో ముక్కెర లేకుండా బయటికి రాలేకపోయింది 'నీ ముక్కెర' ఏదని గద్దించేసరికి విషపానం చేయాలనుకొన్న ఆమెకు విషంనింపుకొన్న గిన్నెలోకి ముక్కెర వచ్చిపడింది పట్టరాని సంతోషంతో ముక్కెర తెచ్చి భర్తకిచ్చింది. దానితో వెళ్ళి తన అంగడిలో

దాచివచ్చిన ముక్కుర కోసం వెతికాడు కనిపించలేదు అనుమానంతో తిరిగి ఇంటికి వచ్చి భార్యనడిగాడు ఆమె జరిగిన సంగతి పూసగ్రుచ్చినట్లు చెప్పింది వెంటనే అతడు తన లోభితనానికి చింతించి, ఆ వచ్చిన బ్రాహ్మణుడు సామాన్యుడు కాడనీ, భగవంతుడే తనకు కనువిప్పు కలిగించడానికి వచ్చాడని గ్రహించి ఆ బ్రాహ్మణుని కై వెతికాడు కనిపించలేదు వెంటనే ఐహిక సుఖవిముఖుడై సర్వ సంపదలు పేదలకు పంచిపెట్టి నిరుపేదతనాన్ని కోని తెచ్చుకొన్నాడు తంబూర, తులసిమాల ధరించి దాసుగా మారిపోయాడు ఒకనాటి నవకోటి నారాయణుడు ఈనాడు నిరుపేదదాసు, భగవద్భక్తి సంపన్నుడు

హంపీ విజయనగరం చేరి, ఆనాటికే ప్రసిద్ధ రాజగురువై దాసులకందరికీ గురువైన వ్యాసరాయని, భార్యా పుత్ర సమేతంగా ఆశ్రయించాడు వ్యాసరాయలు శ్రీనివాసనాయకుని శిష్యునిగా గ్రహించి, పురందర దాసన్న నామకరణం చేశాడు ఆనాటినుంచి 'పురందర విఠల' ముద్రతో అనేక వేల కీర్తనలు కన్నడంలో రచించి ఆడి, పాడడం ప్రారంభించాడు భిక్షాటనలో జీవితం గడప నారంభించాడు గురువు మన్ననకు పాత్రుడయ్యాడు 'దాసరందరె పురందర దాసరయ్య' అనే గురువు ప్రశంసకు పాత్రుడయ్యాడు పురందరదాసు తన పదాల్లో సామాన్య ప్రజలకోసం అనేకాంశాలు చెప్పినా గుణంలో మాత్రం ఉపనిషత్తుల స్థాయికి తీసిపోలేదు అందుకే వాటికి 'పురందరోపనిషత్తు' అనే పేరు సార్థకమయింది ఎక్కువకాలం హంపిలో, పురందర పురంలో నివసించినా, కంచి, తిరుపతి, అహోబిళం, పేలూరు మొదలైన ప్రదేశాలు తిరిగాడు వీటిలో తిరుపతి ముఖ్యమైంది తిరుమల వేంకటేశ్వరుని ఉపముద్రతో నాలుగులక్షలడెబ్బైయైదువేల కీర్తనలు రచించాడు ఈ సందర్భంలోనే తిరుపతిలో పదకవితాపితామహుడు, సంకీర్తనాచార్యుడు అని బిరుదు వహించిన మహా వాగ్గేయకారుడైన అన్నమాచార్యుల్ని సందర్శించినట్లు పూర్వోక్తం ఆయన జీవితంలో ఎన్నో వింతలూ, పరీక్షలు జరిగాయి వాటన్నిటిలోను విజయం సాధించాడు శ్రీకృష్ణదేవరాయలు చేస్తానన్న సన్మానాన్ని సైతం తిరస్కరించాడు

కర్ణాటక సంగీతానికి చక్కటి ప్రణాళిక ఏర్పరచి, చక్కటి బాట వేసిన ఘనత పురందరదాసుదే ఆయనకు 'కర్ణాటక సంగీత పితామహ' అనే బిరుదు ఉంది

ఆయన పదాల్లో కేవలం కీర్తనలేగాక సూళాదులు, ఉగాభోగాలు ఉన్నాయి ఆయన సంగీతజ్ఞానం అమేయం. ఆయన సేవ అనితర సాధ్యం

ఆయా పదాల్లో భక్తి, నీతి, వైరాగ్యాలు, శృంగార, మధురభక్తులు విశిష్టంగా కనిపించే అపురూపమైన లక్షణాలు ఆయన కేవలం కర్ణాటక దేశానికి మాత్రమే పరిమితం కాలేదు. యావద్భారత దేశానికే ఒక మణిపూస ఈ మహానీయుని ఎంత కొనియాడినా తీరదు

"The Karnataka movement based on Vishnu - devotion that of the Haridasas, become widely known in non-kanarese areas also, chiefly through its association with music The great art of the pada-singers of this school,Purandaradasa(1480-1564) is revered as founder of modern Karnataka music His padas, the model and source of inspiration for Thyaga-raja, are remarkable for their devotion, moral teachings, popular sayings, wit and satire and philosopical truths" [58]

1422 కనకదాసు పురందరదాసు సమకాలికుడు మహామహిమాన్వితుడు వ్యాసరాయలకు ప్రియమైన శిష్యుడు పురందరదాసు అంతటి మహనీయుడు ఆతని మహిమను కొనియాడినాడు అనేక కీర్తనలు, మోహన తరంగిణి, హరిభక్తి సారం, నలచరిత్ర మొదలైన రచనలు చేశాడు కనకదాసు పదాల్లో సంస్కృత ప్రభావమెక్కువ

విజయనగర సామ్రాజ్యానికి చెందిన బాడగ్రామ మండలాధికారి వీరప్పనాయకుని కుమారుడు కనకదాసు కురుబ వంశానికిచెందిన వీరప్పనాయకునకు బచ్చమ్మకు లేక లేక జన్మించినవాడు ఇతనికి తల్లి దండ్రులు పెట్టిన పేరు తిమ్మప్ప నాయక ఇతని కాలం 1507-1570 అని కొందరు, 1507-1607 అని మరి అని మరికొందరు భావిస్తున్నారు [59] తండ్రి వీరప్ప నాయకుడే కొడుకు తిమ్మప్ప నాయకునకు సకల విద్యలు బాల్యంలోనే బోధించాడు అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేసి, వివాహం చేసిన తరువాత తండ్రి స్వర్గస్థుడయ్యాడు కొంత కాలంలోనే భార్య మరణించింది. ఇంతలో సంపదంతో ఆదికేశవస్వామి దేవాలయం 'కాగినల్లి'

యందు నిర్మించాడు ముందే భక్తి బీజాలున్న తిమ్మప్ప క్రమంగా భక్తుడుగా మారి పోయాడు ఆదికేశవుడు భక్తునికాదేశించాడు ఇంతలో తల్లి మరణించింది సర్వ సంగ పరిత్యాగం చేసి ఏకతారతో భక్తుడుగా మారిపోయాడు ఆ వెనుక విజయనగ రంవెళ్ళి వ్యాసరాయల శిష్యుడై, గురువు ఆశీర్వాదం పొంది, పురందరదాసు మొద లైన దాసులను మెప్పించాడు తిరుపతి, ఉడిపి, వెలూరుకు వెళ్ళి ఆయా దేవతలను దర్శించి భక్తి ప్రపత్తిని ప్రకటిస్తూ అనేక మహిమలను చూపించిన మహాభక్తుడు ఉడిపిలో బ్రాహ్మణులు కనకదాసును కృష్ణాలయంలో ప్రవేశించ నంగీకరించలేదు గుడి వెనుకకు వెళ్ళి భక్తి పారవశ్యంతో పాడగా గోడ పగిలి పశ్చిమదిశకు దేవుడు తిరిగి భక్తుడు కనకదాసుకు దర్శనమిచ్చాడు అర్చకులు ఆశ్చర్యచకితులై కనక దాసును ఎంతగానో ప్రశంసించి సత్కరించారు

అనేక సందర్భాలలో విజయనగరంలో వ్యాసరాయలు శిష్యులతో అనేక పరీ క్షలు పెట్టగా నెగ్గి తన భక్తి ప్రపత్తిని ప్రకటించిన మహనీయుడు అనేక సహ దాసులకు తనపై ఈర్ష్య, గురువుగారికి ప్రియశిష్యుడు పురందరదాసంతటి వాడు 'కనక దాసమేలె' కనకదాసు పైగల దయ నామీద సైతం ప్రసరించుమని వ్యాస రాయల్ని కోరుకొన్నాడంటే కనకదాసు గొప్పదనం స్పష్టం [59]

కనకదాసు భక్తి, నీతి, వైరాగ్యాల్ని పదాలవల్లా, ఇతర రచనవల్ల ప్రబో ధించాడు

పురందరదాసు లాగానే అంటే దాసకూటంలోని ఇతర దాసుల్లాగానే సంగీతా నికి, కృష్ణభక్తి తత్వానికి ప్రచారం తెచ్చిన మహనీయుడు కనకదాసు. కులం ప్రధా నంకాదు, గుణం ముఖ్యం అని నిరూపించిన మహనీయుడు కనకదాసు అది కనక దాసులోని ప్రత్యేకత

## 1 5 తెలుగులోని ప్రముఖ వాగ్గేయకారులు .

మనమింతవరకు సంస్కృతం, మరాఠీ, బెంగాలీ, హిందీ, తమిళం, కన్నడం మొదలైన భాషలలో వెలసిన కృష్ణభక్తులు, పదకర్తలు, వాగ్గేయకారులైన మహనీయుల జీవిత విశేషాలను అన్నమాచార్యుల జీవితంతో పాటు తెలుసుకో గలి గాము ప్రస్తుతం తెలుగులో అన్నమాచార్యునితో సరితూగగల ప్రముఖ వాగ్గేయ

కారుల గురించి తెలుసుకోవడం అవసరం తద్వారా తదనంతర తులనాత్మక అధ్యయనం సుకరమవుతుంది విపులీకరణ ద్వారా విశదమవుతుంది

తెలుగులో అన్నమాచార్యులతో పోల్చదగిన వాగ్గేయకారులెందరో మహానుభావులున్నారు. అయితే నా యీ అధ్యయనంలో అన్నమాచార్యుల కుమారుడు పెద తిరుమలాచార్యుడు, ప్రపౌత్రుడు చిన తిరుమలాచార్యుడు, క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి, త్యాగరాజులకు పరిమితం చేసుకొంటున్నాను అందరు వాగ్గేయకారులకు ఆద్యుడు అన్నమాచార్యుడు అతనితో సమాన ప్రతిభా పాండిత్యాలే గాక సంగీతాభినయాలకు తదితర వాగ్గేయకారులు చేసిన సేవను తెలిపి, అన్నమాచార్యులతో సమానమూ, విశేషమూ అయిన అంశాల్ని వెలికి తీసి చూపించి వివరించడమే నాయీ తులనాత్మక అధ్యయన ప్రయత్న ప్రయోజనం

సంగీతాభినయాలకు ఈ వాగ్గేయకారులతో సమానమైన సేవ చేయకపోయినా దేశి అయిన అచ్చ తెలుగులో వచనాలు రచించి, కృష్ణ భక్తి మార్గోపదేశకుడైన కృష్ణమాచార్యుని గూర్చి సైతం ఇక్కడ తెలుసుకోవడం అవసరం ఆయన రచనలు పేరుకు వచనాలే అయినా పాడుకోడానికీ, భక్తి ప్రపత్తిని తెలుపడానికి ఉపకరించేవే అందువల్ల కృష్ణమాచార్యుని గూర్చి ముందు తెలుసుకోవడం అవసరం

## 1 5.1 కృష్ణమాచార్యులు (1268-1323) :

అన్నమాచార్యుల కంటె కృష్ణమాచార్యులు పూర్వుడు రామానుజ మతమైన విశిష్టాద్వైత మతాన్ని స్వీకరించి, ప్రచారం చేసిన మహనీయుడు పాడుకోడానికి వీలైన వచనాలు భగవద్భక్తి పరంగా రచించి ఈ పద్ధతికి మార్గదర్శకుడైన వాడు "తెలుగు మాటలనంగవలదు, వేదముల కొలదిగా చూడు"దని ద్విపదల్లో జాను దెనుగులో రచన చేసినవాడు పాల్కురి సోమనాథుడని మనం భూమికలో తెలుసుకొన్నాము అలాంటి మాటచేమీ చెప్పకుండానే అచ్చ తెలుగులో భగవన్నామ సంకీర్తన పరంగా వచనాలు రచించిన వాడు కృష్ణమాచార్యుడు ఇలాంటి వచనాలు బసవేశ్వరాదులు కన్నడంలో శైవమత పరంగా రచించారు కృష్ణమాచార్యుల తరువాత సంకీర్తనలతో పాటు వచనాలు రచించిన భక్తుడు పెదతిరుమలాచార్యుడే.

"13వ శ వాడే అయి సింహగిరి నరహరిపై వచన మాలికా గేయాలు రచించిన కృష్ణమాచార్యుడు లీలాశుకునికి సమకాలికుడవుతున్నాడు, ఆ కాలంలో ఆంధ్ర

దేశాన్ని పరిపాలించిన కాకతీయ రాజులు శైవమతాభిమానులు. దేశం అంతటా శైవ మతం ప్రచారంలో ఉండేకాలంలో లీలాశుకుడు ఆరంభలో పంచాక్షరీ మంత్రోపాసకుడు కావడం సమంజసమే కృష్ణమాచారి నెలవైన సింహగిరి లాగానే కాకతీయ రాజధానికి అంత సమీపంగాలేని వైష్ణవ క్షేత్రమైన వేదాద్రికి చుట్టుపక్కల ఇతడు సగం జీవితంగడిపి ఉండవచ్చు".[60]నని రజనీకాంతరావుగారి అభిప్రాయంలో సామంజస్యముందని తెలుస్తుంది

కృష్ణమాచార్యుడు కాకతీయ రాజులలో రెండో ప్రతాపరుద్రుని (క్రీ శ 1254-1323)కి సమకాలికుడు ఈతని జననం శ్రీ నిడదవోలు వేంకట్రావుగారు మొదలైన పండితుల ప్రకారం 1290 కానీ కృష్ణమాచార్యుల వచనాల ఆధారంమూలంగా అనేకోపపత్తులతో అతని జననం 1268 కావచ్చునని డా॥ వేటూరి ఆనందమూర్తి గారు అభిప్రాయపడ్డారు.[61] అలాగే డా॥ ఎమ్ కులశేఖరరావుగారు అతని జననం 1265-70 ప్రాంతమని వివరించారు [62] కృష్ణమాచార్యుని స్వగ్రామం సంతూరు లేక సంతనపురం ఇది ఆంధ్రదేశంలోనిదే అనీ, ఈనాడు తెలంగాణా మహబూబ్ నగర్ జిల్లాలోని సంతపూరని డా॥ కులశేఖరరావుగారు నిరూపించారు [63] దీన్ని డా॥ ఆనందమూర్తిగారు సైతం అంగీకరించారు [64] ఒది సమంజసంగానే ఉంది

వ్యతీపాత యోగంలో జన్మించడంవల్ల తరువాత కృష్ణమాచార్యుడుగా ప్రసిద్ధికెక్కిన బాలుని తల్లిదండ్రులు పాడుబావిలో పడవేసిపోయారట కువార (కుమార) నామక సన్యాసిరూపంలో నృసింహస్వామియే రక్షించి, సింహాచలానికి చేర్చాడు అక్కడ స్వామివారి అభిషేక క్షీరాన్ని ఆస్వాదించి కళ్ళకద్దుకోగా చూపు వచ్చిందట ఆ బాలుని మేనమామ శ్రీరంగాచార్యులు గుర్తించి, యుక్తవయస్కుడు కాగా అతనికి పిల్లనిచ్చి పెళ్ళి చేశాడు సాంసారిక జీవితం గడుపుతూ పుత్ర సంతానం పొంది, పుత్ర వియోగంతో బాధపడి, సంకీర్తన వాఙ్మయజలు చేస్తూనే ఆ వెనుక వేశ్యాలోలుడై ఉండగా, అతని దర్శనార్థం పౌతకమూరు అరుగురు సోదర భాగవతులు వచ్చారు వారి దర్శనంతో కృష్ణమాచార్యునికి కనువిప్పు కలిగింది ఇలాగా ఎన్నో కథలున్నాయి "ఏదియేమైనా భక్తి సంకీర్తనలను పాడుకొంటూ మహిమలెన్నో ప్రదర్శిస్తూ ఈ మహనీయుడు- పుట్టింది సంతనపురంలోనే అయినా - బహుకాలం సింహాచలంలోనూ, నడుమ కాలం వోరుగల్లులోను, చివరకు శ్రీ రంగంలోను జీవిత యాత్ర సాగించినట్లు తెలుస్తుంది ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ వైష్ణవ పుణ్యక్షేత్రాల నన్నిటిని దర్శించినట్లు కూడా తన వచనాలలో ఆయనే పేర్కొన్నాడు "[65]

కృష్ణమాచార్యుని వచనాలపై కర్ణాటక వీర శైవ వచనాల, సంస్కృతంలో రామానుజస్వామి రచించిన గద్యత్రయం ప్రభావం ఎంతగానో ఉందని విజ్ఞుల అభిప్రాయం పూర్వోక్తమైనట్లు వృత్త, నిబంధాలనీ, చూర్ణాఖ్యలనీ, పదాలు మూడు విధాలు అందులో కృష్ణమాచార్యునివి చూర్ణాఖ్య పదాలని తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు తెలిపాడు

"ధర కృష్ణాచార్యాదిక
 పరికల్పిత పదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగు ననిర్యుక్త నామ భాసితమగుచున్"[66]

దీన్ని కొందరు తాళగంధి అని అంటారనీ, తాళగంధి నిర్వచన మిదని అతడే తెలిపాడు

"ఛందోగణముల నియతిం
బొందక తాళ ప్రమాణమునఁ గడుఁ జెలువై
కొందరిచేఁ దమ్మార్గం
బందముగా తాళగంధి యనఁ బొగడొందున్"[66]

దీని ప్రకారం కృష్ణమాచార్యుడు అనియత అంటే అనిబద్ధ పదాలైన చూర్ణ నామక వచనాలు రచించి తరించాడు

"ఆంధ్రదేశమున వచనరచనకు, భజనసంకీర్తన పద్ధతులకు పరమాచార్యుడు, ప్రపితామహుడు నయినవాడు మనమెరిగినంతలో నీకృష్ణమాచార్యుడే 'ఓం నమో నారాయణాయ' అనియు, 'నమోనమో లక్ష్మీవల్లభా' అనియు, 'అనాథపతి సింహగిరి నరహరీ నమోనమో దయానిధి' అనియు, 'మా యతిరామానుజముని వరందాతారు కృష్ణకువ్వారస్వామి నరహరీ నమోనమో దయానిధీ!' అనియు, 'పరబ్రహ్మ సింహగిరి నరహరీ నమోనమో దయానిధీ!' అనియు మకుటములుగా స్వామివారి యనంత నామగుణ కథలకు వచనభావంబున నీతడు విన్నపము సేయు చుండెడివాడు ఈ విధమున కృష్ణమాచార్యుడు పాడుకొన్న వచన సంకీర్తనములలో విన్నపములుగాను, చూర్ణికలుగాను గుర్తింపదగినవి కొన్ని మాత్రమే మనకు లభించినవి పదునైదు, పదునాఱు శతాబ్దాలలో వెలసిన తాళ్ళపాక కవీశ్వరులు ఈ కృష్ణమాచార్యునే తమకు

మార్గదర్శకుడుగాను, తాళబంధచ్ఛందో విరహితమై చూర్ణాఖ్యంబరగునట్టి పదరచనలకు పరికల్పకుడుగను పేర్కొనినారు "[67]

లభించిన కృష్ణమాచార్యుని కృతులు వచన సంకీర్తనములు, తులసీ మాహాత్మ్యము, నరసింహనామాలు, రామనామ కీర్తనము, రామనామాలు అయినా అతడు చాతుర్లక్ష వచనాలు రచించినట్లు తెలుస్తుంది వాటిని వైష్ణవమత సిద్ధాంత ప్రతిపాదకాలు, పురాణ సంబంధమైనవి, వేదాంత పరమైనవి, నీతిబోధకమైనవి అని నాలుగు విధాలుగా విభజించవచ్చు మచ్చుకు భక్తి ప్రబోధాత్మకంగా, వర్ణవ్యవస్థారహితంగా చెప్పిన ఒక వచనం "దేవావిష్ణుభక్తిలేని విద్వాంసునికంటె హరికీర్తనము సేయునతఁడె కులజాండు శ్వపచుండైననేమి? ఏ వర్ణండైన నేమి? ద్విజునికంటెనతఁడె కులజాండు సంధ్యా (వందనాది) నిత్యకర్మానుష్ఠానంబులు దప్పక నడిపిననేమి? సకల ధర్మంబులు సేసిననేమి? మా సింహగిరి నరహరిదాసులకు దాసులైనంగాని లేదుగతి? స్వామీ! సింహగిరి నరహరీ! నమోనమోదయానిధీ! [68]

కృష్ణమాచార్యుని వచనాల ప్రభావాన్ని గూర్చి డా॥ ఎమ్ కులశేఖరరావుగారు "తెలుగుభాషలో వచనైక రచనచేయుటలో ప్రథమునైన కృష్ణమాచార్యుల ప్రభావము అతని తరువాత ఆంధ్ర రచయితలపై స్పష్టముగా కాన్పించుచున్నది రచన పద్ధతి యందును, భావమునందును, సంప్రదాయమునందును ఈ ప్రభావ మీ తర రచయితలపై నున్నది స్తుతివచనములు వ్రాయుట యందీతడే యగ్రగామియగుట వలన నీ సంప్రదాయమును పాటించి రచనలు చేసిన శ్రీ వేంకటేశ్వరవచనములు, శరకోపవిన్నపములు, కాళహస్తీశ్వర వచనములు మొదలగు వాని రచయితలందరును నీతని యనుయాయులే "[69]

ఇలాగా వచనాలు రచించి సంకీర్తన పద్ధతికి, వైష్ణవ భక్తి ప్రపత్తికి చక్కగా ప్రచారం తెచ్చిన ఘనత కృష్ణమాచార్యునికి దక్కుతుంది పైపెచ్చు తదితర యుగాల వారిపైన తన ప్రభావాన్ని అనంతంగా నెరపిన మహానుభావుడీతడే.

## 1 5 2 పెద తిరుమలాచార్యుడు (1458-1554).

తాళ్ళపాకంవారి వంశంలో అన్నమాచార్యుల అనంతరం పదకవితా వ్యవసాయం చేసిన మొదటి కృషీవలుడు అతని పుత్రుడు పెద తిరుమలాచార్యుడు

అన్నమాచార్యుల చిన్నభార్య అక్కలాంబ యందు పెద తిరుమలాచార్యుడు జన్మించాడు. ఇతని జననం 1458. తండ్రిలాగానే సంపూర్ణ జీవితం అనుభవించి శ్రీ వేంకటేశ్వరుని సేవక జీవితం కైంకర్యచేసి 1554 దివంగతుడైనట్లు తెలుస్తూంది. శ్రీ కృష్ణదేవరాయ, అచ్యుతదేవరాయల పరిపాలనలను చూచినట్లు సైతం స్పష్టమవుతుంది. ఇతడు అత్యంత మహిమాన్వితుడైనట్లు విదితమవుతుంది.

"మండెము కోటలో మండలం బెగుర
మండలాగ్రాహతి మహనీయవృష్ఠి
దాముపై ధర్మాంగద స్థితిఁ గొలిచె
నీ మహిమయాని యిహసగాత్రమున" — అని విన్నపం చెప్పడం గమనించదగ్గ అంశం. ఈ విషయాన్నే పెదతిరుమలాచార్యుడు "నాటికినాడు గొత్త నేటికి నేడు గొత్త"(6-85) అనే పదంలో చెప్పుకొన్నాడు. దీన్ని 'కరము తీరిపులును కలిగిన మామిడి కరము సోకిన యంతనే"[70] అనే పదంలోను ప్రశంసించడం జరిగింది.

తండ్రి అన్నమాచార్యుడు ఆరంభించిన స్వామి కైంకర్య కార్యక్రమాన్ని కుమారుడు పెదతిరుమలాచార్యుడు జీవితాంతం కొనసాగించాడు. పెద తిరుమలాచార్యుడే చెప్పుకొన్న విషయాన్ని స్వీకరిస్తే అన్నమాచార్యుడు దివంగతుడయ్యేసరికే పదకర్తగా పెద తిరుమలాచార్యుడు గణనకెక్కినాడని భావించవచ్చు. "శాలివాహన శకవరుషంబులు 1424 అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బ॥ 12 మొదలుగాను, తాళ్ళపాక అన్నమాచార్యులుంగారు తమ కొమారుడు తిరుమలాచార్యులను దినమొక సంకీర్తన శ్రీ వేంకటేశ్వరునకు అంకితముచేసి చెప్పుమనఁగాను, విన్నపము చేసిన సంకీర్తనలు"[71] అయితే అంతకు ముందే పదరచనలో ఆరితేరి ఉండి పితృాజ్ఞతో ఆనాటినుంచి నిత్యపద కైంకర్యం చేయనారంభించాడని తలంచ వలసిఉంది. "స్వామి పుష్కరిణి జీర్ణోద్ధారము, మెట్లు, మండపాలు, నీరాడుమండపం, కొండమీద తాళ్ళపాకవారి యింటి ముందరి మండపం, సంకీర్తనపు రాగిరేకులు దాచి ఉంచిన సంకీర్తన భండారము, అక్కడ దీపారాధనలు, అక్కడ సంకీర్తనలుపాడే వైష్ణవులకు జీతాలు, గుడి ఆవరణపు గ్రామాలలో చెరువులు, కాలువలు బాగుచేయించడానికి ధనదానం, ఆళ్వారుతీర్థం దగ్గర శ్రీ లక్ష్మీనారాయణ స్వామి ప్రతిష్ఠ, ఎగుపదిగువ తిరుపతులను, ఇంకా ఇతర స్థలాల వెలసిన దేవుళ్ళకు భక్ష్య

భోజ్యాది నైవేద్యములను, నిత్య, పక్ష, మాస స్వర్ణోత్సవాదులను, వసభోజనాది వినోదాలను, వమ వంశపారంపర్యంగా తమ పేర జరిపించడానికి 12 గ్రామాలను, వేలకొలది వరహాలు, పణాలు, అర్పణాలు శ్రీ భండారమునకు అర్పించగా అందుకు స్థానపతులు సమ్మతిగా శాసనాలు చెక్కించారు "[72]

పెద తిరుమలాచార్యుడు శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రచించడమే గాక, వైరాగ్య వచనగీతాలు, శృంగార దండకం, చక్రవాళమంజరి, శృంగార వృత్త శతకం, వేంకటేశ్వరోదాహరణం, నీతిసీస శతకం, సుదర్శనరగడ, రేఫఱకారాలు, భగవద్గీత తెలుగు వ్యావహారిక వచనం, ద్విపద హరివంశం, మేలుకొలుపు ద్విపద, ఆంధ్ర వేదాంతం మొదలైన ఎన్నో రచనలుచేసి తన ప్రతిభా పాండిత్య ప్రకర్షలను ప్రకటించాడు

"సింహగిరి నరహరి వచనములను పేరుతో ఉళగంధి ఎచన గీతములను రచించిన కృష్ణమాచార్యులు, అన్నమాచార్యులు, పెద తిరుమలాచార్యులు తమ సంకీర్తనలద్వారా ఆంధ్ర వేదాంతకర్తలని, పంచమాగమ సార్వభౌములని అన్పించుకొన్నారు పెద తిరుమలయ్యకు శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య, శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కిక కేసరి, శరణాగత వజ్ర పంజర బిరుదాలు కలవు ఈతనికి వేంకటేశ్వరస్వామి మూడు పురుషాంతరముల వరకు ప్రత్యక్షమును, ఏడు పురుషాంతరముల వరకు మోక్షము ఇచ్చెదనని వరమిచ్చాట్ట. పెద తిరుమలాచార్యులకు ఉపదేశ గురువైన కందాడ అప్పలాచార్యులే తెనాలి రామ కృష్ణకవికి వాడా వైష్ణవ మిచ్చిన గురువు

"అన్నమాచార్యుని రచనలో పుంభాయుగ సారళ్యము, సౌకుమార్యము, దేశి పలుకుబడుల తీయదనము కన్పిస్తాయి పెద తిరుమలాచార్యుడు పట్టుమని ప్రబంధ యుగంలో రాయలకు సమకాలికుడైన వాడు కనుక ఆయన కవితాకన్యక ముక్త పదగ్రస్తములు, యమకాది మొదలైన శబ్దాలంకారాల సొమ్ములను ధరించిన ప్రౌఢ తనంలో రామరాజభూషణాది ప్రౌఢ ప్రబంధకవుల కవితా సుందరిని తలపింప జేస్తుంది."[73]

అన్నమాచార్యుని తరువాత ఈ పదకవితా స్రోతస్వినిని చక్కగా పారించిన ఘనత పెద తిరుమలాచార్యునిదే ఆ వెనుక ఆ భారాన్ని స్వీకరించి, కొనసాగించిన వాడు చిన తిరుమలాచార్యుడు

## 1.5.3 చిన తిరుమలాచార్యుడు (1488-1562) .

చిన తిరుమలాచార్యుడు పెద తిరుమలాచార్యుని పుత్రులలో పెద్దవాడు ఇతని తమ్ముళ్ళు అన్నయ్య, తిరు వెంగళప్ప, చిన్నన్న అనబడే చిన తిరువెంగళనాథుడు, కోనేటి వెంకటనాథుడు

చిన తిరుమలాచార్యుడు సుమారు 1480-88 మధ్యకాలంలో జన్మించి ఉండ వచ్చునని విజ్ఞుల అభిప్రాయం 1562 వరకు జీవించి తాత తండ్రులు ఆరంభించిన స్వామి కైంకర్యం కొరకే జీవితం మీదు గట్టిన మహనీయుడు అన్నమాచార్యులకు పెదతిరుమలాచార్యులు చనవరి అయిన సుతుడై తే తిన తిరుమలయ్య ముద్దుల మను మడు మనుమడికి తాత అన్నమాచార్యులే బ్రహ్మోపదేశం చేసినట్లు తెలుస్తుంది తనను అన్ని విధాల దిద్ది తీర్చిన వాడు తాత

"తాళపాకన్నమాచార్య దైవమవు నీవు మాకు
వేళమె శ్రీహరిఁగనే వెర వానతిచ్చితివి ॥పల్లవి॥

గురుఁడవు నీవె సుమ్మీ కుమతినైన నాకు
సరవి బ్రహ్మోపదేశము సేసితి
పరమ బంధుఁడవైనా పరికింప నీవెసుమ్మీ
వరుసనేఁ జెడకుండ వహించు కొంటివి ॥తాళ॥

తల్లివైన నీవెసుమ్మీ తగిన విషయాలలో
పల్లదానఁ బడకుండా బ్రతికించితి
అల్లుకొని తోడునీడవైనా నీవెసుమ్మీ
చిల్లర మాయలలోనఁ జెడకుండాఁ జేసితి ॥తాళ॥

దాతవు నీవె సుమ్మీ తగు శ్రీవేంకటనాథు
నా తలఁపులో నిలిపి నమ్మఁజేసితి
ఘేతలఁ జూచినా నాకు నేడుగడయు నీవె
ఆ తల నీతల నన్ను నాదుకొని కాచితి ॥తాళ॥

(చిన తిరుమలాచార్యుని అధ్యా సం సం, 16, ప 39)

ఇతడు తన పదహారవయేటనే సంకీర్తన రచనకారంభించినట్లు ఆయన సంకీర్తన పల్లవే తెలుస్తుంది

'రామా రామచంద్ర రాఘవా రాజీవలోచన రాఘవ
సౌమిత్రి భరత శత్రుఘ్నులతోడ జయమందు దశరథరాఘవా ॥పల్లవి॥

శిరసు కూకటుల రాఘవా చిన్నారి పొన్నారి రాఘవా
గరిమ నావయసున తాటకిఁ జంపిన కౌసల్య నందన రాఘవా
అరిది యజ్ఞముగాచి రాఘవా యట్టె హరునివిల్లు విరిచిన రాఘవా
సిరులతో జనకుని యింట జానకిఁ జెలఁగి పెండ్లాడిన రాఘవా"
(చిన తిరుమలాచార్యుని అధ్యా సం సం 16. ప 1)

"నా వయసున తాటకిఁ జంపిన కౌసల్యానందన రాఘవా' యని యుండుటచే శ్రీ రాముడు తాటకిఁ జంపిన వయసున నీతఁడును కీర్తనల రచించినాఁడను కొన వచ్చును. అయిన రాముఁడు తాటకిఁ జంపినదెపుడు?" అని ప్రశ్నించుకొని అనేకోపపత్తులతో శ్రీరాముడు తాటకిని చంపినది పదహారో ఏట అని నిరూపించి "అన్నమయ్య కూడ 'ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున నవముగా రామాయణము' రచించెను చిన తిరుమలయ్యయు పదునైదువత్సరములు గడచి పదునారవ సంవత్సరము వచ్చినపిదపనే కీర్తనలు రచించినాఁడని మనము విశ్వసింపవచ్చును"[74] అని నిర్ణయించారు అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులు

ఇతడు తాత తండ్రులలాగే శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రచించి ఉత్తమ పదకవిగా నిరూపించుకొన్నాడు ఇతడు సంస్కృతాంధ్రభాషల్లో మహాకవి మాత్రమే గాక అష్టభాషాదండకం రచించి అష్టభాషాచక్రవర్తి అని బిరుదుపొంది ప్రసిద్ధుడయ్యాడు అన్నమాచార్యుడు సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణాన్ని తెలుగుచేసిన పండితుడు

చిన తిరుమలాచార్యుడు తాత అన్నమాచార్యుని అనేక సంకీర్తనల్లో ప్రస్తుతించాడు తనకు బ్రహ్మోపదేశం జరిగాక కొంతకాలం తాత జీవించినట్లు తెలుస్తుంది ఇతని సంకీర్తనల వల్ల ఇతడు అపారమైన గురుభక్తి సంపన్నుడని విశదమవుతుంది. తాత తండ్రులలాగే భగవద్భక్తి ముఖ్యమని నమ్మినవాడు. రాజా

శ్రయాన్నికోరే దైన్యానికి ఇతడు దిగజారలేదు ఇందువల్ల ఇతని వ్యక్తిత్వం స్పష్టమవుతుంది ఎగువ, దిగువ తిరుపతుల్లో వేల్పులకు గూడా ఇతడనేక కైంకర్యాలు జరిపించాడు ఇందుకు శాసనాధారాలున్నాయి [75]

"శాసనాధారాలను బట్టియు, కీర్తనలను బట్టియు నీతడు మత ప్రచారమునకును, సంకీర్తన ప్రచారమునకును చిత్తూరు, అనంతపురము, కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు మున్నగు మండలములందు సంచారము గావించినట్లు తెలియుచున్నది. మంగళగిరి దేవాలయమున నీతడు సంకీర్తన అఖండప్పాడున కేర్పాటు గావించెను ఈతడు క్రీ శ 1562 వరకును జీవించినట్లు తెలియుచున్నది "[76]

ఇలాగా పదరచనా ప్రచారాలలో, భక్తి ప్రపత్తిలో, ప్రతిభాపాండిత్యాలలో తాతతండ్రులకు తీసిపోనివాడు చిన తిరుమలాచార్యుడు

## 1. 5 4 క్షేత్రయ్య (1590 - 1675)

అన్నమాచార్యుల తరువాత ఒక శతాబ్ది అనంతరం అన్నమాచార్యులంతటి వాగ్గేయకారుడు, పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య పదకవితా పితామహుడు అన్నమాచార్యుడైతే పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య సంకీర్తనల్లో సంగీతం కంటే సాహిత్యానికి అధిక ప్రాధాన్యమిచ్చినవాడు అన్నమాచార్యుడు తన పదాలలో సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యమివ్వడమేగాక అభినయం జోడించినవాడు క్షేత్రయ్య ఇతడు సారంగపాణి మొదలైన సమకాలికులకు, తదనంతర పదకర్తలకు మార్గదర్శకుడు పదాభినయం క్షేత్రయ్య పదాలతోనే ఆరంభమైంది ఇది సమకాలికుడైన సిద్ధేంద్ర యోగి కూచిపూడి నృత్యంలో పరిపుష్టిచెందింది పైపెచ్చు పదాలంటే క్షేత్రయ్య నాటినుంచి కేవలం శృంగారపదాలనే భావం నిలిచిపోయింది ఈ పదకవితల ద్వారా సంగీత సాహిత్యాభినయాలకు అనన్యసామాన్యమైన సేవచేసినవాడు క్షేత్రయ్య తేటతెలుగు పదాలకు, పలుకుబళ్ళకు, జాతీయాలకు క్షేత్రయ్య పదాలు చక్కటి ఉదాహరణలు

క్షేత్రయ్య పూర్వనామం వరదయ్య అనేక పుణ్యక్షేత్రాల సందర్శనంవల్ల, క్షేత్రజ్ఞానం కలవాడు కావడంవల్ల వరదయ్యకు క్షేత్రయ్య అనేపేరు కలిగింది క్షేత్రజ్ఞుడనే పేరుకూడా ఇతడు దక్షిణదేశంలో ప్రసిద్ధుడు క్షేత్రయ్య నివాసం మొవ్వ ఇది కృష్ణామండలం దివిసీమలోని కూచిపూడి, పెదపూడి, ఘంటసాలలకు

దగ్గరలోనే ఉన్న మొవ్వ ఆ మొవ్వలో వెలసిన మువ్వగోపాలస్వామిపై భక్తితో శృంగారరస భావాలతో రచించిన పదాలే మువ్వగోపాల పదాలు 'మువ్వగోపాల' అనే ప్రసిద్ధమైనా మువ్వ, మవ్వ రూపాలుగా వాడుకలో మారిపోయినట్లు తెలుస్తుంది మువ్వగోపాల మకుటంతో రచితమైనవే క్షేత్రయ్య పదాలు

క్షేత్రయ్య కేవలం గొడ్లకాపరిగా ఉంటూ అల్లరిచిల్లరిగా తిరుగుతూఉండే వాడు. కానీ ఒక యోగివల్ల గోపాలమంత్రోపదేశం పొంది జపంచేశాడట శృంగార రసాధి దేవత అయిన గోపాలుని అనుగ్రహంతో "శ్రీపతిసుతుబారికినే - నోపలేక నినువేడితే కోపాల? మువ్వగోపాలా!" అనే పల్లవితో ప్రారంభించి పదకవితల ల్లి నట్లు తెలుస్తూంది కానీ బాల్యంలో ఇతడు గొడ్లకాపరికావచ్చు క్రమంగా చక్కటి వైదుష్యం గడించినట్లు స్పష్టం సంస్కృతాంధ్ర భాషల్లోను, సంగీతాభినయాలం కారాది శాస్త్రాల్లోను పాండిత్యం గడించాడు. శృంగార పదరచన చేయనారంభిం చాడు అయితే మరో కథ ఉంది ఇతడు మొదట వేశ్యాలోలుడనీ, ఒకానొక సంఘటన వల్ల ఒక దాసి మూలంగా మువ్వగోపాలభక్తుడయ్యాడనీ, అనాటి నుంచి 'మువ్వగోపాల' ముద్రతో పదరచనలు మధురభక్తిపురస్సరంగా చేయనారంభించాడనీ అంటారు ఏది ఏమైనా ఉత్తమ వాగ్గేయకారుడయ్యాడు

ఆనాడు ప్రసిద్ధికెక్కిన మధుర, తంజావూరు, జింజి నాయకులను ఆశ్ర యించాడు "లేడుకతో నడచుకొన్న విఁరాయడే" అనే పదంవల్ల మధుర తిరుమ లేంద్రుణ్ణి, తంజావూరు విజయరాఘవనాయకుణ్ణి, గోలుకొండ పాదుషాలను ఆశ్ర యించినట్లు తెలుస్తుంది. ఇంకా రఘునాధ నాయకుని, తుపాకుల వెంకటకృష్ణప్ప నాయకుని గూడా ఆశ్రయించినట్లు సాక్ష్యాధారాలున్నాయి అందరిలోకి క్షేత్రయ్యకు విజయరాఘవనాయకుడు అత్యంతగౌరవం ఇచ్చేవాడట కొందరు ఇతరకవులు ఈర్ష్యతో 'మహారాజా! ఇదేమి? ఏరా, పోరా, రారా అనే క్షేత్రయ్య మీద ఇంత మోహమా?' అన్నారట ఈ విషయం విజయరాఘవనాయకుడు క్షేత్రయ్యతో చెప్పాడట వెంటనే క్షేత్రయ్య "వదరకపోవే వాడేలవచ్చీని - వద్దు రావద్దనవే" అనే పదం చెప్పి, మూడో చరణంలో చివరి పాదం ఆకవీంద్రులచేత పూరింపజేయుమని రాజును కోరి తాను సేతుయాత్రకు వెళ్ళాడట యాత్రానంతరం వచ్చిన క్షేత్రయ్య, ఆ కవులకు సాధ్యంకాలేదని తెలిసి "రామ రామ ఈ మేనితో నికవానిమోము జూడ ఫలెనా మొదటి పొందేవాలు". అని పూరించాడట సిగ్గుపడ్డ ఆకవీంద్రులు

క్షేత్రయ్యను ప్రశంసించారట. విజయరాఘవుడు ఘనంగా సత్కరించాడు ఆ వెనుక గోలకొండ పాదుషాను దర్శించి, అచటి తులసిమూర్తితో పోటీపడి నలభైరోజులలో 1500 పదాలు చెప్పాడట పాదుషా సత్కారానికి పాత్రుడయ్యాడట ఆ వెనుక శృంగారి అయిన క్షేత్రయ్య మొవ్వగోపాలుని ఆలయంలోని దేవదాసిని మోహించగా ఆమె తిరస్కరించి, భక్తిపూరితమైన పదరచనచేస్తే అతనికి వశమవుతానని చెప్పింది రక్తేగాని భక్తి ఎరుగని క్షేత్రయ్యకిది అగ్నిపరీక్ష గోపాలదేవుని ఉపాసించి అనుగ్రహీతుడై పూర్వోక్తమైన "శ్రీపతిసుతుబారికి నేనోపలేక నినునేడితే కోపాలా ? మువ్వగోపాలా !" అని భక్తిభరితంగా పదరచనచేసి తరించాడు ఆవెనుక పరమ భక్తాగ్రేసరుడయ్యాడు దేవదాసి చింతలేదు మధురభక్తి పరవశుడు క్షేత్రయ్య తానె నాయిక, తన ప్రాణ వల్లభుడు మువ్వగోపాలుడు తదుచితంగా మధురభక్తి పదరచన చేశాడు ఆంధ్రదేశమేగాక దక్షిణదేశమంతా తిరిగాడు సందర్శించిన ప్రతిదేవునిపైన ఆదేవుడి ఉపముద్రతో ప్రధాన మువ్వగోపాల ముద్రతోపదరచన చేశాడు ఒకసారి శ్రీ పెరుందేవీవరదరాజులకు శయ్యాసనాలు సమర్పించి తలుపులు బిగించి వెళ్ళిపోయారు అర్చకులు ఆ సమయంలో దేవాలయంలోపలె ఉండిపోయాడు క్షేత్రయ్య తెల్లవాఋజామున ఒక దివ్యస్త్రీ ఉంటే పెరుందేవి దర్శనమిచ్చింది క్షేత్రయ్యకు ఆ అలౌకిక శృంగారాన్ని ఊహించిన క్షేత్రయ్య నోటినుంచి "మగువ తన కేళికా - మందిరము వెడలెన్" అనే అద్భుతపదం వెలువడిందట ఇది ఆనాటి క్షేత్రయ్య మానసిక స్థితికి తగినట్లుంది కానీ కొందరు క్షేత్రయ్య విజయరాఘవ నాయకుని ఆస్థానంలో ఉండగా రాణీదర్శనాన్ని ఇలా వర్ణించాడంటారు అదంత సముచితమనిపించదు మొదట పరమ శృంగారి అయిఉండి, ఆవెనుక మధురభక్తి పరతంత్రుడైన క్షేత్రయ్య 1590 ప్రాంతంలో జన్మించి 1675 వరకు జీవించినట్లు భావించవచ్చు [77] కాని ఇతని జీవిత పరిసమాప్తి ఎక్కడ, ఎప్పుడు, ఎలాజరిగింది చెప్పడానికి తగిన ఆధారాలు లభించవేదు

తన పదాల్లో సంగీత సాహిత్యాలను సమ్మేళనంచేసి, అభినయం జోడించి, ఉత్తమ వాగ్గేయకారుడుగా, సమున్నతస్థానం ఆక్రమించుకొన్నాడు క్షేత్రయ్య మధురభక్త్యుపాసకుడుగా తరించి, భక్తులకు తరణోపాయం చూపించాడు తన పదాల ద్వారా సంగీతసాహిత్యాభినయాలలో ఎందరికో మార్గదర్శకుడయ్యాడు

చేసింది పదరచనే అయినా, పదకవితా చక్రవర్తిగా, అత్యుత్తమ మధురభక్త్యు పాస కుడుగా తన వైశిష్ట్యాన్ని నిలబెట్టుకొన్న మహామనిషి. అమరుడు క్షేత్రయ్య

"తెలుగు పదకవితా కన్యకు పితామహుడు తాళ్ళపాక అన్నమయ్య గారంటిని కాని జనకుఁడే క్షేత్రయ్య తాత మొదలు పెట్టిన పనిని తలపొలము దాక ఈడ్చిన తండ్రి యీతడు ' 78 అని ఎంతో సముచితంగా తీర్పునిచ్చిన రాళ్ళపల్లివారి మాటలు సార్థకమైనవి

## 1.5 5 కంచెర్ల గోపన్న (భద్రాచల రామదాసు) (1620-1680)

క్షేత్రయ్య తరువాత తులనాత్మక అధ్యయనార్థం మనం తెలుసుకోదగ్గ వాగ్గేయ కారుడు రామదాసు క్షేత్రయ్య సమకాలికుల్లో నారాయణతీర్థుల గూర్చి సంస్కృత వాగ్గేయకారులలో తెలుసుకొన్నాము ఇంకా సిద్ధేంద్రయోగి, రఘునాథనాయకుడు, విజయరాఘవనాయకుడు ప్రభృతులు ఎందరో క్షేత్రయ్య సమకాలికులు కానీ వారిలో రామదాసు పరిగణింపదగ్గ వాగ్గేయకారుడు

భద్రాచల రామదాసు అని ప్రసిద్ధికెక్కి, ఆంధ్రదేశంలోనేగాక, యావద్భార తంలోనే విశిష్టస్థానం ఆక్రమించిన భక్తాగ్రేసరుడూ, వాగ్గేయకారుడూ అయిన ఇతని అసలుపేరు కంచెర్ల గోపన్న

ఇతని తల్లిదండ్రులు కామాంబాలింగన మంత్రులు తెలంగాణాలోని నేల కొండపల్లి స్వగ్రామం ఇతనికి వైష్ణవమతం ఇచ్చిన గురువు రఘునాధ భట్టా చార్యులు ఇతడు 1620 ప్రాంతంలో జన్మించి, 1680 వరకు జీవించినట్లు తెలు స్తూంది కానీ ఇతనికాలం 1650 - 168/ మధ్య ఉన్నట్లు భావిస్తున్నారు 79 దీనికంటె పైకాలమే సమంజసం ఈ కాలంలోనే గోలకొండ రాజ్యాన్ని అబ్దుల్లా తానాషా, అబుల్‌హసన్ తానాషాలు పరిపాలిస్తూ ఉండేవారు వారికొలువులో ఉన్న అధికారులు అక్కన్న మాదన్నలు అనె అన్నదమ్ములు, గోపన్న మేనమామలు వీరి మూలంగానె 1650 ప్రాంతంలో గోపన్న భద్రాచలం తహసిల్దారయ్యాడు ఇతనికి కమలతో వివాహమైంది పుత్రుడు జన్మించగా రఘురాముడని పేరుపెట్టుకొన్నారు భద్రాచలంలో భజనలు, సాధుసంతర్పణలు కొనసాగిస్తూండేవాడు ఒకానొక సంతర్పణ సమయంలో ప్రమాదవశాత్తువల్ల పుత్రుడు గంజిగుంటలోపడి మరణించగా,

రామసంకీర్తనతో బ్రతికించుకో గలిగిన భక్తసంపన్నుడు నాటినుంచి రామదాసన్న పేరు ప్రసిద్ధికెక్కింది

రామదాసు తహసీల్దారుగా ఉంటూ సర్కారు పైకం ఖర్చుపెట్టి భద్రాద్రి రామాలయానికి, తమ్మల దమ్మక్క అనే భక్తురాలు లాగానె మరమ్మత్తులు చేయించి, దేవుని కైంకర్యం చేయించి నందుకు గోల్కొండనవాబు ఆగ్రహానికిగురిపై కారాగార శిక్షపొందడం జరిగింది పండ్రెండేండ్లు ఘోరనరకం కారాగారంలో అనుభవిస్తూ శ్రీరాముని ఆర్తితో వేడుకొంటూ అనేకకీర్తనలు రచించాడు చివరికి శ్రీరామ చంద్రుడు సలక్ష్మణుడై వచ్చి పైకం చెల్లించి రసీదునిచ్చి చెరవిడిపించినట్లు ఆంధ్రు లందరకు సువిదితమే

"రామదాసు చరిత్ర పుస్తకాలనుబట్టి, అతడు బాల్యంలోనె సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యం సంపాదించినట్లు తెలుస్తుంది గోలుకొండ తురుష్క ప్రభుత్వంలో అధికారి గనుక పారశీక, ఉర్దూభాషలలో కూడా పండితుడై ఉండాలి ఇతని కీర్తనలలోని వేరువేరు ఛందోరీతులను బట్టి మాస్తే, దేశీయగేయ రీతులను ఇతడుబాగా మనస్సుకు పట్టించుకొన్నట్లు కనబడుతుంది తెలుగులోనేకాక సంస్కృతంలో కూడా రామదాసు ముద్రతో ఉన్న కీర్తనలు ఐదారింటికిపైగా కనిపిస్తున్నాయి"

"అతని సంగీత రచనలనుబట్టి అతని ఆశయం పాండిత్య ప్రకర్షకాదనీ, సంగీతం అతని భక్తి సాధనకు ఉపకరణ మాత్రమేననిచెప్పాలి అతని కీర్తన లందుకే సహజభక్తి భావావేశంతో, తన్మయత్వంలో అప్రయత్నంగా సంకీర్తన భావానుగుణంగా వచ్చిన సరళమైన రచనలు ఉందుకె ఒకేసారి ఎన్నిగొంతుకలు చేరిపాడిన, శ్రావ్యమైన మేళంతో వినిపించే బృందగీతులవి భక్తికి భజన గోష్ఠులలో రామదాసు కీర్తనల తర్వాతనే మిగిలినవారి కీర్తనలకు పేరు"

"వీటిలో రామదాసు రచించినవి అని గుర్తు పట్టదగిన కీర్తనలు 100 మొదలు 108 వరకూ దొరకుతాయి"[80] అని రజనీకాంతరావుగారి అభిప్రాయం

శ్రీ మంచాళ జగన్నాధరావుగారు స్వరసహితంగా సేకరించిన రామదాసు కీర్తనలు ఆంధ్రప్రదేశ సంగీతనాటక అకాడమీ ప్రకటించి రామదాసు కీర్తనలను సంరక్షించడం ముదావహం

ప్రసిద్ధమైన రామదాసు కీర్తనలు కొన్ని తారకమంత్రము కోరిన దొరకెను, తక్కువేమి మనకు, పలుకే బంగారమాయెను, ఏ తీరుగ నను దయజూచెదవో - మొదలైనవి సుమారు ఇరవైదాకా ఉన్నాయి పల్లెటూళ్ళలో ఈనాడు భజనగోష్ఠులలో మనం వినగలము. అన్నమాచార్యులతో ఆరంభమైన సంకీర్తన లేదా పదం రామదాసులో కీర్తనగా రూపుదిద్దుకొంది.

## 1 5 6 సారంగపాణి (1680 - 1750)

అన్నమాచార్యునితో ఆరంభమైన సంకీర్తన కవిత శృంగార ఆధ్యాత్మ పదాలుగా రూపుదిద్దుకొని పెద, చిన తిరుమలాచార్యులలో కొనసాగి క్షేత్రయ్యలో సుస్థిరరూపం పొంది, సారంగపాణిలో విస్తృతిపొందింది. శృంగార పదాలకు అన్నమయ్య, క్షేత్రయ్య, సారంగపాణి ముగ్గురు వాగ్గేయకారులను చెప్పుకోవడం పరిపాటి. అలాగే అన్నమాచార్యునితో ఆరంభమైన ఆధ్యాత్మికత సైతం రామదాసులోను, ఆ వెనుక సారంగపాణిలో విశిష్టతనుపొందినట్లు స్పష్టమవుతుంది. అంటే అన్నమాచార్యుడు ఆరంభించిన పదమూ, సంకీర్తన అనే రెండు రీతులూ క్రమవికాసం పొందినట్లు తెలుస్తుంది. అన్నమాచార్యుల తరువాత పెద, చిన తిరుమలాచార్యులు, క్షేత్రయ్య, సారంగపాణి వాగ్గేయకారుల్లో పదవికాసం పొందినట్లే, సంకీర్తన రామదాసు, సారంగపాణి వాగ్గేయకారుల్లో విశిష్టతను పొందింది. పైపెచ్చు అన్నమాచార్యుని ఆధ్యాత్మికసాహిత్యంలోని వైరాగ్యరీతి, రామదాసు అంతకంటే సారంగపాణిలో వైరాగ్య, నీతి ప్రబోధకాలైన కీర్తనల్లో స్పష్టతను పొందింది. అన్నమయ్య తరువాత క్షేత్రయ్య, ఆ వెనుక సారంగపాణి క్రమంగా పేరొందదగ్గ పదకవులు, వాగ్గేయకారులు. తెలుగు పదసాహిత్యంలో సారంగపాణి పదాలకు పన్నెవాసి ఉన్న విషయం మనకు తెలిసిందే.

సారంగపాణి చిత్తూరు మండలంలోని కార్వేటినగరం సంస్థానంలో ప్రసిద్ధి పొందిన పదకర్త, వాగ్గేయకారుడు. ఇతడు చెన్నపురి సమీపంలోని పొన్నేరులో పుట్టిపెరిగి, ఆ వెనుక కార్వేటి నగరంచేరి, ఆ యాస్థానంలో స్థిరపడ్డాడు. వేణుగోపాల ముద్రతో అనేకపదాలు రచించాడు. మాకరాజు వేంకట పెరుమాళ్ళరాజు (1719-1732), అతని సోదరపుత్రుడు మాకరాజు కార్వేటిరాజు (1733-1752)

అనే కార్వేటి నగరరాజుల కాలంలో వారిచే సత్కృతుడై ఆస్థాన విద్వాంసుడుగా, విద్యాధికారిగా, వాగ్గేయకారుడుగా ప్రసిద్ధికెక్కాడు సారంగపాణి. ఇతడు 1680 ప్రాంతంలో జన్మించి, 1750 వరకు జీవితం కొనసాగించినట్లు తెలియవస్తూంది.[81]

సారంగపాణి విద్యాభ్యాసమూ, గురుపరంపర, వైదుష్యం మొదలైన అంశాల గూర్చి మనకంతగా తెలియరావడంలేదు. అయినా సంస్కృతాంధ్ర భాషాకోవిదుడనీ, సంగీతాభినయాల్లో పరిపూర్ణ జ్ఞానం కలవాడని సారంగపాణి పదాల్ని పరిశీలిస్తే స్పష్టం కాక మానదు. సారంగపాణి పదాలుగా ఇప్పటికి లభించిన రెండువందలా ఒకటి కానీ అందులో క్షేత్రయ్య పదాలు ఆరు చేరాయి. తక్కిన నూటాతొంభై ఐదు మాత్రమే సారంగపాణి పదాలు. విటిలో నాలుగురకాల పదాలున్నాయి. ప్రథమ భాగం శృంగార పదాలు. ద్వితీయభాగం దేశియపదాలు. విటిలో వేశ్యావిలాస, దూషణలు వివరించబడ్డాయి. తృతీయభాగం జాతీయపదాలు. వీటిలో జానపదభాషా ధోరణి స్పష్టమవుతుంది. చతుర్థభాగం కీర్తనలు. ఇవి నీతి, వైరాగ్య, తత్వ ప్రబోధకాలై ఒప్పుతున్నాయి. వీటిలో మూడుపదాలు మాకరాజు కార్వేటిరాజుకు అంకితమై ఉన్నాయి. తక్కినవన్ని కార్వేటి నగరంలో వెలసిన వేణుగోపాలస్వామికి అంకితమైన పదాలు.

సారంగపాణి కార్వేటి నగరం సంస్థానంలో పండితుడై పదరచనచేసి వాగ్గేయ కారుడుగా ప్రసిద్ధి కెక్కాడు. వైణికవిద్వాంసుడై సత్కృతుడయ్యాడు. అభినయా చార్యుడై ప్రఖ్యాతి గడించాడు. క్షేత్రయ్యలాగే తన పదాల్లో సారంగపాణి సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యమివ్వడమేగాక అభినయం జోడించాడు. 1731లో మాకరాజు వేంకట పెరుమాళ్రాజు సారంగపాణికి దుర్గరాజపురమనే అగ్రహారం దాన మిచ్చాడు. చివరిదశలో రాజాశ్రయం కోల్పోయి నిరుపేదతనంతో శ్రీ నాథునిలా సారంగపాణి అష్టకష్టాలు అనుభవించినట్లు శ్రీ రజనీకాంతరావుగారి అభిప్రాయం[82] వాస్తవమనిపిస్తుంది. కానీ ఆరంభంలో శృంగార పదరచన చేసినా, క్రమంగా ఉత్తమభక్తుడై, తాత్వికుడై నీతివైరాగ్య తాత్వికబోధనా పద్ధతిలో కీర్తనలు రచించి నట్లు గూడా మనం సారంగపాణిజీవితం ద్వారా తెలుసుకోగలం.

అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు, త్యాగయ్య సంకీర్తనలు, పదాలు, కీర్తనలు కృతులు స్వరసహితంగా కొన్ని అయినా - ముద్రితమైనట్లు సారంగపాణి,

పదాలు నోచుకోలేదు ఈవిషయాన్నె రజనీకాంతరావుగారిలా పేర్కొన్నారు "కాని క్షేత్రయ్య పదాలను నేర్చుకొని, పరంపరాగతంగా పాడుకొంటూ నేటికి కొందరు మిగిలినట్లుగా, సారంగపాణి పదాలకు అంతప్రచారం కలిగినట్లులేదు దానికి కారణం చివరికాలంలో అతనికి రాజాస్థానాల ప్రాపు లేకపోవడమూ, శిష్యపరంపర లేక పోవడమూ కావచ్చు ఈతని పదాల స్వరపణితులను అన్వేషించి సేకరించవలసి ఉన్నది [83] మరి రజనిగారి కోరికతీరి, స్వరసహితంగా సారంగపాణిపదాలు ఎప్పుడు వెలువడుతాయో ? అందుకు తిరుమల తిరుపతి దేవస్థానం అన్నమాచార్య ప్రాజెక్టు వారు ప్రయత్నిస్తే బాగుంటుంది అయితే ఈ విషయంలో శ్రద్ధవహించి ప్రతి సంవత్సరమూ క్రమంతప్పక 'సారంగపాణి ఉత్సవాలు' కార్వేటి నగరం వేణుగోపాల స్వామి ఆలయంలో నడుపుతూన్న ఆచార్య పి వి అరుణాచలంగారి కృషి ప్రశంసించ దగ్గది

గోవిందస్వామయ్య, కూవనసామయ్యలనే అన్నదమ్ములు సారంగపాణి సమకాలికులై, కార్వేటి నగరం ఆస్థానంలోనె వాగ్గేయకారులుగా ప్రసిద్ధికెందారు

సారంగపాణి శృంగార, దేశియ, జాతీయ పదాలతోపాటు కీర్తనలు వివిధ రాగతాళాలతో రచించి, ఆడిపాడి ఆనాటి కార్వేటినగర సంస్థానాన్ని, ప్రజల్ని ఆనందింపజేసి, సంగీతాభిమానులకు ఎనలేని సేవచేసిన వాగ్గేయకారుడు

## 1 5. 7 మునిపల్లె సుబ్రహ్మణ్యకవి (1730 - 1780) :

సారంగపాణి తరువాత పేర్కొదగ్గ వాగ్గేయకారుడు, సుప్రసిద్ధుడు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి ఇతడు అధ్యాత్మరామాయణకర్త. రామదాసు కీర్తనల తరువాత తెలుగుదేశంలో మిక్కిలి జనరంజకమైన సంగీతసాహిత్య రచన - కీర్తనాత్మకమైన అధ్యాత్మరామాయణం సంకీర్తనాత్మకంగా అన్నమాచార్యుడు ఆరంభించిన పదం అధ్యాత్మరామాయణంలో కథనాత్మకమైంది రామాయణ కథ నంతటినీ బాల, అయోధ్య, ఆరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండలనే ఆరుకాండలలో 104 కీర్తనల్లో సుబ్రహ్మణ్యకవి విరచించాడు.

సుబ్రహ్మణ్యకవి కాలం 1730 - 80 అని రజనీకాంతరావుగారు నిర్ణయించి "సంస్కృతాంధ్ర భాషలలోను, సంగీత నాట్యాలంకార శాస్త్రములలోను, వేదాంత శాస్త్రంలోను కూడా సుబ్రహ్మణ్యకవికి అపారమైనపాండిత్యం ఉన్నట్లు అతని రచనల వలన తెలుస్తుంది

అంతేకాకుండా ఇతడు సంస్కృతాంధ్రములలో గేయరచనాదక్షుడు క్షేత్రయ్య త్యాగరాజులకు నడుమ వెలసి, బహుజనరంజకుడైన వాగ్గేయకారుడు "[84] అని వివరించాడు ఇంతేగాక ఈ విషయాన్నే మునిపల్లె సుబ్రహ్మణ్యకవి విరచితమైన 'అధ్యాత్మరామాయణ కీర్తనలకు 'పరిచయము' రాస్తూ గూడా రజనిగారు ఉట్టంకించి ఉండడం గమనించదగ్గ అంశం [85] కానీ ఇతడు 16వ శ కి చెందినవాడని వివరించి "ప్రస్తుతము సుబ్రహ్మణ్యకవి కాలనిర్ణయము సంతృప్తికరముగా జరుగలేదని విన్నవించి, దానిని భావిపరిశోధకులకు వదలివేయుట మంచిదని తోచుచున్నది "[86] అని వదలివేశారు కుమారి మంగళగిరి ప్రమీలాదేవి అయినప్పటికీ రజనికాంతరావు గారు పైని పేర్కొన్నట్లు క్షేత్రయ్య, త్యాగయ్యల నడిమికాలం వాడనడంలో దోషం లేదు. సముచితంకూడా ఇతని రచనసైతం ఇందుకుపకరిస్తుంది అధ్యాత్మికత ఉన్నా శృంగార రసపోషణ చేసినతీరు ఆయన అధ్యాత్మరామాయణంలో, ఆయన పదాలలో మనం చూడగలం "అధ్యాత్మరామాయణము భక్తి, వేదాంత ప్రధానమైనా సుబ్రహ్మణ్యకవి తన కథాకథనంలో శృంగార రసాత్మకమైన మనోహర పద జాలాన్ని పల్లవులలోనె కాకుండా, కీర్తనలలో చాలా చోట్ల అవకాశం చిక్కినప్పుడల్లా అనుసంధిస్తూనే వచ్చాడు భక్తితత్వ ప్రబోధితులైన పోతనాది మహాకవులు పోయిన మార్గమే అది "[87] అని రజనిగారు స్పష్టీకరించారు

కథనాత్మకంగా పదం ప్రారంభమైంది సంస్కృతంలో జయదేవుని అష్టపదుల్లో రాధామాధవుల రమణీయగాథను రమ్యంగా అష్టపదుల్లో రచించిన ప్రథమ వాగ్గేయకారుడు జయదేవుడు అయినా దేనికదే అష్టపది స్వయం సంపూర్ణ కావ్యంలా ఉంటుందన్న అంశం పూర్వోక్తం అలాగే శ్రీకృష్ణ లీలాతరంగిణిని సంస్కృతంతోనే రచించిన వాగ్గేయకారుడు నారాయణతీర్థులు ఇక తెలుగులో కథనాత్మకంగా కీర్తనలు రచించిన వాగ్గేయకారుడు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి ఒక్కడే రామాయణాన్ని పార్వతికి ఈశ్వరుడు చెప్పినట్లు ఈ కీర్తనలు రచితం బాలకాండలో 17 కీర్తనలు, అయోధ్యాకాండలో 9 కీర్తనలు, అరణ్యకాండలో 11 కీర్తనలు, కిష్కింధాకాండలో 10 కీర్తనలు, సుందరకాండలో 10 కీర్తనలు, యుద్ధకాండలో 47 కీర్తనలు మొత్తం 104 కీర్తలున్నాయి ఈ కీర్తనలు ఒక్కొక్కటి స్వయం సంపూర్ణమై ఉండడం గమనించగలం. కథనాత్మక కీర్తనకారుడు సుబ్రహ్మణ్యకవి

సుబ్రహ్మణ్యకవి పదాలుసైతం రచించాడు వాటిలో కొన్నింటిని తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు ప్రకటించగా వివరించారు రజనిగారు అపదాలు దామెర్ల కుమారవేంకటేంద్రునీ, అతని కుమారుడైన కృష్ణస్వామినీ, కాళహస్తీశ్వరునీ, అగస్త్యనాధునీ నాయకులుగాచేసి చెప్పినవి[88] "సుబ్రహ్మణ్యకవి స్వతహాగా గొప్ప ఆధ్యాత్మిక తత్వవేత్త, భక్తినిష్ఠాపరుడూ అయినప్పటికీ జీవితంలోని శృంగారమునూ, సృష్టిలోని సౌందర్యమునూ అనుభవానికి తెచ్చుకొన్న వాడేనీ, శృంగారరస నిష్యంది అయిన మధురభావసంపదా, లలితపదజాలమూ అతనికి కరతలామలకమునే అనీ . తెలుస్తూంది తనను ఆచార్యపీఠాన ఉంచి గౌరవించిన కాళహస్తి పాలకుల కోరిక పైని కొన్ని పదాలుకూడా వ్రాసిపెట్టి వాటితోపాటు ఆశీఃపూర్వకంగా తనకు తానుగా దైవాంకితంగా రచించుకొన్న రామాయణ కీర్తనలను కూడా దామెర్లవారికి ఇచ్చి ఉంటాడు'[89] ఆంధ్రులను ఆబాలగోపాలమును పాడించిన ప్రసిద్ధవాగ్గేయకారుల కోవలో ఇంచుమించు చివరివాడు సుబ్రహ్మణ్యకవి అతని కీర్తనల సంగీతాన్ని ఉద్ధరించుకొనడమూ వరదలో మునిగిపోవనున్న నాగార్జున శిల్పకళాఖండాలను ఉద్ధరించు కొనడము వంటిదే ఎక్కువశో దక్షిణాది వారిబాణీనో, ఉత్తరాదిబాణీనో అను కరించడం తప్ప, ఆంధ్రులకు సొంత సంగీతమునేదనుకొనే వారందరికీ - అన్నమాచార్యులతో ప్రారంభించి, సుబ్రహ్మణ్యకవి వరకూ - మనము స్మరించిన వాగ్గేయ కారులందరి జీవితములూ సరియైన ప్రత్యుత్తరమియ్య గలవు"[90]

కుప్పావీరరామవశాస్త్రి పాడగా, త్రిపురారిభట్ల శ్రీరామమూర్తి స్వరపరచగా మంగాళ జగన్నాదరావు సంపాదకత్వం వహించగా, రాజమహేంద్రవరం ఆంధ్రగాన కళాపరిషత్తు పక్షాన విస్సా అప్పారావు కన్వీనరుగా "అధ్యాత్మరామాయణ కీర్తనలు"- మునిపల్లె సుబ్రహ్మణ్యకవి విరచితం - 1962లో ప్రకటింపబడ్డాయి ఇందులో స్వర సహితంగా 61 కీర్తనలున్నాయి[91] ఇలా మనవారు కొంత కొంతయినా స్వర సహితంగా సుబ్రహ్మణ్యకవి కీర్తనల్ని పరిరక్షించుకోగలిగారని తెలుస్తుంది.

## 1. 5 8 త్యాగరాజు (1767-1847) ·

వాగేయకారుల తులనాత్మక అధ్యయనంలో అన్నమాచార్యులతో సరిపోల్చ దగిన ప్రముఖవాగ్గేయకారులలో చివరివాడే అయినా అతి ప్రముఖుడు త్యాగరాజు త్యాగరాజు నాదోపాసనలో ముక్తిపొంది, భక్తులందరికి దారిచూపిన మహా వాగ్గేయ

కార సత్తముడు, అన్నమాచార్యుని ఆధ్యాత్మిక సంపదనూ, పురందరదాసు సంగీత స్ఫూర్తినీ, రామదాసు భజనరీతినీ పుంజీభూతం గావించుకొని సంగీత సామ్రాజ్యానికి అధినేతృత్వం వహించిన మహావాగ్గేయకారుడు

పదం క్రమపరిణతిలో సంకీర్తన, కీర్తన అయి త్యాగయ్యలో కృతిగా రూపు దాల్చింది అన్నమాచార్యుని సంకీర్తనలో ధాతుమాతువుల్లో మాతువుకే ప్రాధాన్యం అంటే సాహిత్యానికే ప్రాముఖ్యం క్షేత్రయ్యలో ధాతుమాతువులకు అంటే సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యం, దానికి అభినయంతోడై జోడుకూడింది త్యాగయ్యలో ధాతువు అంటే సంగీతానికి ప్రాధాన్యమేకాదు ప్రాణం

త్యాగయ్య శాహాభూపాలుని ఆస్థానవాగ్గేయకారుడై ప్రసిద్ధికెక్కిన గిరిరాజ కవికి స్వయానపౌత్రుడు గిరిరాజకవి పుత్రులలో కనిష్ఠుడు రామబ్రహ్మం రామ బ్రహ్మంపుత్రుల్లో కనిష్ఠుడు త్యాగయ్య 1600 ప్రాంతంలో గిరిరాజకవి తండ్రి కాకర్ల పంచనదబ్రహ్మం తెలుగునాడులోని కర్నూలు మండలంలోని కంభం తాలూకా (ఈనాడు ప్రకాశంజిల్లాలోని) కాకర్లగ్రామం నుంచి తంజావూరు జిల్లాలోని తిరు వారూరుకి వచ్చి స్థిరపడ్డ ములికినాటి ఆంధ్ర బ్రాహ్మణుడు సీతమ్మ రామబ్రహ్మం లకు పంచాపకేశబ్రహ్మమనే జపేశయ్య, రామనాధబ్రహ్మం అనే మొదటి ఇద్దరు పుత్రులు సంప్రదాయబద్ధులుగాక తల్లిదండ్రులకు ఇబ్బంది కలిగించేవారట ఆ దంపతులకు తిరువారూరు త్యాగరాజస్వామి అనుగ్రహంతో కారణజన్ముడై వాల్మీకి, నారద, సరస్వతుల అంశాన జన్మించినవాడు త్యాగబ్రహ్మం ఇతడు 1767లో జన్మించాడు త్యాగరాజ జనన సంవత్సరంగా ఇదే ప్రసిద్ధం కానీ కల్లూరి వీరభద్ర శాస్త్రిగారు 1783లో జన్మించినట్లు పేర్కొన్నారు [92] వారీవిధంగా దేనినాధారంగా గ్రహించి పేర్కొన్నారో తెలియదు తండ్రి రామబ్రహ్మం తంజావూరు ప్రభువు శరభోజీ ఆదరంలో ఉండేవాడు తాత గిరిరాజకవి మహావాగ్గేయకారుడు మాతా మహుడు వీణ కాళహస్తయ్య ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు తల్లి పురందర, రామదాసాదుల కీర్తనలను పాడుకొంటూ ఉండేది ఈ వాతావరణంలో త్యాగయ్యకు సంగీతం ఉగ్గుబాలతో అబ్బింది సంస్కృతాంధ్రాలలో పాండిత్యం గడించాడు శొంఠి వేంకటరమణయ్యవద్ద చేరి సంవత్సరంలోనే సంగీతంలో ప్రావీణ్యాన్ని సంపా దించాడు. రామకృష్ణానందస్వామి అనే సన్యాసి నారదోపాస్తి మంత్రాన్ని

త్యాగయ్య కుపదేశించాడు. నారదుడు యతివేషంలో వచ్చి స్వరార్ణవమనే సంగీత గ్రంథాన్నిచ్చి సమస్త సందేహాలు తీరిపోతాయని ఆశీర్వదించి వెళ్ళిపోయాడట. తన గురువైన నారదుని అనేకవిధాలా కీర్తనల్లో స్తుతించాడు. రామకృష్ణానందస్వామి ఆదేశానుసారం 96 కోట్లు రామతారకమంత్ర పఠనంలో 38వ యేట శ్రీరాముడు సలక్ష్మణుడై దర్శనమిచ్చాడట. ఆ సందర్భంలో చెప్పిన కీర్తనే అఠాణారాగంలోని "ఏలనిదయరాదు పరాకుజేసేవేల" అన్నది. అనేక పర్యాయాలు సైతం రాముని దర్శించినట్లు అనేక కృతులు సాక్ష్యమిస్తున్నాయి. అలాంటివాటిలో "అలకలల్లలాడగగని ఆ రాజ్యమ్మని యెటుపొంగెనో" అనే కృతి చక్కటిఉదాహరణ.

త్యాగయ్యకు పద్దెనిమిదోయేట పార్వతమ్మతో వివాహమైంది. ఆ వెనుక తండ్రి రెండేండ్లకు మరణించాడు. ఆ పిమ్మట ఐందేడ్లకు మొదటిభార్య గతించగా, ఆమె చెల్లెలు కమలాంబనిచ్చి త్యాగయ్యకు వివాహంచేశారు. జీవనోపాధికై నరుల నాశ్రయించలేదు. ఉంఛవృత్తితో జీవించేవాడు. అన్న జపేశయ్య కిది నచ్చేదికాదు. రాజాశ్రయానికి తమ్ముని మనస్సు మరల్చయత్నించి విఫలుడయ్యాడు. ఇల్లు విభజించి తమ్మునికి వాటా ఇచ్చివేశాడు మారుతాడన్న ఆశతో. ఇది తనకిష్టంలేదు. ఉంఛవృత్తి, నిత్యరామసంకీర్తనమే రాను ఆచరించేవి. ఆయనకీర్తి దేశమంతటా ఉత్తమవాగ్గేయకారుడిగా వ్యాపించింది. ఎంతో మంది ఆతనిచేత సంగీతసభ చేయించి సన్మానించ అభిలషించారు. తంజావూరు ప్రభువు రెండో శరభోజీ పలుకానుకలు పంపి ఆహ్వానించాడు. జపేశయ్య సంతోషించాడు. కానీ త్యాగయ్య తిరస్కరించాడు. "నిధి చాల సుఖమా రామునిసన్నిధిసేవ సుఖమా?" అంటూ ఆ సందర్భంలో పాడినకృతి మహాయోగి త్యాగరాజు. ఇదేరీతిగా తిరువాన్కూరు ప్రభువు స్వాతితిరునాళ్ళు ఆహ్వానించగా తిరస్కరించి "పదవి నీసద్భక్తియు గల్గుటే" అనే కృతిచెప్పాడు. విసిగిపోయిన జపేశయ్య త్యాగయ్య పూజించే పంచాయతన విగ్రహాల్ని కావేరిలో పారేశాడట. తెల్లవారుజామున త్యాగయ్య ఆ సంగతి తెలుసుకొని "ఎందుదాగినాడో" కృతిరచించి తన ఎదసొదను తెలిపాడట. తరువాత రాముడే కలలో కనిపించి చెప్పాడు. త్యాగయ్య కావేరినుంచి విగ్రహాల్ని తెచ్చుకొని పూజచేయ నారంభించాడు.

తిరువొత్తియూరు, కోవూరు, నాగాలాపురం, తిరుపతి, పుత్తూరు, కంచి, వాలాజపేట, శ్రీరంగం, నాగపట్టణం, ఘటికాచలం మొదలైన పుణ్యక్షేత్రాల్ని సందర్శించి ఆయాదేవతల ఉపముద్రతోటి కృతులు రచించాడు త్యాగయ్య.

త్యాగయ్యతో ధాతుకల్పన విశిష్టమై ప్రాధాన్యం వహించిందన్న అంశం పూర్వోక్తం ఈ విషయాన్ని సమువితంగా వివరించారు రజనికాంతరావుగారు "అన్నమాచార్యుల నాడు సంకీర్తనముగాను, ఆధ్యాత్మికపదంగానూ ప్రారంభించిన కీర్తన రామదాసు, నారాయణ తీర్థులూ, సుబ్రహ్మణ్యకవీ వంటి వాగ్గేయకారులచేత భజనకీర్తనగాను, ఆధ్యాత్మ కీర్తనలుగాను పరిణమించి, మార్గదర్శి శేషయ్యంగారు, మేరట్టూరు వీరభద్రయ్య గారల రచనలలో ధాతుకల్పనకు కొత్త మార్గాలవలంబించి, ఆ నూతన రూపంలో త్యాగరాజు నాటికి కృతి అనేపేరు వహించి, పరిపక్వత పొందింది కృతులు బయలుదేరు నాటికి రాగాల స్వరూపంలో కూడా వాల మార్పులు సంభవించాయి రాగస్వరూప దర్శనానికి త్యాగరాజ కృతులు దర్పణము వంటివి

"సాహిత్యంలోని అంతరార్థమును మరింత ప్రస్ఫుటం చేయడానికి రాగసంచారంలోని ప్రత్యేక ప్రయోగాలద్వారా రాగ భావాన్ని సాహిత్య భావంతో రంగరించి విస్తరించడానికి సంగతుల ప్రయోగం విరివిగా జరిగి త్యాగరాజు కృతులకు ప్రత్యేక స్వరూపాన్నిచ్చింది ఈ సంగతుల విస్తరణనె ధాతుకల్పన దక్షతగాపేర్కొన్నాము"[93]

త్యాగరాజు కృతులవల్లనే దక్షిణభారతంలో అంతటా కర్ణాట సంగీతానికి అత్యంత ప్రాధాన్య ప్రాచుర్యాలు కలిగాయని చెప్పడంలో అత్యుక్తిలేదు కేవలం దక్షిణ భారతానికె కర్ణాటక సంగీతం పరిమితం కాలేదు యావద్భారత దేశంలోను, ప్రపంచంలోను ఎంతో ప్రసిద్ధి కెక్కింది

త్యాగరాజు కృతులకు త్యాగ బ్రహ్మోపనిషత్తు అనే ప్రసిద్ధి కలిగింది ఇతడు 2400 కృతులు రచించినట్లు తెలుస్తుంది అయినా ఈనాడు సుమారు 60 కృతులు మాత్రమే సంగీత స్వరరహితంగా ప్రచారంలో ఉన్నాయి త్యాగరాజు 72 మేళకర్త రాగాలలోను కృతులు రచించాడు అవన్నీ పూర్తిగా ఈనాడు లభించక పోవడం మన దురదృష్టం ఇతని ఘనరాగ పంచరత్న కృతులు "జగదానంద కారక జయ జానకీ ప్రాణనాయక (నాట-ఆది), దుడుకుగలనన్నే దొరకొడుకు బ్రోచురా (గౌళ-ఆది), సాధించెనె ఓ మనసా (ఆరభి-ఆది) కనకనరుచిరా కనక వసన నిన్ను (వరాళి-ఆది), ఎందరో మహానుభావులందరికి వందనములు (శ్రీ-ఆది) ఇవి ప్రసిద్ధమైన కృతులు "ఈ పంచరత్న కీర్తనలందు భాష, శైలి జటిలంగా ఉంటుంది వీటిని గానంచేసేటప్పుడు అనేకములైన సంగతులతో విస్తరించి విశాలైన

విద్వాంసులు పాడటానికి యోగ్యములై ఉంటాయి  గాయకుని ఉత్సాహభావొద్రేక ములు వెల్లివిరియించే అర్థ గాంభీర్యమూ, రసస్ఫురణా విటిలో ఉన్నవి విటిలో కొన్నింటిలో తేట నీటి గోదావరి వంటి జాను తెనుగు కవితా, యమక, అను ప్రాసాది శబ్దాలంకార మాధుర్యముతో ఆడిఉంటాయి  వీటిని సాభితానముగా వైదిక గాయక సంప్రదాయాలతో పాడవలెను" 94

త్యాగయ్య ఈ కృతులే గాక ప్రహ్లాద భక్తవిజయము, నౌకాచరిత్రము, సీతా రామ విజయము అనె మూడు సంగీత రూపకాలను కూడా రచించాడు  వీటిని ప్రబం ధాలని వ్యవహరిస్తారు  ఇవి నృత్య నాటికలు

1847లో త్యాగరాజు సిద్ధిపొందాడు స్వప్న ప్రబోధితుడై తాను దివ్యధామం చేరే దినం సైతం గుర్తించాడు త్యాగయ్య అది త్యాగయ్య యోగమహత్వానికి నిదర్శనం  ఆనాటి నుంచి అతని సమాధి వద్ద ఆరాధనోత్సవాలు సంగీత వేత్తలు క్రమం తప్పక జరుపుతూ ఘనరాగ పంచరత్న కీర్తనలు ఆలపిస్తూ తమ భక్తి ప్రపత్తుల్ని ప్రకటిస్తూ ఉంటారు

శ్యామశాస్త్రిలు(1762-1827), ముత్తుస్వామి దీక్షితులు(1776-1835)త్యాగ రాజంతటి మహా వాగ్గేయకారులు త్యాగరాజు సమకాలికులు  ఈ ముగ్గురికి కర్ణాటక సంగీత ప్రపంచంలో సంగీత త్రిమూర్తులనీ, సంగీత త్రయమని ప్రసిద్ధి త్యాగరాజు శిష్యులు అనేకులు  వీరిని వాగ్గేయకారులు, సభాగాయకులు, ఇతరులని మూడు వర్గాలుగా విభజించవచ్చుననీ, అందులో ముఖ్యులు వాలాజపేట వేంకటరమణయ్య ప్రభృతులని రజనీకాంతరావుగారు వివరించారు.[95]

అయినా త్యాగరాజు చుక్కల్లో చంద్రునిలా మహావాగ్గేయకార చక్రవర్తిగా వెలుగొందుతున్నాడు  తెలుగు ప్రముఖ వాగ్గేయకారుల్లో ప్రధాన వాగ్గేయకారుడు త్యాగరాజు

# సూ చి క లు


| | | |
|---|---|---|
| 1. | చిన తిరువేంగళనాథుడు, తాళ్ళ పాక (చిన్నన్న) | అన్నమాచార్యుల జీవిత చరిత్రము పు 9 |
| 2 | ప్రభాకరశాస్త్రి, వేటూరి | పీఠిక - అన్నమాచార్యుల జీవిత చరిత్రము పు. 2, 3 |
| 3 | ఆనందమూర్తి, వేటూరి | తాళ్ళపాక కవుల కృతులు - వివిధ సాహితీ ప్రక్రియలు - పు 60 - 65 |
| 4 | రామసుబ్బశర్మ, గౌరి పెద్ది(సం) | శృంగార సంకీర్తనములు సం. 12 పీఠిక పు 6-8 |
| 5 | ,, ,, | తృతీయ ముద్రణ పరిష్కర్త తాళ్ళపాక అన్నమాచార్యుల జీవితచరిత్రము-వివేకదీపిక పు 18 - 20 |
| 6 | శ్రీనివాసులు, కామిశెట్టి | ఉపోద్ఘాతము డా॥ ముట్నూరి సంగమేశం గారి అన్నమాచార్య సాహితీ కౌముది- పు 7,8 |
| 7 | ప్రమీలాదేవి, మంగళగిరి | అన్నమాచార్య సంకీర్తనలు - జానపద గేయ సంగీతచ్ఛందో రీతులు (అముద్రితం) |
| 8 | పై 1వ సూచికలోనిదే పు 44, 45 | |
| 9 | ఆనందమూర్తి, వేటూరి | తాళ్ళపాక కవుల పదకవితలు- భాషాప్రయోగ విశేషాలు - అధో జ్ఞాపిక పు 44 |
| 10. | పైదే పు 44, 45 | |
| 11 | M V Krishna Rao | Purandara and Haridasa Movement 67. |
| 12 | పైదే. పు. 66 | |
| 13 | శ్రీహరిహరప్రియ | కన్నడ తెలుగు సాహిత్య వినిమయ పు. 47 |
| 14 | పై 11వ సూచికలోనిదే. పు 114 | |

15 వివరాలకు నావ్యాసం అన్నమాచార్య పురందరదాసుల సమాగమం అన్వేషణ(నాగార్జున విశ్వవిద్యాలయం, తెలుగు విభాగం పరిశోధన పత్రిక) 1984 పు. 30-40

16 పై 2వ సూచికలోనిదే పు 122

17 రజనీకాంతరావు, బాలాంత్రపు ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము పు 112, 113

18 పైదే పు 120

19. పైదే. పు· 83

20. i) పైదే పు. 84

ii) Prof P Samba murthy Great Composers - Book I-p. 16

21 A B Keith Classical Sanskrit Literature p. 103

22 Y. Venkata KrishnaRao . A Hand Book of Classical Sanskrit Literature p 132

23 డా॥ వైద్యుల కృష్ణారావు శ్రీ జయదేవుని గీతగోవిందము ఆంధ్రీకరణములు పు 19

24. పైదే పు 21,

25 పై 20 ii), 21, 22, 23 సూచికల్లోనివే

26 పై 23వ సూచికలోనిదే పు 13, 14

27 పై 17వ సూచికలోనిదే పు. 84, 85

28 పై 23వ సూచికలోనిదే పు 14

29 జయదేవుడు , గీత గోవిందము సర్గ 12 , శ్లో. 11

30 పైదే సర్గ, శ్లో 2

31 పై 17వ సూచికలోనిదే పు 87, 88

32 పైదే పు 93

33 పైదే పు 93 - 98

34. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ పరిచయ వాక్యాలు - ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము పు 13

34 A మానవల్లి రామకృష్ణ కవి పుష్పాంజలి - శ్రీకృష్ణ లీలాశుకకవి . ఆంధ్ర పత్రిక-స్వర్ణోత్సవ సంచిక 1965 పు 130

35 పై 17వ సూచికలోనిదే పు 100, 101, 103

36. పైదే పు 163, 164

37 పైదే పు 165, 166

38 Prof P Samba Murthy Great composers-Book-1 P 36

39. పై 17వ సూచికలోనిదే పు 168, 169

40 పైదే పు 162.

41 పైదే పు 181

42 P Y Deshpande Jnanadeva - p 18.

43. పైదే పు 19

44 Kusmavathi Deshpande Marathi Sahitya - p 15

45 పై 42వ సూచికలోనిదే పు 75

46 Saint Namadev - Indian Express 30-8-'87 to 3-9-'87

47 పై 42వ సూచికలోనిదే. పు 74

48 తెలుగు విజ్ఞాన సర్వస్వము - తెలుగు సంస్కృతి సం 4 పు 1066-1068

49. P Seshadri Ayyar Sri Chaitanya and his Sikshashtaka Prof K V Rangaswami Commemoration Voheme 1940 Pp 579-581

50 Edward C Dimock Jr and Demise Levertov with Introduction & Notes by Edward C Dimock Jr Gnrl Ed Nathaniel Tarn In Praise of Krishna Songs from the Bengali - 1968, p 13

51 The Blind poet of Agra Indian Express 20-6-1983

52 i) పై 3వ సూచికలోనిదే - పు 213-264

ii) ఆనందమూర్తి, వేటూరి వైష్ణవాంధ్ర వాఙ్మయము- పు 34, 35

iii) శ్రీ రామానుజ దాసుడు దివ్య సూరి కథాసారము - గోదాగ్రంథమాల 1985.

53 ధనకుధరం వరదాచార్యులు ఆళ్వారుల దివ్యప్రబంధములు పు 73-97

54. పైదే పు 62, 63

55 గడియారం రామకృష్ణశర్మ కన్నడ సాహిత్య చరిత్ర - దక్షిణ భారత సాహిత్య చరిత్ర పు 94

56 i) పై 17వ సూచికలోనిదే పు 141

ii) Dr V Raghavan The Great Integrators - The Saint Singers of India p 25

iii) వి సీతారామయ్య పురందరదాసరు పు 56

57 నా 'పురందరదాసు' - (తి తి దే ప్రచురణ) పు 2-5

58 పై 56 ii) లోనిదే పు 25.

59. i) కనకదాసర పదగళు - పదగళు, చరిత్రె కనకదాసర జీవన చరిత్రె - పు 1

ii) వ్యాసరాయ హాడుగళు కెలవు మహత్వద దాసర వివర పు 17

60 పై 17వ సూచికలోనిదే పు 99

61 ఆనందమూర్తి, వేటూరి తొలి సంకీర్తనకవులు పు 14, 15

62 కులశేఖరరావు, ఎమ్ సంపాదకుడు, పరిష్కర్త, సింహగిరి వచనములు-ఉపోద్ఘాతము పు viii

63 పైదే పు viii, xiv.

64 పై 61వ సూచికలోనిదే పు 15

65. పైదే పు 19

66. The Minor works of Tallapakam poets — చిన తిరుమలాచార్యుడు సంకీర్తన లక్షణము పద్యాలు 54, 55 పు 147

67 పై 9వ సూచికలోనిదే పు 21

68 పై 62వ సూచికలోనిదే - వచనం 11 పు 9

69. పైదే పు xxvi

70 పై 2వ సూచికలోనిదే - పు 65

71 పెదతిరుమలాచార్యులు — శృంగార సంకీర్తనలు సం 23. పు 1

72 పై 17వ సూచికలోనిదే పు. 125

73 i) పైదే పు 126.

ii) పై 9వ సూచికలోనిదే పు 113 - 119

74 విద్వాన్ అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులు(పరిష్కర్త) సంపుటము 16 — తాళ్ళపాక చినతిరుమలాచార్య విరచితములు అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు - పీఠిక పు 11 - 13

75 పైదే పు. 25, 26

76 i) పై 3వ సూచికలోనిదే పు 121

ii) పై 74వ సూచికలోనిదే పు 25 - 30

77 వివరాలకు నా గ్రంథం — "క్షేత్రయ్య పదసాహిత్యం" పు 41, 42

78 రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ — పదములు-క్షేత్రయ్య ఆంధ్రపత్రిక - చిత్రభాను సంవత్సరాది సంచిక (1942 - 43) పు 12

79 పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు — భక్తకవిపుంగవులు-శ్రీభక్తరామదాసు పు 165

80 పై 17వ సూచికలోనిదే పు 200-203

81 వివరాలకు నా గ్రంథం "సారంగపాణి పద సాహిత్యం" పు 6 - 8

జీవిత రేఖలు

82. పై 17వ సూచికలోనిదే పు. 318
83 పైదే పు. 301
84. పైదే పు 240
85 జగన్నాధరావు, మంచాళ, (సంపాదకుడు) అధ్యాత్మరామాయణ కీర్తనలు - మునిపల్లె సుబ్రహ్మణ్య కవి విరచితము - స్వరయుక్తములు - ఆంధ్ర పరిషత్తు, రాజమహేంద్రవరము 1962.
86 ప్రమీలాదేవి, మంగళగిరి భారతీకళాతరంగిణి - పు 36,37
87 పై 17వ సూచికలోనిదే పు 240
88 పైదే పు 247-249
89 పైదే పు 249
90 పైదే పు 252
91 పై 85వ సూచికలోనిదే
92 శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రి త్యాగరాజస్వామి చరిత్ర - త్యాగరాజ కీర్తనలు - విశేష వివరణము (ప్రథమ సంపుటము)-పు XIV
93 పై 17వ సూచికలోనిదే పు 328, 329
94. పైదే. పు. 330
95 పైదే. పు 341-343.



# 2.0 శృంగారం, భక్తి, మధురభక్తి : అన్నమాచార్యులు

భూమికలో పదం, వాగ్గేయకార నిర్వచనాలు, వాటి విశిష్టతలు తెలుసుకొన్నాము. ప్రథమప్రకరణంలో అన్నమాచార్యుడు ఉత్తమ సంకీర్తనలు వేలలో రచించి పద కవితా పితామహుడని, సంకీర్తనాచార్యుడని ప్రసిద్ధి పొందిన విషయం పరిపూర్ణంగా గ్రహించాము అలాగే తరువాతి ప్రకరణాలలో చర్చకోసం సంస్కృతం, ఔత్తరాహ భాషలు, దాక్షిణాత్యభాషలలోని పదకారులను, తెలుగులో ప్రముఖ వాగ్గేయకారులను గూర్చి సంపూర్ణంగా విశదం చేసుకొన్నాము

ప్రస్తుతం శృంగారం, భక్తి, మధురభక్తులను గూర్చి తెలుసుకొని, అన్నమాచార్యుల సంకీర్తనల్లోని శృంగారం, భక్తి, మధుర భక్తులను గుర్తించి, సంస్కృత, ఔత్తరాహ, దాక్షిణాత్య పదకవులతో తరువాతి భాగంలో సరిపోల్చి చూడడం ప్రముఖాంశం

## 2.1 శృంగారం - అన్నమాచార్యులు

మొదట శృంగారరస నిర్వచన లక్షణాల్ని గ్రహించి అన్నమాచార్యులు తన పదాల్లో ఈ శృంగారాన్ని ఎలా పరిపోషించాడో పరిశీలిద్దాం ఆ వెనుక తదితర పద కర్తల్లో ఎలా పోషితమైందో పరిశీలించిచూద్దాము

కావ్య ప్రయోజనం రసానందదాయకమేననీ, అది తొమ్మిది విధాలనీ, ఆ నవరసాల్లో రసరాజం శృంగారమనీ లాక్షణికుల మతం సర్వప్రాణికోటికి అనంతానందాపాది శృంగారమన్న విషయం విదితమే

రస నిష్పత్తిని గూర్చి భరతమహర్షి, ధనంజయాదులు వర్ణించిన వైనం గమనింపదగ్గది "విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః"[1] అని అతి ప్రాచీనలాక్షణికుడైన భరతముని రససూత్రం అంటే విభావానుభావ వ్యభిచారి భావాల సంయోగంవల్ల రసనిష్పత్తి జరుగుతుందని అర్థం

"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయిభావో రసస్స్మృతః"[2]

అని దశరూపక కర్త ధనంజయుని నిర్వచనం. అంటే విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావాలచేత ఆస్వాద్యమానమైన స్థాయి భావమే రసమని అర్థం. స్థాయి అంటే స్థిరంగా ఉండేది. స్థాయి భావం అంటే రసస్ఫూర్తిపరకు సహృదయ హృదయాల్లో నిలిచిఉండేది. కావ్య పఠనం వల్లనైతేనేమి, దృశ్యకావ్య దర్శనం వల్లనైతేనేమి, సహృదయ హృదయాల్లో ఉత్పన్నమయ్యే ఆనందమే రసం.

పూర్వోక్తమైనట్లు నవరసాల్లో రసరాట్టు శృంగార రసం. నాయికా నాయకుల హృదయాల్లో కలిగే సంభోగ సంబంధమైన కామం అంటే అభిలాషను రతి అంటారు. స్త్రీ పురుషులు అన్యోన్యాలంబనంగల ప్రేమాఖ్యమైన చిత్తవృత్తి విశేషం రతి అని రస గంగాధరంలో జగన్నాథ పండితరాయల అభిప్రాయం. ఈ రతి అంకుర, పల్లవ, కళికా, ప్రసూన, ఫల, భోగావస్థలలో ప్రేమ, మాన, ప్రణయ, స్నేహ, రాగ, అనురాగాలనే పేర్లతో పేర్కొనబడుతుంది. ఈ ఆరవస్థలలో మొదటి అయిదు పూర్వరాగంలోను, ఆరవదైన భోగం సంభోగంలోను కలుగు తాయి. ఈ శృంగార రసం - సంభోగ శృంగారం, విప్రలంభ శృంగారం అని రెండు విధాలు. సంభోగ శృంగారం కేవల సురతయాపంలోనే గాక, దర్శన, స్పర్శన, ఆలింగన, చుంబనాదులైన అనేక విధాలుగా ఉన్నా, వీటన్నిటిని కలిపి సంభోగ శృంగారంగానే పరిగణించారు. విప్రలంభమంటే వియోగం. ఇది అభిలాష (అయోగ లేక పూర్వరాగ) విప్రలంభం, మాన (ఈర్ష్యా) విప్రలంభం, విరహ విప్రలంభం, ప్రవాస విప్రలంభం అని నాల్గువిధాలు. మాన విప్రలంభం - ప్రణయ మానమూ, ఈర్ష్యా మానమూ అని రెండువిధాలు. ఇలాగా శృంగారమెన్నో విధాలుగా పరివ్యాప్తమై ఉంది.

తెలుగులో వెలసిన పదకవితల్లో శృంగారమే ప్రాముఖ్యం వహించింది. పద కవితల్లోనేకాదు తెలుగు సాహిత్యంలోనే శృంగార ప్రాధాన్యముంది. దీనికి కారణాలు రాళ్ళపల్లి వారిలా వివరించారు. "కన్నడమున ఈ వాఙ్మయము భక్తి మత ప్రధానముగా వెలసినది. తెలుగులో ఇది శృంగార మయముగా విజృంభించినది. కన్న

మున శృంగార పదములును, తెలుఁగుని భక్తి పదములును చాల అరుదని చెప్పునంత గౌణస్థితికి ఆ రెండు రసములు దిగినవి ఈ వింతకు నిజమైన హేతువేమో చెప్ప లేను ఒక ఊహ సాహసించి చేసెదను కన్నడ వాఙ్మయమున అంతకు చాల ఏండ్ల క్రిందనే శైవవైష్ణవ మతప్రచారకులు రాజాశ్రయము నాశించక సామాన్య జనోద్బోధకమునకై సాహిత్యమును సృజించిరి తెలుగు వాఙ్మయమన్ననో మొదటి నుండియు రాజుల పెట్టు పోఁతలచేతనే బ్రతికి పైబడినది తెలుగుదేశమున రాజుల సంఖ్యయు ఎక్కువ రాజులు సహజముగా రసికులు రమణీ కుసుమాయుధులు అందును తెలుఁగురాజులు శౌర్యమును పొగడించుకొను నప్పుడు కూడ, శత్రురాజులు స్త్రీలని, తాము పురుషులని చాటించుకొని తృప్తిపడినవారు 'రాయవేశ్యా భుజం గులు' కాని రాజులు తెలుఁగులో పలువురులేరు కాబట్టి వారి యాజ్ఞచే, ప్రోత్సాహ ముచే పుట్టిన రచనలలో శృంగారము నిండియుండుట వింతకాదు మఱియు భగవ త్ప్రేమే భక్తుని శృంగారముగామారుట అనేక మతములలోఁగల సహజ పరిణామము మఱి దానికి రాజసన్మానము గూడ లభించెనేని అడుగవలయునా? కావున తెలుగున పదములలో పేరు దైవభక్తియైనను పదార్థము మనుష్య శృంగారమేయైనది"[3] కాని రాజుల నాశ్రయించిన కవులు ఆ రాజుల అభీష్టానుసారమే శృంగార రసపోషణాత్మ కంగా తెలుగులో కవితలల్లిన మాట వాస్తవం అయితే రాజాశ్రయం కోరని కవులు భక్తి పురస్సరంగానే కావ్యరచన చేసినట్లు స్పష్టం అయితే అలాంటి కవులసంఖ్య తక్కువనే చెప్పవలసి ఉంది శైవమతాధిక్యాన్ని ప్రచారం చేయదలచిన శివకవులు, తదుచితంగా శైవభక్తి పారమ్యంగా రచన చేశారు పోతన రామభక్తుడై భాగవత భక్తిని సకల హృదయ రంజకంగా రచించి తరించాడు స్వయం రాజైన శ్రీ కృష్ణ దేవరాయలు పెరియాళ్వారు, ఆండాళ్ చరిత్రను తీసుకొని గోదా శ్రీరంగేశుల ప్రణ యాన్ని ఆముక్తమాల్యదలో మనోహరంగా వర్ణించాడు పదకర్తలలో ఒకరిద్దరు తప్ప రాజాశ్రయాన్ని ధిక్కరించిన వారే ఎక్కువ ప్రప్రథమంగా పేర్కొదగ్గ కృష్ణమాచార్యులు కేవల భక్తి పూర్వకంగానే సింహగిరి వచనాలు రచించిన భక్తా గ్రేసరుడు అన్నమాచార్యుడు రచించిన అధ్యాత్మ శృంగార సంకీర్తనలలో శృంగార సంకీర్తనలే అధికం సాళువ నరసింహరాయలను ధిక్కరించిన మహాభక్తుడు అలాగే రామదాసు, అంతకంటే త్యాగరాజు క్షేత్రయ్య,సారంగపాణి రాజాశ్రయంలో శృంగార పదరచనచేశారు కానీ ఇవి సైతం మధురభక్తి ప్రపూరిత పదాలు కాబట్టి భక్తి వీట న్నిటా ముఖ్యమైందని తెలుస్తుంది క్షేత్రయ్యనుగూర్చి తెలిపిన సందర్భంలో రాళ్ళపల్లి

వారు "అతని రచనలలోని సారమంతా శృంగారమే మధురభక్తియని సగౌరవంగా మనం పేర్కొన్నా, అంతరార్థాలు పైకి తీసిచూపినా, దాని రూపురేఖలూ, సౌరభమూ శృంగారందే"[4] అని వివరించారు అయినా ఈ శృంగారమే మధురభక్తిమూలం తత్సంపూర్ణ స్వరూపాన్ని ఈ పదకవులందరిలోనూ చూడగలం కేవలభక్తి ప్రతిపాదక పదరచన చేసినారన్న కన్నడ పదకర్తల్లోను, తెలుగులోని రామదాసు, త్యాగరాజుల్లోను శృంగారం లేకపోలేదు పోతన భాగవత భక్తినే ప్రతిపాదించినా, అందులో శృంగారానికి చావులేకపోలేదు అయితే అది మానవ పరిధినిదాటి అలౌకికమైన భగవద్భక్తికి కారణమైన దేవతా శృంగార రూపమని స్పష్టమవుతుంది.

కేవల లౌకికశృంగారాన్నికాం భగవత్పరమైన శృంగారాన్ని తనపదాల్లో వర్ణించి తరించిన తొలితెలుగు వాగ్గేయకారుడు అన్నమాచార్యులు అన్నమాచార్యులు అధ్యాత్మ సంకీర్తనలు గూడా రచించినా, శృంగార సంకీర్తనల సంఖ్యే అధికమని పూర్వోక్తం అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరుల శృంగార వర్ణనా వైదగ్ధ్యంకలవి పదాలు అవి

'శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞాన సారంబులై
యతిలోకాగమవీధులై వివిధ మంత్రార్థములై నీతులై
కృతులై వేంకట శైల వల్లభ రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళ(య) (ఖల) పాకయన్నయవచో నూత్నక్రియల్ చెన్నగున్"[5]

అంటే పైని పేర్కొన్నట్లు అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు "వేంకట శైల వల్లభ రతిక్రీడా రహస్యంబులు" ఈ శృంగార పదాల్లో గ్రామ్యోక్తులుంత వచ్చునని 'సంకీర్తన లక్షణము'లోనె ఉంది

"పదములు శృంగార వధూ
మృదు మధుర మనోజ్ఞ వాక్య మిశ్రమములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగా (చొంక మెఱిగి పలుక(గజెల్లున్"[6]

ఈ లక్షణానుగుణంగానె పదరచన చేసిన మహావాగ్గేయకారుడు అన్నమాచార్యులు అతని శృంగార పదరచన అనేక రీతుల కొనసాగింది

"అమరుకకవేః ఏకః శ్లోకః ప్రబంధ శతాయతే" అని ప్రాచీన లాక్షణిక మతం అంటే శృంగార రససిద్ధి సంపాదనంలో అమరుక కావ్యంలోని ప్రతిశ్లోకమూ వంద ప్రబంధాలతో సమానమని ప్రాచీనాలంకారికులు విశ్వసించారు అదే రీతిగా తెలుగులోని శృంగారపదాలు ప్రతి పదం ఒక స్వయం సంపూర్ణమైన కావ్యం పైని పేర్కొన్నట్లు వంద ప్రబంధాలకు సాటి రాదగినది

"అన్నమయ్య శృంగార సంకీర్తనములు 'వేంకటశైల వల్లభరతి క్రీడా రహస్యముల' వెల్లడించునవి అవి పదసంజ్ఞదాల్చినవి అధ్యాత్మ సంబంధములగు సంకీర్తనములును పదరచనములే యయినప్పటికిని, శృంగార సంకీర్తనముల యావిర్భూతితో నవి పదసంజ్ఞను కోలుపోయి కేవల సంకీర్తన సంజ్ఞను మాత్రము తాల్చినవి. నాటినుండి పదసంజ్ఞ శృంగారసంకీర్తనముల యందు రూఢమయి పోయినది. భగవద్గుణ సంకీర్తనాత్మకములయిన పదరచనములకు సంకీర్తనములని, శృంగార సంకీర్తనములకు పదములని వ్యవహారము నాటినుండి యేర్పడినది ' 7

"ఏకోరసః కరుణఏవ" అని నిర్వచించి తల్లక్ష్యంగా ఉత్తరరామచరితనాటక రచనచేసి నిరూపించాడు భవభూతి అలాగే భోజదేవుడు "శృంగార ఏవఏకోరసః" అని ప్రగాఢంగా నమ్మి నిర్వచించాడు తదితరమైనవి భోజదేవుని దృష్టిలో రసాలేకావని తలంచవలసిఉంది అలాగే "శృంగారఏవ మధురః పరప్రహ్లాదనోరసః"— అని ధ్వన్యాలోక నిర్వచనం స్వభావసిద్ధంగానే మానవహృదయం రాగమయం ఈ రాగం స్పష్టమై శృంగారంలో పర్యవసిస్తుంది ఇది భోజదేవుని అభిమతం తదితర రసాలు చరమావస్థలో మాత్రమే మనోహరమవుతుండగా శృంగారం ప్రారంభం నుంచి చివరిదాకా మధురమంజులమే లాక్షణికుల మతం ప్రకారం శృంగారరస స్థాయిభావం రతి రతికంటె ఇతర స్థాయిభావాలకు శృంగారానికున్నంత చురుకు, శుద్ధి లేవని చెప్పడం అత్యుక్తికాదు అందుకే శృంగారానికి శుచి అనీ, ఉజ్జ్వలమనీ పేర్లువచ్చాయి ఈ శృంగారం సృష్టిరహస్యాన్నే ఇముడ్చుకొంది అందువల్లనే అనాది నుంచి సర్వసాహిత్యోపాసకులూ ఈ శృంగారాన్ని ఆరాధించితరించారు. అదే రీతిగా అన్నమాచార్యులు శృంగార సంకీర్తనల్లో దివ్యశృంగారాన్ని వివిధరీతుల దర్శించి, వర్ణించి, తరించాడు క్రమంగా ఆరీతులను పరిశీలిద్దాము

అన్నమాచార్యుల పదాల్లో శ్రీవేంకటేశ్వరుడే నాయకుడు అలుమేల్మంగాదేవి నాయిక శ్రీ భూనీళాదులు అలుమేల్మంగకు సవతులు. అందుకే అలాంటి సందర్భా

అలో నాయకుడు దక్షిణ నాయకుడు అన్నమాచార్యుడే శృంగార సహకారిణి అవుతుంటాడు మరికొన్ని సందర్భాల్లో అన్నమాచార్యుడే నాయిక అదే మధురభక్తి. ఇది అనంతరం వివరించబడుతుంది శృంగారనాయిక విరహమనుభవించడమూ కలదు అలమేల్మంగా వేంకటేశ్వరుల దివ్యశృంగారంలో నాయిక అయిన అలమేల్మంగ యందు స్వామి రతిచిత్తం కలవాడు ఈ దివ్యనాయికా నాయకులు రతి స్థిరమైనది, దివ్యమైనది అది స్థాయికృతమవుతుంది భావాన్నుద్దీపింపజేసే ప్రతి పదంలోను పుష్కలంగాఉంది నాయకునకు నాయిక, నాయికకు నాయకుడు ఆలంబనం ఆయా నాయికల హావభావాది శృంగార విలాసాదులు అనుభావాలు. నాయికస్థాయి రతిసాగరంలో అసూయాదులు,శంకాదులు,ఉత్సాహాదులులీనమై అత్యంత శోభను చేకూరుస్తున్నాయి. ప్రియసందర్శన దులమూలాన విపశఅయిన నాయిక సాత్వికస్థితికి లోనవుతుంది విభావాదుల సంయోగంవల్ల రతిస్థాయి శృంగార రసమయి ప్రతి పదంలోను సహృదయ హృదయరంజకమై ఒప్పుతూంది

## నిర్మల ప్రణయం .

అన్నమాచార్యులు ఉదాత్తాన్విత భావస్ఫోరకమై నిర్మలప్రేమతోగూడిన శృంగారం వర్ణించాడు దీన్నే మనం అచ్ఛమైన (మలిన శృంగారం అనడం సముచితం నాయిక నాయకునితోనన్న మాటలు.

"వద్దు నన్నుఁజెనకకుర వాదేఁటికి
చద్దివేఁడికి నొలపుజంౌనలు మేలు ॥పల్లవి॥

వొలసి నొల్లముల పొందొనరించుకంటేను
అలవోకలైన పొలయలుక మేలు
కలసీకలయని మనసు కసగాటుకంటేను
తలఁపులో నడియానతమకమే మేలు ॥వద్దు॥

వచ్చిపెచ్చులకూర్మి పచరించు కంటేను
కొచ్చి వూరకయుండు గుట్టు మేలు
వచ్చియును రాములను వడిఁబొరలు కంటేను
మచ్చరము మాని మెయి మఱచుపే మేలు ॥వద్దు॥

తనిసియునుఁ దనివోని రతులకంటేను
కనుఁగొనుచుఁ జెలఁగు సంగతులే మేలు
యెనలేని శ్రీ వేంకటేశ యిన్నిటికంటే
నినుఁగలసియున్న నానేరుపే మేలు ॥వద్దు॥

(శృ సం 30-83)

ఇంత నిర్మలప్రణయం అన్నమాచార్యుని సంకీర్తనల్లో అనంతంగా ఉంది

## సంభోగ శృంగారం

అన్నమాచార్యుల దివ్య సంభోగ శృంగారాన్ని మధుర మంజులంగా, మనో రంజకంగా వర్ణించాడు

పలుకుఁదేనెల తల్లి పవళించెను ॥పల్లవి॥
కలికి తనముల విభుని గలసినదిగాన ॥అనుప॥

నిగనిగని మోముపై నెఱులు గెలఁకులఁ జెదర
పగలైనదాఁకఁ జెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారిన దాఁక
జగదేకపతిమనసు జట్టిగొనెఁగాన ॥పలుకు॥

కొంగుజారిన మెఱుఁగు గుబ్బ లొలయఁగఁదరుణి
బంగారు మేడపైఁ బవళించెను
చెంగలువ కనుఁగొనల సింగారములు దొలఁక
అంగజగురునితోడ నలసినదిగాన ॥పలుకు॥

మురిపెంపునటనతో ముత్యాల మలఁగుపై
పరవశంబునఁ దరుణి పవళించెను
తిరువేంకటచలాధిపుని కౌఁగిటఁగలసి
అరవిరై నునుఁజెమట నంటినదిగాన ॥పలుకు॥

(శృం. సం 4-74)

ఇలాగే మరో చక్కటి పదం—

"ఏమొకొ చిగురుటధరమున యెడనెడ గస్తురినిండెను
భామిని విభునకు వ్రాసినపత్రిక కాదుగదా ॥ఏమొకొ॥

కలికిచకోరాక్షికిఁ గడకన్నులు గెంపై తోఁచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువునఁ బ్రాణేశ్వరుపై నాఁటిన యాకొనచూపులు
నిలువునఁ బెరుకఁగ నంటిన నెత్తురు గాదుగదా ॥ఏమొకొ॥

పడఁతికి చనుఁగవ మెఱుఁగులు పైపైఁబయ్యెద వెలుపల
కడుమించిన విధమేమో కనుఁగొనరే చెలులు
ఉడుగని వేడుకతోఁ బ్రియుఁడొత్తిన నఖశశిరేఖలు
వెడలఁగ వేసవికాలపు వెన్నెల గాదుగదా ॥ఏమొకొ॥

ముద్దియ చెక్కుల కెలఁకుల ముత్యపుజల్లుల చేర్పుల
వొద్దికలాగులివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపుఁ జెమటల అందముగాదు గదా ॥ఏమొకొ॥

(శృం సం 12–82)

సాళువ నరసింగరాయల ఆస్థానంలో అతని ఆహ్వానంతో విచ్చేసిన అన్నమాచార్యుడు భగవత్పరమైన ఈ శృంగార సంకీర్తనను మధుర మంజులంగా పాడి వినిపించగా తనపై గూడా అలాంటి పద్యాలు పాడి అలరించమన్నాడు ఆభక్తుడు రాజుని ధిక్కరించి, రాజదండనకు గురియై, భక్తితోనే రాజును సైతం భక్తునిగా మార్చివేశాడు అలుమేల్మంగా వేంకటేశ్వరుల సురతక్రీడా విశేషాలిందు వర్ణితం

సంభోగ శృంగార మిలా నాయికానాయక పరస్పర దర్శన స్పర్శన, చుంబనాలింగ నాది రూపంలో ఉంటుంది అలాంటి శృంగారమందు చిత్రితం—

"లలిత లావణ్య విలాసముతోడ
నెలఁత ధన్యతగలిగె నేఁటితోడ ॥పల్లవి॥

కుప్పలుగా మైననలుకొన్న కస్తూరితోడ
తొప్పఁదో గేట చెమటతోడ
అప్పడటు శశిరేఖలైన చనుఁగవతోడ
దప్పిదేరేటి మోముదమ్మితోడ ॥లలిత॥

కులుకుఁగబరీభరము కుంతలంబులతోడ
రొలఁగఁదోయని ప్రేమతోడ
మొలకనవ్వులు దొలఁకుముద్దుఁ జూపులతోడ
పులకలు పొడమైన పొలుపుతోడ ॥లలిత॥

తిరువేంకటాచలాధిపుని మన్ననతోడ
సరిలేని దివ్యవాసనలతోడ
పరికించరాని అరవిరిభావముతోడ
సిరిదొలఁ(లం)కెడి చిన్ని సిగ్గుతోడ ॥లలిత॥

(శృం. సం 12—130)

ఈపదమెంతో ఔచితీసహమై అన్నమాచార్యుని ప్రతిభను ప్రకటిస్తూంది

## విప్రలంభ శృంగారం

మొదటే పేర్కొన్నట్లు నిర్మలప్రాయమే ఉన్నతమూ, పరిశుద్ధమూను, అయినదే విప్రలంభశృంగారం దీనికొక ప్రత్యేకతా, విశిష్టతా ఉన్నాయి "న వినా విప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే" అంటే విప్రలంభ విరహితంగా సంభోగ శృంగారంపుష్టిని పొందలేదని లాక్షణికమతం పైపెచ్చు ఈ విప్రలంభ శృంగారం సంయోగ శృంగారం కంటే ఉదాత్తమైంది. ఇందులో ఔచిత్యం అనంతం. అదే రీతిని అన్నమాచార్యుని ఉదాత్తసమన్విత విప్రలంభ శృంగారం చవిచూస్తే దాని విశిష్టత స్పష్టమవుతుంది

## అభిలాష లేక పూర్వరాగ విప్రలంభం :

నాయికకు నాయకునిపైగల పూర్వరాగంఅన్నమాచార్యులు కరుణరసాత్మకంగా వర్ణించి మనల్నిగూడా అందులో భాగస్వాములుగాచేసి సార్వజనీనం చేయడం ఎంతో రమణీయం

"మదము దొలఁకెడి యట్టి మంచి వయసున మనకు
తుదలేని వేడుకలు దొరకు టెన్నడురా ॥పల్లవి॥

ఉదుటుఁ జనుదోయి నీవురముపై ఁదనివార
నదిమి మోమును మోము నలమియలమి
వదలైన నీవితో వాలుఁగన్నుల జంకె
లొదవ నీ మీద నేనొరగు టెన్నఁడురా ॥మదము॥

కలికి తనమున నాదు కప్పురపుఁ దమ్ములము
కులికి నీ వదనమునఁ గుమ్మరించి
పలచనగు గోళ్ళ నీ పగడవాతెర నొక్కి
చెలువమగు నునుగంటి సేయు టెన్నఁడురా ॥మదము॥

గరగరని కురులతో కస్తూరి వాసనలు
విరితావులతోడ విసరఁగాను
తిరువేంకటాధిపుఁడ నినుఁ గూడి నే
నరమరచి సదమదము లౌట యెన్నడురా ॥మదము॥

(శృం. సం 12-54)

ఇందులోనాయిక కున్న ప్రగాఢానురాగాన్ని ఎంతో తీవ్రంగా ఉన్నట్లు స్పష్టం చేసింది ఇది పూర్వరాగం ఇలాగే మరో ఉదాహరణ

"దగ్గరగ రాదు మరి దగ్గరకుండఁగ రాదు
యెగ్గులాయ జవ్వనము యిఁక నేఁటికే ॥పల్లవి॥

చేరి వానిరూపు చూచి బిగి సంతోసించేనంటే
సారె నాకన్నుల నీరు సం(సా)గర మాయ
ఆరయవానితో మాటలాడి చొక్కేనంటేను
దూరే నా నవ్వులే నాకుఁదొడసాయనే ॥దగ్గరగ॥

మునప వానింటికేఁగి ముచ్చటఁ బాసేనంటే
నమువైన మరపుచే అడ్డమాయెనే
తనివోక వానిరీతి తలపోసి వుండేనంటే
కొనసాగి(గే?) కోరిక పై కొనరాయనే ॥దగ్గరగ॥

గక్కన వానిమేను కౌఁగిలించి పట్టేనంటే
పక్కన నాసిగ్గులు దెప్పరమాయెనే
ఇక్కువ శ్రీ వేంకటేశు నిట్టె నేఁగూడితిని
దక్కిన వాని మన్నన తలకూడెనే ॥దగ్గరగ॥

(శృం సం 27-512)

ఇంకా ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా ఇవ్వవచ్చు

## విరహవిప్రలంభ శృంగారం .

సంభోగానంతరం నాయిక అనుభవించే విరహాగ్నికీలోనై ఎదేబాధ నాయకుని కలయికకై ఆశించే ప్రగాఢకాంక్ష కిది నిదర్శనమవుతుంది తెలుగు ప్రబంధాలన్నిటా ఇది అత్యంతంగా, విపులంగా వర్ణితమైన విషయం మనకు తెలిసిందే

చెలులు నాయికా విరహాన్ని నాయకునికి విపరించి చెబుతున్నారు. చెలిని ఆదరించుమని అర్థిస్తున్నారు.

"మాటలేల మనసుకు మనసేసాక్షి
యేఁటికిఁబరాకు నేసే వింతిఁ గానవయ్యా ॥పల్లవి॥

కామిని తాపమునకు (గప్పిన పయ్యెద సాక్షి
చేమిరి చింతకు చెక్కు చేయే సాక్షి
వాముల పూరుపులకు వాడిన మోవే సాక్షి
యేమరిపాటు విచ్చేసి ఇంతిఁ జూడవయ్యా ॥మాఁట॥

వడియుఁ గన్నీటికిని పత్రున గుబ్బలే సాక్షి
తడుపుఁ జెమటలకు తనువే సాక్షి
చిదుముడియలంతకు చెదరుఁ గురులే సాక్షి
యెడ సేయక విచ్చేసి ఇంతిఁగానవయ్యా ॥మాఁట॥

నీ కెదురు చూచుటకు నిట్టూ చూపులే సాక్షి
పైకొన్న యవస్థలకు పానుపులే సాక్షి
చేకొని శ్రీ వేంకటేశ చేరి కూడితి వింతట
యీకడ నిష్టే కరుణనింతిఁ జూడవయ్యా ॥మాఁట॥"

(శృం. సం 30 188)

ఇలాగే చెలులు నాయికా విరహాన్ని గూర్చి భయపడి తమలో తాము సంభాషించుకొని నాయకునకు విన్నవించాలనుకోవడం ఈ కింది పదంలో చూడవచ్చు

"ఇందుమీఁద సతిభావ మెట్లౌనో యేమౌనో
విందుగాఁ జెలువునికి విన్నవించరే ॥పల్లవి॥

కోవిలకూఁతకుఁగానే గుండె జల్లురని చెలి
పూవక పూచిన యట్టు పులకించె
మావినుండి యంతలోనే మదన భూతమునోఁకె
పోవులైన పుప్పొడినే పోయరే బడిమి ॥ఇందు॥

కోమలి చందురుఁడనే కొరవిదయ్యముఁ జూచి
దీమస మింతయు మాని దిగులందెను
తేమలైన వెన్నెలల దిమ్ముపట్టి నిలువున
మైమఱచె ఁగప్పురాన మంత్రించరే ॥ఇందు॥

ఇంతలో శ్రీవేంకటేశుఁ డిందుకు విచ్చేయఁగాను
చింతఁదీర మేనెల్లఁ జెమరించెను
వింతలైన రతులలో విరహపు సోఁకు వాసె
కంతు చిగురాకు రక్షగట్టరే యంగనకు ॥ఇందుకు॥

(శృం సం. 30-76)

ఇందులో కోవెలలు, మన్మథుడు, చంద్రుడు, వెన్నెల మొదలైనవన్నీ విరహాగ్నిని నాయికకు అధికం చేయగా, శైత్యోపచారాలు రక్షలు గట్టడం చేయుమని అంటున్నారు. ఇది ప్రబంధ రీతి

ఇలాగే పురుష విరహమూ వర్ణితం ఇదీ ప్రబంధాల వర్ణనకు ఏ విధంగానూ తీసిపోదు పైగా ఇది కొత్త అట !

"ఏమిసేతు నమ్మలాల యెందుకొను నాయకుఁడు
భూమిలోఁ జెప్పఁ గొత్త యీ పురుష విరహము ॥పల్లవి॥

తొయ్యలి రాకకుఁ బతి తొంగిచూడఁ బోతేను
దయ్యమువలెఁ జంద్రుఁడు తలచూపెను
చయ్యన నందు కతఁడు జడిసి తలవంచితే
నుయ్యివలెనే తోఁచె నూలుకొని మనసు ॥ఏమి॥

మగువ యెలుఁగు విన మతి నాలకించితేను
పగవాని వలెనే పల్కెఁ గోవిల
వెగటై యందు కతఁడు వినుబు మూసుకొంపే
మొగులు వలెనే కప్పె ముంచుక విరహము ॥ఏమి॥

నలినాక్షి రూపు మనసునఁ దలఁచఁబోతే
చిలుకుగాలమై తోఁచెను మరుఁడు
అలసె శ్రీవేంకటేశుఁడంతలోన సతిగూడె
నెలకొని కొండవలె నిలిచె సంతోసము ॥ఏమి॥

(శృం సం 24 157)

ఇందులో నాయకుని విరహం కొత్త అని చెప్పి, నాయకుడు నాయిక రాక కోసం తొంగి చూడబోతే చంద్రుడు దయ్యంలా, మనసు నూయిలాగా, కోవిల శత్రువై, మొగులులా విరహం కప్పడం మొదలై నవివర్ణితం

## ప్రవాస విప్రలంభ శృంగారం

నాయకుడు ఏదేని కార్యార్థమై దూరదేశమేగినప్పుడు నాయిక నాయకునికై అనుభవించే విరహమే ప్రవాస ప్రలంభం ఈ కింది పదంలో చెలులు నాయిక నుద్బోధిస్తూ అనునయించడం గమనించగలం.

"నీ విభుఁడు వచ్చు దాఁక నిచ్చలాన నుండే (డ) వే
వేవేలకును రేయి వేగించవేమే ॥పల్లవి॥

పూయకు కస్తూరి మేనఁ బొద్దుగూఁకెఁ జీఁకటంటా
నోయమ్మ చందురుఁ డుదయించెను (౧ని)
వాయల వెన్నెలదాఁకి చల్ల జంపు మెండలంటా
ఆ యెడ నీవు వేఁగఁగ నది చూడరేమే ॥నీవి॥

గందము పుయ్యకువే కలికి నీ కుచముచే
చందనపుఁ గొండలంటాఁ జల్లిగాలి
అందులో పూవు తావిదాఁకి అమ్మ మొనలంటెనంటా
మందమై మేను మరువఁగ మందులు దేలేమే ॥నీవి॥

పద్దేలే కుంకుమలు వసంతపుఁ జిగురంటా
నద్దితేఁ గోవిల భూతమని లోఁగేవు
నిద్దపు శ్రీవేంకటాద్రి నిలయుఁ డిట్టె కూడె
యిద్దరి మీ వలపులు యింకనెంచరేమే ॥నీవి॥

(శృం సం 13 285)

ఇంకా ఇలాంటి ఉదాహరణ లివ్వవచ్చు.

## ఈర్ష్యా విప్రలంభ శృంగారం :

ఈ ఈర్ష్యా విప్రలంభం ప్రణయమానమనీ, ఈర్ష్యా మానమనీ రెండువిధాలు ఈ రెండు రమణీయాలని ఆలంకారికుల మతం ఇందులో ప్రణయమానం

నాయక సంబంధమైన ప్రగాఢ ప్రణయం గలిగి ఉండి ఏదో ఒక కారణం వల్ల వైలయలకతో నున్న నాయకనుద్దేశించి నాయిక ఒనసయస్తూన్న మాటలు చిత్రితం —

"మైలవాసి మణుఁగాయ మాటలేలరా
వాలుఁజూలు బనులెల్లఁ జిక్కెనాయరా ॥పల్లవి॥

తొడిఁబడ నవ్వితిని తోడుత నే మొక్కితిని
చిడుముడి నీఁక నేమి చేసేవురా
ఆడరి నేఁదిట్టితిని అంతలోఁ బంతమిచ్చితి
వడిగాఁ బైపైనాతో వాదుచేలరా ॥మైల॥

కోపగించి చూచితిని గొబ్బన నే మెచ్చితిని
మాపుదాఁకా నింత జోలిమాట లేలరా
రేపకాడ నెడసితి మాపటంతఁ గూడితిని
యీపాటి వాసికిని యెగ్గులేలరా ॥మైల॥

మోవి గంటి సేసితి నామోవి తేనెలిచ్చితిని
దేవుఁడ శ్రీవేంకటేశ తెగువేలరా
భావమెల్లఁ గరఁగితి పక్కన మెప్పించితిని
చేవదేరెఁ బనులెల్ల జింత లేలరా ॥మైల॥

(శృం సం 28 511)

ఇలాగే ఈర్ష్యామానంగూడా చక్కగా వర్ణితం

"లంజ కాఁడవౌదువురా ॥పల్లవి॥

లంజకాఁడవౌదవు నీలాగు లెల్లఁ గానవచ్చె
ముంజేతఁ బెట్టిన సొమ్ముల కద్దమేలరా ॥అనుప॥

కొంకక యెవ్వతో కాని కోరి నీ బుజముమీఁద
కంకణాల చేయివేసి కౌఁగిలించఁబోలును
పంకలైన వత్తులెల్ల వడిఁగాన వచ్చెనింక
బొంక నేమిటికిరా నీ బూములెల్లఁ గంటిమి ॥లంజ॥

ఒద్దిక నెవ్వతో గాని వోరి నీవురము మీఁద
నిద్దరించఁ గంటమాల నీఁమ లొత్తినది
తిద్దిన జాణవుగాన తిరిగి తిరిగి మాతో
బద్ద నేఁటికిరా నేఁబచ్చి సేయఁజాలను ॥లంజ॥

వేడుకనెవ్వతో తిరువేంకటేశ్వర నిన్ను
కూడిన నీమేనితావి కొల్లవట్టుకొన్నది,
తోడనె నాకౌఁగిటిలో దొరకొంటివింక నిన్ను
నాడనేమిటికిరా నాయలపెల్లఁదీరెను ॥లంజ॥"

(శృం సం 12 84)

నాయకుడు ఇతరత్రా మరోనాయికతో సాగించిన శృంగార వ్యాపారంవల్ల వ్యక్తమవు తూన్న శృంగారచేష్టలనుచూసి కోపంతో నాయిక నాయకుని నిందిస్తూ పొలయలకను ప్రకటిస్తూంది ఇది ఎంతో రమణీయంగా ఉంది

అయితే ఇక్కడ 'లంజకాడ' పదప్రయోగం అంత ఔచితీసహంకాదని భావిస్తే సంకీర్తన లక్షణంలోని-

"పదములు శృంగారవధూ
మృదు మధుర మనోజ్ఞ వాక్యమిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ దొంకమెఱఁగి పలుకఁగఁజెల్లున్"[8]

అనే పద్యమే సమాధానం

**శృంగార సహకారిణులు .**

శృంగారంలో నాయికా నాయకులకు సహకరించేవారు సఖులు, దూతికలు

**సఖిహితబోధ**

నాయికకు హితబోధచేస్తూంది కిందిపదంలో సఖి ఎంతోచక్కగా-

"ప్రాణనాయకుఁడు వాఁడె ప్రాణేశ్వరివి నీవు
జాణవు నీవిన్నిటాను చలమేఁటికే ॥పల్లవి॥

పీడనాడవచ్చుఁగాని వెనకవేఁడుకోరాదు
కూడేరు మీకెపోదు కోపమింతేలే
నీడలు వేరైతేఁచు నిలువొక్కటేకాదా ॥ప్రాణ॥

అలుగఁగవచ్చుఁగాని అట్టె కిందుపడరాదు
కలసేరు మీకెపోదు కపటమేచే
పలుకులెన్నైనాఁ దోఁచు భావనొక్కటెకాదా
పులకలి వేడవంటా పొర్లనేఁటికే ॥ప్రాణ॥

తప్పులెంచవద్దుగాని తారుకాణించరాదు,
చెప్పుడు మీకేపోదు చెరివేఁటికే
అన్నఁడిదే శ్రీవేంకటాధిపుఁడు నిన్నుఁగూడె
కుప్పించి నవ్వేనంటా గోరఁ జించనేటికే ॥ప్రాణ॥"

(శృం. సం 28-41)

దూతీహితబోధ

ఇలాగే దూతి నాయిక పంపినదని నాయకునకు హితబోధచేసి తీసుకొనిరావడానికి ప్రయత్నించడం దూతీహితబోధ

"చెలి నన్నుఁ జెప్పుమని సిగ్గుతోడఁదానున్నది
తలకొని యాకెతో మంతనమాడవయ్యా ॥పల్లవి॥

కన్నుల చూపులనే కాంత నీ కారతులెత్తీ
మన్నించి రావయ్యాలోని మల్లసాలకు
చన్నులనే నిమ్మపండ్లు సారెకుఁగానుకలిచ్చీ
చెన్నుగా నందుకొందువు చేయిచాఁచవయ్యా ॥చెలి॥

వచ్చిచిగురాకు మోవిఁబళ్లెము నీకుఁబెట్టీ
ఇచ్చ విందారగింతువు ఇయ్యకోవయ్యా
ముచ్చటఁగరకమలముల నిన్నుఁబూజించీ
కొచ్చి కాఁగిటిలోనఁ జేకొనఁగదవయ్యా ॥చెలి॥

మొలకనవ్వులనే ముత్యాలసేసవెట్టీ
లలినాపె మోము చూచి లాలించవయ్యా
అలమేలుమంగ పతివైన శ్రీ వేంకటేశ్వర
కలసితివీకె నిట్టె కరుణించవయ్యా ॥చెలి॥"

(శృం సం 28-336)

ఇందులో కవితాత్మకంగా దూతికలు నాయకునకు నాయికని గూర్చి విన్నవించి వేడు కొన్నట్లు అన్నమాచార్యుడు రచించినట్లు స్పష్టం వాస్తవానికి ఇక్కడ ఈ దూతీ

సఖులు అన్నమాచార్యుడే అని కూడా మనం గమనించడం అవసరం లేకపోతే ఇంత హృదయంగమంగా, ఆత్మీయంగా రచన ఉండడానికి అవకాశంలేదు ఇది అన్నమాచార్య రచనాచాతుర్యంలో ఒక భాగమనీ, శృంగార రచనకు మనోజ్ఞరూప నిదర్శనమనీ గుర్తించవచ్చు

## చతుర్విధ శృంగారనాయికలు .

చతుర్విధనాయికలు హస్తిని, చిత్తిని, పద్మిని, శంఖిని అని శృంగారమంజరి అనే శృంగారలక్షణ గ్రంథం పేర్కొంది ఈనాలుగు జాతుల నాయకల్ని ప్రాచీ నాలంకారికులు పేర్కొనలేదు సంస్కృత సాహిత్యంలో కనిపించని ఈ నాయికా భేదాలను తెలుగు కన్నడ సాహిత్యాల్లోనే చూడగలం[9] అన్నమాచార్య లీ శృంగార శాస్త్రజ్ఞానం గలవాడు గనుకనే ఈ నాలుగు రీతుల నాయికలను ఒకే పదంలో వర్ణించి మనోజ్ఞం చేయడం గమనించగలం

"అన్నిజాతులుఁ దానెయైవున్నది
కన్నుల కలికి మాయగరచెనోయనఁగ ॥పల్లవి॥

కన్నె శంకిణిజాతిగాఁబోలు వీఁపునను
నన్నపుమదనాంకములు జడిగొన్నవి
వన్నెలుగ వలరాజు వలపు తలకెక్కించ
పన్నినటువంటి సోపానములో యనఁగా ॥అన్ని॥

తెలవ దలపోయ చిత్తిణిజాతి గాఁబోలు
నెఱులు విచ్చుచు వీధి నిలుచున్నది
నెఱతనము మరుఁడు తనునిండనేసిన యంప
గరులిన్నియనుచు లెక్కలు వెట్టుగతిని ॥అన్ని॥

కాంత హస్తిణిజాతి గాఁబోలు కరమూలము
లంతకంతకు నలుపులైయున్నవి
పంతంపు మరుఁడు తన భండార మిండ్లకును
దొంతిగా నిడిన కస్తురి ముద్రలనఁగా ॥అన్ని॥

ఘనత పద్మిణిజాతి గాఁబోలు నీ లలన
తనువెల్ల పద్మ గంధంబైనది
మినుకుగా మరుఁడు తామెర లమ్ములనె మేను
కనలించి వడిఁ బువ్వుగట్టెనో యనఁగా ॥అన్ని॥

ఇదియు జగదేక మోహిణి దానె కాఁబోలు
కదలు కనుఁగవకెంపు గలిగున్నది
వదలకిటు వేంకటేశ్వరుని కుంకుమపూఁత
చెదరి చెలికనుఁగొనలఁ జిందెనోయనఁగా ॥అన్ని॥"

(శృం సం. 12-123

చివరి చరణంలోని 'మోహిణి'ని చతుర్విధ నాయికలతో ఐదో నాయికగా గూఁ
అన్నమాచార్యులు చేర్చారేమోనన్న సందేహం ప్రకటించారు, డా॥ ఆనందమూ
గారు [10] కానీ అన్నమాచార్యులు ఉద్దేశించలేదనిపిస్తుంది, పల్లవిలో అన్ని జాతుల
స్వభావం గలిగిన నాయికా చతుర్విధరీతుల్ని తెలిపి చివరికి, ఆ నాయికనే 'జగదే
మోహిణి'గా బోలునని చెప్పాడు కాబట్టి నాయికా సౌందర్య వర్ణనకే ఈ పదం
ప్రయుక్తమంటే తప్పులేదని భావిస్తున్నాను.

శృంగార నాయకుడు శ్రీ వేంకటేశ్వరుడు, నాయిక అలమేల్మంగ అన్నమా
చార్యుడు వర్ణించిన ఈదివ్య శృంగారం ఇందులో త్రివిధ నాయికలు స్వీయా,
అన్యా, పరకీయా నాయికలలో స్వీయనాయికకే ప్రాధాన్యం ఇందుకెన్ని ఉదాహరణ
లైనా ఇవ్వవచ్చు మచ్చుకు ఒక ఉదాహరణ

## స్వీయా - దివ్యా - శృంగారనాయిక

"ఏమి సేతునయ్యా నీవు యింతటి నాయకుండవు
మోముచూచి తొలినీకు మోహించిన దానను ॥పల్లవి॥

వలపించవలె నొండె వశముగాకుండితేను
చెలరేగి ప్రియమైనం జెప్పవలెను
పిలువనంపంగవలె బిగిసి రాకుండితేను
కొలువుకు వచ్చి కొంత కొసరగావలెను ॥ఏమి॥

మెప్పించుకోవలె నొండె మించి కరగకుండితే
వుప్పతించ నోర్పుతోడ నుండవలెను
చిప్పిలఁబెనగంగ చేతికి లోగాకుండితే
చెప్పి నట్టివాడిగాలు సేయంగవలెను ॥ఏమి॥

పంచుకొనవలె నొండె నవమానమున నుంటె
కొంచక పంతములిచ్చి కూడవలెను
యెంచంగ శ్రీ వేంకటేశ యేనలమేల్మంగను
పొంచి నన్నేలితివి పొగడంగవలెను ॥ఏమి॥"

(శృం సం. 3–188)

ఇలాగా ఎంతో దివ్యాతిదివ్యంగా వర్ణించాడు స్వీయనాయికా శృంగారాన్ని అన్నమాచార్యుడు

## పరకీయా శృంగారనాయిక

అంతటా స్వీయా శృంగారమే వర్ణితమైనా, పరకీయా శృంగారం వర్ణితం-ఒక ఉదాహరణ

"కొండలోఁ గోవిల గుయ్యగుండె వగిలె నీ
యండకురాఁగాఁ బ్రాణమంతలో బ్రదికెరా ॥పల్లవి॥

వలచి నిన్ను వెదకి వడి నేరాఁగాను
పులివలె మగఁడుండెఁ బోనియ్యక
తలఁచి నాకంతలోనే తల నొవ్వఁగాను
చిలుకుఁబలుక లెత్తి సిగ్గుమాలె వలపు ॥కొండ॥

ఏమరించి యింటివారి నెడసి నే రాఁగాను
గామైన బిడ్డ యేడ్చెఁగదలనీక
తామసించి యుండలేక తల్లడించఁగాను
చీమలు మైవాఁకినట్టు చిమ్మిరేఁగె వలపు ॥కొండ॥

పుండలేక యిప్పుడు నీ వొద్దికి నే రాఁగాను
కొండవలె మరదుండెఁ గోపగించుక
బొండుమల్లెపరపుపైఁ బొరవేటి యిట్టి నన్ను
కొండలరాయఁడ నిన్నుఁ గూడించె నా వలపు ॥కొండ॥

(శృం సం 12–324)

ఇలా మగనాలుగా పరకీయగా కనిపించినా పవిత్రమైన ప్రణయమూ, నిర్మలానురాగమూనని నాయిక చెబుతూంది అంతటి పవిత్రమైన వలపే శ్రీ వేంకటేశ్వరుని కలిపినదని వివరిస్తూంది నాయిక ఇలాంటి పదాలే తరువాత పదకర్తలైన క్షేత్రయ్యాదులకు పరకీయా శృంగార పద రచనకుపకరించాయి

అయితే అన్నమాచార్యుల పదాల్లో సామాన్య నాయికా శృంగారం కనిపించదు ఇది విశేషం

ఆలంకారికులు పేర్కొన్న అష్టవిధ నాయికలు అన్నమాచార్యుల పదాల్లో దర్శనమిస్తారు

## అష్టవిధ నాయికలు

వాసకసజ్జిక

"ఎప్పుడుగాని రాఁడో యెంతదడవాయ కాలి
చప్పుడాలకించి మతి జల్లు రనెనమ్మా" (శృం సం 12-46)

అభిసారిక

"కామించి నీవరుగఁగలయు నాయకుఁడు నేఁ
డేమి భాగ్యము సేసెనే తరుణి" (శృం సం 12-142)

ఖండిత

"దాని సాహసము మేలు తరువాత నీపు మేలు
పూనిన యారడికి నిన్నొడగట్టించినది" (శృం సం 16-97)

కలహాంతరిత

"ఎంతవాఁడవైన నిన్ను నింత సేసితి
ఖంతిని నాయపరాధా లెట్టోరిచేవయ్యా" (శృం సం. 17-565)

విరహోత్కంఠిత

"విన్నవించవే వోరమణి విభునికి వింతలింకనేలే
వున్నతిఁదన్ను నేనేమైన వంటినా వోరుమకొమ్మనవే"

(శృం సం 16-2)

స్వాధీనపతిక ·

"చెలులాల చూడరే యీ చెలిభాగ్యము
అలమేలుమంగ యీకె కబ్బెను యీభాగ్యము ॥పల్లవి॥

పతిదయ గలిగిన పడఁతి దీ భాగ్యము
అతఁడు మాట మీరనీదది భాగ్యము
సతతముఁ బాయక జంటై వుండేది భాగ్యము
అతివ లెందరుగల్గానది యేమిచెప్పేరే ॥చెలు॥

మగఁడు మన్నించినను మగువది భాగ్యము
నొగిసి యాతఁడు మోహించుట భాగ్యము
వెగటులేని రతుల వేనరనిది భాగ్యము
మగువల వలపులు మరియేమి చెప్పేరే ॥చెలు॥

శ్రీవేంకటేశుఁడేలె మచ్చిక నీసతిది భాగ్య
మావేళ నాతఁడు మెచ్చినది భాగ్యము
తావుకొని యెప్పుడూఁ దనవాఁడౌటే భాగ్యము
యేవనితల నేరుపు లిఁక నేమిచెప్పేరే ॥చెలు॥

(శృం సం 30-274)

విప్రలబ్ధ

"పొద్దిక నెన్నడు పొడచునో పోయినచెలి రాదాయను
నిద్దుర కంటికిఁదోఁచదు నిమిషం బొకయేఁడు' (శృం సం 12-138

ప్రోషితభర్తృక

"ఇదివో యింతట వరంబీవయ్యా
కదిసి ప్రత్యక్షంబుగావయ్యా చెలికి" (శృం సం 13-290

ఇలాగా వివిధ విధ నాయికలు ఆలంకారిక, లాక్షణికమతానుసారం రచితమై ఉండడం గమనించగలం ఇంకా ఎన్నోరకాలైన శృంగారాన్ని అన్నమాచార్యులు తన పదాల్లో చిత్రించి ఉండడం గమనించగలం

శృంగారం - సాత్వికభావాలు .

"మనసిజ సముద్ర మద(థ)న మిదె
కనుగొను మింతటఁగాంతుండ నీవు ॥పల్లవి॥

సతి చింతామతి జలనిధి తరువఁగ
అతిగరళపు విరహము వొడమె
తతి నా పిమ్మటఁ దమకపుఁగోర్కుల
లతల కల్పక పులాకలు వొడమె ॥మన॥

వొలతి తురిములఁ బొంగులు వొంగఁగ
పులకల తారలు వొడమె నవె
ఫలమై సాత్వికభావపుఁ జంద్రుఁడు
నిలువునఁ వొడమఁగ నేరుపులమరె ॥మన॥

సుదతి దానే నీ చొక్కపుఁ గాఁగిట
నదనున నిందిరమై వొడమె
కదిసిన శ్రీ వేంకటపతి నీదెన
యద(ధ)రామృత మ య్యతిశకుఁ బొడమె ॥మన॥

(శృం సం 30-52)

శ్రీ సహజస్వభావాలు .

"పుట్టఁగాఁబుట్టినవి వొలఁతులకీ గుణాలు
నెట్టన నీ వేలితేను నేస్తము లై యుందురు ॥పల్లవి॥

వున్నతి సవతికాంత లోకరొకదిఁ గంచేను
సన్నల నుప్పతింతురు సాదింతురు
విన్న కన్న వారితోడ వెంగెములాడుదురు
వన్ని పతిపైఁబెట్టి వంగింతురు ॥పుట్టఁగా॥

ముందరికి వచ్చితేను మాతలు గిరపుదురు
నిందింతురు వూరకే నెపాలెంతురు
అంది సింగారించుకొంటే నటుమోమై నవ్వుదురు
యెందు మేలు గలిగినా నీ సడింతురు ॥పుట్టగా॥

చక్కదనా లీడుచూసి సణగులు రాలుతురు
నిక్క చూతురు యెమ్మెలు నెరిపుదురు
పక్కన నలమేల్మంగపతి శ్రీ వేంకటేశుడ
ఇక్కడ నన్నేలినందు కీక మెచ్చుకొందురు ॥పుట్టగా॥

(శృం సం 29-104)

ఉత్తమనాయిక .

"ఉత్తమ నాయకురాలికోజ యిదియేకాదా
చిత్తగించి నీసేవ సేయించుకోవయ్యా ॥పల్లవి॥

యెల్లవారిలోనా నేరాలెంచగజాలక నిన్ను
చల్లని చూపులనే సాదించిని
పల్లదానఁ బెనగుతా బలిమి చూపజాలక
నొల్లనే కొసరుతా నిన్నొడి పట్టీని ॥ఉత్తమ॥

మనసు నాటగ నిన్ను మాటలాడజాలక
ననువుసేసుక నీతో నవ్వు నవ్వీని
చెనకుచు నిన్నుఁ గడుసిగ్గు పరచజాలక
మొనగోరు సోకకుండా మొక్కు మొక్కీని ॥ఉత్తమ॥

చలముల నీతోను సాదించజాలక
కలుపుకోలుఁ దనానఁ గాగిలించీని
చెలినేలితి విన్నిటా శ్రీవేంకటేశ్వర
సొలయఁ జాలక రతిఁ జొక్కించీని ॥ఉత్తమ॥

(శృం సం 28-518)

ఇలాగా అన్నమాచార్యులు పలువిధాలుగా శృంగార రహస్యాన్ని గుర్తించి, అలంకారిక, లాక్షణికుల మతాల్ని మననం చేసుకొని తదుచిత రీతిని అలమేలుమంగా శ్రీ వేంకటేశ్వరులనే నాయికా నాయకుల దివ్య శృంగార రీతులను, వివిధ విధ నాయికలను పరిపూర్ణంగా వర్ణించి తరించాడు తానే ఒక్కొక్కసారి నాయికగా, దూతిగా, సఖిగా అయి తన పదాల్లో భగవంతుని పై మరులుగొన్నట్లు చిత్రించుకొన్నాడు తద్వారా భక్తిని, అంతకంటే మధురభక్తిని ఆయా పదాల్లో ప్రకటించి ధన్యుడయ్యాడు

## 2 2 భక్తి, మధురభక్తి - అన్నమాచార్యులు .

అన్నమాచార్యుల ఆధ్యాత్మ సంకీర్తనల్లో భక్తి, శృంగార సంకీర్తనల్లో మధురభక్తి మధుర మంజులంగా మనకు దృగ్గోచరమై మనోనయనాలకు అందివచ్చి, అనంతానందాన్ని అందించగలుగుతూండడం స్పష్టమవుతుంది

### 2 2.1 భక్తి

'భక్తి' అన్నది 'భజ్' ధాతువు నుంచి పుట్టింది. అంటే భజించడమన్నమాట భగవద్భజనమని అర్థం శంకరాచార్యులవారు

> "అంకోలం నిజ బీజ సంతతి రయస్కాంతోపలం సూచికా
> సాధ్వీనైజ విభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్
> ప్రాప్నోతీహయథాతథా పశుపతేః పాదారవింద ద్వయమ్
> చేతోవృత్తి రుపేత్యతిష్ఠతి సదాభక్తి రుచ్యతే॥"

అనే శ్లోకంలో సహజంగా పరమేశ్వరుని పాదారవిందాల కడకు పోవడమే 'భక్తి' అంటాడు ఇది చాలా సహజంగా, సముచితంగా ఉంది నారద మహర్షి భక్తి సూత్రాలలో "సాతస్మిన్ పరమ ప్రేమరూపా (సూ-2)—అ భక్తి పరమేశ్వరుని పరమ ప్రేమ రూపంగా ఉందని చెప్పబడింది అంటే ఈశ్వరుని యెడలగల ఉత్తమమైన ప్రేమయే భక్తి దీని విశిష్టతను తెలుపడానికే ఆ మహర్షి "భక్తి రేవగరీయసీ భక్తిరేవ గరీయసీ" (సూ-81) అని స్పష్టీకరించాడు. "'భజనం అంతః కరణస్య భగవదాకారతా రూపం భక్తిః' అని కానీ, 'భజ్యతే సేవ్యతే భగవదాకార మంతః కరణం క్రియతే అనయా ఇతి భక్తిః' అని కానీ, 'భజ్యతే అస్వాద్యతే భగవాన్

నాయకత్వేన అనయా ఇతి భక్తిః' అని కానీ, భక్తికి వ్యుత్పత్తి చెప్పుకొనవచ్చును ఈ విషయమునే 'దృష్టాను శ్రావిక విషయ తృష్ణస్య వశీకార సంజ్ఞా వైరాగ్యమ్', 'తత్పరం పురుషఖ్యాతేః గుణ వైతృష్ణ్యం'[12] అనుపాతంజల యోగ సూత్రములును వివరించుచున్నవి"[13] ఇట్లే శాండిల్య భక్తి సూత్రాలలోను 'రసా పరాను రక్తి రీశ్వరే" (సూ-2) అంటే భగవంతుని యెడగల పరమప్రీతి (గాఢానురాగం) భక్తి అని చెప్పబడింది పరమ పూజ్యమైన ప్రీతియే భక్తి–భగవంతుని యెడగల ఆ పరమ పూజ్య భావమే భక్తి ఇది తొమ్మిది విధాలు

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్॥"[14]

భగవంతుని పవిత్ర చరిత్ర, గుణ మహిమాదుల్ని వినడం శ్రవణం తరువాత కీర్తించడం. నామరూప స్వరూపాల్ని స్మరించడం పాదాల్ని సేవించడం అర్చించడం. నమస్కరించడం. సేవించడం. సామ్యగుణాల్ని పొంది సఖ్య మొనరించడం. చివరికి ఆత్మను భగవంతుని యందు చేర్చడం ఈ తొమ్మిది విధాలైన భక్తి ఒకదాని కంటె మరొకటి గొప్పదై చివరికి ఆత్మ నివేదనంతో పరిపూర్తి చెందుతుంది

అన్నమాచార్యులు శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రచించాడు శృంగార సంకీర్తనల్లో వివిధ శృంగార రీతులను పరిశీలించాము భక్తితత్వ నిరూపణార్థమే అధ్యాత్మ సంకీర్తనలు రచితమయ్యాయి అందులో నీతి వైరాగ్యాలు సైతం స్పష్ట మవుతాయి సంకీర్తన లక్షణంలో–

"దేహాత్మేశ వివేకో
త్సాహంబును లోకవేద ధర్మాధర్మా
ద్యూహాపోహంబులు గల
యాహరి సంకీర్తనంబు లధ్యాత్మంబుల్"[15]

–అని అధ్యాత్మ సంకీర్తనల్ని లక్షణాలు వివరించబడ్డాయి దేహం, ఆత్మ, పరమాత్మలకు గల సంబంధాన్ని, లోక, వేద, ధర్మాదుల వివేచనాదుల సంబంధాన్ని వివరించే హరి సంకీర్తనలే అధ్యాత్మ సంకీర్తనలు పైగా కలియుగంలో హరి నామ సంకీర్తనమే మోక్ష సాధనమన్న విషయం స్పష్టం.

"ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞైస్త్రేతాయామ్
ద్వాపరేఽర్చయన్ యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్" [16]

దీన్ననుసరించి చిన్నన్న అన్నమాచార్య చరిత్రలో నరసింగరాయలకు అన్నమాచార్యులు బోధించినట్లున్న తీరు గమనించదగ్గది.

"మురవైరి కృత యుగమున సర్వజనులు
నిరత నిజధ్యాన నిష్ఠచే మెచ్చు.
క్రతువులఁ ద్రేతాయుగమున, నర్చనలఁ
బ్రతిలేని యట్టి ద్వాపరమున నలరు.

నామూఁడు యుగముల ధ్యానాది విధుల
నేమేమి నరులకు నిచ్చు నన్నియును
జలజోదరుఁడు నిజ సంకీర్తనమునఁ

గలియుగంబున నిచ్చుఁ గాపున, నీవు
ప్రతిలేని వేంకటపతి మీఁద భక్తి

వదలక మను"[17]

మని ఉపదేశించాడు సంకీర్తన విశిష్టతను వివరిస్తూ అందుకే అన్నమాచార్యుడు నామ సంకీర్తనాన్ని కలియుగంలో పంచమ వేదమని, పదాలలో అనేక రీతుల సంకీర్తించాడు.

"కలియుగంబునకుఁ గలదిదియే
వెలసిన పంచమ వేదమె కలిగె ॥పల్లవి॥

పరమగు వేదము బహుళము చదివియు
హరి నెరిగిన వారరుదనుచు
తిరువాయిమొడియై దివ్య మంత్రమై
వెలసిన పంచమ వేదమె కలిగె ॥కలి॥

వింకపు మనుజులు పెక్కులు చదివియు
సంకెదీర దెచ్చట ననుచు
సంకీర్తనమే సకల లోకముల
వేంకటేశ్వరుని వేదమె కలిగె ॥కలి॥

(అధ్యా సం 11, 2-60)

"కలియుగ మెటులైనాఁ గలదుగా నీ కరుణ
జలజాక్ష హరిహరి సర్వేశ్వరా ॥పల్లవి॥

పాపమెంత గలిగినఁ బరిహరించేయందుకు
నా పాలఁగలదుగా ని నామము
కోపమెంత గలిగిన కొచ్చి శాంతమిచ్చుటకు
చేపట్టి కలవుగా నా చిత్తములో నీవు ॥కలి॥

ధరనింద్రియాదులెంత తరము కాడిననన్ను
పరిఁగావఁగద్దుగా నీ శరణాగతి
గరిమఁ గర్మబంధాలు గట్టిన తాళ్లు వూడించ
నిరతిఁ గలదుగా నీ భక్తి నాకు ॥కలి॥

హితమైన యిహపరా లిష్టమైన వెల్లానియ్య
సతమై కలదుగా ని సంకీర్తన
తతి శ్రీవేంకటేశ నా తపము ఫలియింపించ
గతి గలదుగా నీ కమలాదేవి ॥కలి॥

(అధ్యా సం 2-430)

ఇలా విశ్వసించిన అన్నమాచార్యుడు ఈ నామ సంకీర్తన తన వేలపదాలలో సంకీర్తన చేసి చేసి తరించాడు అందులోని మొదటి నవవిధభక్తితత్వాన్ని ఎలా ప్రస్ఫుటీకరించాడో పరిశీలిస్తే అన్నమాచార్యుల భక్తి తత్వం స్పష్టమవుతుంది

అధ్యాత్మ పదాలు 'అగ్రామ్యారమ్య విష్ణు చరితోదారములై' ఉండాలని సంకీర్తన లక్షణంలో నిర్వచనమే ఉంది,

"వైరాగ్య వృద్ధి కరగం
భీర పదశ్రేణి పొసగఁ చెనుపుచు నగ్రా
మ్యారమ్య విష్ణు చరితో
దారములై యున్నఁ జాలు ధరణిన్వేలయున్"[18]

తదుచితరీతిని ఆధ్యాత్మ సంకీర్తనలు అన్నమాచార్యుడు రచించాడు. భాష లక్షణ బద్ధమై గ్రామ్యోక్త్యుల విరహితంగా ఉంటుంది. భక్తి ప్రధానమనీ, పైని పేర్కొన్న నవ విధ భక్తుల్ని ఒకే పదంలో అన్నమాచార్యుడు పేర్కొనడం గమనించగలం.

"నిత్య సుఖానంద మిదె నీ దాస్యము
సత్యము లేని సుఖాలు చాలుఁ జాలునయ్యా ॥పల్లవి॥

కన్ను చూపుల సుఖము కడు నీ చక్కని రూపె
యెన్నఁగ వీనుల సుఖమిదె నీపేరు
పన్ని నాలుక సుఖము పాదపు నీ తులసి
వున్న సుఖముల తెరువొదఁ బడమయ్యా ॥నిత్య॥

తనువు తోడి సుఖము తగు నీకైంకర్యము
మనసులో సుఖము నీ మంచి ధ్యానము
పనివి నీ యూర్పు సుఖము పాదపద్మము వాసన
యెనయని పెర సుఖమేమి సేసేనయ్యా ॥నిత్య॥

పుట్టుగుకెల్ల సుఖము పొల్లులేని నీ భక్తి
తొట్టి కాళ్ళ సుఖము పాతర లాడుట
జట్టి శ్రీవేంకటేశ మాచనవోలి చెన్నుడవై
వొట్టుకొని మమ్మేలితివోహో మేలయ్యా ॥నిత్య॥
(అధ్యా. సం. 10-78)

ఇలా వివరించిన నవ విధ భక్తి రీతుల్ని అనేకపదాలలో అన్నమాచార్యులు రచించాడు వాటిని క్రమంగా పరిశీలిద్దాం

**శ్రవణం :**

"ఎన్నడుఁ జెడని యీవు లిచ్చిని మాధవుఁడు
పన్నిన యాసలితనిపై పై నిలుపవో ॥పల్లవి॥

కొన నాలుకా హరి గుణములే నుడుగవో
మనసా అతని దివ్య మహిమెంచవో
తనువా శ్రీపతి తీర్థ దాహమే కోరవో
యెనలేని అడియాస లేటికి నీకిఁకను ॥ఎన్నఁడు॥

వీనులాలా ఏ పొద్దు విష్ణుకథలే వినరో
ఆనిన చేతు లితని కంది మొక్కరో
కానుక చూపులాల కమలాక్షుఁ జూడరో
యీ నేటి పాపాలబారి నేల పడేవిఁ (రిఁ) కను ॥ఎన్నఁడు॥

నలిఁ బాదాలాల హరిసిగరికె నడవరో
కలభక్తి యాతనిపై ఘటియించవో
చలమా శ్రీవేంకటేశు సంగతినే వుండవో
యొలయింపుఁ గోరికలకేల పారేవిఁకను ॥ఎన్నఁడు॥

(అధ్యా సం 10-14)

"వినరో భాగ్యము విష్ణుకథ
వెనుబల మిదివో విష్ణుకథ" (అధ్యా సం 3-355)

కీర్తనం :

"చాలదా బ్రహ్మమిది సంకీర్తనం మీకు
జాలెల్ల నడగించు సంకీర్తనం ॥పల్లవి॥

సంతోషకరమైన సంకీర్తనం
సంతాప మణగించు సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం
సంతతముఁ దలచుఁడీ సంకీర్తనం ॥చాలదా॥

సామజముఁ గాంచినది సంకీర్తనం
సామమున కెక్కుడీ సంకీర్తనం
సామీప్య మిందరికి సంకీర్తనం
సామాన్యమా విష్ణు సంకీర్తనం ॥చాలదా॥

జముబారి విడిపించు సంకీర్తనం
సమ బుద్ధి వొడమించు సంకీర్తనం
జమళి సౌఖ్యములిచ్చు సంకీర్తనం
శమదమాదులఁ జేయు సంకీర్తనం ॥వాలదా॥

(అధ్యా. సం 1–343)

పాదసేవనం .

"శ్రీమన్నారాయణ శ్రీమన్నారాయణ
శ్రీమన్నారాయణ శ్రీ పాదమే శరణు ॥పల్లవి॥

కమలాసతీ ముఖకమల కమలహిత
కమలప్రియ కమలేక్షణా
కమలాసహిత గరుడగమన శ్రీ
కమలనాభ నీ పదకమలమే శరణు ॥శ్రీమ॥

పరమయోగి జనభాగధేయ శ్రీ
పరమపురుషా పరాత్పరా
పరమాతుమ పరమాణురూప శ్రీ
తిరుపతి వేంకటగిరి దేవ శరణు ॥శ్రీమ॥

(అధ్యా. సం. 1-155)

"విడువ విడువనింక విష్ణుఁడు నీ పాదములు
కడఁగి సంసారవార్ధి కడుముంచు కొనిన" (అధ్యా సం 10-206)

అర్చనం :

"ఎన్ని చందములనెట్లైన నుతింతు
కన్నుల నిన్నే కనుఁగొంటిఁ గాన ॥పల్లవి॥

గోవిందా యని కొలిచిన నిన్నే
శ్రీ వల్లభుఁడని చింతింతును
భూవిభుఁడవు యిది పునరుక్తనకు మీ
దైవ మొకఁడవే ధరణికిఁ గాన ॥ఎన్ని॥

పరమాత్ముఁడ వని భక్తి సేసి నిను
నరహరి వని ధ్యానము సేతు
నరవులఁ జరిత చర్వణ మనకు మీ
అరయఁగ గురి యంతరాత్మవు గాన ॥ఎన్ని॥

(అధ్యా. సం. 3-427)

వందనం .

"ఉన్న సుద్దులేల మాకు వూర విచారములెల్ల
వెన్నునికి మొక్కుఁటే వేవేలు మాకు" (అధ్యా సం. 10-236)

స్మరణం .

"ఎందుకుఁ బనిగొందము యేమి సేతమివియెల్లా
చెందిన మాకిఁక బుద్ధి చెప్పవే నారాయణా ॥పల్లవి॥

హరి నామమొకటనే అణఁగెఁ బాపములు
వారసియన్ని నామము లూరకున్నవి
సిరులిచ్చెఁ గల వెల్లా శ్రీపతి నామమొక్కఁటే
పెదనామము లెల్లా పెట్టెలలో నున్నవి ॥ఎందుకు॥

గోవింద నామ మొకటే కూడబోసెఁ బుణ్యములు
వేవేలు నామములకు వెలలున్నవా
శ్రీవిష్ణు నామమొకటే చేతికిచ్చె వైకుంఠము
తావై యున్న నామములు తమకింవి నీవికి ॥ఎందుకు॥

ఇత్తల కేశవు నామ మియ్యఁ గల వెల్లానిచ్చె
హొత్తుల నామము లెల్లాఁ బొంకు చున్నవి
చిత్తమున నిన్నుఁ జూపె శ్రీ వేంకటేశ నామమే
హత్తిన నామము లెల్లానందుకోనే వున్నవి ॥ఎందుకు॥

(అధ్యా సం. 3-297)

ధ్యానం :

"పనిగొను వారల భాగ్యమిదీ
వెనక ముందరికి వివేక మొకటే ॥పల్లవి॥

బలు పుణ్యములకుఁ బాపములకు గురి
కలియుగ మొకటే కలది
చెలఁగి చేయుటకు చేయించుటకును
తలఁపూ నొకటే తనలోఁ గలది ॥పని॥

మోదపు భోగము మోక్షమునకు గురి
యీ దేహ మొకటే యెత్తినది
గోదిలి కడుఁ గుంగుటకు నెక్కుటకు
యీ దేహ విజ్ఞానమే కలది ॥పని॥

ఆర్మిలి దుఃఖము నతి సుఖములకు గురి
కర్మం బొకటే కలది
ఈర్మి శ్రీ వేంకట గురు దైవముఁగను
ధర్మమున కతని దాస్యమే కలది ॥పని॥

(అధ్యా సం. 10-7)

సఖ్యం :

'బలువగుఁదన చూపము చూపెన్
కలదింతయుఁ దన ఘనతెలఁగించెన్ ॥పల్లవి॥

పాండవ రక్షణపరుఁడై నరునకు
నండనే తెలిపె మహామహిమ
దండివిరచి తనదయతో నర్జునుఁ
డుండఁగ మగటిమి నొడఁబడఁ బలికె ॥బలు॥

మగుడఁగ కులధర్మములుఁ బుణ్యములు
తెగి పార్థున కుపదేశించెన్
నగుచు నతనితో నానాగతులను
నిగమము నియమము నిజ మెరిఁగించెన్ ॥బలు॥

వెరవుమిగుల నా విజయుని మనుమని
పరీక్షిత్తుఁ దగఁ బ్రదికించెన్
తిరువేంకటగిరి దేవుఁడు దానై
గరిమల భారతకథ గలిగించెన్ ॥బలు॥

(అధ్యా సం 1-295)

## ఆత్మనివేదనం :

అన్నమాచార్యుల భక్తిప్రపత్తి, శరణాగతి ప్రధానాంశాలన్నది అతని అధ్యాత్మ సంకీర్తనలన్నింటా వ్యక్తమవుతుంది అతని అధ్యాత్మ కీర్తనలన్ని ఆత్మనివేదనానికి నిదర్శనాలు

"ఇంతటఁ గావఁగదే యిందిరానాయక నన్ను
ఎంతానఁ గాకాసురునిఁ బాలించినట్లు ॥పల్లవి॥

దించని పంచభూతాల దేహము మోచితిఁగాన
నించిన యజ్ఞానమున నిన్ను నెరఁగ
పంచేంద్రియములచేఁ బట్టు వడ్డవాఁడఁ గాన
యెంచరాని పాపములే యిన్నియుఁ జేసితిని ॥ఇంత॥

మిన్నువంటి జఠరాగ్ని మింగి వున్నవాఁడఁగాన
కన్నవెల్లా వేఁడివేఁడి కిష్టపడితి
పన్నిన సంసారపుభ్రమఁ బడ్డవాఁడఁ గాన
అన్నిటా దేవతలకు నరిగాఁపనైతి ॥ఇంత॥

ఆతుమతో నీ వుండే భాగ్యము గలవాఁడఁగాన
చైతన్యమున నీకు శరణంటిని
నీతితో శ్రీవేంకటేశ నీ పాలివాఁడఁగాన
బాతితో సర్వము నీ కొప్పనము సేసితిని ॥ఇంత॥"

(అధ్యా సం 9-154)

ఇలాగా అన్నమాచార్యుల భక్తితత్వాన్ని నవవిధ రీతుల అనేకోదాహరణలతో దర్శింపవీలున్నది. మచ్చుకు మాత్రమే పైని వివరించడం జరిగింది

పన్నిద్దరు ఆళ్వారుల భక్తితత్వాన్ని పునాదిగా శ్రీ మద్రామానుజులు విశిష్టాద్వైత మతాన్ని నిరూపించడం వల్ల అందులో ప్రధానంగా శరణాగతి, ప్రపత్తి, హరిదాసు, గురువు - ఆచార్యుడు మొదలైన అంశాలు ప్రముఖంగా పరిగణించబడతాయి ఇవన్నీ అన్నమాచార్యుల అధ్యాత్మపదాల్లో మనకు విదితమవుతాయి

ఆత్మపరమాత్మలు :

"కానరనేల నా గుణములివి
రసికత నీ విన్నిటా రక్షింపకొనుమా ॥పల్లవి॥

నేరమి నాది నేరుపునీదే
దూరు నాది బంధుఁడవు నీవు
కోరుదు నేను కొమ్మని యిత్తువు
కారుణ్యాత్మక గతి నీవు సుమా ॥కానర॥

నేను యాచకుఁడ నీవే దాతవు
దీనుఁడ నేఁ బరదేవుఁడవు
జ్ఞానరహితుఁడను సర్వజ్ఞనిధివి
శ్రీనిధి యిఁక ననుఁజేరి కావుమా ॥కానర॥

అరయ నే జీవుఁడ నంతర్యామివి
యిరవుగ దాసుఁడ నేలికవు
చిరజీవిని నే శ్రీ వేంకటపతివి
వరదుఁడ ననుఁ జేపదలఁకుమా ॥కానర॥"

(అధ్యా. సం 10-176)

శరణాగతి :

"ఒరసి నన్ను గావినాతనికి శరణు
పరము విహాముచేలే పతికిని శరణు ॥పల్లవి॥

వేదములు దెచ్చినట్టి విభునికి శరణు
ఆదిమూల మంటే వచ్చినతనికి శరణు
యేదెసాఁ దానైయున్న యీతనికి శరణు
శ్రీదేవి మగఁడైన శ్రీపతికి శరణు ॥అరసి॥

అందరికిఁ బ్రాణమైన అతనికి శరణు
ముందు మూఁడు మూర్తుల మూర్తికి శరణు
దిందుపడి దేవతల దేవునికి శరణు
అంది మిన్నునేల నేకమై నతనికి శరణు ॥అరసి॥

తానె చైతన్యమైన దైవానకు శరణు
నానా బ్రహ్మాండాల నాథునికి శరణు
ఆనక శ్రీ వేంకటాద్రియందు నుండి వరములు
దీనుల కిందరికిచ్చే దేవునికి శరణు ॥అరసి॥

(అధ్యా సం 9-85)

## ప్రపత్తి

"అన్నిటా నీ వంతర్యామివి అవుట ధర్మమే అయినాను
యెన్నఁగ నీ వొక్కఁడవే గతియని యెంచికొలుచుటే ప్రపన్నసంగతి
॥పల్లవి॥

యేకాంతంబున నుండినపతివి యెనసి గమించుటే సతిధర్మంబు
లోకమురచ్చలో నుండిన పతిలోఁగొని పైకొని(న)రానట్లు
యీ కొలఁదులనే సర్వదేవతల యిన్ని రూపులై నీ వున్నప్పుడు
కైకొని నిను బహుముఖములఁ గొలుచుటగాదు పతివ్రతధర్మంబు"

(అధ్యా॰ సం 1-386)

## గురువు - ఆచార్యుడు .

"కటకట నేమూ కర్తలము గాము
ఘటన శ్రీపతినీవే కానఁ గదవయ్యా" (అధ్యా. సం. 10-136)

"కైకొన్న కొలఁది కర్మము
వాకుచ్చి తనతోనె వగవఁగ నేలా" (అధ్యా సం 10-220)

## హరిదాసు

"ఉమ్మడి కర్మములాల వుండఁబోటు మాకులేదు
యిమ్ముల నెందైనాఁ బోరో యివిలేని చోటికి' (అధ్యా సం 10-132)

## దాసానుదాసః :

"బంటుకు బంటవుదురా పాపముగాక నీ
బంటుకు బంట్లమై బదికేము నేము" (అధ్యా సం 10-225)

హరి ఒక్కడే దిక్కు

"భావములోనా బాహ్యమునందును
గోవింద గోవింద యని కొలువవో మనసా"
(అధ్యా సం. 9-272)

సర్వం విష్ణుమయం .

"చేరి యశోదకు శిశు వితఁడు
ధారుణి బ్రహ్మకుఁ దండ్రియు నితఁడు' (అధ్యా సం 3-485)

"సర్వం విష్ణుమయం బనుభావము సత్యం సత్యం బన్నిటను
సర్వేశ్వరుఁడే పొందెటి వస్తువు శరణాగతియే వుపాయము"
(అధ్యా. సం. 10-90)

ఇలాగా విశిష్టాద్వైతం ఎన్నో విధాలుగా సమున్నతమై శ్రీ వైష్ణవులచే సమా దరించ బడుతుంది వీటికన్నిటికీ అన్నమాచార్యుల పదాలు ఉదాహరణలన్న విషయం పై ఉదాహరణలవల్ల స్పష్టం

ఇంకా పైని పేర్కొన్నట్లు భక్తి ప్రపత్తులే వైష్ణవమతానికి పట్టుగొమ్మలు అయినా పై పంచవిధ భక్తితత్వాలు ముఖ్యమన్న విషయం మనం మరవరాదు శాంతం, దాస్యం, సఖ్యం, వాత్సల్యం, మధురం అనే పంచభావాలు అత్యంతాపశ్యాది మైనవి ఇవి అన్నమాచార్య సంకీర్తనల్లో కోకొల్లలుగా ఉన్నాయి ఇవి భావాలని కొందరు,[19] రతి అని మరికొందరు,[20] ఆసక్తి అని ఇంక కొందరు,[21] భక్తి అని తదితరులు[22] పేర్కొన్నా రసస్ఫూర్తిని పొందాయి వాటిని లాక్షణికులు రసాలుగానే నిరూపించారు. ఇతఃపూర్వమే దాస్యం, సఖ్యం, భక్తిని గూర్చి తెలుసుకొన్నాము. శాంత, వాత్సల్య, మధుర రసాలు భక్తి ఎలా అయ్యాయో ఉదాహరణ పూర్వకంగా తెలుసుకొందాము

శాంతం :

శాంతం రసమన్న విషయం విజ్ఞులకు విదితమే "పరాభక్తియొక్క ప్రప్రథమ రూపమే శాంతభక్తి అంటారు భగవంతుని ఆత్మగా గ్రహించి సర్వదా అభిన్నుడై, సమదర్శనుడైన, అనన్య భావమున ప్రేమించుచు అద్వైతానంద నిమగ్నుడైన బ్రహ్మజ్ఞానినే శాంత భక్తుడంటారు."[23] ఇందుకు చక్కటి ఉదాహరణ .

"నిత్యాత్ముఁడై యుండి నిత్యుఁడై వెలుఁగొందు
సత్యాత్ముఁడై యుండి సత్యమై తానుండు
ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు సం
స్తుత్యుఁడీ తిరువేంకటాద్రి విభుఁడు ॥పల్లవి॥

ఏ మూర్తి లోకంబులెల్ల నేలెడు నాతఁ
డే మూర్తి బ్రహ్మాదులెల్ల వెదకెడు నాతఁ
డే మూర్తి నిజమోక్షమయ్యఁ జాలెడు నాతఁ
డే మూర్తి లోకైక హితుఁడు
యేమూర్తి నిజమూర్తి యేమూర్తియునుఁ గాఁడు
యేమూర్తి త్రైమూర్తు లేకమైన యాతఁ
డే మూర్తి సర్వాత్ముఁడే మూర్తి పరమాత్ముఁ
డా మూర్తి తిరువేంకటాద్రి విభుఁడు ॥నిత్యా॥

యే దేవు దేహమున నిన్నియును జన్మించె
నే దేవు దేహమున నిన్నియును నణఁగె మరి
యే దేవు విగ్రహం బీసకల మింతయును
యే దేవు నేత్రంబు లిన చంద్రులు
యే దేవుఁడీ జీవులన్నింటిలో నుండు
నే దేవు చైతన్య మిన్నిటికి నాధార
మే దేవుఁడవ్యక్తుఁ డే దేవుఁ డద్వంద్వుఁ
డా దేవుఁడీ వేంకటాద్రి విభుఁడు ॥నిత్యా॥

యే వేల్పు పాదయుగ మిలయు నాకాశంబు
యే వేల్పు పాదకేశాంతం బనంతంబు
యే వేల్పు నిశ్వాస మీ మహామారుతము
యే వేల్పు నిజదాసు లీపుణ్యులు
యే వేల్పు సర్వేశుఁ డేవేల్పు పరమేశుఁ
డే వేల్పు భువనైక హితమనో భావకుఁడు
యే వేల్పు కడు సూక్ష్మమే వేల్పు కడు ఘనము
ఆ వేల్పు తిరువేంకటాద్రి విభుఁడు ॥నిత్యా॥

(అధ్యా సం 1-75)

వాత్సల్యం :

"ముత్తుకురే యమ్మలాల ముద్దులాడు వీడే
ముత్తెము వలె నున్నాడు ముద్దులాడు" (శృం సం. 4-142)

"కానరటె పెంచరటె కటకటా బిడ్డలను
నేను మీ వలెనే కంటి నెయ్యమైన బిడ్డని ॥పల్లవి॥

బాయటం బారవేసిన పాలువెన్నలను
చేయి పెట్టకుందురా చిన్ని బిడ్డలు
మీ యిండ్లు జతనాలు మీరు సేసుకొనక
పాయక దూరేరేలే ప్రతిలేని బిడ్డని ॥కాన॥

మూసినకాగుల నేయి ముంగిటి పెరుగులు
ఆస పడకుందురా ఆదే బిడ్డలు
వోవరించి మోనపోక వుండలేక మీరు
సేసేరింతేసి దూరు చెప్పరాని బిడ్డని ॥కాన॥

చొక్కమైచి కొప్పెరల జున్నులును
చిక్కిన విడుతురా చిన్ని బిడ్డలు
మిక్కిలి పూజలు సేసి మెచ్చించ దగదా
యెక్కువైన తిరువేంకటేశుడై బిడ్డని నివి ॥కాన॥[24]

## 2.2.2 మధుర భక్తి :

అన్నమాచార్య మధురభక్తిని గురించి తెలుసుకొనే ముందు మధుర భక్తిని గూర్చి వివరంగా తెలుసుకోవడం ఎంతైనా అవసరం. దీన్ని గూర్చి వివిధ ...తుల వివిధాలంకారికులు లాక్షణికులు, విమర్శకులు విశదీకరించిన తీరు తెన్నులను ...స్పష్ట రీతిని గుర్తించడం ముఖ్యం

ఇతః పూర్వమే భక్తిని గూర్చి విపులంగా తెలుసుకొన్నాము. ఇందులో ...ధురభక్తి అత్యంత మధురమైంది భక్తిని రసమని పూర్వ లాక్షణికు లెందరో ...ర్థయించారు. అది భగవత్పరమైనప్పుడు ఉత్తమ రస పర్యవసాయి అవుతుందని ...ర్కొలించారు.

భగవంతునిపైగల ప్రేమ - గానానురాగమే - భక్తి అని మనం గుర్తించాము "భాగవత విష్ణుపురాణములనే ఆధారముగా చేసుకొని మధుసూదన సరస్వతి తన భక్తి రసాయనమును కొనసాగించినాడు

అందుకో 'ఉపాయాః ప్రథమ స్కంధే నారదేనోపవర్ణితాః
సంక్షేపాత్తనహం వక్ష్యేభూమిభేద విభాగతః ।।
ప్రథమం మహతాం సేవాతద్దయా పాత్రతాతతః
శ్రద్ధాఽథ తేషాంధర్మేషుతతో హరిగుణశ్రుతిః ।।
తతోరత్యంకురోత్పత్తిః స్వరూపాధిగతిస్తతః
ప్రేమ వృద్ధిఃపరానందే తస్యాథ స్ఫురణం తతః ।।
భగవద్ధర్మ నిష్ఠాతఃస్వస్మిం స్తద్గుణశాలితా
ప్రేమ్ణోఽథ పరమాకాష్ఠేత్యుదితా భక్తిభూమికా।।'[25]

'మహా పురుషుల సేవ, వారిదయకు పాత్రుడగుట, వారొనరించు ధర్మములపై శ్రద్ధ, భగవద్గుణ శ్రవణము, భగవంతునియందు ప్రేమ ఉదయించుట, భగవత్స్వరూప మును తెలిసికొనుట, భగవత్స్ఫూర్తి, భగవద్ధర్మనిష్ఠ, తన యందాగుణములు పెంపొం దించుట, భగవంతునిపై గల ప్రేమ పరాకాష్ఠనందుట అనునవి క్రమ క్రమముగా, ఒక దాని తర్వాత ఒకటి అలవడవలెను వీటినన్నిటిని శాస్త్రియోపాయనము లందురు ఇవియన్నియు భాగవతమున వ్యాసనారద సంవాదములో వివరింపబడినవి '

"ఇంకను నాలుగు విధముల భక్తిని చెప్పిదానిని గోపికల యందు సమన్వ యింపజేసినాడు మధుసూదన సరస్వతి

"వ్రజదేవీషుచ స్పష్టం దృష్టం రతిచతుష్టయమ్
తచ్చిత్తాలంబనత్వేనస్వచిత్తం తాదృశంభవేత్"[26]

గోపికా స్త్రీలయందు కనబడు భక్తిని భావించినవారికి, వారిచిత్తము వలెనే తన చిత్తము గూడ మారుచున్నదని స్పష్టమగుచున్నది మరి సాధారణమై తుచ్ఛమైన లౌకిక శృంగారమే కావ్యములయందు విభావాది రూపముగా సమర్పింపబడి, రసానందమును చేకూర్చు చున్నదని ఆలంకారికులు చెప్పుచున్నారు కాని కనపడని రూపముగల స్వామి విషయమున కేవలమానసికముగ సాగించిన ఈ శృంగారము శాశ్వత రసా నందము కలిగించుననుటకో సందేహమేలేదు అందులకే

'పరిపూర్ణ రసాక్షుద్ర రసేభ్యోభగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్యప్రభేవ బలవత్తరా॥'[27]

క్షుద్రములగు కావ్య శృంగారములతో తన్మయులగు వారికి భగద్విషయక శృంగార భక్తి, మిణుగురు బూచులను చూచి అబ్బురపడు వారికి ఆదిత్య ప్రభవలె కన్పట్టి గలదు "[28]

భక్తిని రసమని నిరూపించిన వారిలో రూపగోస్వామి ప్రథముడు "భరతుని రస సిద్ధాంతమును ఆధారముగజేసికొని రాధామాధవుల నాలంబనముగాజేసికొని రాధకుం గృష్ణునిపైఁగల శృంగార రూపభక్తి, రసస్వరూపమైనదని యారసజనక ప్రక్రియ నంతటిని సాంగోపాంగముగ నిరూపించుచు రూపగోస్వామి వ్రాసినగ్రన్థమే "ఉజ్జ్వల నీలమణి" "నవరసములకును మాత్రము భక్తిరసమేయని రూపగోస్వామి అభి ప్రాయము "[29]

ఇంతకు ముందే పేర్కొన్నట్లు మధుసూదన సరస్వతి భక్తిరసానికి పట్టం గట్టాడు "అనుభవమాత్రము వలననే సాక్షిత్సుఖ విరుద్ధములయిన శోక క్రోధ భయాదులకు రసత్వమంగీకృతమై యున్నది అనుభవసిద్ధమై మిగిలిన రసముల కన్న వేయిరెట్లెక్కువగా రస్యమాన మగుచున్నభక్తి రసముగాదనుటెట్లు ? రసకోవిదులు దేవాదివిషయకరతి రసము కాదనియు భావమనియుఁజెప్పిరి ఇతర దేవతా విషయక మగు రతి భావమే, ఏలన వారు జీవులే యగుటచేఁ బరమానందము గలుగదు, పర మాత్మ స్వరూప శ్రీకృష్ణ రతి పరమానందమునకు గొంపోవును మఱియు కాంతాది విషయకములగు నేరసములందును భగవద్రతియందువలెఁ బూర్ణసుఖము లేక యానందము కలుగదు కాన వానియందుఁదగిన రసపుష్టిలేదు అవి క్షుద్రరసములు భగవద్రతిపూర్ణరసము అది మిడుగురు పుర్వులకన్న సూర్యకాంతిమెట్లు బల వత్తరమో యట్లే మిగిలిన రసములకన్న శ్రేష్ఠతరము, బలవత్తరము "[30] "ఈ భక్తి రసమునకు నాలంబన విభావము భగవంతుడు, తచ్చరిత్రలు విభావములు, భగవదాకార చిత్త వృత్తియే స్థాయిభావము, అదియే భగవద్రతి అనుభావములు తత్కాలమునఁ బుట్టిన నేత్రాది వికారములు వ్యభిచారులు నిర్వేదశంకా హర్షాదులు ఇది పరమా నంద స్వరూపమగు భక్తిరసముగాఁ బరిణమించును "[31]

"ప్రేమము భక్తియొక్క ఉపరిణత స్వరూపమని భక్తియోగులు భక్తిని అయిదు తరగతులుగా విభజించియున్నారు శాంతి, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర

భావములని వానికి పేరు ఈ పంచభావములను శ్రీకృష్ణుడు గోకులమునందు ప్రయోగించెను. తన ప్రాకృత లీలా రంగస్థలమగు గోకులమునందు శాంతభావమును, సమవయస్కులకు గోపబాలురయందును, గోవత్సముల యందును దాస్య సఖ్య భావములను, తనకంటె వయోవృద్ధులగు గోపగోపికా జనమునందును మాతృగోగణమునందును దాస్యవాత్సల్యభావములను, దుర్లభమును, పరమమునునగు మధుర భావమును గోపకన్యా గణమునందును ప్రయోగించినట్లు పురాణములవల్ల నవగతమగుచున్నది ఈ మధురభావమే కాంతాసక్తియని కొందరు చెప్పుదురు పూర్వోక్తములైన చతుర్విధ భావలక్షణములును పంచమ భావమునందు పరిణమించునని వారిసిద్ధాంతము "[31]

"A life emotion absolutely guided by love for All-life it there fore the highest phase of religious life on the face of it If emotions rule life, for all other emotions, are really subsidiary to love. Love there- fore is pre eminently the spring of life and a religious life of love All-life is necessarily the most exalted of modes of religious life

Let it be drawn heart and soul to Krishna, the heart and soul of all life, and immediately it finds itself in its true element, in its eteual greatness un - alloyed joy

"It is superflous to observe after all that has been said that all the varieties of emotion flowing and ebbing in the heart of Krishna-worsh pper are no better, no worse, than defferent sides of one eternal glorious love of the One, lovely, lovable and Loved "

"The Love that the Supreme God born as Krishna evoked in the hearts of His Worshippers manifested itsel as love proper in more ways "[32]

ఇట్లే భారతీయేతరులు సైతం దేవతా విషయకమైన శృంగారం భక్తి అని చెప్పారు "సంవేదనమగు రస చర్వణ శుద్ధము, అక్లిష్టము, స్ఫుటమునగు విశ్వ ప్రేమయని, ఈ విశ్వప్రేమయే వైశద్యమునంది తీవ్రత్వముతో నభివ్యక్తమై, మానవుల విషయమున శృంగారమని, దేవతా విషయమున భక్తియని పిలువబడుచున్నదని కోహెన్ (Cohen) పల్కుచున్నాడు "[33]

'భగవద్భక్తిని శృంగారముగా మార్చుకొన్నవారికి ఉపాస్య వస్తువు పురుషుడుగాను, తాము స్త్రీలుగాను అనుభవమునకు వచ్చునందురు

" సఏవ వాసుదేవోఽసౌ సాక్షాత్పురుష ఉచ్యతే
స్త్రీ ప్రాయ మితరత్సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్"
"స్వామిత్వాత్మత్వ శేషిత్వ పుంస్త్వాద్యాః స్వామినోగుణాః
స్వేభ్యో దాసీత్వ దేహత్వ శేషత్వ స్త్రీత్వదాయినః"

అనుట వారి మతము "[34]

"కృష్ణ సంబంధమైన భక్తిమార్గములందెల్ల నగ్రగణ్యము-భాగవతభక్తి సంప్రదాయము భాగవతమునందలి మధుర రసాలంబములైన గోపికా కృష్ణులాలంబనముగా వెలసినది వల్లభాచార్యుని పుష్టి మార్గము వల్లభసంప్రదాయమందు గోపికాకృష్ణుల దృష్టిలో నిడుకొని గోపికలకు శ్రీకృష్ణునియెడగల మధుర రసోజ్జ్వల పరిపుష్టమైన భక్తియందలి పరిస్థితిలోని తుట్టతుది స్థాయియైన మహాభావము నాధారముగా చేసికొని రాధాకృష్ణ పరముగ వెలసినది చైతన్యుని మధురభక్తి సంప్రదాయము "[35]

పురుషునకు నాయికాత్వము సిద్ధింపనాయని సందేహింపరాదు వైష్ణవ సంప్రదాయము నందు 'పుమాన్ విష్ణురితిఖ్యాతః స్త్రీప్రాయ మితరంజగత్" అను వచనము సుప్రసిద్ధము ఈ వచనము ఈ పద్ధతి సనాతనమని చాటు చున్నది. .

"గోపికలు స్త్రీలుగావున వారికి శ్రీ కృష్ణునిపైగల ప్రేమ శారీరకమనరాదు గోవర్ధనోద్ధరణ, శరద్రాత్రిగాన, రాసక్రీడాదులన్నియు మగసిరి మొలవని ఎనిమిదేండ్ల వయసుననే సాగినవి శ్రీ కృష్ణునకు ఆ తరువాతనే మధురాగమన కంస వధాదులు "[36] భాగవతంలో మరింత మనోహరంగా చెప్పబడింది [37] ఇలాగా భాగవతభక్తి మధురభక్తి ఈ భక్తిరసమని మనం విశ్వసించినప్పుడు రసానందానికి

కొరవలేదు అది దైవసంబంధమైనది అందుకే "రసో వైసః" "రసగ్ హ్యేవాయం లబ్ధ్వా ఆనందీభవతి" ఇది వైదిక వాక్యము పరమాత్మాను సంధానమువే సమాధి యందు యోగి చిత్తవృత్తి యనుభవించెడిది ఆత్మానుభూతి ఆదే పరమానుభూతి. అదే మోక్షసాధనము అందు బాహ్యేంద్రియ ప్రత్యక్షానుభూతి యుండదు ఉన్నచో అది ఆత్మానుభూతికాదు బాహ్యేంద్రియ ప్రత్యక్షముల నన్నింటిని మనో విలీనము చేసి తద్వారా కేవలము మానసిక ప్రత్యక్షముగ తచ్చైతన్యమును ననుభవించుటయే పరమాత్మానుభూతి "[38] దీని నాధారంగా అన్నమాచార్యుని మధురభక్తి తత్వంపై విశ్లేషణ చేయవలసి ఉంది

భక్తి మూడుదశలుగా, ఎనిమిది విధాలుగా విస్తరించిందని పెద్దలు ఎనిమిదో దైన తనయందు నాయికాత్వాన్ని ఆరోపించుకొని విషయ సుఖాత్మకముగా సాగినది సమారోపభక్తి ఇదే అన్నమయ్య, క్షేత్రయ్య, రూపగోస్వామి, మీరాబాయి, ఒక దశలో రామకృష్ణ పరమహంస మొదలైన వారనుసరించినది[39] దీనినే మధుర భక్తి అని అంటారు

ఇతః పూర్వమే అన్నమాచార్య, వర్ణిత శృంగార రీతులను మనం గమనించి నాము అది అనేక రీతుల కొనసాగినది అది కేవలమైహికమైన భౌతిక శృంగారం కాదు అలౌకిక శృంగారం భగవద్భక్తిపరమైన శృంగారం 'రసో వైసః' సిద్ధాంతానికి ఇది సముచితంగా కుదురుతుంది

"గురువుల యొద్ద చదివిన వేదాంతము, ఆళ్వారుల చరిత్రములు, భాగవత విష్ణు పురాణములందును, నారద శాండిల్యాది భక్తి సూత్రముల యందును వివరింప బడిన గోపికా భక్తియు, అన్నమయ్యకు ఆదర్శములుగా నిలిచి, ఆతనిచేత శృంగార సంకీర్తనల రాశిని నిర్మింపజేసినవి ఆళ్వారులయందు కానరాని పామర శృంగారము ఈతనియందు కానవచ్చుటకు భాగవత విష్ణుపురాణములే కారణములుగా తోచుచున్నవి

"తననొక నాయికగా భావించుకొని, స్వామిని నాయకునిగా మనసున నిల్పు కొని, పురుషుడై దొడ్డ సంసారియైన తాను తనయందు పుంస్త్వమే లేనట్లు, ఆతు దనమే నిండుకొన్నట్లు అంత తన్మయీ భావముతో ఈ కీర్తనలను రచించినాడు కొన్ని పట్టుల పరిశీలించునప్పుడు భౌతిక సుఖములను రెండు చేతుల జుర్రుకొను రసిక స్త్రీలకు సూడ మనసుకందని శృంగార మర్మములను, తెచ్చిపెట్టుకొన్న నాయి

కాత్వముగల ఈతడు వర్ణించుట చూడగా ఎంతయోగి కైనను ఈ తన్మయీ భావము కుదరదని యూహింపవలసియున్నది

"తనకు ముందే సంస్కృతమున జయదేవుడు

శ్లో॥ యది హరిస్మరణే సరసం మనః
యది విలాస కథా సుకుతూహలమ్।
మధుర కోమల కాంత పదావలీం
శృణు తదా జయదేవ సరస్వతీమ్"40

అని ఉపక్రమించిన గీతగోవిందములోని శృంగారముకూడ ఈతని నాకర్షించి యుండవచ్చును ఈతని శృంగార పరమార్థమును తెలుపునట్టి రెండు మూడు పాటల నుదాహరించు చున్నాను.

ముఖారి

ఇదిగాక సౌభాగ్యమిదిగాక తపము మఱి
యదిగాక వైభవం బిఁక నొకటిగలదా? ॥పల్లవి॥
అతివ జన్మము సఫలమై పరమయోగి వలె

నితర మోహాపేక్ష లిన్నియును విడిచె
నతి కోరికలు మహాశాంతమై యిదె మాడ
నతత విజ్ఞాన వాసనవోలె నుండె ॥ఇది॥

తరుణి హృదయము కృతార్థతఁ బొంది విభుమీఁది
పరవశానంద సంపదకు నిరవాయ
సరసిజానన మనో జయమంది యింతలో
సరిలేక మనసు నిశ్చల భావమాయ ॥ఇది॥

శ్రీవేంకటేశ్వరునిఁ జింతించి పరతత్త్వ
భావంబు నిజముగాఁ బట్టె చెలియాత్మ
దేవోత్తముని కృపాధీనురాలై యిపుడు
లావణ్యవతికి నుల్లంబు తిరమాయ ॥ఇది॥

(శృం నం. 12-17)

## కన్నడ గౌళ

కామయాగము చేసెఁ గలికి తన
ప్రేమయే దేవతా ప్రీతిగాను    ॥పల్లవి॥

పొలుపలర సురత తాంబూల రసపానంబు
నలినాక్షి సోమ పానంబుగాను
కలకలంబుల మంచి గళరవంబుల మోఁత
తలకొన్న వేదమంత్రములుగాను    ॥కామ॥

పడఁతి తన విరహ తాపమునఁ బుట్టినయగ్ని
అడరి దరికొన్న హోమాగ్నిగాను
ఒడఁబడిక సమరతుల నుదయించిన చెమటఁ
దరియుచే యది యవభృథంబుగాను    ॥కామ॥

తనర గుచముల రుమలు దంతా (త) క్షత క్రీడ
ననుపైన పశుబంధనంబుగాను
మొనసి శ్రీతిరువేంకటేశ్వరుని బొందు
ఘనమైన దివ్యభోగంబుగాను    ॥కామ॥

(శృం॰ సం 12-223)

## వరాళి

వెలయు నీ కల్యాణవేదిగా మతినుండి
కలికి జవ్వనపు యాగము సేసెనతఁడు    ॥పల్లవి॥

మలయు నీ నాభి హోమపు గుండమునను
నెలకొన్న విరహాగ్ని నిండాఁ బోసి
పొలయు నీ నిట్టూరుపుల విసరుమును
వొలుకుఁ జెమటల నాహుతి వోసెనతఁడు    ॥వెలయు॥

కదిసి నీనెన్నడిమి గగనమునందు
పొదలిన యారనే పొగ నిండఁగా
మదిరాక్షి నీ మంచి మానవుఁ బసవు
నధనెరిఁగి వేలిచె నతిథ నీకతఁడు    ॥వెలయు॥

కాటుక కన్నుల నిన్నుఁ గడునలయించి
బూటకముల చిటిపొటి సిగ్గుల
గాఁటపుఁ గరుణ వేంకటగిరి విభుఁడు
కోఁటి హోమము సేసెఁగూడి నిన్నతఁడు ॥వెలయు॥
(శృం సం 12-288)

"పై మూడు పాటలలోని శృంగార రహస్యమును రసికులూహింపఁగలరు మొదటిది వేదాంత పరమార్థముగ, రెండవది నాయికాకృతమైన వైదిక హోమ ప్రక్రియగా, మూడవది నాయకా కృతమైన వైదికహోమ ప్రక్రియగా వర్ణింపబడినవి వేదములలోగూడ ఇట్లే రతి, హోమ ప్రక్రియగా వర్ణింపబడియుండుట సుప్రసిద్ధమే

"తపము, యోగము, కర్మము అనువీనికి ఇంద్రియజయము, యమనియమాది సాధనము, కాలముదాటని దీక్షయు అవసరములైనవి వీనిలో హృదయ పరిపాకమున కంటె శ్రద్ధ, సాధనము ముఖ్యములు. భక్తియందు శ్రద్ధతోపాటు హృదయపరి పాకము, తన్మయీభావము హెచ్చు ఆ హృదయ పరిపాకము బలిసినపుడే తన్మయీ భావము సిద్ధించును హృదయము అయస్కాంతమువలె తానను కొను వస్తువు పట్టు కొని విడువకున్నచో హృదయ పరిపాకము సిద్ధించినట్లు ఈ భక్తి ప్రక్రియలలో కొన్ని కాలికములు, కొన్ని దైశికములు, కొన్ని మానసికములు, కొన్ని పరా శ్రయములు, కొన్ని ఆత్మార్పణ రూపములోను గలవు "[42]

ఈ విధంగా అన్నమాచార్యులు నాయికగా, శ్రీ వేంకటేశ్వరుడు నాయకుడుగా మధురభక్తి పూరితమైన ఆయన శృంగార పదాలన్నీ ఉదాహరణలే ఇందులో జీవాత్మ పరమాత్మలో సంలీనం కెందడానికి చేసిన ప్రయత్నం స్పష్టమవుతుంది ఇది నిర్మల ప్రేమ. శారీరకంకాక కేవల చిత్త సమ్మేళనం ఇందు పిడికవవుతుంది ఉదాహరణ .

"ఇదివో నీ తోడిపొందు ఇంతేశేయా
యెదుట నున్నది చెలి యెఱుఁగుకోవయ్యా ॥పల్లవి॥
కొమ్మచిత్తములోని చింత కొప్పునెరులై నిండె
ముమ్మడి తరితీపల్లా మోవిపండాయ
నెమ్మది నడియాసలు నివ్వెరగు చూపులాయ
పమ్మిపరాకులేల తప్పక చూడవయ్యా ॥ఇది॥

జలజాక్షి కోరికలు చనుఁగవరాసులాయ
వలపులు రోమరాజి వరుసలాయ
వెలలేని తమకము వేఁకమై పిఱుదాయ
తలపోఁత తాదేర్ప దయసేయవమ్మా ॥ఇది॥

(శృం సం 25–301)

ఇంతకంటె మరింత మనోజ్ఞమూ, జీవాత్మ పరమాత్మల కలయిక పర్ణితమైన పదం అత్యంత మనోహరమూనై మధురభక్తికి మకుటాయమానమై ఒప్పుతూంది.

"అదిగాక సౌభాగ్యమదిగాక వలపు
అదిగాక సుఖమింక నందరికిఁ గలదా ॥పల్లవి॥

ప్రాణవల్లభునిఁ బెడఁబాసి మరుబాణముల
ప్రాణబాధల నెగులుపడుటెటి వలపే
ప్రాణేశ్వరుఁడు దన్నుఁ బాయఁజూచిన యపుడు
ప్రాణంబు మేనిలోఁ బాయంగవలదా ॥అది॥

ఒద్దికై ప్రియునితో నొడగూడి యుండినపు
డిద్దరై విహరింపుటిది యేటివలపే
పొద్దుపోకలకుఁ దమ పొలయలుకచూటముల
బుద్ధిలోఁ బరవశము పొందంగ వలదా ॥అది॥

చిత్తంబులోపలను శ్రీవెంకటేశ్వరుని
హత్తించి నాఁడుదానియై యుండవలదా
కొత్తయిన యిటువంటి కౌదవేని సంగతుల
తత్తరము మున్నాడి తగులంగవలదా ॥అది॥

(శృం సం 12–230)

ఇలాగా ఎన్ని ఉదాహరణలనైనా ఇవ్వవచ్చును మరో ఉదాహరణ ఇందులో అన్నమాచార్యుడు నాయిక అయి చెలిని బోధిస్తూన్నట్లు చిత్రితం

"తారుకాణ సేసుకొంటే తానే నేను
యీ రీతి నవ్వుగానీ ఇంటికి రమ్మనవే ॥పల్లవి॥

చెక్కులివె చెమరించె చిత్తమెల్లాఁ జిగిరించె
కుక్కిపెట్టు కోరికలు కొనసాగెను
తొక్కినాఁడు నా పాదము తొలుతే సందడిలోన
యెక్కడ పరాకు సేసి నింటికి రమ్మనవే ॥తారు॥

దప్పిదేరె పెదవుల తమకము దైవారె
కొప్పువీడి చన్నులపై కుప్పలాయను
ముప్పిరిగాఁ గట్టినాఁడు ముంచేతకంకణము
యిప్పుడేలనిండి సిగ్గులు యింటికి రమ్మనే ॥తారు॥

ఆయాలంటి నన్నుఁగూడె అంగమెల్లాఁ బులకించె
చేయిచేయి సోఁకె యానచిమ్మిరేఁగెను
పాయలా సన్నలా సేనచల్లె శ్రీవేంకటేశుఁడు
యీ మెడ నన్ను మన్నించి యింటికి రమ్మనవే ॥తారు॥

(శృం సం 25-239)

ఇలాగా నాయిక తానె అయి భగవంతుడైన శ్రీ వేంకటేశ్వరస్వామిని తన ప్రియునిగా భావించి, శృంగార లీలావిలాసములను భావించి, తన్మూలంగా మధురభక్తిని ప్రకటించాడు అన్నమాచార్యుడు

ఇందులో పైకి భౌతికమైన నాయక శృంగారంలాగానే కనిపించినా, అనంత భక్తి భావనా బలంతో మనం అవలోకించినప్పుడే అది అలౌకిక శృంగారమనీ, భగవత్పరమైన మధురభక్తి అనీ స్పష్టమవుతుంది.

"ఈతని శృంగారములో ప్రబంధములందున్నట్లు కొంత పచ్చిదనము అక్కడక్కడ కనపడుచుండుట నిజమే అది గీతగోవిందములో లేదా? గోపికల విషయమున లేదా? కృష్ణకర్ణామృతమున లేదా? మరి వీరి శృంగారము మాత్రము మడిగట్టు కొనవలెనా? శృంగారమన్నప్పుడు కచకుచాది వర్ణనలు, రతిలంపటములు లేక దర్భలు - రుద్రాక్షమాలలు - భస్మత్రిపుండ్రములు - తులసీదామములు - ఊర్ధ్వ పుండ్రములు సాక్షాత్కరింపవా? నిగనిగలాడు పట్టుచీరలంగడిలో పచ్చారి సరకులు దొరకునా? ఎటు చూచినా కొన్ని కీర్తనలందుగల పచ్చిదనము మాత్రము మన దృష్టిలో హేయము కావచ్చు అది తప్పనిసరి నాయికా రూపము ధరించిన అన్నమయ్య

ప్రాణేశ్వరుఁడగు వేంకటేశ్వరునితో విచ్చలవిడి సంచరింపక, మనలను జూచి సిపడి నంగి నంగిగా నడుచుకొనవలెనా? అన్నమయ్య కున్నంత ఆత్మార్పణ భక్తి, యికాత్మసిద్ధి మనకున్నచో మనమీ మాట అనలేము అంత ఆత్మార్పణశక్తి ుండుట మనలోని లోపమేకాని అతని లోపముకాదు ఈతని శృంగార సంకీర్త రాశిలో వ్యంగ్య మర్యాదకు పడగలెత్తిన పాటలెన్నియో కలవు అవి మనము పుకొనవచ్చును. పాడుకొనవచ్చును

" 'నాయకస్య కవేః శ్రోతుః సమానోఽనుభవో మనః' అన్నట్లు శృంగారసంకీ నకర్తయగు అన్నమయ్యతోపాటు మనకు సమానానుభవము కలిగినచో అప్పుడు పాటలలోని పచ్చిదనము మన కగపడదు లౌకిక స్త్రీ పురుషులకు సంబంధించిన ంగారము వారి అంతస్తుకు తగిన ఔచిత్యమును పాటించవలెను భగవద్విషయమై, పదర్పితమై ఆత్మార్పణ సిద్ధికో సాగించిన శృంగారమునందు ఈ లౌకిక మర్యాద ు సాటింపవలసిన పనిలేదు అది ఆ యంతస్తు వారికే స్పష్టముగ అర్థము గలదు" 43

ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని అన్నమాచార్యుల మధురభక్తిని మనం ుంతగా గమనించి ఆనందించగలం

అన్నమాచార్యుడే అలమేలుమంగగా మానసికంగా మారిపోయి పతి అయిన వేంకటేశునితో సంభాషిస్తున్నట్లున్నది

"నీ మహిమో నాలోన విండిన వలపు జాడో
యేమిసేతు నన్నెప్పుడు నెడవకుమయ్యా ||పల్లవి||

యెనసి నీ తో నేన యెంత పడి మాటాడినా
తనియదు నా మనసు తమి యెట్టిదో
వినయముతో రెప్పలు వేయక చూచినాను
నినుపులై మమతలు నిచ్చ కొత్తలు ||నీ మ||

చలపట్టి నీ తోను సారె సారెఁ బెనఁగిన
నలయదు నా మేను ఆశ యెట్టిదో
కొలువులో నీ వద్దఁ గూచుండి యెంత నవ్విన
తలఁపులో కోరికలు తరగని ధాన్యాలు ||నీ మ||

కరఁగి యుండాఁకా నిన్నుఁగాఁగిలించుచుండినాను
విడువవు చేతులు వేడుకెట్టిదో
అడరి శ్రీ వేంకటేశ యలమేల్ మంగను నేను
తొడరి యేలితివి రతులు తరితీపులు ॥సీ మ॥

(శృం సం 28-155)

ఇలాగే అన్నమాచార్యుడే నాయిక అయి చెలులతో తనకు నాయకుడైన భగవత్సన్ని ధానంవల్ల కలిగిన అతిశయితమైన ఆనంద పారవశ్యాన్ని వివరిస్తున్నాడు

"ఇన్నిటా ఘనుఁడు దాను యేమి చెప్పేరే
యెన్నుకొనీ నా గుణము లేమి చెప్పేరే ॥పల్లవి॥

చెంతఁ దన చెప్పినట్టు సేసితినంటా నిదె
యెంత నన్ను బుజ్జగించి నేమి చెప్పేరే
అంతటాఁ దన కిచ్చక మాడితినంటా నిదె
ఇంతలో నన్నుఁ బొగడీనేమి చెప్పేరే ॥ఇన్ని॥

బొట్టి తనపై పాటలు బొనరఁ బాడితినంటా
యిట్టె విడెమిచ్చిని యేమి చెప్పేరే
జట్టిగాఁ జన్నులతోడ సాము సేయించితి నంటా
యెట్టనెదుటనే మెచ్చి నేమి చెప్పేరే ॥ఇన్ని॥

మనసు మర్మములంటా మంతన మాడి తనంటా
యెనసి కౌఁగిలించీ యేమి చెప్పేరే
చెనకి మొక్కితినంటా శ్రీవేంకటేశ్వరుఁడు
యినుమడిగా మన్నించె నేమి చెప్పేరే ॥ఇన్ని॥

(శృం సం 29-239)

ఇందులో అన్నమాచార్యుని జీవిత రహస్య మున్నదని గౌరిపెద్ది రామసుబ్బ శర్మగారి అభిప్రాయం [44] అయినను కావచ్చును అన్నమాచార్యుడు తన వ్యక్తిగతాభి ప్రాయాన్నే అభివ్యక్తీ కరించాడనడంలో దోషం లేదు

ఇదే రీతిగా తప శ్శృంగారం వర్ణితం ఇందులో ఆత్మ పరమాత్మల కలయిక ఎంతో మనోరంజకంగా వర్ణితం

"అవియే పో నేఁడు మాతోనంటి సేసే తపములు
విపరించుకొని యిట్టె విచ్చేయు మనవే ॥పల్లవి॥

కొండల కొట్టగొనల గోరమైన తపములు
పండు బలములలోని పచ్చిమేఁతలు
గుండెదాకే మంత్రాల కుత్తికలో జపములు
దండకారు(ర)ణ్యాన నాఁడు తాఁజేసెఁగా ॥అవియే॥

యేరులలో మునుకలు యెక్కువ ఆచారాలు
ఆ రీతి మోనము తోడి యానందాలు
కోరికోరి చలివేఁడి కోటికోటి నేమాలు
చేరి యీ రీతి (దపాలు సేసినాఁడుగా ॥అవియే॥

నమ్మతించఁ జేసిన యానన భేదబంధాలు
వుమ్మడి యన్యోన్యపు యోగాలు
దొమ్మి శ్రీ వేంకటపతి తొల్లి సేసె నట్లనె
రమ్మని నేఁడును నారతిఁ జేసెఁగా ॥అవియే॥

(శృం. సం 30-190)

ఇంతకంటే మనోజ్ఞమైన ఆత్మపరమాత్మల కలయిక ఉంటుందా? తపశ్శృంగా రాల అభేదాద్వైవ సాయిగా వర్ణించి ఇది మహాయోగంగా వర్ణించడంవల్ల అన్నమా చార్యుని మధురభక్తి సుస్పష్టమవుతుంది

ఇలాగే పరమయోగంగా ఆత్మ పరమాత్మల సంయోగంగా అన్నమాచార్యుడే నాయిక అయి, భగవంతునితో తనకు అతనికి భేదంలేదని చెబుతున్నట్లున్న దీ పదంలో. ఇది ఉత్కృదాత్త మధురభక్తికి పకటాయమానమైనదనడంలో సందేహం లేదు. పైగా ఇది పరమయోగమట !

"ఇదియే పరమయోగ మిద్దరికి విభుఁడా
అధన ననిచిన (దిష్టాంత మాయనిపుడు ॥పల్లవి॥

వెలి మన మిద్దరము వేరై వుందుము గాని
తలఁపు లోపలను యిద్దర మొకటే
వొలసి యుద్ధములోన నొకరూపే రెండై
తెలిసినట్లనేవో ద్రిష్టాంతమిపుడు ॥ఇది॥

పేరులిద్దరికి నిట్టె భేదమై తోఁచీగాని
తారుకాణ గుణము లిద్దరి కొకటే
కోరిన మాటొకటే కొండలలో రెండవు
తేరి చూడనిది యేవో ద్రిష్టాంతమిపుడు ॥ఇది॥

శ్రీవేంకటేశ నీనా చేఁతవే వేరులుగాని
కేవలమిద్దరికి కాఁగిలి వొకటే
పూవుగుత్తి వొకటే పూఁసలు వేరైనట్లు
దేవ యిన్నిటికి నిదెద్రిష్టాంత మిపుడు ॥ఇది॥

(శృం సం. 30-206)

ఇట్లు ఇతఃపూర్వమే అనేక రీతుల వివరించినట్లు ఆళ్వారుల, గోపికల ఆత్మార్పణ వలెనే భగవంతునికై తనను తాను అర్పించుకోవడం వల్ల కలిగిన శరీరాలు వేరైనా భక్తుడైన ఆత్మ తాను, భగవంతుడు పరమాత్మ ఒకటేనని అన్నమాచార్యుడు నాయికగా ఊహించుకొని చిత్రించడం మధురమనోజ్ఞమైన మధురభక్తికి అత్యంత మకుటాయ మానమైనదని విదిత మవుతుంది ఇవి అన్నమాచార్యుని మధురభక్తి లోని వివిధ రీతులు ఇలాగా ఎన్ని ఉదాహరణలైనా ఇవ్వవచ్చు కానీ అన్నమాచార్యుని శృంగార సంకీర్తనలన్నీ ఇందు కుదాహరణాలే అనే విషయం మరువ కూడదు.



## సూ చి క లు


| | | |
|---|---|---|
| 1 | భరతముని | నాట్యశాస్త్రం పు. 93 |
| 2 | ధనంజయుడు | దశరూపకం 4 1 |
| 3 | రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ | ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1942 - 43) పు 12 |
| 4 | రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ | ప్రవేశిక - డా ఎస్ గంగప్ప - క్షేత్రయ్య పదసాహిత్యం - పు vii |
| 5,6 | Minor works of Tallapakam Poets | తాళ్ళపాక చినతిరుమలాచార్యుడు సంకీర్తన లక్షణము పద్యాలు 12, 56. పుట 139, 147 |
| 7 | తిమ్మావఝ్ఝల కోదండ రామయ్య | పదములు - శృంగారము భారతి, సెప్టెంబరు 1952 పు 282 |
| 8 | పై 5, 6 సూచికలోనిదే పద్యం 56 పు 147 | |
| 9 | డా వేటూరి ఆనందమూర్తి | తాళ్ళపాక కవుల పదకవితలు-భాషా ప్రయోగ విశేషాలు - ద్వి భా పు 102 |
| 10 | పై 9 సూచికలోనిదే పు 104 | |
| 11. | శంకరాచార్యులు | శివానందలహరి శ్లో 51 |
| 12 | పాతంజల యోగ సూత్రములు 1-15 16 | |
| 13 | గౌరిపెద్ది రామసుబ్బశర్మ | పీఠిక అన్నమాచార్యుడు శృంగార సంకీర్తనలు-సం 26. పు 20 |
| 14 | భాగవతం - సప్తమస్కంధం | |
| 15 | పై 5, 6 సూచికల్లోనిదే ప 61 | |
| 16 | విష్ణుపురాణము 6-2-17 | |
| 17. | చినతిరువేంగళనాథుడు, తాళ్ళపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రము పు 41 (చిన్నన్న) | |

18. పై 5, 6 సూచికల్లోనిదే ప 60

| | | |
|---|---|---|
| 19 | సముద్రాల రాఘవాచార్య | రాసలీల గోపికలు ఆంధ్రపత్రిక (విక్రమ సంవత్సరాది సంచిక - 1940-41)పు 129 |
| 20 | Dr Bhagavat Kumar Goswamin, Shastri | Bhakti cult In Ancient India - p. 390 |
| 21 | పై 9 సూచికలోనిదే పు 171-174 | |
| 22 | ఆరుద్ర | అన్నమయ్య సమగ్రాంధ్ర సాహిత్యం-సం vi పు 163-169 |
| 23. | పై పు. 164 | |
| 24 | అన్నమాచార్య సంకీర్తనలు | ఉత్సవ గాయకోపయోగార్థ ముద్రితములు- ప 112 |
| 25 | మధుసూదన సరస్వతి | భక్తి రసాయనము-ప్రథమోల్లాసము 31-34 |
| 26. | పైదే 2-72 | |
| 27. | పైదే 2-78 | |
| 28 | గౌరిపెద్ది రామసుబ్బశర్మ | పీఠిక-అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు సం 26 - పు 20-22 |
| 29 | సాహితీ వల్లభ్యము | (ముళ్ళపూడి తిమ్మరాజుగారి అభినందన సంపుటి) పు 453, 457 |
| 30 | సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి | కావ్యాలంకార సంగ్రహము - పు 306, 307-310 |
| 31 | సముద్రాల రాఘవాచార్య | రాసలీల - గోపికలు ఆంధ్రపత్రిక-విక్రమ సంవత్సరాది సంచిక (1940-41) పు 129 |
| 32 | Dr Bhagavat Kumar Goswami, shastri, Ch II - Emotional life in Comprehensive Devo - tion | Suddha Prema - Bhakticult in Ancient India - Pp 382-388 |

సూచికలు

33 భారతి - (అక్టో 1954) పు. 236

34. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ క్షేత్రయ్య పదములు ఆంధ్రపత్రిక(1942-43) పు 17

35. పై 29. సూచికలోనిదే పు 452

36,37 గౌరిపెద్ది రామసుబ్బశర్మ పీఠిక అన్నమాచార్య శృంగార పదములు- సం 12 పు 15-21

38 రాధా 'రసోవైసః' భారతి - మార్చి 1975 పు 25

39 గౌరిపెద్ది రామసుబ్బశర్మ పీఠిక - అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు - సం 26 పు 21, 22

40 గీతగోవింద కావ్యము - శ్లో 3.

41 అన్నమాచార్యుడు శృంగార సంకీర్తనలు - సం 12 ప 17, 223, 288

42 పై 39వ సూచికలోనిదే పు 23-26

43 పైదే పు 27, 28

44. అన్నమాచార్య శృంగార సంకీర్తనలు, సం 29 అభిస్నూచిక పు 160



# 3.0 ఆధ్యాత్మికత, నీతి, వైరాగ్యాలు-
# అన్నమాచార్యులు :

ఇతఃపూర్వం అన్నమాచార్యుల శృంగారరీతులు, భక్తి, మధురభక్తిస్ఫూర్తి మన హృదయాలకు హత్తుకొన్నాయి. ఇంక అన్నమాచార్యుల ఆధ్యాత్మిక చింతనా వైవిధ్యమూ, నీత్యుపదేశరీతీ, వైరాగ్య నిరూపణమూ ఈ ప్రకరణంలో గుర్తించడమే ముఖ్యోద్దేశం

హైందవ మతంలో ద్వైతాద్వైత విశిష్టాద్వైతాలు ముఖ్యమైనవి వీటికా చార్యులు మధ్వ, శంకర, రామానుజులు సంక్షిప్తంగా ఈ మతాల లక్ష్యాలు జీవాత్మ పరమాత్మలు ఎల్లప్పుడూ వేర్వేరని ద్వైతమత సిద్ధాంతం జీవాత్మపర మాత్మలకు దశాభేదమేగాని వస్తుతః రెండూ ఒక్కటే అన్నది అద్వైతమత సిద్ధాంతం. జీవాత్మ పరమాత్మలు ఒక్కటే అయినప్పటికీ శరీరశరీరి భావంతో వాటి సంబంధం కూడి ఉంటుంది శరీరి ప్రధానమూ, శాశ్వతమూను, శరీరమప్రధానమూ, అశాశ్వత మూను కనుకనె శరీరం శరీరిని ఆశ్రయించి ఉంటుందని విశిష్టాద్వైత మత సిద్ధాంతం. ఇది శ్రీరామానుజ సిద్ధాంతం దీన్నే మనసా, వాచా, కర్మణా - త్రికరణశుద్ధిగా - విశ్వసించి, తదుచితరీతిని అన్నమాచార్యులు శాశ్వతుడైన భగవంతునికై తన జీవి తాన్నే కైంకర్యంచేసి తరించాడు దాన్ని భగవద్భక్తిలో, రక్తిలో ఆధ్యాత్మిక చింతనలో, నీతి వైరాగ్య ప్రబోధంలో తన సంకీర్తనలన్నిటా నిరూపించి నిత్యు డయ్యాడు అన్నమాచార్యులు

## 3 1 ఆధ్యాత్మికత :

గురుభక్తి పురస్సరంగా, భగవద్భక్తిని జ్ఞానమనే యజ్ఞంతోపోల్చి వైరాగ్య భావపూరితంగా అత్యంత మనోహరంగా, అలంకారిక శైలీవిన్యాసంతో ఆలపించాడు అన్నమాచార్యుడు-

"జ్ఞానయజ్ఞ మీగతి మోక్షసాధనము
నానార్థములు నిన్నేనడపె మాగురుడు ॥పల్లవి॥

అలరి దేహమనేటి యాగశాలలోన
బలుపై యజ్ఞానపు పశువుబంధించి
కలసి వైరాగ్యపుకత్తులఁ గోసికోసి
వెలయ జ్ఞానాగ్నిలో వేలిచె మాగురుడు ॥జ్ఞాన॥

మొక్కుచు వైష్ణవులనే మునిసభ గూడబెట్టి
చొక్కుచు శ్రీపాదతీర్థ సోమపానము నించి
చక్కఁగా సంకీర్తన సామగానము చేసి
యిక్కువతో యజ్ఞము సేయించెఁబో మాగురుఁడు ॥జ్ఞాన॥

తదియ్య గురుప్రసాదపు పురోడాశమిచ్చి
కొదదీర ద్వయమను కుండలంబులు వెట్టి
యెదలో శ్రీవేంకటేశు నిటు ప్రత్యక్షము చేసె
యిదివో స్వరూపదీక్ష యిచ్చెను మాగురుడు ॥జ్ఞాన॥"

(అధ్యా సం 1-148)

అందుకే ఈ సిద్ధాంతాన్ని వివరించా డీ సంకీర్తనల్లో-

"దేహము దానస్థిరమట దేహి చిరంతనుఁడౌనట
దేహపు మోహపు సేఁతలు తీరుట లెన్నడొకో"

(అధ్యా స 1-136)

"ఓహో దేందేం వొగి బ్రహ్మమిదియని
సాహసమున శ్రుతివాకెడిని ॥పల్లవి॥

పరమును నపరముఁ బ్రకృతియు ననఁగా
వెరవు దెలియుచే వివేకము
పరము దేవుఁడును. అపరము జీవుఁడు,
తిరమైన ప్రకృతియె దేహము ॥ఓహో॥

జ్ఞానము జ్ఞేయము జ్ఞానగమ్యమును
పూని తెలియుటే యోగము
జ్ఞానము దేహాత్మ, జ్ఞేయము పరమాత్మ,
జ్ఞానగమ్యమే సాధించు మనసు ॥ఓహో॥

క్షరము నక్షరమును సాక్షి పురుషుఁడని
నరవిఁ దెలియుటే సాత్వికము
క్షరము ప్రపంచ, మక్షరము కూటస్థుఁడు,
సిరి పురుషోత్తముఁడే శ్రీ వేంకటేశుఁడు ॥ఓహో॥"

(అధ్యా సం 1-396)

దీన్ని మరింతగా సుస్పష్టం చేశాడు అన్నమాచార్యులు-

"దేహినిత్యుఁడు దేహము లనిత్యాలు
యీహల నా మనసా యిది మరువకుమీ ॥పల్లవి॥

గుదిఁ బాతచీరమాని కొత్త చీరఁగట్టినట్టు
ముదిమేను మాని దేహమొగిఁ గొత్తమేను మోచు
ఆదనఁ జంపఁగలేవు ఆయుధము లితని
గదిసి యగ్నియు నీరు గాలిఁ జంపఁగ లేవు ॥దేహి॥

ఈతఁడు నరకు వడఁ డీతఁడగ్నిఁ గాలఁడు
యీతఁడు నీటమునుగఁ డీతఁడు గాలిఁబోడు
చేతనుఁడై నర్వగతుండౌ చెలియించ దేమిటను
యీతల ననాది యీ తఁడిరవు గదలఁడు ॥దేహి॥"

(అధ్యా సం 7-185)

ఇది భగవద్గీతలోని శ్రీకృష్ణుని వాక్యాల్ని యథా
తథంగా నిరూపిస్తుంది "వాసాంసి జీర్ణాని
నానుశోచితు మర్హసి" (2 22-24)

అందుకే ఆ భగవంతుని భజించడం ఆ విధానాన్ని అన్నమాచార్యుడు అన్ని సంకీర్తనల్లోను ఆడిపాడి తరించాడు. ఉదాహరణకు

"పాడేము నేము పరమాత్మ నిన్నును
వేడుక ముప్పదిరెండువేళల రాగాలను ॥పల్లవి॥

తనువే వొళవు తలయే దండెకాయ
ఘనమైన వూర్పులు రెండుకట్టిన తాళ్ళు
మనసే నీ బద్దితాడు మరి గుణాలే జీవాళి
మొనసి పుట్టుగే మూలమైన కరడి ॥పాదేము॥"
(అధ్యా సం 9–178)

"నిత్యపూజ లివివో నేరిచిన నోహో
ప్రత్యక్షమైనట్టి పరమాత్మునికి ॥పల్లవి॥
తనువే గుడియట తలయే శిఖరమట
పెనుహృదయమే హరిపీఠమటా
కనుగొన చూపులె ఘనదీపములట
తనలోపలి యంతర్యామికిని ॥నిత్య॥"
(అధ్యా సం 6-82)

"గుఱ్ఱాలఁగట్టని తేరు కొంక కెంపైనాఁ బారీ
విఱ్ఱవీఁగుచుఁ దీసిని వేడుకతో జీవుఁడు ॥పల్లవి॥
సరిపెఱుఁదే రెండు జంట బండికండ్లు
సరవితోఁ బాదాలు బాఁపు నొగలు
గరిమఁ జూపులు రెండు గట్టిన పగ్గములు
దొరయై దేహరథము దోలీఁబో జీవుఁడు"
(అధ్యా. సం 6-152)

శరీరాన్ని వీణగా, గుడిగా, రథంగా ఊహించి తదుచితరీతిని భగవంతుని మహిమాన్వితమూ, శాశ్వతమూ అయిన గుణాన్ని ఆడిపాడుకొన్నాడు అనేకవిధాల అన్నమాచార్యులు

అన్నమాచార్యుల ఆధ్యాత్మిక ప్రతిపత్తికి ఎన్నైనా ఉదాహరణలివ్వవచ్చు. మచ్చుకు ఒకటి రెండు సంకీర్తనల్ని సమాలోచిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

"పోయఁగాలం బడవికిఁగాయు వెన్నెల కరణిని
శ్రీయుతుఁ దలఁచుఁడీ నరులు మాయఁబడి చెడక ॥పల్లవి॥

చిత్తము చేకూడుమకొని చిత్తైకాగ్రతను
చిత్తజగురునిఁ దలఁచుఁడీ చిత్తజుఁ జొరనీక ॥పోయ॥

బూరుగు మాకునఁ జెందిన కీరము చందమున
ఆరయ నిష్ఫలమగు మరియన్యులఁ జేరినను ॥పోయ॥

కూరిమి మా తిరువేంకటగిరి గురు శ్రీపాదములు
చేరినవారికి భవములు చెందవెపుడు నటుగాన ॥పోయ॥"

(అధ్యా సం 1-194)

ఇలాగే మరో ఉదాహరణ

"పోరాకపోయి తలఁపుననున్న దైవంబుఁ
జేరనొల్లక పరులఁ జేరఁదిరిగెదము ॥పల్లవి॥

వడిఁబారు పెనుమృగము వలలోపలఁ దగులు
వడివెడల గతిలేక వడఁకు చున్నట్లు
చెడని కర్మములలోఁ జిక్కి భవముల బాధఁ
బడియెదము గాక యేపనికిఁ దిరిగెదము ॥పోరా॥

నీరులోపలి మీను నిగిడి యామిషముకై
కోరి గాలము మ్రింగి కూలఁబడినట్లు
జారిపోయిననేల సంసారసౌఖ్యవి-
కారంపు మోహములఁ గట్టువడియెదము ॥పోరా॥

శ్రీవేంకటేశు నాశ్రితలోకరక్షకుని
భావింప దేవతాపతియైనవాని
సేవించు భావంబు చిత్త మొడఁబడక నే-
మీవలావలి వనుల నిట్లఁ దిరిగెదము ॥పోరా॥

(అధ్యా సం 1-331)

ఇలాగా అన్నమాచార్యులు తన జీవితమంతా ఆధ్యాత్మికచింతనతో భగవంతుడైన శ్రీ వేంకటేశ్వరునికే మీదు కట్టిన మహాభక్తాగ్రేసరుడు,

## 3. 2 నీతి

అన్నమాచార్యులు తన సంకీర్తనలన్నిటా భక్తి ప్రపత్తుల్ని, ఆధ్యాత్మికతతో ప్రధానంగా ప్రతిపాదించినా, సందర్భోచితంగా నీత్యుపదేశం చేయడంలో ఎంతో ప్రాముఖ్యం వహించినట్లు విదితమవుతుంది ఆతని పదరచనలో, భాషలో, భావంలో ప్రముఖంగా ప్రజాకవి కనుకనే ప్రజాశ్రేయస్సు నుద్దేశించి నీతి ప్రతిపాదక సంకీర్తనలు ఆడిపాడినట్లు తెలుస్తుంది

మనుజుడు ద్వంద్వాతీతుడై ఉండాలన్న దీ పదంలో వ్యక్తీకరించాడు అన్నమాచార్యులు. భగవంతుడే ప్రధానుడని భావం

"ఎండగాని నీడగాని యేమైనఁగాని
కొండలరాయఁడే మాకుల దైవము" (అధ్యా సం 1-214)

నీత్యుపదేశానికి పరాకాష్ఠ ఈ సంకీర్తన. నరుడెంత చదివినా, ఎంతవిన్నా, పాప పంకిలంలో పడిపోక సచ్ఛీల సంపన్నుడైతే ఉన్నతుడవుతాడంటాడు అన్నమాచార్యులు

"ఎంత చదివిననేమి వినిన తన
చింతయేలమాను సిరులేల కలుగు ॥పల్లవి॥

ఇతర దూషణములు యెడసినఁగాక
అతికాముకుఁడుగాని యప్పుడుగాక
మతిచంచలము గొంతమానినఁగాక
గతియేల కలుగు దుర్గతులేల మాను ॥ఎంత॥

పరధనముల యాస పాసినఁగాక
అరిది నిందలు లేనియప్పుడు గాక
విరసవర్తనము విడిచినఁగాక
పరమేల కలుగు నాపదలేల మాను ॥ఎంత॥

వేంకటపతి నాత్మ వెతకినఁగాక
కింక మనసునఁ దొలఁగినగాక
బొంకుమాట లెడసి పోయినఁ గాక
శంక యాల మాను జయమేల గలుగు ॥ఎంత॥
(అధ్యా సం 1-62)

కులం ప్రధానంగాదు గుణం ముఖ్యమని వేమన లాగానే మిక్కిలి చక్కగా వివరించాడు అన్నమాచార్యులు

"ఎక్కువ కులజుఁడైన హీనకులజుఁడైన
నిక్కమెరిగిన మహానిత్యుఁడే ఘనుఁడు ॥పల్లవి॥

వేదములు చదివియును విముఖుడై హరిభక్తి
యాదరించని సోమయాజికంటె
యేదియులేని కులహీనుఁడైనను విష్ణు–
పాదములు సేవించు భక్తుడే ఘనుఁడు ॥ఎక్కువ॥

పరమమగు వేదాంత పఠన దొరకియు సదా
హరిభక్తి లేని సన్యాసి కంటె
సరవిమాలిన యంత్య జాతికులజుఁడైన -
నరసి విష్ణుని వెదకు నాతఁడే ఘనుఁడు ॥ఎక్కువ॥

వినియుఁజదివియును శ్రీ విభుని దాసుఁడుగాక
తనువు వేఁపుచునుండు తపసికంటె
యెనలేని శ్రీవేంకటేశు ప్రసాదాన్న -
మనుభవించిన యాతఁడప్పుడే ఘనుఁడు ॥ఎక్కువ॥
(అధ్యా సం 1-318)

"ఏకులజుఁడేమి ఎవ్వడైననేమి
ఆకడ నాతఁడె హరినెరిగిన వాఁడు" (అధ్యా సం 1-292)

వీటన్నిటా శ్రీ కృష్ణ దేవరాయల ఆముక్త మాల్యదలోని మాలదాసరి గుర్తుకు వస్తాడు

పరులను కొలుచుట కంటే, ఇతరులను యాచించుట కంటే హైన్యమూ, దైన్యమూ లేదంటాడు అన్నమాచార్యులు

"ఛీఛీ నరులదేఁటి జీవనము
కాచుక శ్రీహరి నీవే కరుణింతుగాక ॥పల్లవి॥

అడవిలో మృగ జాతియైనఁ గావచ్చుఁ గాక
వడి నితరులఁ గొలువఁగ వచ్చునా
వుడివోని పక్షియై వుండనైనా వచ్చుఁగాక
విడువ కెవ్వరినైనా వేడ వచ్చునా ॥చీచీ॥
(అధ్యా సం 1-397)

పిపీలికాది బ్రహ్మాండ పర్యంతమూ సర్వమూ బ్రహ్మమయమని వివరించాడు అన్నమాచార్యులు తద్వారా సర్వసమానత్వాన్ని స్పష్టం చేస్తున్నాడు. భగవంతుని సృష్టిలో హెచ్చు తక్కువలు లేవు ఉంటే, అవి మనం కల్పించుకొన్నవి మాత్రమే

"తందనాన ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥పల్లవి॥

బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె పర
బ్రహ్మ మొకటే పరబ్రహ్మ మొకటె ॥తంద॥

కందువగు హీనాధికము లిందులేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతు కులమంతా నొకటే
అందరికి శ్రీహరె అంతరాత్మ ॥తంద॥

నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటు నిద్రదియు నొకటే
మెండైన బ్రాహ్మణుఁడు మెట్టు భూమియొకటే
చండాలుఁడుండేటి సరి భూమి యొకటే ॥తంద॥
(అధ్యా సం 2-385)

కనుకనే అజ్ఞానంలో మునిగి, ఇతరుల కార్యమంతా తమదేనని భావించే వెట్టివారిని హెచ్చరిస్తున్నాడు అన్నమాచార్యులు బహుశః ఇది వ్యక్తిగతమైన అనుభవమనిపిస్తుంది సోమరిపోతులు కావద్దంటాడు ఆ మహనీయుడు

"వెఱ్ఱులాల మీకు వేడుక గలితేను
అఱ్ఱువంచి తరుకల్లంగ రాదా ॥పల్లవి॥

ముడిచి వేసిన పువ్వు ముడువ యోగ్యము గాదు
కుడిచి వేసిన పుల్లె కుడువఁగాఁ గాదు
బడినొకరు చెప్పినఁ బ్రతి చెప్పఁబోతేను
అడరి శ్రీహరి కది అరుహము గాదు ॥వెట్టి॥

ఉమిసిన తమ్మలో నొక కొంత కప్రము
సమకూర్చి చవిగొని చప్పరించనేల
అమరఁగ ఛాయాపహారము చేసుక
తమ మాట గూర్చితే దైవము నగఁడా ॥వెట్టి॥

నేతి బీరకాయ నేయి అందులేదు
రాతినీరునికి బీరము ఇంచుకా లేదు
పూత బూరుగుపండు కడుపులోన దూది
యేతుల నుడుగులు యెక్కునా హరికి ॥వెట్టి॥

యెన్నఁగ శ్రీవేంకటేశుఁడాళ్ళ పాక
అన్నమాచార్యులు అఖిల దిక్కులు మెచ్చ -
నున్నతితోఁ బాడి రొకఁడెవ్వఁడో తాను
నన్ను నొరసునట నమ్మతా హరికి ॥వెట్టి॥

(అధ్యా. సం 2-494)

ఇలాగా నీత్యుపదేశం చేయడమేగాదు ఆత్మ పరిశీలన అన్నమాచార్యులలో బహువిశిష్టంగా విదితమవుతుంది ఇది కేవలం ఆయన ఆత్మ పరిశీలనమే గాదు అందరికీ ఇదీ వారి వారి ఆత్మ పరిశీలనమే

"ఇట్టి నా వెట్టితనము లేమని చెప్పుకొందును
నెట్టన నిందుకు నగి నీవే దయఁజూడవే ॥పల్లవి॥

పాటించి నాలో నుండి పలికింతువు నీవు
మాటలాడ నేరుతునంటా మరి నే నహంకరింతును
నీటున లోకము లెల్లా నీవే యేలుచుండఁగాను
గాఁటాన దొరనంటా గర్వింతు నేను ||ఇట్టి||

నెమ్మదిఁ బ్రజలనెల్లా నివే పుట్టించఁగాను
కమ్మి నేనే బిడ్డలఁ గంటినంటా సంతసింతును
నమ్మతి నీవే సర్వసంపదలు నొసఁగఁ గాను
యిమ్ముల గడించుకొంటి నివి నేనంటా నెంతు ||ఇట్టి||

మన్నించి యిహపరాలు మరి నీవే యియ్యఁగాను
యెన్నుకొందు నా తపోమహిమ యిది యనుచును
వున్నతి శ్రీవేంకటేశ నన్ను నేమి చూచేవు
అన్నిటా నాయాచార్యుని విన్నపమే వినవే ||ఇట్టి||

(అధ్యా సం 2–304)

ఇంకా ఆత్మ పరిశీలన చేసుకోవడంలో పరాంకోటి అయిన సంకీర్తన అన్నమాచార్యుని జ్ఞానధన్యుని గావించినది

"చదివితిఁ దొల్లి కొంత చదివేనింకాఁ గొంత
యెదిరి నన్నెఱఁగను యెంతైన నయ్యో ||పల్లవి||

వొరుల దూషింతుఁగాని వొకమారైన నా
దురిత కర్మములను దూషించను
పరుల నవ్వుదుఁ గాని పలుయోనికూపముల
నరకపు నా మేను నవ్వుకోను ||చది||

లోకులఁ గోపింతుఁ గాని లోని కామాదులనెటి
కాకరి శత్రువుల మీఁదఁ గడుఁ గోపించ
ఆకడ బుద్ధులు చెప్పే అన్యుల బోధింతుఁగాని
తేకువ నాలోని హరిఁ దెలుసుకోలేను ||చది||

యితరుల దుర్గుణము లెంచి, యెంచి రోతుగాని
మతిలో నాయాసలు మానలేను
గతిగా శ్రీవేంకటేశుఁగని బ్రదికితిఁగాని
తతి నిన్నాళ్ళ దాఁకా దలపోయలేను ॥చదివి॥

(అధ్యా సం 10–74)

ఇలాగా ఆత్మ పరిశీలనతో సముచిత రీతిని నీత్యుపదేశం గావించిన ఉత్తమ దేశికుడు అన్నమాచార్యులు

## 3.3 వైరాగ్యం

ఆధ్యాత్మిక చింతనాపరుడై, చక్కటి నీత్యుపదేశం గావించిన అన్నమాచార్యులు అత్యంత సముచితరీతిని వైరాగ్య నిరూపణగావించడం గమనించదగ్గ అంశం

తనచుట్టూ ఉండి, తన నంటిఉన్న సమస్తమూ తనకుపకరించేదిగాదనీ, వయసు, వయసుతోపాటు కాలమూ గతించిపోతున్నాయంటూ మిక్కిలి వగచెంది, దిగులుపడిన రీతినీ పదంలో అభివ్యక్తీకరించాడు-

"అయ్యో పోయఁ బ్రాయముఁ గాలము
ముయ్యంచు మనసుననే మోహమతినైతి ॥పల్లవి॥

చుట్టంబులా తనకు సుతులుఁ గాంతలుఁజెలులు
వట్టి యాసలఁ బెట్టు వారేకాక
నెట్టుకొని వీరు గడు నిజమనుచు హరినాత్మఁ
బెట్టనెరక వృథా పిరివీకులైతి ॥అయ్యో॥

తగుబంధులా తనకుఁదల్లులునుఁ దండ్రులును
వగలఁ బెట్టుచుఁ దిరుగువారేకాక
మిగుల వీరలపొందు మేలనుచు హరినాత్మఁ
దగిలించలేక చింతాపరుఁడనైతి ॥అయ్యో॥

అంత హితులా తనకు నన్నలును దమ్ములును
నంతువాసికి బెనగువారేకాక
అంతరాత్ముడు శ్రీవేంకటాద్రీశుఁ గొలువ కిటు
సంతకూటముల యలజడికి లోనైతి ॥అయ్యో॥

(అధ్యా సం 1-179)

ఇందులో లోకన్యాయాన్ని, తీరుతెన్నుల్ని వ్యక్తంచేసి భగద్భక్తిపరుడై విరాగి కావడమే ముఖ్యమంటాడు ఇలాగే సమస్త ప్రజానీకానికి తానెరిగిన వైరాగ్యాన్ని నిరూపిస్తున్నాడు, వైరాగ్య మార్గాన్ని చూపిస్తున్నాడు-

"కొండో నుయ్యో కుమతులాల
తుండుముండు తట్టుముట్టు తాఁకైనఁగనుఁడీ ॥పల్లవి॥

కాకివోటు జముచేత కందుకుందు మరుచేత
మాకా పనిగాదు మనుజులాల
పోకుమని యాఁపరాదు పొమ్మని చెప్పఁగరాదు
మీకుమీకే చూచుకొందు మీరేకనుఁడు ॥కొండో॥

గాములిల్లు పుట్టమీఁది కప్పతోలు పైకప్పు
నేమా యెఱఁగము నిపుణులాల
పాము నోరికడి మీప్రాణపుటూరుపు గాలి
జాము జాము మేలుఁగీడు చక్కఁజేయఁగనుఁడు ॥కొండో॥

రచ్చమాని చింతకింద రాఁపులకూటమి పొందు
ముచ్చోచిచ్చో మూఢులాల
యెచ్చరికతోడ వేంకటేశుదాసులఁ గూడి
పచ్చిగచ్చు మేనితోడ భయమెల్లఁ బాయుఁడు ॥కొండో॥"

(అధ్యా సం. 1-160)

బ్రదుకాలన్న మమకారమెంతో బ్రదుకులోని కడగండ్లని గాంచినాక ఆబ్రదుకుపై నెంత రోత గలదో విస్పష్టం చేశాడు అన్నమాచార్యులు ,

"ఎనుపోతుతో నెద్దు నేరుగట్టిన యట్లు
మెనసి ముందర సాగదేఁటి బ్రదుకు ॥పల్లవి॥

కడలేని యాసచే కరఁగి కరఁగి చిత్త-
మెడమ వంకకు వచ్చె నేఁటి బ్రదుకు
పొదవైన సమతతోఁ బొదలఁ బొదల మాన-
మిడుమపాట్లఁ బడెనేఁటి బ్రదుకు ॥ఎను॥

తెగదెంపులేని భ్రాంతికిఁజిక్కి యాచార-
మెగసి గొందులు దూరె నేఁటి బ్రదుకు
వగఁగొన్న మోహతాపము వేరుగ విజ్ఞాన-
మిగురువెట్టక మానె నేఁటిబ్రదుకు ॥ఎను॥

భావింప రోఁత లోఁబడి పొరలెడి సౌఖ్య-
మేవగింపఁడు జీవుఁడేటి బ్రదుకు
శ్రీవేంకటేశుపై చిత్త మొక్కకెకాని
యేవంక సుఖము లే దేఁటిబ్రదుకు ॥ఎను॥"

(అధ్యా సం. 1-156)

"ఏదితుద దీనికేది మొదలు
పాడుకోను హరిమాయఁ బరగు జీవునికి ॥పల్లవి॥

(అధ్యా సం. 1-102)

"ఏమి గలదిందు నెంతగాలంబైన
పామరపుభోగ మాపద వంటిదరయ ॥పల్లవి॥"

(అధ్యా. సం 1-112)

అంతశ్శత్రువులైన అరిషడ్వర్గాలు మనపై అధికారం వహించి వశపరచు కొంటాయి వాటిని జయించడానికి మార్గం భగవన్నామస్మరణమూ, శరణమూను, తద్వారా భగవంతుడు మనల్నికాపాడి వాటిపై అధికారాన్ని కల్పిస్తాడని ఆలంకారిక రీతిలో మధురమంజులంగా వివరించాడు అన్నమాచార్యులు

"కాయమనే వూరికిఁ గంతలు తొమ్మిదియాయ
పాయక తిరిగాదేరు పాపపు తలారులు ॥పల్లవి॥

కాముఁడనియెడిరాజు గద్దె మీఁద నుండఁగాను
దీముగోపపు ప్రధాని దిక్కులేలీని
కోమలపు జ్ఞానమెల్లాఁ గొల్లఁబోయ నాడనాడ
గామిడులై రింద్రియపుఁగాఁపు లెల్లా నిదివో ॥కాయ॥

చిత్తమనే దళవాయి చింతలనే పౌఁజు పెట్టె
యిత్తల విషయములు యెన్నికిచ్చిరి
తుత్తుములై కోరికెల దొందెము దేఁగఁగఁ జొచ్చె
జొత్తుల వెరగుపడి చూచీఁ బుట్టుగులు ॥కాయ॥

బలు సంసారమనేటి భండారము ఘనమాయ
కలదీగి జవ్వనపు కైజీతము
యిలలో శ్రీవేంకటేశుఁడింతలో జీవుఁడనేటి
బలుపుని రాజుఁజేసి పాలించె నన్నును ॥కాయ॥
(అధ్యా సం 1-488)

సాంసారికబంధం మిక్కిలి చెడ్డదనీ, ఆబంధవిముక్తి కలిగించుమనీ కోరుకొంటాడు అన్నమాచార్యులు ఎంతో ఇందులో వైరాగ్యముంది

"పాయపు మదముల బంధమా మము
జీయని యిఁకఁ గృపసేయఁ గదో ॥పల్లవి॥

ధనధాన్యములై తనులంపటమై
పనిగొంటివి ననుబంధమా
దినదినంబు నను తీదీపులఁ బెను
గనివైతివి యిఁకఁ గావఁగదో ॥పాయ॥
సతులై సుతులై చలమై కులమై
పతివైతివి వోబంధమా
రతిఁ బెరరేఁపుల రంతుల యేపుల

గతిమాలితి వీడఁ గావఁగదో ॥పాయ॥
పంపైపొఁడై బలుసంపదలై
బంటుగ నేలితి బంధమా
కంటిమిదివో వేంకటగిరిపై మా
వెంటరాక తెగి విడువఁగదో ॥పాయ॥"

(అధ్యా సం 1-238)

భవబంధాలను తెంచుకొని ముక్తికాంతాబంధంలోకి వెళ్ళాలన్న విషయాన్ని వ్యవసాయంతో పోల్చి మనోజ్ఞంగా వైరాగ్యభావాన్ని వివరించాడు అన్నమాచార్యులు

"పంటల భాగ్యులు వీరాబహువ్యవసాయులు
అంటిముట్టి యిట్లఁ గాపాడుదురు ఘనులు ॥పల్లవి॥
పొత్తుల పాపమనేటి పోడునటికివేసి
చిత్తమని యెడు చేను చేనుగా దున్ని
మత్తిలి శాంతమనే మంచి వానపదనున
విత్తుదురు హరిభక్తి వివేకులు ॥పంటల॥
కామ క్రోధాదులనే కలుపు దవ్వివేసి
వేమరు వైరాగ్యమనే వెలుఁగు వెట్టి
దోమటి నాహార విధుల యెరువులువేసి
పొమమన్నారు జ్ఞానపుఁ బైరుదోృగజనులు ॥పంటల॥
యెందు చూచిన శ్రీ వేంకటేశుఁడున్నాఁడనియెడి
అందిన చేని పంట లనుభవించి
సందడించి తమవంటి శరణాగతులుఁ దాము
గొంది నిముడుకొందురు గురుకృప జనులు ॥పంటల॥

(అధ్యా సం. 9-70)

మానవ జీవితమే ఒక నాటకమని అత్యంత సహజరీతిని వివరించాడు అన్నమాచార్యులు

"ఇన్నియుఁ జదువనేల యింతా వెదకనేల
కన్ను దెరచుటొకటి కను మూయుటొకటి" ॥పల్లవి॥

(అధ్యా సం. 10-64)

"నానాటి బదుకు నాటకము
కానక కన్నది కైవల్యము ॥పల్లవి॥

పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్ట నడిమి పని నాటకము
యెట్టనెదుటఁ గల దీ ప్రపంచమును
కట్టఁగడపటిది కైవల్యము ॥నానాటి॥

కుడిచే దన్నము కోక చుట్టెడిది
నడుమంత్రపు పని నాటకము
వొడిఁ గట్టుకొనిన వుభయ కర్మములు
గడి దాఁటినపుడె కైవల్యము ॥నానాటి॥

తెగదు పాపమును తీరదు పుణ్యము
నగి నగి కాలము నాటకము
యెగువనె శ్రీవేంకటేశ్వరుఁ డేలిక
గగనము మీదిది కైవల్యము ॥నానాటి॥

(అధ్యా సం 9–287)

అందుకే భవబంధవిముక్తికి మూలం సర్వథా, సర్వదా హరినామ స్మరణమే దిక్కని సిద్ధాంతీకరించాడు అన్నమాచార్యులు

"అఁకటి వేళల నలపైన వేళలను
తేఁకువ హరినామమే దిక్కు మఱిలేదు ॥పల్లవి॥

కొఱమాలి ఉన్నవేళ కులము చెడినవేళ
చెఱవడి వొరులచేఁ జిక్కినవేళ
వొఱపైన హరినామ మొక్కటే గతిగాక
మఱచి తప్పిననైన మఱిలేదు తెరఁగు ॥అఁకటి॥

ఆపద వచ్చిన వేళ యారడిఁ బడినవేళ
పాపపు వేళల భయపడిన వేళ
వోపినంత హరినామ మొక్కటే గతిగాక
మాపుఁ దాఁకాఁ బొరలిన మఱిలేదు తెఱఁగు ॥అఁకటి॥

(అధ్యా సం 1-158)

ఈ విధంగా వైరాగ్య నిరూపణం తన సంకీర్తనల్లో పలురీతులుగా పదే పదే చెప్పి జీవన్ముక్తుడు కావటానికి మార్గోపదేశం చేశాడు మానవులకు అన్నమాచార్యులు

ఇంతేగాక సంసారంపై ఎంత విరక్తుడో ఈ సంకీర్తనలో వ్యక్తీకరించాడు ఆచార్యులు ,

"సడిఁ బెట్టెఁ గటకటా సంసారము చూడ
జలధి లోపలి యీఁత సంసారము ॥పల్లవి॥

జమునోరిలో బ్రదుకు సంసారము చూడ
చమురు దీసిన దివ్వె సంసారము
సమయించుఁ బెనుదెవులు సంసారము చూడ
సమరంబులో మనికి సంసారము ॥సడి॥

సందిగట్టిన తాడు సంసారము చూడ
సందికంతలతోన సంసారము
చందురుని జీవనము సంసారము చూడ
చంద మేవలె నుండు సంసారము ॥సడి॥

చలువలోపలి వేఁడి సంసారము చూడ
జలపూఁతబంగారు సంసారము
యిలలోనఁ దిరువేంకటేశ నీ దాసులకు
చలువలకుఁ గడుఁ జలువ సంసారము ॥సడి॥

(అధ్యా సం. 1-199)

ఈ విధంగా అన్నమాచార్యునిలో ప్రవృత్తి భోగాలపై ఎంత ఆసక్తి ఉండేదో నివృత్తి భోగాలపై సైతం అంతకంటే అధికమని స్పష్టమవుతుంది అంటే ఎంతగా భగవత్పరమైన శృంగారాది విషయాలను వర్ణించి తరించాడో ఐహిక సుఖ విముఖత్వాన్ని సైతం అంతకంటే ఎక్కువగానే ఆధ్యాత్మిక, నీతి, వైరాగ్యనిరూపణ మూలంగా అన్నమాచార్యులు అభివ్యక్తీకరించాడు ఈ ప్రవృత్తి, నివృత్తిభోగాలను గూర్చి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వివరించిన తీరు గమనించదగ్గది "భోగములు ప్రవృత్తి భోగములని, నివృత్తి భోగములని రెండు విధములుగా విభజింపవచ్చును ఎందుకనఁగా ప్రవృత్తి మార్గమునందుండి ప్రాపంచికములగు గృహ

శయ్యాది భోగముల ననుభవించుట యందెంత యానందము గలదో యంతే - మఱియు నంతకన్న నెక్కువయే - నివృత్తి మార్గమునకుఁ జేరిన భక్తి, త్యాగము, వైరాగ్యము, శాంతి - మొదలగువాని ననుభవించు నప్పుడును గలదు ఆనందమను నది మనోధర్మముగాని వస్తుధర్మముగాదు ఏ కారణముచేతఁగాని దేనియందు మనస్సు దృఢముగా లగ్నమగునో దానిననుభవించునప్పుడు మనకు నిరతిశయానందము గలుగును. అట్టి యానందమును సాధింపఁ బ్రయత్నించుటయే రసికత్వమునకు లక్షణము"[2] పై వింగడింపులో గల రహస్యం అన్నమాచార్యులకు వర్తిస్తుంది ఆయన సన్యాసి గాదు. పెద్ద సంసారి సంసారి అయియుండి సంసారంపై రోయడమంటే అన్నమాచార్యుల శృంగార, అధ్యాత్మ సంకీర్తనలలోని విశిష్టత విదితమవుతుంది అందులో ప్రవృత్తి భోగాలపై నెంతటి ప్రత్యయమో అంతకంటే ఎక్కువగా నివృత్తి భోగాలపై ఆసక్తి గల పరమయోగీశ్వరుడు ఇందుకు తన గురించే వ్యక్తీకరించినా సంకుసాల నృసింహకవి పద్యం అన్నమాచార్యులకు సైతం సమంగా సమన్వయిస్తుంది అయితే శృంగారపరంగా గాదు కాని వైరాగ్యపరంగా సంపదిస్తుంది

"యతివిటుఁడు గాక వోపు పెట్లస్మదీయ
కావ్య శృంగార వర్ణనా కర్ణనమున
విటుఁడు యతిగాక వోరాదు వెస మదీయ
కావ్య వైరాగ్య వర్ణనాకర్ణనమున"[3]

నృసింహకవి కేవలం ఇతర సంబంధి విషయాలనే చెప్పాడని భావించినా, అన్నమాచార్యులు మాత్రం ప్రతిపదంలోను పైవిషయాలను త్రికరణశుద్ధిగా నిరూపించుకొన్నాడని విశ్వసించడమే సముచితం



## సూ చి క లు

1 i) Dr. P. Nagaraja Rao — Sri Madhva's Dvaita Philosophy p p 34-38

ii) వెంపటి కుటుంబశాస్త్రి — అద్వైత సిద్ధాంతము పు 53-55

iii) డా॥ కె వి రామకృష్ణమాచార్యులు — విశిష్టాద్వైతము పు 55-59

iv) డా॥ కె కృష్ణమూర్తి — త్రిమతాచార్యులు-తత్వ-ప్రభావ-పు. 25-29

Golden Jubilee Celebrations Souvenir - Tirumala Tirupati Devasthanams - 1933 - 1983 - April 22-24, 1984

v) Dr. K C. Varadachari — Sri Ramanuja's Theory of Knowledge - A study - pp 125-130

vi) వి సీతారామయ్య — శ్రీ పురందరదాసరు . పు 44-49

vii) గౌరిపెద్ది రామసుబ్బశర్మ — పీఠిక - అధ్యాత్మసంకీర్తనలు - ౧ సంపుటము పు 21-26

2 అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి — రాయలనాటి రసికత సారస్వతాలోకము పు 3

3 నృసింహకవి, సంకుసాల — కవికర్ణ రసాయనము - అవతారిక - పు 22



# 4.0 సంగీతాభినయాలు-అన్నమాచార్యులు

ఇతఃపూర్వం మనం అన్నమాచార్యుల పదకవితను వివిధ దృక్కోణాలనుంచి పరిశీలించాము అయితే అంతటితో పరిపూర్ణంగా ఆస్వాదించినట్లు కాదు అన్నమాచార్యుల సంగీతాభినయాల గూర్చి తెలుసుకొంటేనే సంపూర్ణత అన్నమాచార్యులకు "పదకవితాపితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ" బిరుదులున్న విషయం మనం గుర్తించాము ఆయన మహావాగ్గేయకారుడు. తెలుగులో ప్రప్రథమ వాగ్గేయకారుడన్న విషయమూ మనం గమనించాము ఆ మహాభక్తి రక్తి సంపూరితుడైన అన్నమాచార్యుల సంకీర్తనల్లో అభివ్యక్తీకరించిన సంగీతాభినయాల స్థూల పరిశీలన మవసరం ఎంతైనా ఉంది. అది ఈ పరిశీలనాత్మకాధ్యయనానికి అతిముఖ్యం వాగ్గేయాలకి సమానాదరణని కూర్చి అలవోకగా సంకీర్తనలల్లిన మహనీయుడు అన్నమాచార్యులు. ఆమహాత్ముని, ఆ మహావాగ్గేయకారుని సంగీతాభినయాల్ని - పెద్దలు ఉట్టంకించిన వాటిని - పరిశీలిస్తే ఇది పరిపూర్ణం కాగలదు సంగీతాభినయాల నెరిగిన వాణ్ణికాను నేను తజ్ఞులు చెప్పిన వాటిని వివరించడమే నేను చేసే యత్నం ఇది జిజ్ఞాసువుల కుపకరించగలదు

## 4 1 సంగీతం .

'గీతం వాద్యం తథా నృత్యం సంగీతముచ్యతే" గీతవాద్య నృత్యాలు కలిసినదే సంగీత మంటారు కొందరు కానీ మరికొందరి ప్రకారం "గీత వాద్యోభయం యత్ర సంగీత మితికేచన"—" అంటే గీతవాద్యాల సమ్మేళనమే సంగీతం ధాతు మాతువుల సమ్మేళనం సంగీతం ధాతువు సప్తస్వర సంబంధికాగా, గేయసంబంధి మాతువు వాక్+గేయాలను నిర్మించగలవాడు వాగ్గేయకారుడు. ఈ విషయం పూర్వోక్తం. ఇలాంటి మహా వాగ్గేయకారుడు అన్నమాచార్యులు. సంగీత సాహిత్యాలను సమంగా తెలిసిన మహాజ్ఞాని అన్నమాచార్యులు ఆయన సాహిత్యప్రపంచం శ్రీ వేంకట వల్లభ శృంగారాధ్యాత్మ పరమైనది సంగీత జ్ఞానం అనంతం. అసామాన్యం. అసదృశం అందువల్లనే ముప్పైరెండువేల సంకీర్తనలు రచించాడు; సంకీర్తన లక్షణం సంస్కృతంలో రచించిన సంగీతవేత్త ఇది పూర్వోక్తం ఆయన సంకీర్తనలు వివిధరీతుల ఉన్నవి ప్రసక్తాను ప్రసక్తంగా వివరించడం జరిగింది,

ఆయన సంకీర్తనలలో దేశి సంగీత సంబంధి, జానపద సంగీతధోరణులు ఉన్నాయి ఇంక ఆయన సంగీత జ్ఞానాన్ని కొంత వివరించవలసి ఉంది

## 4.1.2 సంకీర్తనలలోని సంగీత ప్రశంస

అన్నమాచార్యులు సంగీతాన్ని తన సంకీర్తనల్లో పొందుపరచి తన సంగీత జ్ఞానాన్ని ప్రదర్శించాడు

"బత్తిగలవాడవు పదంతి పాట వింటివి
చిత్తము రంజించి నీకు చెవిబట్టైనా" (శృం సం 25-233)

"
సంకీర్తన
లెడయక భాగవతు లెడయక పాడగా" (శృం. సం 24–281)

సంగీతం కిన్నెర వాయిస్తూ-వాద్య సహితంగా-గూడ ఉంది

"గిరులెక్కి లకిమమ్మ కిన్నెర వాయించుకొంటా
పరగనీమోము తప్పక చూడగా

యెదురు మేడపై నెక్కి యెలుగెత్తి పాడిపాడి
వుదుటున దామర పూవుల వేయగా' (శృం. సం 25–161)

కిన్నెర, పిల్లనగోవి సహాయంతో పాడిన సంగీతం—

"ఎంత నేర్చెనే యీ మగువా
వంతమె నెరపీ బాయము మీదా ॥పల్లవి॥

చుక్కల పొడవగు సుదతి చన్నుగవ
జక్కవ లెగరుచు జరయగను
గక్కన కిన్నెర కాయ గూండ్లు
దొక్కిపట్టి తంత్రులు మీటీని ॥ఎంత॥

గుట్టున నుందక కొప్పు తుమ్మెదల
తెట్టెలు చెదరగ దెరవ యిదె
కట్టెడి గోళ్ళ కత్తుల బోనున
బెట్టుచు ప్రతులే బిగి ఇంచీని ॥ఎంత॥

యిత్తరి శ్రీవేంకటేశ్వరుఁ గూడఁగఁ
గుత్తిక లోపలి కోవిల లా
బిత్తరి యధరవుఁ బిల్లఁ గోవిలో
నొత్తి నిలిపి తని వొందించీని ॥ఎంత॥

(శృం. సం 30-63)

పదంలో పాట, రాగమూ రెండింటిని అన్నమాచార్యులు కూర్చిన తీరు అనన్య సామాన్యం. ఆయన సంగీత జ్ఞానానికి తుదిమెట్టు

"రతి నీ పలుకులకు రామనడపులకు
గతిగూడఁ గడమ రాగము సేయు మీ ॥పల్లవి॥

పిల్లఁ గోవిరపములు బెరయించఁగా నదే
గొల్లె తలమట్టెలకుఁ గూడ సుతి
పల్లవపుఁ బదముల పాటలు పాడుచుఁ
గల్లగాదు కడమ రాగము సేయుమీ ॥రతి॥

ముందు నీ సంకిపు రివరపమునకు గోపికలెల్ల
కుందణపు టందెలకుఁ గూడె సుతి
చిందుల రాగములు చిలికించి చిలికించి
కందువులఁ గడమ రాగము సేయుమీ ॥రతి॥

పెనఁగే నీ వూరుపులు పెరుగమ్మె కాంతల
కొన గోరితాఁకులకుఁ గూడె సుతి
చెనకితి విందరిని శ్రీవేంకటేశ్వర
కనుచొక్కి కడమ రాగము సేయుమీ ॥రతి॥

(శృం సం 30-114)

ఇలాగా తాను సంగీతాన్ని రాగప్రసక్తిని తన పదాల్లో ప్రదర్శించాడు అన్నమాచార్యులు

## 4 1 3 అన్నమాచార్యుల రాగాలు .

అన్నమాచార్యులు ముప్పైరెండువేల పదాలు రచించినా మన కీనాడు లభించిన పదాలు పదిహేను వేల వరకు ఉన్నాయి ఈ పదాలకు రాగాలను సూచించిన మొదటి

వాగ్గేయకారుడు అన్నమాచార్యులు అంతకుముందే 'సింహగిరి వచనాలు' పేరుకి వచనాలైనా దైవస్తుతి పూర్వకమై పాడుకోడానికి ఉపకరించే వాటిని రచించిన కృష్ణమాచార్యులు రాగాల ప్రసక్తి చేయలేదు అందుకే అన్నమాచార్యులు అనేకం రచించి పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడుగా ప్రసిద్ధికెక్కాడు ఆయన ప్రయోగించిన రాగాలు అమరసింధు, ఆందోళి, ఆబాలి, ఆరభి, ఆహిరి, ఆహిరినాట, కన్నడగౌళ, కన్నడ బంగాళం, కాంబోది, కుంతలవరాళి, కురంజి, కేదారగౌళ, కొండమలహరి, కోకిలపంచమం, కౌశి, గంభీరనాట, గుండక్రియ, గుజ్జరి, గుమ్మకాంబోది, గౌళ, ఘంటారావం, జాళి, చాయ, చెంచుమలహరి, ఛాయానాట, తెలుగుకాంబోది, తోడి, దన్నాసి, దేవక్రియ, దేవగాంధారి, దెశాక్షి, దేశి, దేసాళం, ద్రావిడభైరవి, ధన్యాసి, నట్టనారాయణి, నాగగాంధారి, నాగవరాళి, నాట, నాదరామక్రియ, నారణి, నారాయణి, నీలాంబరి, పడపంజరం, పాడి, ప్రతాపనాట, పిసాళం, ఫలమంజరి, పూరభి, పూర్వగౌళ, బాలహంస, బౌళి, బౌళిరామక్రియ, భంగాళం, భల్లాటి, భవుళి, భూపాలం, భైరవి, మంగళకౌశిక, మధ్యమావతి, మనోహరి, మలహరి, మాళవి, మాళవిగౌళ, మాళవశ్రీ, ముఖారి, ముఖారిపంచ, మేఘరంజని, మేచబౌళి, రామక్రియ, రామగౌళ, రీతిగౌళ, రేవగుప్తి, లలిత, వరాటి, వరాళి, వసంతం, వసంతవరాళి, వేళావళి, శంకరాభరణం, శుద్దదేశి, శుద్దవరాళి, శుద్ధవసంతం, శోకవరాళి, శ్రీ, సామంతం, సామరాగం, సామవరాళి, సాళంగం, సాళంగనాట, సావేరి, సింధురామక్రియ, సోమరాగం, సౌరాష్ట్రం, సౌరాష్ట్ర గుజ్జరి, హిందోళం, హిందోళ వసంతం, హిజ్జిజి - ఇంకా కొన్ని పదాలు రాగ నిర్దేశ రహితంగా ఉన్నాయి

ఇందులో కొన్ని రాగాలు అన్నమాచార్యులకు ఆదరపాత్రమైనవని తెలుస్తుంది ఆనాడు ప్రసిద్ధి పొందినా, ఈనాడు వాటికి ప్రచారం లేకుండా పోయింది. కొన్ని ఈనాడూ బతికి బట్టగట్టాయి

## 4.1.4 తాళప్రసక్తి

అన్నమాచార్యులు తన పదాలకు వాడిన రాగాల పేర్లు మాత్రమే పేర్కొన్నాడుగాని తాళగతిని చెప్పలేదు అతఃపూర్వమే పన్నెండో శతాబ్దిలో వెలసిన జయదేవుడు తన గీతగోవింద సంస్కృత అష్టపదులకు రాగతాళాల్ని పేర్కొన్నాడు మరి అన్నమాచార్యులకీ జయదేవుడు తెలియదనడానికి వీల్లేదు జయదేవునితో సమా

నంగా సంస్కృతుల సంకీర్తన చేసిన వాగ్గేయకారుడు అన్నమాచార్యులు మరి రాగాల్ని పేర్కొన్న అన్నమాచార్యులు తాళగతి నిర్దేశం ఎందుకు చేయలేదన్న విషయానికి పలువురు పలు విధాలుగా సమాధానాలు చెబుతున్నారు

"పద పదానికీ పైని పేర్కొన్న రాగనామం అన్నమాచార్య పదాలకు రాగ ప్రాధాన్యాన్ని సూచిస్తుంది అంతేగాక

యతులుం బ్రాసములుం బదంబులును మాత్రానీకముల్ సం
గతులుం గల్గి నిబంధనామ పదమాఖ్యాతార్థ సంయుక్త స
త్కృతిమై తాళ్ళ(కుల?) పాకయన్నయగురూక్తిన్ లోక విఖ్యాతమై
జిత మార్ద్వీక సితా సుధారస రుచస్ఫీతంబునై చెన్నగున్''[1]

అని చెలగే ఈ నిబంధ పదాలలోని నడక, తాళ నిర్ణయమూ బహుశః రసజ్ఞ లోక సుపరిచితాలు కాబట్టి కేవల రాగనామాన్ని అన్నమయ్య పేర్కొని ఉండ వచ్చు రాళ్ళపల్లి వారు ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ 'నిబంధించు రాగతాళములలో ఎందును ఒకటి రెండు చోట్ల తప్ప-తాళము పేర్కొని యుండలేదు ఒట్టి రాగము పేరు మాత్రము సూచింపబడి యున్నది. రాగ తాళములలో రాగము కంటే తాళమే ప్రబల తరమైనది రాగము మార్చినంత సులభముగా, ధారాళముగా పాట తాళ మును మార్చలేము పాటయందలి అక్షరములు ప్రాయశః తాళగతిని బట్టియే కూర్చబడియుండును'[2] అని పేర్కొన్నాడు దీనిని బట్టి చూసినా అన్నమయ్య ధాతు భాగమునకు ప్రాముఖ్యం ఇవ్వలేదనడం సమంజస మనిపించదు వారే, అయితే అదే పీఠికలో మరోచోట 'మొత్తముమీద తాళ్ళపాక వారి రచనలు అర్థభావ ప్రధాన ములైనవి త్యాగరాజు, దీక్షితుల వారివలె నాదరచనా ప్రధానములుకావు కనుక గాయకులు ఆ దృష్టితో సాధించి పాడిరేని తప్పక నాకర్షింపగలరని చెప్పారు ఈ వాదన కొంతవరకు సమంజసమేగాని, తరచిచూస్తే ధాతుమాతు సమన్వితంగా సాగిన అన్నమయ్య రచనలలో నాద రచనా ప్రాధాన్యానికి ఏ మాటి లోపమూలేదని చెప్ప వచ్చు వింత వింతనడకలతో సాగే రచనలలో అక్కడక్కడా మాత్ర లోపాలూ, అధిక మాత్ర నియతులతో ఆ వృత్తానికి ఎక్కువ తక్కువలుగా అక్షరాల్ని పేర్చి గాయకునకు 'గానస్వేచ్ఛ' కల్పిస్తూ, పాటలో సంగీతాన్ని ప్రతిష్ఠించిన స్రష్ట అన్న మయ్య ... కనుక నిబంధ పదాలలో గానరచనకు ప్రాధాన్యం ఉండదనే వాదన

పూర్తిగా వాస్తవమైంది కాదని నా అభిప్రాయం' అని వివరించి డా॥ మంగళగిరి ప్రమీలాదేవి పేర్కొని కొన్ని పదాల్లో రాగాల్నిబట్టి తాళాలను ఎలా నిర్ణయించుకో వచ్చునో ప్రదర్శించారు [3] ఇలాగే కొన్ని పదాలకు గతి చూపించారు డా॥ వేటూరి ఆనంద మూర్తిగారు [4]

అన్నమాచార్యులు తన పదాలకు రాగ నిర్దేశంచేసిన, తాళగతిని నిర్దేశించక పోవడానికి గల కారణాలు తెలుపుతూ ఇలాంటి అభిప్రాయమే ప్రకటించారు మంచాళ జగన్నాథరావుగారు తాళములందు ఇప్పుడు వాడుకలోగల చతురశ్రత్రిపుట (ఆది), చతురశ్ర రూపకం, ఖండజంపె (కురుజంపె), త్రిశ్రత్రిపుట (చాపు) తాళములు మాత్రమేగాక, ఇంకను మాత్రాచ్ఛందస్సులను ఆధారముగా చేసికొని ప్రస్తరింపబడిన తాళములేవో కొన్ని అనాడు వాడుక యందుండి యుండవలెను వానిని ఓపికతో పరిశోధించి కనుగొన వలసియుండును "

"కందరికంటె ప్రాచీనులైన జయదేవులు తన గీత గోవిందకావ్యమున మాత్రాచ్ఛందస్సులను ఎల్లు వాడిరనగా సంగీత పరిచయముగల వారికి అష్టపది చెలువ గిని ఇది ఈ తాళమునకు ఒదుగుచున్నదను విషయము స్పష్టముగా తెలిసిపోవును అట్లే తాళ్ళపాక వారి రచనల యందును కొన్ని తాళములకు ఒదుగు రచనలు సుస్పష్ట ముగాను యున్నవి 'ఈతడే-హరుడు-ఈలడే యజుడు । ఈతనికి యీ చేతలెంత ఘనమటుగాని ।' ఇది త్రిశ్ర రూపకము లేక కురుజంపె "[5] ఇది మంచాళ వారి అభిప్రాయం. దివంగతులైన మంచాళవారు సంగీత విద్వాంసుల్లో శ్రేష్ఠులనడంలో సందేహంలేదు. కానీ వీరందరి అభిప్రాయాలు తమకు తెలిసినంతమట్టుకు మాత్రమే చెప్పగలిగారు కానీ అన్నిటికీ తాళ నిర్ణయం చేయడం కష్టమనే తలంచడం అసంబ ద్ధంగాదు

అన్నమాచార్యుల సంకీర్తనల్లో సంగీతం కంటే సాహిత్యానికే అధిక ప్రాధాన్యమని ప్రాజ్ఞ విద్వాంసులు వివరించిన అంశం దీన్ని సంగీత సాహిత్యాల రెంటను అత్యంత ప్రముఖ విద్వాంసులైన రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారు అంగీకరించారు అంతేగాక అన్నమాచార్యులు రాగాలపేర్లు పేర్కొని, తాళాలను నిర్దేశించకపోవడానికి కారణం తెలియదనీ, అయినా కొన్నింటిని గ్రహించ వీలయినా అన్నమాచార్యులుద్దేశించిన తాళాలేమిటో తెలుసుకోవడం కష్టమని పైని పేర్కొన్న విషయంలో సత్యముంది అలాగే రాళ్ళపల్లి వారితో ఏకీభవించిన బాలాంత్రపు

రజనీకాంతరావుగారు సైతం రాళ్ళపల్లివారిని సమర్థిస్తూ పేర్కొన్న అంశాన్ని మనం గమనించవలసిఉంది

“తాళాలపేర్లు రాగిరేకులలో లేనేలేవు పాటల అక్షరప్రమాణమును, యతి ప్రాసలను పరిశీలించి ఆది, రూపకము, జంపె, అట్ట, మిశ్రచాపు, త్రిపుట మొదలగు సుప్రసిద్ధ తాళాలన్నీ ప్రయుక్తములైనాయని శ్రీ శర్మగారు వ్రాశారు అంతేగాక ‘భావము భాషా రూపముగా మనస్సులో స్ఫురించిన వెంటనే తత్కాలమునకు స్ఫురణకు వచ్చిన ఏ సిద్ధమైన వర్ణమెట్టునో గ్రహించి రచన సాగించినట్లే కానవచ్చునే తప్ప, నూతననాద శరీర కల్పనకై (అనగా కొత్త సంగీతపు వరుసల కల్పనకై) ప్రత్యేకముగా వారు పరిశ్రమించినట్లు తోపదు’ అనికూడా వ్రాశారు అంటే ఆనాటికి పండిత జనాదరణం, సమాజగౌరవం లేని జక్కులవారి యక్షగాన ప్రదర్శనాలలోనో, ఇతర జానపదగీత నృత్య ప్రదర్శనాలలోనో కర్ణాకర్ణిగా వినిపించే దరువులను, పదాలను వరవడులుగా పెట్టుకొని, వాటికి వాడుకలో ఉన్న, ఆ రాగ తాళాలలోనే తాళ్ళపాక కవులు తమకు తోచిన సంకీర్తనములన్నీ పాడి ఉంటారని మనం శ్రీ శర్మగారి ఊహకు వ్యాఖ్యానము చేసుకోవచ్చును.”[6] అని రాళ్ళపల్లి వారిని సమర్థించి ఉండడం గమనించదగ్గ అంశం ఏమైనా తాళనిర్దేశం అన్నమాచార్యులు చేయకపోవడానికి గల కారణాలూహ్యములే ఇంకా సంగీత ప్రాజ్ఞుల పరిశోధనకు అవకాశమిచ్చే అంశమే

మంచాళ జగన్నాథరావుగారు క్షేత్రయ్య, రామదాసులాంటి వాగ్గేయకారుల పదాలకు, కీర్తనలకు సంగీతం కూర్చిన విషయం మనకు తెలిసిందే అలాగే అన్నమాచార్యుల సంకీర్తనలకు సైతం సంగీతం సమకూర్చారు జగన్నాథరావుగారు వాటిని మూడు సంపుటాలుగా తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రకటించారు

“మరో విషయం కూడా ఇక్కడ పేర్కొనడం అవసరం ” ‘తెలుగు గేయకర్తలలో ఆద్యుడుగా అన్నమాచార్యులను గుర్తిస్తున్నాము ఆకారణంగా ఆయన గేయాలు గేయపరిణామంలో ప్రాథమిక దశకు చెందుతాయి. అందుచేత వాటిని పాడేటప్పుడు ‘అతీతం, అనాగతం’ అనే తాళప్రక్రియలను ప్రయోగించడం ‘అనాక్రానిజం’ అంటే చారిత్రక (పారిణామిక) పౌర్వాపర్యాల విపర్యయదోషంగా పరిగ

జించాలి' అని 1952 మద్రాసులో జరిగిన ఒక సాహిత్యసభలో డా॥ శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారివంటి హేతువాదియైన సాహిత్య విమర్శకుడు ఉద్ఘాటించారు అన్నమయ్యకు 15 శతాబ్దుల పూర్వమే భరతముని నాట్యశాస్త్రంలోనే గేయగానంలోని అతీత, అనాగత సమగ్రయోగాల లక్షణం ఉన్నదన్న సంగతి ఆసభలోనే ఆ విమర్శకుని దృష్టికి తేవడం జరిగింది "[7] అని బాలాంత్రపు రజనీకాంతరావుగారి - అన్నమాచార్యుల రాగాల గూర్చిన - నిర్ణయం

## 4. 2 అభినయం ·

కేవలం పాడుకోడానికి మాత్రమే అన్నమాచార్యుల సంకీర్తనలు రచితం కాలేదు ఆడుతూ - అంటే అభినయిస్తూ - పాడుకోడానికి ఉద్దిష్టమైనవనే విషయం గమనించదగ్గ అంశం అందుకే ఈ సంకీర్తనలు ఆ పద్ధతిలోనే అన్నమాచార్యులు రచించారు ఆడిపాడి అంటే అభినయిస్తూ పాడి తన సంకీర్తన పుష్పాలతో శ్రీవేంకటేశ్వరుని సేవకై తనజీవితమే మీదుకట్టిన మహావాగ్గేయకార భక్తుడు అన్నమాచార్యులు

## 4. 2. 1 అన్నమాచార్యుల సంకీర్తనల్లో అభినయప్రసక్తి

తెలుగులో పదాభినయం క్షేత్రయ్యతోనే ప్రారంభమైందనీ, అది అనాడు సిద్ధేంద్రయోగి భామాకలాపంలోనూ, ఉండేదనీ తెలుస్తుంది. నారాయణతీర్థుల శ్రీకృష్ణ లీలా తరంగిణిలోని తరంగాల అభినయమూ ఉండేదనీ విజ్ఞుల అభిప్రాయం. కాని సంకీర్తన లేక పదమనే నామకరణం అన్నమాచార్యుడే చేసి ఉండడం ఇక్కడ గమనించదగ్గ అంశం. పైగా అన్నమాచార్యులు ఆడుతూ - అభినయిస్తూ - పాడేవారన్న విషయం మనమిక్కడ గుర్తుంచుకోవాలి ఆయన సంకీర్తనల్లోనే ఈ అభినయాన్ని గూర్చిన ప్రసక్తిని గుర్తిస్తే ఈ అంశం మరింత స్పష్టమవుతుంది

ఒక చెలియాట వర్ణితం

"శ్రీ వేంకటేశుఁడవు చెలియాట చూచితివి
"భావించి నీకుఁ గన్నుల పండుగాయనా" (శృం. సం. 25-233)

నానావాద్యాలు, తాళాలతో ఆట, పాటలు వర్ణించడం గమనించగలం

"నానా వాద్యాలతో నట్టువలు గడించఁగా
పానిపట్టి మంచి మంచి పాత్రలాడఁగా
అనుక కోలాటములు అంత నింతఁ జూచుకొంటా
కోనేటి రాయఁడు మెచ్చీఁ గోడ తిరుణాళ్ల ॥అప్ప॥
వరుసతో విణ్ణాపఁబివారు తాళము లొత్తుచు
పొరిబొరి ద్రావిడానఁ బొగడఁగాను
... " (శృం. సం 24-281)

తెరమరుగు బహురూపాల్ని గూర్చిన అంశాల్ని ప్రస్తావించాడు అన్నమాచార్యులు తెరమరుగాటల్ని, బహురూపాల్ని పాల్కురికి సోమనాథుడు పేర్కొని ఉండడం పూర్వోక్తం.

"పన్నిన తెరమఱఁగు బహురూపము లెల్లాను
కన్నదాఁకానే కాని కడఁ జవుకే" (శృం. సం 27-481)

అన్నమాచార్యుల కాలంనుంచీ పదాభినయముండేదని చెప్పిన బాలాంత్రపు రజనీ కాంతరావుగారు "అలరులుగురియగు" అనే పదానికి చేసిన వివరణ ఇక్కడ ప్రస్తావించడం అత్యంతావశ్యకం ఆ పదం పూర్తి పాఠమిది , ఇది ప్రసిద్ధమైన పదమే.

"అలరులు గురియగ నాడెనదే
అలకలఁగులుకుల నలమేలు మంగ ॥పల్లవి॥
అరవిరి సొబగుల నతివలు మెచ్చఁగ
అర తెర మరుగున నాడెనదే
వరుసగ పూర్వ దువాళపు తిరుపుల
హరిఁగరఁగింపుచు నలమేలు మంగ ॥అలరు॥
మట్టపు మలపుల మట్టెలకెలపుల
తట్టెడి నడపుల దాటెనదే
పెట్టిన వజ్రపు పెండెపు దళుకులు
అట్టిటు చిమ్ముచు నలమేలుమంగ ॥అలరు॥

చిందుల పాటల శిరిపొల యూటల
అందెల మ్రోతల నాడెనదే
కందువ తిరువేంకటపతి మెచ్చఁగ
అందపు తిరుపుల నలమేలుమంగ ॥అలరు॥

(శృం. సం 12-24)

ఇందులో అన్నమాచార్యులు అలమేలుమంగాదేవి దివ్యనృత్యాన్ని అతి మనోజ్ఞంగా శ్రీవేంకటనాథుని మైమరపించేలా అభినయించిన శృంగారలీలా విలాసాలను అభివర్ణించి తరించాడు దీనికి రజనిగారి వ్యాఖ్యానం అన్నమాచార్యుల కాలంలోనే ఈ పదాభినయముండేదని నిరూపిస్తుంది

"అన్నమయ్య పదాలను వెలుగులోకి తెచ్చిన నాటి నుండి శంకరాభరణ రాగంలో అనంత కృష్ణులు (రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు) సుపరిచితం చేసిన 'అలరులు గురియఁగనాడెనదే' అనే ప్రసిద్ధ పదం రెండక్షరాల జాగాలోనే పాడాలికదా? ఈ పల్లవిలోని భావం సిద్ధేంద్ర యోగి భామాకలాపంలోని సత్యభామ రంగ ప్రవేశానికి ముందు జరిగే 'జడపట్టు' అనే ఘట్టాన్ని స్ఫురింపజేస్తుంది ఆ తర్వాత చరణంలోని 'అరతెర మరుగున ఆడెనదే'—భామా నాట్యంలో తెరను అడుగుభాగం సగం పైకెత్తి చేసే పాద విన్యాసాన్ని సూచిస్తుంది ఆ వెనుకవచ్చే 'అపూర్వ దువాళపు తిరుపులు, మట్టపుమలపులు, మట్టెలకెలపులు' వాగ్గేయకారుని నాట్యప్రయోగ దక్షతను వెల్లడిచేస్తాయి అన్నమయ్య పదాలలో మూడింటి రెండు వంతులు శృంగార పదాలే వాటిలో క్షేత్రయ్యవంటి పదకవితా ప్రవర్తకులకు కూడా మార్గదర్శకములైన ఒరవడులు కోకొల్లలుగా లభిస్తాయి వాటిని అన్నమాచార్యుల కాలము నాదే రాజనర్తకులు, దేవదాసీలు, రాజుల కొలువుల్లోను నాట్య ప్రయోగం ద్వారా ప్రదర్శించేవారు."[8]

కాబట్టి పదాభినయం ఆనాదే ఉండేదని స్పష్టమవుతుంది. ఇంకా ఇలాంటిదే మరో ఉదాహరణ మరో సంకీర్తనలో మనం చూడగలం

"ఉపచరింపఁగ రాదా వువిద గదునలసె
నెపముగ పురుటెల్ల నెరపీ నీమీఁదను ॥పల్లవి॥

నలినాక్షి గరడిలో నంటునఁ గేళి సేసె
మలసి చెక్కులను చెమట గారఁగా
వలపందులోనె చల్లి వాసన గుబ్బలు మోఁపి
నలువంక నీకు నభినయము చూపీని ॥ఉప॥

తెర మఱుఁగున వచ్చి దేశి శుద్ధాంగములను
సరవి నాడి చూపులు సళుపుచును
తిరుపుగొని కమ్మటి తీగె చేతులటుచాఁచి
సరస నంగరంగ వైభవము మెరసీని ॥ఉప॥

పదములఁ జిందు జక్కిణి బహుతాళమానముల
నిదె నాట్యమున నిన్ను నింతి మెప్పించె
అదన శ్రీవేంకటేశ అలమేలుమంగా నీవు
గదిసి చూడఁగా మతి గరగించీని ॥ఉప॥"

(శృం సం 30-555)

పై పదంలో 'నలినాక్షి' నాయిక 'గరడినంటునఁ గేళిసేసి' నాయకునకు 'నలువంక' 'అభినయము' చూపిందట. 'తెర మరగున వచ్చి దేశిశుద్ధాంగములను సదవి నాడి, చూపులు సళుపుచును' 'సరసనంగరంగ వైభవము మెరసిం'దట

ఇక్కడ మొదటి చరణంలో అభినయం చూపిన రీతిని వివరించాడు రెండో చరణంలో ఆంగిక, సాత్వికాభినయ వైశద్యాన్ని నాయిక ఆడిచూపింది. పైగా తెర మరుగున వచ్చిందట నాయిక వచ్చి 'దేశి పద్దాంగములను' అంటే దేశి పద్ధతిలో నృత్తంచేసి అభినయించి అంగరంగ వైభవం'తో మెరసిపోయిందట ఇంతకంటే అభినయ విశేషమేముంది? ఎక్కడుంది?

నాల్గో చరణంలో 'పదములఁజిందు జక్కిణి బహుతాళమానములనిదె నాట్యమున నిన్నునింతి మెప్పించె"— పదాభినయంతో, చిందు, జక్కిణి (ఇదొక యక్షిణి రూపమే అయినా దేశిపద్ధతిలోని అభినయమేమో అనిపిస్తుంది), బహుతాళగతులతో నాట్యమాడి నాయక అలమేలుమంగ శ్రీ వేంకటేశ్వర నాయకుని మెప్పించిందని అన్నమాచార్యులు అత్యంత మనోహరంగా అభివర్ణించి ఆనాటి పదాభినయ రీతిని వివరించాడు.

ఇది అన్నమాచార్యుల సంగీతాభినయాల వివరణ ఇంకా తజ్ఞులు పరిశీలించి వివరించవలసిన అవసరం ఎంతేని ఉంది.

| | | |
|---|---|---|
| 1 | చినతిరుమలాచార్యులు, తాళ్ళపాక | సంకీర్తన లక్షణము The minor works of Tallapakam poets Ed V Vijayaraghavacharya and G. Adinarayana Naidn పు. 143 ప 34 |
| 2 | అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి | అన్నమయ్య పాటలు-X పీఠిక. |
| 3 | ప్రమీలాదేవి, మంగళగిరి | అన్నమాచార్య సంకీర్తనలలోని జానపద సంగీతచ్ఛందో రీతులు - పు 580-585. (పి హెచ్ డి థీసిస్ - అముద్రితం) |
| 4 | డా॥ ఆనందమూర్తి, వేటూరి | తాళ్ళపాక కవుల పదకవితలు - భాషా ప్రయోగ విశేషములు - పు 315-320 |
| 5 | జగన్నాథరావు, మంచాళ | శుభాశంసనము డా॥ వేటూరి ఆనంద మూర్తి తాళ్ళపాకకవుల పదకవితలు-భాషాప్రయోగ విశేషములు . పు. 19. |
| 6 | రజనీకాంతరావు, బాలాంత్రపు | ఆంధ్ర వాగ్గేయకారచరిత్రము పు. 139 |
| 7 | రజనీకాంతరావు, బాలాంత్రపు | : అన్నమాచార్యుల పదకవిత - నాట్యానుకూలత A Brochure - All India Radio, Vijayawada - Special Programmes on Annamacharya held at Tirupati on 19th, 20th Sept 1981 |
| 8 | పైదే | |



## 5.0 తులనాత్మక అధ్యయనం .

ప్రథమభాగంలో అన్నమాచార్యుల జీవిత చరిత్రతోపాటు సంకీర్తనల గూర్చి వివిధ కోణాల నుంచి విపులంగాను, తక్కిన వాగ్గేయకారుల జీవిత విశేషాలను గూర్చి క్లుప్తంగాను తెలుసుకొన్నాము. ఈ ద్వితీయ భాగంలో అన్నమాచార్యులు, తదితర వాగ్గేయకారులను గూర్చి ముఖ్యంగా తెలుగు వాగ్గేయకారులగూర్చి విపులంగా తులనాత్మకంగా పరిశీలించి ఆయా వాగ్గేయకారుల ప్రాధాన్య విశిష్టతల్ని తెలుసుకోవడమే ప్రధానాశయం తద్వారా ఆయా వాగ్గేయకారుల రచనలవల్ల వారి హృదయావిష్కరణ జరిగిన తీరుతెన్నులు అవగతమవుతాయి ఏరంవరిలోను అన్నమాచార్యుని పదాల్లోని ఉన్నతోన్నత రసభావ బంధురత, పదరచనలో ఆతని గొప్పదనమూ, మానవాళికి చేసిన సేవ, వాగ్గేయకారుల్లో ఆతని స్థానమూ స్పష్టమవుతాయి

ఇందులో ప్రప్రథమంగా సంస్కృత వాగ్గేయకారులను గూర్చి, ఆ వెనుక క్లుప్తంగా ఔత్తరాహ, దాక్షిణాత్య వాగ్గేయకారులను గూర్చి తెలుసు కొంటాము ఈ అధ్యయనంలో ఇది ప్రవేశిక వంటిదనవచ్చు ఆ వెనుక తెలుగులో వెలసిన ప్రముఖ వాగ్గేయకారులను గూర్చి కొంచెం విపులంగానె తెలుసుకొంటే అన్నమాచార్యులు వాగ్గేయకారుడుగా విశిష్టుడనడం అభివ్యక్తం కాకమానదు. ఈ అధ్యయనమే ఈ ద్వితీయ భాగంలో ప్రముఖ స్థానం వహిస్తుంది.

## 5 1 సంస్కృత వాగ్గేయకారులు .

సంస్కృతంలో వెలసిన వాగ్గేయకారులలో ప్రథమస్మరణీయుడు జయదేవుడు ఆ వెనుక లీలాశుకుడు తరువాత నారాయణ తీర్థులు వీరి జీవిత చరిత్రలను ఇతః పూర్వమే సంక్షిప్తంగా వివరించడం జరిగింది ప్రస్తుతం ఈ వాగ్గేయకారులకు, అన్నమాచార్యులకు గల భేదసాదృశ్యాలను గూర్చి అధ్యయనం చేద్దాము

### 5.1.1 జయదేవుడు .

వాగ్గేయకారులందరికీ ఆద్యుడూ, ఆదర్శప్రాయుడూ అయినవాడు జయదేవుడు ఇతని ప్రభావం తదనంతర వాగ్గేయకారులందరిమీద ఉంటుందనడం స్వభావోక్తి

అన్నమాచార్యులకు, గాని జయదేవుడే ఆదర్శం ఇతని ఇష్టదైవం తిరుమలలో వెలసిన శ్రీవేంకటేశ్వరుడు అన్ని పదాలలోను నాయకుడు శ్రీవేంకటేశ్వరుడే. అయితే కృష్ణుని, నరసింహస్వామిని, హనుమంతుని, ఇంకా ఇతర దేవతలను స్మరించడం గమనించగలం అన్నమాచార్యులు తన శృంగార, అధ్యాత్మ సంకీర్తనలలో శృంగార రస పరిపుష్టిని, భక్తితత్వాన్ని ప్రతిబింబింపచేశాడు ఇతని సంకీర్తనలు వేటికవే రసప్రతిపాదకాలైన రసవత్కావ్యాలు. ముక్తకాలు ముప్పై రెండువేల సంకీర్తనలు రచించినా, లభించిన పన్నెండువేల పదాలు ఇతని భక్తి వైవిధ్యాన్ని, వైశిష్ట్యాన్ని వివరిస్తున్నాయి

జయదేవుని గీతగోవిందం గీతి కావ్యం ఇందులో ఇరవైనాలుగు అష్టపదులు, ముందు వెనుక కొన్ని సందర్భోచితంగా శ్లోకాలు రచించాడు అందుకే ఇది ఒక కావ్యమైంది కాని అష్టపదులను దేనికదే పరిస్తే రసభావ వ్యంజకమై ఆనంద ప్రదాలుగా ఉంటాయి రాధామాధవ శృంగార లీలలను వివిధ రీతుల చలచ్చిత్రాలుగా చిత్రించాడు జయదేవుడు

జయదేవుడు సంస్కృతంలోని ప్రప్రథమ వాగ్గేయకారుడు తదనంతర వాగ్గేయకారులకు ఆదర్శ పురుషుడు తెలుగులో మొదటి వాగ్గేయకారుడు అన్నమాచార్యులు ఇద్దరు వాగ్గేయకారులు తమకాలంలో జీవించిన రాగతాళాలను ప్రయోగించి సంగీత ప్రతిపత్తిని ప్రసిద్ధికి తెచ్చారు

అన్నమాచార్యుడు పదరచనచేసి, ఆడి, పాడి తరించాడు జయదేవుడు పాడుతుంటే అతని భార్య పద్మావతి అభినయిస్తూండేదన్న అంశం పూర్వోక్తం తద్వారా గీత, సంగీతాలతో పాటు అభినయానికీ ఎంతో ప్రాధాన్య ప్రాచుర్యాలు తెచ్చిన వాగ్గేయకారులు జయదేవ అన్నమాచార్యులు

జయదేవునితో ఆరంభమైన కృష్ణభక్తి, అన్నమాచార్యులలో ఫలవంతమైందని చెప్పవచ్చు ఆ వెనుక ఎంతో ప్రచారం పొందింది

జయదేవుడు అన్నమాచార్యులు తమ రచనల్లో భక్తి శృంగారాల్లో మధుర భక్తిలో జీవాత్మ పరమాత్మలో సమైక్యం పొందడానికి పడిన తపనను అభివ్యక్తీకరించారు

జయదేవుడు గీతగోవిందంలో రాధాకృష్ణుల ఆధారంగా గోపికాకృష్ణుల భాగవతభక్తిని వర్ణించాడు రాధాకృష్ణుల శృంగారం, భక్తి, మధురభక్తి గీతగోవిందంలో మనం చూడగలము.

## శృంగారం .

రాధామాధవుల అలౌకిక శృంగారం అనన్యసామాన్యంగా వర్ణించాడు జయదేవుడు గీతగోవిందంలో విరహవిప్రలంభ శృంగారమేగాక, దర్శన స్పర్శనాలింగనాది వివిధ రీతుల శృంగారమూ, చివరికి సురతం సైతం వర్ణితం

## విరహం .

రాధావిరహం వర్ణితం

'నిందతి చందన మిందుకిరణ మను నిందతి ఖేదమధీరమ్
వ్యాళనిలయ మిళనేన గరళమివ కలయతి మలయసమీరం
మాధవ మనసిజ విశిఖభియా దివ భావనయా త్వయి లీనా
సా విరహే తవ దీనా ' [చతుర్థసర్గ - అష్ట - 8]

(మన్మథబాణాలు తన మీద పడతాయేమోనన్న భయంవల్ల నీయందు దాగినదై అత్యంత విరహంతో దీనమై చందనాన్ని, చంద్ర కిరణాలను రాధ నిందిస్తోంది పాములకాటపట్టైన చందనవృక్షాలనుంచి వచ్చే మలయమారుతాన్ని విషంగా భావిస్తూంది )

ఇందులో రాధ విరహోత్కంఠిత

## సంభోగ శృంగారం

రాధామాధవుల సురతమిందు వర్ణితం ఇది అలౌకికమూ, దేవతా పరమూను

'శ్రమజలకణ భర సుభగ శరీరా
పరిపతితోరసి రతిరణధీరా' (సప్తమసర్గ - అష్ట-14)

(ఆ రాధ సంభోగంలో నేర్పరిగా మెలగి ఆయాసంవల్ల కలిగిన చెమటబిందువుల శరీరానికెంతో శోభావహంగా ఉండగా అలసిసొలసి శ్రీకృష్ణుని ఉరంమీద పడియున్నది )

విరహమూ సంభోగ శృంగారమూ మొదలైన అన్నిరీతుల శృంగారమూ అన్నమాచార్యుల పదాలలో మనం గుర్తించవచ్చు మందే

## సంభోగశృంగారం - హాస్యం

సంభోగశృంగారం వర్ణించి హాస్యోత్పత్తి గావించడం జయదేవ, అన్నమాచార్యులకో మాడగలం రాధామాధవుల శృంగారక్రీడలో పరస్పరం గుడ్డలు మారడం వల్ల హాస్య ముద్భవించింది

'ప్రాతర్నీల నిచోల మచ్యుత మురః స్సంవీత పీతాంబరం
రాధాయా శ్చకితం విలోక్య హసతిస్వైరం సఖీమండలే
వ్రీడాచంచల మంచలం నయనయో రాధాయ రాధాననే
స్వాదుస్మేర ముఖోఽయమస్తు జగదానందాయ నందాత్మజః'
(సప్తమసర్గ - శ్లో 10)

(రాధామాధవులు రాత్రి యథేచ్ఛగా క్రీడించినపుడు ఇద్దరివస్త్రాలు మారడం వల్ల కృష్ణుని పీతాంబరం రాధ, రాధ దుప్పటి కృష్ణుడు కప్పుకొని ఉదయం శయ్యాగారం నుంచి రాగా సఖులు నవ్వారట దానితో సిగ్గుపడి రాధాముఖావలోకనం చేసే కృష్ణుడు లోకానందదాయి బొనుగాక !)

'మగరూపు నాఁడురూపు మారుచు కొనిరిద్దరు
సొగిసెద్దము చూపరే చూచుకొనేరిద్దరు ॥పల్లవి॥

కలికి కస్తూరి బొట్టు కాంతుని నొసలనంటె
నిలువు నామముపైపై నెలత కంటె
అలివేణి కొప్పుజారి అతని కొప్పుపైవాలె
అలరెనీతని(న్వి)సిక అతని పాపటపైని ॥మగ॥

కుంకుమ గుబ్బల పూతగురుతు విభునికంటె
అంకేఁటి గొమ్ముటొప్పు ఆకెకంటెను
కంకణాల గాజుల చేయి మనునినందిటజిక్కె
అంకపుసాముల చేయి ఆకెనందిట జిక్కెను ॥మగ॥

మట్టెల వాదములవె మగనికె నాతని మీద
నిట్ట పెద్ద పాదాలు నిలిచెనందు
యిట్టె శ్రీవేంకటేశు డింతి గూడి పానుపుపై
పట్టపగలిందరిని భ్రమయించి నిదె ॥మగ॥
(26 - 309)

ఇది అన్నమాచార్యుల పదం ఇందులో నాయికా నాయకుల సురతంపల్ల గుర్తులు పరస్పరం మారడంతో హాస్యముత్పన్నమవుతున్నది జయదేవుడు వస్త్రాల మార్పిడివేయగా ఇక్కడ తదితర చిహ్నాలు అన్నమాచార్యులు మార్చి హాస్యం కలిగించాడు

భక్తి .

జయదేవుడు భక్తి ప్రవృత్తిని స్తుత్యాత్మకంగా నిరూపించుకొన్నాడు ఆరంభంలోనే ఈస్తుతి ఉంది

'మేఘైర్మేదురమమ్బరం వనభువ శ్యామాస్తమాలద్రుమై
నక్తం భీరురయం త్వమేవ తదిమం రాధే! గృహం ప్రాపయ,
ఇత్థం నందనిదేశ తశ్చలితయో: ప్రత్యధ్వకుంజద్రుమం
రాధామాధవ యోర్జయన్తి యమునా కూలే రహఃకేళయః.' (ప్రథమసర్గ-శ్లో-1)

(ఓ రాధా! ఆకాశం దట్టమైన మేఘావృతమైంది తమాలచెట్లవల్ల వనభూములన్నీ చీకటిమయమయ్యాయి ఈరోజే కృష్ణుడు రాత్రులందు భయపడుతూంటాడు కనుక వెంటనే నీవె కృష్ణుని ఇంటికి చేర్చవలసింది అని నందుడు రాధ కప్పగించగా, వెళ్ళి యమునానదీ కూలాలలో మనోహరమైన పొదరిండ్ల యందు రాధాకృష్ణుల రహస్యక్రీడలు సర్వోత్కృష్టంగా ఉన్నాయి)

ఇలాగే ఇష్టదేవతా ప్రార్థన

'వాగ్దేవతా చరిత చిత్రితచిత్త సద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ,
శ్రీ వాసుదేవ రతికేళి కథాసమేత
మేతం కరోతి జయదేవ కవిః ప్రబంధమ్' (ప్రథమ సర్గ - శ్లో - 2)

(మనోహరమైన వాగ్విలాసాలతో చిత్రితమైన చిత్తమనే గృహం గలవాడూ, పద్మాపతి పాదవిన్యాసంతో నాట్యం చేయించగల నేర్పరి అయిన జయదేవకవి అయిన తాను శ్రీకృష్ణుని, శ్రీకృష్ణ శృంగార క్రీడల్ని వివరించే గీతగోవింద ప్రబంధం రచిస్తున్నాడు )

'యది హరిస్మరణే సరస మ్మనో
యది విలాసకలాసు కుతూహలమ్,
మధురకోమల కాన్త పదావళీం
శృణు తదా జయదేవ సరస్వతీమ్' (ప్రథమ సర్గ - శ్లో - 3)

(హరిస్మరణ యందు భక్తిరసంతో గూడి మీ మనస్సు ఉంటే శృంగార కళలయందు కుతూహలముంటే మధురమూ, కోమలమూ, మనోహరమూ అయిన పదావళిగల జయదేవ వాణిని వినండి)

ఇలాగా ఎంతో మనోహరంగా స్తుతి పూర్వక కావ్యారంభల గావించాడు జయదేవుడు

ఇలాంటి వెన్నో విధాల తన పదాలలో చేశాడు అన్నమాచార్యుడు నవవిధ భక్తులను సవివరణగా, ఉదాహరణ పూర్వకంగా అన్నమాచార్యుల 'భక్తి' అనే అంశంలో వివరించడం జరిగింది

## దశావతార స్తుతి .

జయదేవుడు మనోజ్ఞంగా దశావతారస్తుతి కావ్యారంభంలో చేశాడు

'ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదం
విహిత వహిత్ర చరిత్ర మఖేదమ్
కేశవ! ధృతమీన శరీర! జయజగదీశ! హరే! ధ్రువమ్ 1

క్షితిరితి విపులతరే తవ తిష్ఠతిపృష్ఠే
ధరణి ధరణ కిణ చక్రగరిష్ఠే
కేశవ! ధృతకచ్ఛపరూప! జయజగదీశ హరే! ధ్రు. 2

వసతి దశన శిఖరే ధరణీ తవ లగ్నా
శశిని కళఙ్కకలేవ నిమగ్నా
కేశవ! ధృతసూకరరూపా! జయజగదీశ! హరే! ధ్రు 3

తవ కరకమలే నఖ మద్భుత శృఙ్గం
దళిత హిరణ్య కశిపు పరభృఙ్గమ్
కేశవ! ధృతనరహరిరూప! జయజగదీశ? హరే! ధ్రు     4

ఛలయసి విక్రమణే బలిమద్భుత వామన!
పదనఖనీరజనిత జనపావన!
కేశవ! ధృత వామనరూప! జయజగదీశ! హరే! ధ్రు     5

క్షత్రియ రుధిరమయే జగదపగత పాపం
స్నపయసి పయసి శమిత భవతాపమ్
కేశవ! ధృతభృగుపతిరూప! జయజగదీశ! హరే! ధ్రు     6

వితరసి దిక్షు రణే దిక్పతి కమనీయం
దశముఖమౌళి బలిం రమణీయమ్
కేశవ! ధృతరామశరీర! జయజగదీశ! హరే! ధ్రు     7

వహసి వపుషి విశదే వసనం జలదాభం
హలహతి భీతిమిళితయమునాభమ్
కేశవ! ధృతహలధర రూప! జయజగదీశ! హరే! ధ్రు     8

నిన్దసి యజ్ఞ విధే రహహ శ్రుతిజాతం
సదయ హృదయ దర్శిత పశుఘాతమ్
కేశవ! ధృతబుద్ధ శరీర! జయజగదీశ! హరే! ధ్రు     9

మ్లేచ్ఛ నివహనిధనే కలయసి కరవాలం
ధూమకేతు మివ కిమపి కరవాలమ్
కేశవ! ధృతకల్కి శరీర? జయజగదీశ! హరే! ధ్రు!     10

శ్రీజయదేవ కవేరిదముదిత ముదారం
శ్రుణుసుఖదం సుఖదం భవసారమ్
కేశవ! ధృతదశవిధరూప! జయజగదీశ! హరే! ధ్రు'     11

[ప్రథమ సర్గ - అష్టపది - 1]

ఈ అష్టపదిలో విపులంగావర్ణించిన దశావతారాలను సంక్షిప్తంగా ఒకశ్లోకంలో పర్చినాడు.

"వేదానుద్ధరతే జగన్నివహతే భూగోళ ముద్బిభ్రతే
దైత్యాన్దారయతే బలింఛలయతే క్షత్రక్షయం కుర్వతే
పౌలస్త్యంజయతే హలం కలయతే కారుణ్య మాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతి కృతే కృష్ణాయతుభ్యన్నమః'
[ప్రథమ సర్గ - శ్లో 5]

ఇలాగే అన్నమాచార్యులు అనేక పదాల్లో దశావతార వర్ణనచేశాడు అంతటితో సంతృప్తి చెందక, సంస్కృతంలోను చేయడం గమనించ దగ్గ అంశం

"దశ విధావతరణం త స్నృపతి
దశ విధావస్థార్థం తే లత్ర ॥పల్లవి॥
స్థాపయిష్యామి వేదానితి వ్యాజేన
కృపితోఽయం మత్స్యదేహః పురా
వ్యాపారోఽయి మేవం నచ తరువ్యా
యాప జలధౌ కేళిరుచయే త్ర ॥దశ॥

మారయిష్యామి కలిమితమితి వ్యాజేన
ప్రహర కల్క్యవతార కోపః పురా
ధీర వేంకట నగాధీశ ఏవం నఖలు
ధీరమూర్త్యం సంప్రీణయితుమత్ర ॥దశ॥'
[శృం సం. 12-374]

## మధురభక్తి

జయదేవుడు గీత గోవింద కావ్యాన్ని శృంగార రసప్రధానంగా రచించినా ఇందులో ముఖ్యంగా మధురభక్తిని ప్రతిపాదించాడు రాధాకృష్ణుల ప్రణయంలో జీవాత్మ పరమాత్మల కలయికకై యత్నం జరిగినట్లు స్పష్టమవుతుంది భాగవతభక్తి నంతటిని ఇందులో కవి స్పష్టం చేశాడు ఇలాంటి మధురభక్తి అన్నమాచార్యుల పదాల్లో మనం చవిచూశాము జీవునెపుడు, అన్నమాచార్యులు నాయిక రాధ లాగా పతియైన కృష్ణుని, వేంకటేశ్వరుని కలియుటకై తమ పదాల్లో అభివ్యక్తీకరించారు

రాధా మాధవులేకాక దూతికల్ని గూడా గీతగోవిందంలో ప్రవేశపెట్టాడు. దూతిక నాయికకు ఆచార్యుని వంటిది నాయికా నాయకుల కలయికకు దోహదం చేసే వ్యక్తిదూతిక ఇలాంటి దూతికలు అన్నమాచార్యుల పదాల్లో మనం చూడ గలము.

ఇలాగా జయదేవుడు వాగ్గేయకారులకందరికీ సంస్కృతంలో మూలపురుషుడు అన్నమాచార్యులు జయదేవుని బాగా జీర్ణించుకొన్న తెలుగు ప్రథమ వాగ్గేయకారుడు ఇతని కత్యంతాదర్శ పురుషుడు జయదేవుడు

## 5.1.2 లీలాశుకుడు

లీలాశుకుడు శ్రీకృష్ణ కర్ణామృతంలో కేవలం శ్లోకాలను అంటే నిబద్ధపదాలను గేయచ్ఛందోరీతిలో రచించి శ్రీ కృష్ణభక్తిని, గేయ మాధుర్యాన్ని మనకందించాడు నిబద్ధ పదాలైన శ్లోకాలకు రాగతాళాలను కూర్చి సంగీత సభల్లో పాడి విని పించడమూ, అభినయింపి రసజ్ఞ హృదయాలకు విందొనర్చడమూ జరుగుతూంది అన్నమాచార్యుడు పదరచనచేసి తొలి తెలుగు వాగ్గేయకారుడై పదకవితా పితా మహుడుగా, సంకీర్తనాచార్యుడుగా ప్రసిద్ధికెక్కాడు

అన్నమాచార్యుడు తన శృంగార, ఆధ్యాత్మ సంకీర్తనలలో శృంగారాన్ని, ఈశ్వరభక్తినీ, భక్తి ని ప్రతిపాదించాడు అలాగే లీలాశుకుడు తన శ్లోకాల్లో భక్తి ప్రధానంగా గోపీ మాధవుల శృంగారం, మధుర భక్తులను అభివ్యక్తీకరించాడు

అన్నమాచార్యుల సంకీర్తనల్లోని భాష సరళమూ, మధురమూ అయినట్లే, లీలాశుకుని సంస్కృతశ్లోకాలు లలితంగా, మనోజ్ఞంగా, మధురంగా ఉండి సహృదయ హృదయాలను ఆకర్షిస్తాయి

అన్నమాచార్యుల సంకీర్తనలు పాడి పరవశించడానికేగాక, అభినయానికి సైతం రచితమైనట్లు స్పష్టం కూచిపూడి వారు తరతరాలుగా పదాభినయంతో పాటు లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృత శ్లోకాలను పాడి, అభినయించడం తప్పనిసరి అయిన అంశంగా పరిణమించింది

ఇలాగా అన్నమాచార్యులకంటే ముందే సాహిత్య సంగీతాభినయాలకు లీలా శుకుడు అపారమైన సేవ చేసినట్లు విదితమవుతుంది

లీలాశుకుడు శ్రీకృష్ణ బాల్యక్రీడల్ని అభివర్ణించి అత్యంత మనోహరమైన భక్తి, మధురభక్తిని ప్రతిపాదించాడు పైకి శృంగారంలా కనిపించినా భక్తి, మధుర భక్తి ప్రధానాంశాలు శృంగారం, మధురభక్తుల్లో బాలకృష్ణుని క్రీడల్ని అభివర్ణించి తానే గోపికగా, రాధగా లీలాశుకుడు భావించి భావించి తన్మయుడై, పాఠకుల్ని సైతం మైమరపింపజేస్తాడు

## శృంగారం

గోపీకృష్ణుల రాసక్రీడను అత్యంతమనోజ్ఞంగా రాసక్రీడాష్టకంలో అభివర్ణించి కవి తరించాడు ఇందుకో బాలకృష్ణుని శృంగార క్రీడలు స్పష్టం

'అఙ్గనా మనాఙ్గనా మన్తరే మాధవొ
మాధవం మాధవం చాన్తరేణాఙ్గనా,
ఇత్థమాకల్పితే మణ్డలే మధ్యగః
సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః' [శ్రీకృష్ణకర్ణామృతము-2-35]

(ఇరుదెసఁదాను నిల్చి తనకింతులు పార్శ్వములన్ వసింపఁగా,
గరములు గంఠసీమఁ జెలఁగన్ బలభిన్మణి విద్రుమంబులన్
సరమొనరించినట్లు సరసస్థితి మండల మధ్యవర్తియై
మురళి రవంబునం జెలఁగు మోహనమూర్తి మురారిఁ గొల్చెదన్)

దీనితో ఆరంభించి సముచిత రీతిని కవి వర్ణించాడు

ఇలాంటిదే అన్నమాచార్యుల సంకీర్తనను మనం గమనించగలము

"ఒక్కొక్క సతి నడుమ నొక్కొక్క రూపు గైకొని
మొక్కుచైతి కృష్ణా! నిన్నెట్ల నమ్మేది రా ॥పల్లవి॥

మాటలాడే వొకతెతో మర్చి చూచేవొకతెను
వోటలేక నవ్వునవ్వే వొకతెతోను
కూటువై గొల్లెతలము గుంపు గూడున్నార మిదే
యేటిది నీ మోహమిక నెందని నమ్మేదిరా ॥ఒక్కొ॥

కన్నుగిటే వొకతెకు గాఁగిలించె వొకతెను
వెన్న దిన్న మోవిచ్చెవు వెరొకతెకు
పున్నతి రాసక్రీడలున్నార మిందరము
ఇన్నిటిలో నీ వలపు నెందని నమ్మేదిరా ॥ఒకొ్కక్క॥
(శృం సం 28-146)

'కేకి కాదృతానేక పఙ్కేరుహః, లీన హంసావళీ హృద్యతాహృద్యతా,
కంసవంశాటవీ దాహదావానలః, సఙ్గగో వేణునా దేవకీనన్దనః'
(శ్రీ కృ 2-36)

(తను కాంతుల్ జలజలదంబటంచు శిఖి సంతానంబుఁ గేకాస్వనం
బును మీటన్ విని యంచపిండు లలితాంభోజాళిలో నుండి వ
య్యన దేపన్ భ్రమ మాన్పి సంతసము సేయంజాలు వంశీమృదు
స్వనముగాంచిన కంసవంశ దహన జ్వాలిన్ హరిం గొల్చెదన్)

'క్వాపి వీణాభిరా రావిణా కమ్పితః క్వాపి వీణాభిరాకిఙ్కిణి నర్తితః
క్వాపి వీణాభి రామా న్తరం గాపితః సఙ్గగొ వేణునా దేవకీ నన్దనః'
(శ్రీ కృ. 2-37)

[ఒకచో గాణలు మోటు వీణియలకున్ యుక్తంబుగా నాదు పే
రొకచో వీణెకు వియ్యమై మొనరఁ జేయుంగింకిణీ నాద మొం
డొకచో వీణియరోడఁ బాడు జతగా నుత్సాహియై యట్టినం
దకుమారాగ్రణి వేణు నాద మొనరన్వర్తిల్లె నుల్లాసియై]'

'వారుచన్ద్రావళీలోచనై స్సృష్టితో గోపగోబృన్ద గోపాలికా వల్లభః,
వల్లవీ బృన్దారకః కాముకః సఙ్గగొ వేణునా దేవకీనన్దనః'
[శ్రీ కృ. 2-38]

(క్రేవులు గోపదంపతులుఁ గేవలభక్తి భజింపనప్పరో
రూపముఁగల్గు నేతలుమరొ్కని క్రీడమొనర్ప సంభృతా
ష్టావదభూషరా చెలులు సౌధములం దిలకించి మాడఁగా
గోపకుమారుఁడొప్పె రసగుంభిత వేణునినాదలోలుడై.)

'ఘాటీకూలామిళన్మత్తభృఙ్గలతాంతతచిత్రప్రసూనావిభ్రమాలిఙ్గితః
ప్రస్తుతగోపకుమారభోగసమ్మోహితం సజ్జగౌ వేణునా దేవకీనన్దనః'
(శ్రీ కృ. 2 - 39)

(ఘోటితటిన్ ఘటించిన సుమమ్ముల వెంబడివచ్చు భృంగఝా
ఝిలలితధ్వనిం గలఁగి చేలము లాడఁగఁ గౌఁగిలించు గో
పాలక నిరుకోటి కుచభార మురమ్మున నాను రాసలీ
లాలసమాన మానస విలాసుని వేణువినోదుఁ గాంచెదన్)

'చారు చామీకరాభాస భామా విభ
క్త్యైకజయ స్త్రలతా వాసితోర స్థల,
స్నిగ్ధ బృన్దావనే వాసితా మధ్యగం
సజ్జగౌ వేణునా దేవకీనన్దనః' (శ్రీకృ 2 - 40)

(జత మై బంగరుతీగె గుంపు నదలించం జాలు బృందావనాం
చిత విశ్వోకవతుల్ విలాసగతులన్ సేవించ రాసక్రియా
పరిత్వంబున వైజయంతి నటియించన్ వేణుగాన స్వనా
మృత ధారాపటిమం చెలంగు హరి నెమ్మిం బ్రోచుమిమ్మెప్పుడున్.)

'బాలికా తాలికా తాల లీలా లయాసఙ్గసన్దర్శిత భ్రూలతావిభ్రమః,
గోపికాగీత దత్తావధానస్స్వయం సజ్జగౌ వేణునా దేవకీనన్దనః'
(శ్రీకృ 2 - 41)

(తాళములు గ్గడించు వనితాకరతాళలయానుభావిత
భ్రూలతసొంపు వల్లవ సరోజముఖీ మృదుగాన వైఖరిం
దాలిమి నెచ్చరించు నవధానము మీఱఁగ వేణు పాటియై
లాలితగాన వైభవ కళానిపుణుం డగు శౌరిఁ గొల్చెదన్ )

'పారిజాతం సముద్ధృత్య రాధావరో
రోపయామాస భామాగృహస్యాఙ్గణే,
శీతశీతే వటే యామునీయే తటే
సజ్జగౌ వేణునా దేవకీనన్దనః' (శ్రీకృ. 2 - 42)

(రమతోడన్ సమమైన కాంతగుణముల్ రాధావయోరూప వి
భ్రమముల్ గల్గిన భామ ముంగిటను గల్పక్ష్మాజమున్ నిల్పి య
య్యమునా సైకత మధ్య శీతల తలన్యగ్రోధవీధిన్ ముదం
బమరన్ వేణువినోదనాదరతుఁ జౌనబ్జాసనీక్షించెదన్)

ఇలాగా గోపికలతో రాసక్రీడలో మైమరచి, మురిపించిన ఆ బాలకృష్ణుని ముగ్ధ మనోహరంగా వర్ణించి సహృదయ హృదయ రంజకం చేసిన మహాపీయుడు లీలాశుకుడు

బాలకృష్ణ లీలావిలాసాల్నే గాని ఎక్కడో ఒకటి రెండుచోట్ల మాత్రం లీలాశుకుడు సంభోగ శృంగారం వర్ణించలేదు

## సంభోగ శృంగారం

'కలక్వణితకంకణం కరనిరుద్ధ పీతామ్బరం
క్రమ ప్రసృతకుంతలం కలిత బర్హ భూషం విభోః,
పునః ప్రసృతి చాపలం ప్రణయినీ భుజాయన్త్రితం
మమస్ఫురతు మానసే మదనకేళి శయ్యోత్థితమ్'
(శ్రీ కృ 1-20)

(అరవిరి జాఱుకుంతలము లట్టిటు వీడిన పిలిదండమం
గరవలయంబు ఘల్లురనఁ గైకొనునట్టి సువర్ణ చేలమున్
బిరగఁగ సెజ్జ డిగ్గుతటిఁ బద్మవిలోచన గౌఁగిలింపవోఁ
దిరుగ రమింపఁగాఁ దిప్పిరి దేవుని నామది చిత్రయించెదన్,

ఇలాగే మరో ఉదాహరణ

'కుసుమశరశరసమర కుపిత మదగోపి
కుచ కలశ ఘుసృణ రసదురస దేవె,
మదలులిత మృదుహాసిత ముషిత శశిశోభా
ముహురధిక ముఖకమల మధురమణిలీయే' (శ్రీకృ 1-53)

(పుష్పుల దుప్పిగా నలుకఁ బూనిన పల్లవపల్లవాధరల్
గ్రొప్పున అప్ప మీఱఁ జను గుత్తుల నొత్తిన కుంకుమంబెదన్
నిప్పటిలన్ శశాంకు జిగినీటుల తేటలఁ గొల్లలాడు చే
నవ్వుల గోము మోమునఁ గనందగు నందకుమారుఁ బొందెదన్)

ఇలాంటి శృంగారమనేక రీతుల అన్నమాచార్యులు వర్ణించిన విధానాన్ని వివరించడం జరిగింది,

భక్తి •

లీలాశుకుడు అనేక రీతుల బాలకృష్ణుని ఎన్నో వర్ణించి వర్ణించి తనివి తీరా తాను ఆనందించి, మనలనందర్నీ ఆనందాబ్ధిలో ఓలలాడించిన మహాభక్తాగ్రేసరుడు.

యశోదా స్తన్యం గ్రోలి పాలబుగ్గలతోడ తెల్లని దంతద్యుతిగల బాలకృష్ణుని మధుర మనోజ్ఞంగా అనన్య సామాన్యంగా కవి వర్ణించి తరింపాడు. మనకు తరణోపాయం చూపించాడు

'కించిత్కుంచిత లోచనస్య పిబతః పర్యాయ పీతస్తనం
సద్యః ప్రస్నుత దుగ్ధ బిందుమపరం హస్తేన సమ్మార్జితః,
మాత్రైకాంగులిలాలితస్య చుబుకే స్మేరాననస్యాధరే
శౌరేః క్షీరకణాన్వితా నిపతితా దంతద్యుతిః పాతునః'

(ఒక కుచమాని పాల్ గురియు నొక్కకుచంబొకచేలఁ బాని యీ
షన్ముకుళిత నేత్రుడై జనని ముట్టినకుంచుకంబు వ్రేలఁబ
ట్టకిముగ నంటి నోవిఁ బ్ర [illegible]బగు లేనగ వొప్పువారి దు
గ్ధకణ సమేత దంతరుచి తత్పుంతన్ ననుఁ బ్రోచు గాపుతన్)

ఇంత మనోజ్ఞంగా స్వభావోక్తితో బాలకృష్ణుని పాలు త్రాపు చిత్రాన్ని వర్ణించగల కవి లేడంటే ఆశ్చర్యం లేదు దీనికంతటికీ లీలాశుక కవికి గల శ్రీకృష్ణుని యందలి భక్తి పారవశ్యమే

బాలకృష్ణుని పలువిధాలుగా వర్ణించి ఆనందాబ్ధిలో ఓలలాడాడీ మహాకవి

'హస్తాంఘ్రి నిక్వణిత కంకణ కింకిణీకం
మధ్యే నితంబ మవలంబిత హేమ సూత్రమ్,
ముక్తా కలాప ముకుళీకృత కాకపక్షం
వందామహే వ్రజ చరం వసుదేవ భాగ్యమ్' (శ్రీ కృ 2-20)

(సరసనితంబు మధ్యమున జాబెడు పెన్నొల నూలు విన్నపుం
గురులు దళంబుగాఁ గమిచి కూర్చిన ముత్తెపు రావి రేకయుం
గర చరణాగ్ర నిక్వణిత కంకణ కింకిణు లొప్ప నందమం
దిరమున సంచరించు వసుదేవ తపః ఫలమున్ భజించెదన్).

ఆ మహాకవి తనివితీరా బాలకృష్ణుని వర్ణించిన ఇలాంటి పద్యాన్నో ఉదాహరించవచ్చు

కవి ప్రతిభాపాటవమూ, భావుకతా అభివ్యక్తీకరించే మరో మంచి ఉదాహరణ పిల్లల్ని నిద్రపుచ్చడానికి జోలపాడడం కథలు చెప్పడం మనకందరికీ తెలిసిన అంశమే అల్లే యశోద బాలకృష్ణుని నిద్రపుచ్చటానికి రామాయణకథ చెబుతూండగా ఒకప్పుడు రావణుడు సీతను హరింపకపోయాడనగానే నిజంగానే రాముడైన బాలకృష్ణుడు లక్ష్మణా! విల్లు విల్లు విల్లు అని తొందరతో కూడినమాటలాడేట్లు వర్ణించాడీ మహాకవి ఎంత మధురమనోజ్ఞమో సహృదయుల హృదయాలే సాక్షి!

'రామో నామ బభూవ హుం తదబలా సీతేతి హుం తౌ పితు
ర్వాచా పంచవటీ తటే విహరతస్తామాహరద్రావణః,
నిద్రార్థం జననీకథామితి హరేర్హుంకారతః శృణ్వతః
సౌమిత్రే క్వ ధనుర్ధనుర్ధనురితి వ్యగ్రాగిరః పాంతునః (శ్రీకృ 2-72)

(ఇలరా రాఘవుఁ డొక్కఁ డానినతి యమ్మైథిల్ సీత వారిన్ వనం
బులకుం బంచె గురుండటంచు నిదురం బొందించునయ్యం బవ
ల్కులు దా యాలోని రావణుండు మహిజం గొంపోయె నానుడ్కి విల్
విలుదే లక్ష్మణ! యనుచుఁ బల్కు హరి యుద్వేలోక్తి నన్ బ్రోచుతన్)

ఇంక లీలాశుకకవి వర్ణిత నవవిధ భక్తులలో కొన్నింటిని పరిశీలిద్దాము

**కీర్తనం.**

'అఙ్గుళ్యగ్రైరరుణ కిరణైర్ముక్త సంరుద్ధ రన్ధ్రం
వారం వారం వదనమరుతా వేణుమాపూరయన్తం
వ్యత్యస్తాంఘ్రిం వికచకమలచ్ఛాయ విస్తారి నేత్రం
వన్దే బృన్దావన సుచరితం నన్దగోపాలసూనుమ్' (శ్రీకృ 2-5)

(అరుణశ్రీ దళసత్తు నంగుళుల నాయ్యం గప్పుచున్ విప్పుచున్
మురళీ రంధ్ర ముఖాలాస్య మారుతమునం బూరించు నయ్యారమై
చరణ ద్వంద్వము మార్పడన్ నిలుచు కంజాయతా లోకభా
సుర బృందావన సుందరాంతర చరిష్ణున్ గృష్ణుఁ గీర్తించెదన్ )

భజనం

'మన్దారమూలే మదనాభిరామం బిమ్బాధరాపూరిత వేణునాదమ్,
గోగోపగోపీ జనమధ్య సంస్థం గోపం భజే గోకులపూర్ణచంద్రమ్'
(శ్రీకృ 1-100)

(గోపకగోపికల్ సరవి కొల్వఁగ గోవులు గోవులాడఁగా
గ్రేవులు మేపులాని పరికింపఁగ గెంపుగురాకు మోవిపై
మోపిన వేణువగ్గలము మ్రోయఁగ కల్పవనిన్ వసించునా
గోపకుమార మన్మథుని గోకులవార్ధి శశిన్ భజించెదన్.)

శ్రవణం

'ఆలోలలోచన విలోకిత కేళిధారా
నీరాజితాగ్రసరణైః కరుణామ్బురాశేః,
ఆర్ద్రాణి వేణునినదైః ప్రతినాదపూరై
రాకర్ణయామి మణి నూపుర శిఞ్జితాని ? (శ్రీకృ 1-39)

(నను రక్షింప కృపాపయోధియగు కృష్ణస్వామి లోలావలో
కన ధారారుచి త్రోవకాంతు వెనంగం జూచుచున్ వీకమైఁ
జనుచేరన్ బ్రతినాదపూర మురళీ సంగీత తానాను రం
జన మంజీర రవామృతం బు చెవినిండన్ విందు నింపొందఁగన్ )

పాదసేవనం

'అయి పరిచిను చేతః ప్రాతరమ్భోజ నేత్రం
కబర కలితచఞ్చత్ పిఞ్ఛ దామాభిరామమ్,
బలరిపుమణి నీలం వల్లవీభాగధేయం
నిఖిల నిగమవల్లీ మూలకన్దం ముకున్దమ్ ' (శ్రీకృ 2-10)

(లలితాంభోరుహ నేత్రు గోపరమణీలావణ్య పాత్రున్ సము
జ్జ్వల పౌరందర నీలగాత్రుఁ గబరాంచత్పింఛు నీలున్ విని
శ్చల వేదాంత లతాలవాల మురళి సంగీత లోలున్ దయా
నిలయున్ సమ్మతిగోరి మనమా ! నిత్యంబు సేవింపుమా !)

వందనం

'వన్దే మురారేశ్చరణారవిన్దద్వన్ద్వం దయాదర్శిత శైశవస్య,
వస్తారదుస్తారక దుస్తమూలే మన్దారమాలా విమర్దనీయ' ( శ్రీకృ 3-15)

(దితిజానీకము(ద్రుంప పౌనితతిప త్రింపన్ యశోదాదియో
దిత వైశోరకళా విలాసు(డగు నాదేవాదిదేవోత్తమున్
నత బృందారక బృందమౌళి విలసన్మందారమాలా తరం
గిత ధారాళమరంద బిందుమృదు లాంఘ్రిద్వంద్వు సేవించెదన్ )

**స్మరణం .**

'బృన్దావన ద్రుమతలేషు గవాంగణేషు
వేదావసాన సమయేషు చ దృశ్యతే యః,
తద్వేణు వాదనపరం శిఖిపిఞ్ఛ చూడం
బ్రహ్మస్మరామి కమలేక్షణ మభ్రనీలమ్' (శ్రీకృ 2-21)

(బృందారణ్య తరుప్రదేశముల గోబృందాగణ శ్రేణులన్
ఛందోవిధులం గానిపించు పరమ స్వచ్ఛంద సౌతేజ మా
నందబ్రహ్మము వందనీయ మురళీనాదాను మోదంబు నా
యందున్ నిల్పెద(బింఛమాడను పయోజాక్షంబు మేఘాభమున్ )

**ఆత్మనివేదనం (శరణం)**

'శృఙ్గార రససర్వస్వం శిఖిపిఞ్ఛ విభూషణమ్,
అఙ్గీకృత నరాకారమాశ్రయే భువనాశ్రయమ్' (శ్రీకృ 1-92)

(ఒక్కనివాని పుట్టు వెద(జల్లెడు వాని దయారసంబుచే
నెక్కినువాని మౌళి తటి నించిన పింఛమువాని లోకముల్
మ్రొక్క(గ నేలువాని నీతి మోహనమానుష వేషధారియై
యక్కఱచేనివాని జగదాశ్రయు నెప్పుడు నాశ్రయించెదన్ )

ఇలాగే తక్కిన దాస్యసఖ్య భక్తులు గూడా మనం గమనించగలము

యశోదాదేవికి కృష్ణునిపైగల వాత్సల్యాదులు స్పష్టమవుతాయి

**మధురభక్తి .**

ఆత్మ పరమాత్మలో సమైక్యం కావడానికి యత్నించడమే మధురభక్తి ఈతత్త్వానికి లీలాశుకకవి గోపికా, రాధాయాపంలో ఆత్మనివేదనైక భక్తి ద్వారా వివిధ విధాలా అభివ్యక్తీకరించి ఉండడం గమనించగలము

ఇన్నింటి మధురభక్తి, మధురభక్తి, శృంగారం మొదలైనవన్నిటిని జయదేవుని తరువాత వెలసిన కవి తదనంతర వాగ్గేయకారులు అందించారు అన్నమాచార్యులు జయదేవుని భక్తి, మధురభక్తి, శృంగార విశేషాలన్నింటిని కీర్తించుకొని తన పద సాహిత్యంలో అత్యంత మనోజ్ఞంగా ప్రదర్శించి తన విశిష్టతను అభివ్యక్తీకరించిన తీరు మనం ఇతఃపూర్వమే సోదాహరణంగా పరిశీలించి ఉన్నాము.

## 5 1 3 నారాయణ తీర్థులు

మహాకవి జయదేవుడే లీలాశుకుడుగా, నారాయణతీర్థులుగా జన్మించినట్లు లోకంలో జనశ్రుతి ఉంది నారాయణ తీర్థులు మొదట సంసారి ఆ వెనుక ఆపద్ధర్మ సన్న్యాసం స్వీకరించి భక్తి, మధురభక్తి, శృంగారం, వేదాంతం, నీతి వైరాగ్యాలన్నీ తన సంస్కృత శ్రీకృష్ణ లీలాతరంగిణిలో స్పష్టీకరించిన మహాభక్తాగ్రేసరుడైన కవిసత్తముడు అనేక వేదాంతగ్రంథకర్త అని ప్రసిద్ధి తెలుగులో 'పారిజాతాపహరణము' యక్షగానం రచించినట్లు తెలుస్తుంది ఇందులో కొన్ని భాగాలు మాత్రమే లభిస్తున్నాయి అన్నమాచార్యులు బాల్యంనుంచి భక్తిపరుడై శ్రీవేంకటేశ్వర దర్శనంతో, అలమేలుమంగా దర్శనంతో, శతకరచన, పదరచన ప్రారంభించి ఆధ్యాత్మ శృంగార సంకీర్తనలనే - ముప్పై రెండు వేల పదాలు-రచించి తరించాడు, ప్రప్రథమాంధ్ర వాగ్గేయకారుడయ్యాడు ఈతడు పెద్ద సంసారి

అన్నమాచార్యుల్ని జయదేవుని అవతారమని కొందరంటారు మరికొందరు -పూర్వోక్తమైనట్లు-జయదేవుని అపరావతారం లీలాశుకుడు, ఆ వెనుక నారాయణ తీర్థులు అని భావిస్తారు నిజమే దీనికంతటికీ కారణం శ్రీకృష్ణ భక్తి ప్రేరితంగా సంకీర్తన, కీర్తన, పదం అనబడే రచనలో వీరందరూ చేయడం ఒక ముఖ్య సమానాంశమే జయదేవుడు అష్టపదులు, నారాయణతీర్థులు తరంగాలు రచించారు అన్నమాచార్యులు పదరచన చేశాడు లీలాశుకుడు నిబద్ధ పద్యాలైన గేయచ్ఛందస్సులైన వివిధ వృత్తాల్లో రచన చేసినా వాటిని సంగీత సభల్లో గాయకులు పాడి, ఆడి, అభినయిస్తూ ఉండడం మనకు తెలుసు ఈ విధంగా ఈ వాగ్గేయకారుల్లో సమానాంశాలున్నాయి

అన్నమాచార్యుల పదాలు వేనికవే స్వయం సంపూర్ణమైన ఏకభావ నిర్భరమైన కావ్యాలు నాయికా నాయక శృంగారం, భక్తి, పరమాత్మ సమైక్యానికై చేసుకు

పదే తపన, మధురభక్తి మొదలైన అంశాలను వ్యక్తించే శృంగార పదాలున్నాయి నారాయణ తీర్థులు శ్రీకృష్ణ లీలాతరంగిణిలో శ్రీకృష్ణ బాల్యక్రీడలు మొదలుకొని రుక్మిణీకల్యాణం వరకు గల భాగవత కథను సంగీతాభినయాత్మకంగా రచించాడు ఇందులో ఆధ్యాత్మికమైన భక్తి శృంగారాల సమ్మేళనముంది బాల్య మాదిగా ఆ మరణమూ జీవితాన్ని శ్రీవేంకటేశ్వర స్వామి సేవకై మీదుగట్టిన వాడు అన్నమా చార్యులు జీవితంలో ఆపద్ధర్మంగా స్వీకరించిన సన్యాసమే జీవితాంతం కొనసాగించిన శ్రీకృష్ణ భక్తుడు నారాయణ తీర్థులు శ్రీకృష్ణలీలాతరంగిణి గీతి కావ్యమైనా అందలి పన్నెండు తరంగాలలోని తరంగాలు వేటికవే భక్తి పరిప్లావాలు

అన్నమాచార్యులు కేవలం తెలుగు పదరచన చేసినా సంస్కృతంలోను సమాన పాండిత్యంతో కొన్ని సంకీర్తనలు రచించి తన పాండిత్య ప్రకర్షను ప్రక టించాడు శ్రీకృష్ణ లీలాతరంగిణిని తీర్థులు సంస్కృతంలోనె రచించినా, తెలుగులో పారిజాతాపహరణ మనే యక్షగానం రచించి తన ఉభయ భాషా పాండిత్యాన్ని వెల్ల డించాడు.

ఇద్దరి రచనలు సాహిత్య సంగీతాభినయాల్లో సుసంపన్నమై, తదనంతర వాగ్గేయకారులకు మార్గదర్శక మయ్యాయి ఇద్దరూ పరిపూర్ణ జీవితాన్ని అనుభవించిన వారే అన్నమాచార్యులు దివ్య ధామం చేరాక అతని పుత్రపౌత్రులు అతని మార్గంలో పదరచనలు చేసి వైష్ణవ భక్తి తత్వాన్ని ప్రచారం చేశారు అలాగే తీర్థులు జీవసమాధి అయ్యాక అతని శిష్యుడు సిద్ధేంద్రయోగి కూచిపూడి పద్ధతిలో పారిజాతాపహరణమనే భామాకలాప విధానాన్ని ప్రచారంలోకి తెచ్చాడు

అన్నమాచార్యుల సంకీర్తనల్లో పల్లవేగాని, ఎక్కడో తప్ప అనుపల్లవి కనిపించదు తీర్థుల తరంగాలలో పల్లవి, అనుపల్లవి సక్రమంగా తరువాతి పద కర్తల్లో లాగానే ఉండడం విశేషం దీనివల్ల పదరచనా క్రమ వికాసం తెలుస్తుంది.

"అన్నమాచార్యులు ఆరంభించిన ఆధ్యాత్మిక సంకీర్తనములలోని భక్తి వైరాగ్యములను అవలంబించి, యక్షగాన పద్ధతి మేళవించి నారాయణతీర్థులునూ, శృంగార సంకీర్తనములలోని భక్తి శృంగారములను అవలంబించి యక్షగాన పద్ధతి తోనే మేళవించి సిద్ధేంద్రాములును యక్షగానాలను రచించారు మొదటిది నారాయణ

తీర్థులతో ఆగక, దేవాలయాలలో భజన పద్ధతిగాను, ఆ తరువాత వాగ్గేయకార కృతులుగాను మారిపోగా, రెండింటి శృంగారింపోవి ర క్తిపల్లా, జనరంజకత వల్లా రాజాస్థానాలలోకూడా అభివృద్ధి, ఆదరములనుపొంది తంజావూరులో యక్షగాన స్వర్ణ యుగానికి కారణమైంది' 2

నారాయణ తీర్థులు భాగవత దశమస్కంధ కథను గ్రహించి శ్రీకృష్ణ బాల్య క్రీడలను అత్యంత మనోజ్ఞంగా శ్రీకృష్ణలీలా తరంగిణిలో అభివర్ణించి తరించాడు ఇందులో గోపికా, రాధాకృష్ణుల శృంగారాన్ని చిత్రించాడు భాగవత భక్తిని అంటే మధురభక్తిని గోపికల ద్వారా వర్ణించాడు భక్తి వేదాంత తత్వాన్ని ఉపదేశించాడు సర్వం విష్ణుమయమని నిరూపించాడు.

## శృంగారం

పైకి శృంగారంలా కనిపించినా శ్రీకృష్ణునిపై గోపికలకు గలప్రేమ అలౌకిక మైనది

గోపికా కృష్ణుల, రాధాకృష్ణుల ప్రణయం ఎంతో విపులంగా వర్ణితమైనా, అదంతా అలౌకిక శృంగారమే రాసక్రీడలలో ఇది స్పష్టమవుతుంది

## మధురభక్తి

పైని పేర్కొన్న శృంగారమే మధురభక్తి తీర్థులే ఈ విషయాన్ని వివరించాడు ఆత్మపరమాత్మల సమైక్యమే దీని ఫలితమని చెప్పాడు

'ఆత్మారామాః పరానంద నిత్య తృప్తాః పున పునః,
ఆత్మానుభూతిం గాయంత్యః కృష్ణైకరససంగతాః'

(వారు (గోపికలు) కృష్ణునితో నభేదముఁజెంది యాత్మారాములై (పరమాత్మ స్వరూపమే విహారస్థానముగాఁ గలవారై), పరమానంద రసముచే శాశ్వతమగు తృప్తి గలిగి యానుభవము గానము చేయుచుండిరి )

(శ్రీకృష్ణ లీలాతరంగిణి సప్తమ తరంగము - 9 ) ఇది భాగవతభక్తి మధురభక్తి.

3 మల్లబాలక పాలనచతురం మనసిజ కోటి లావణ్యధరం
కల్యాణగుణ నవమణినికరం కమనీయ కౌస్తుభమణి శేఖరం

4 నవనీత చోర బాలకచరితం నందాది ప్రజపుణ్య తరుఫలితం
ప్రియబృంద కలమేత వరిలలితం ఘవినారాయణ తీర్థయతి భణితం"
(శ్రీకృష్ణ లీలాతరంగిణి - తరంగము - 12)

తరంగాలనబడే పదాల రచన, సంగీతాభినయ సహితంగా రచించిన మహా వాగ్గేయకారుడు నారాయణతీర్థులు అన్నమాచార్యుల అనంతర వాగ్గేయకారుడైనా, సంస్కృతంలో రచించినా, ఇద్దరికీ ఎన్నో సాదృశ్యాలున్నాయి

## 5. 2 ఔత్తరాహ వాగ్గేయకారులు :

అన్నమాచార్యులు పదరచనచేసి, ఆడిపాడి భక్తితత్వాన్ని ప్రబోధించినట్లుగానే మరాఠీ భాషలో జ్ఞానదేవ, నామదేవాదులు అభంగులనబడే పదాలు రచించి, ఆడిపాడి భక్తి, నీతి వైరాగ్యాల్ని ప్రబోధించారు ఆనాడు కూడా సంస్కృతమే పెద్దరికం వహించినా, ప్రజల భాషలో ఈభక్తులు పాటలు రచించడమేగాక, వాటిద్వారా ప్రజలకు భక్తిమార్గాన్ని చూపించారు

రామానుజ మతానుయాయి అయిన అన్నమాచార్యులలాగే, జ్ఞానదేవ నామదేవాదులు ప్రతిపాదించి ప్రచారం చేసినది వర్గ, వర్ణ, కులాతీతమైన భక్తి మార్గమని గ్రహించవలసి ఉంది

అన్నమాచార్యులు సంగీతాభినయాలకు ఒక విశిష్ట పద్ధతిని తన పదాల ద్వారా ప్రవేశపెట్టాడు అనేక రాగతాళాలు ప్రయోగించి కానీ అభంగులకు సంబంధించిన సంగీత ప్రతిప్రత్తి ఎలాంటిదో తెలియరావేదు

పుష్టిమార్గ స్థాపనాచార్యుడు వల్లభాచార్యుడు అతని తరువాత, అతని శిష్యులే ఎక్కువగా ఈ వైష్ణవ భక్తిని ప్రచారంచేశారు అందులో చైతన్యస్వామి కృష్ణ భక్తి, సూరదాసు బాలకృష్ణ భక్తి అపూర్వ మధురమైనవి సూరదాసు పదాలు అన్నమాచార్య పదాల్లాగే అఖండ భక్తి పూరితాలై అత్యంత ప్రచారం పొందాయి,

అన్నమాచార్యులు 32 వేల పదాలు రచిస్తే, 12 వేల పదాలు మాత్రమే ప్రస్తుతం లభ్యమవుతున్నాయి సూరదాసు లక్షాపదివేల పదాలలో ఈనాడు పదివేల పదాలు మాత్రం లభిస్తున్నాయి

మీరా భక్తిగీతాలు 2400 సంగీత సాహిత్యాలకు ఆటపట్టులు భక్తి నీతి వైరాగ్యాలకు పట్టుగొమ్మలు శ్రీకృష్ణ భక్తి ప్రతిపాదకాలు మీరా మహిళగా మధుర భక్తిని ప్రతిపాదించగా, అన్నమాచార్యులు పురుషుడై మధురభక్తిని తనపదాల్లో నిరూపించుకొన్నాడు

ఈ భక్తులందరి పదాల్లోను సందర్భోచితంగా శృంగారం చోటు చేసుకొని ఉంటుంది అది వాత్సల్య, సఖ్య, ప్రేమాది మధురభక్తి రీతులలో ఉంటుంది

ఇక్కడే మనం గుర్తించవలసిన అంశముంది అన్నమాచార్య సూరదాసుల జీవితాలలోని సమానాంశమదే ఇద్దరూ భోగభాగ్యాలను తిరస్కరించి, రాజును ధిక్కరించిన మహామహితాత్ములు, అభిమానధనులు

అన్నమాచార్యుల లాగానే సూరదాసు రాజగౌరవాన్ని తిరస్కరించాడు

సాళ్వనరసింగరాయలు తనపై పదాలు రచించి పాడమన్నాడు అన్నమాచార్యుల్ని అందుకతడు గుణగానం చేయ

" హరిహరీ యనుచు
పరమ పతివ్రతా భావంబుఁ బూని
హరిముకుందునిఁ గొనియాడు నా జిహ్వ
నిన్నుఁ గొనియాడంగ నేరదెంతైన
నను నెట్లు పలికితి నైచ్యంపుఁ బలుకు
నాయచ్యుతునిఁ దక్క నన్యుల వినుతి
సేయుట నాకన్న చెలియలి వావి "[3]

—అని తిరస్కరించాడు

ఇలాగే అక్బరు సూరదాసుని ఆహ్వానించి పదాల్లో తన
మన్నాడట సూరదాసు నందనందనుడే తన మనస్సులో నిండి ఉన్నాడని మానవ స్మరణం తనకు సమ్మతంగాదని తిరస్కరించాడు

యందు, సూరదాసు నెరపిన భక్తిప్రాభవము, విశ్వసాహిత్యమునందే మఱియొక కవి చూపలేదు- లేడు- అనిన సత్యమునెంచిన మాత్రము మారదు కాజాలదు శ్రీకృష్ణుని వివిధావస్థా వర్ణనములనేమి యశోదానందుల వాత్సల్య ప్రేమమును చిత్రించుట యందేమి సూరదాసునికి సాటి సూరదాసే ''[5]

ఇలాంటివి అన్నమాచార్యులలోను మనం చూడగలం

ఇంకా సూరదాసు నవవిధ భక్తులను, వాత్సల్యం, సఖ్యం మొదలైన వివిధ విధ భక్తిని, మధురభక్తిని అనేక రీతుల తన పదాల్లో వర్ణించి తరింపాడు

సూరదాసు శ్రీకృష్ణ బాల్యక్రీడల్ని వర్ణించడంలో అద్వితీయుడు ఒక ఉదాహరణ

శోభిత్ కర్ నవనీత్ లియే ।
ఘుటురన్ చలత్ రేను తనమండిత్ ముఖదధిలేప్ కియే॥
చారుకపోలలోలలోచన్ గోరోచన్ తిలక్ దియే।
లట్ లట్ కనిమను మత్తమధుప గన మాదక్ మధుహిఁపియే॥
కఠులా కంఠ్, వజ్రకే హరినఖ్ రాజత్ రుచిర్ హియే ।
ధన్యసూర్ ఏకౌపల్ హరిసుఖ్ కాసత్ కలప్ జియే॥'

(సూరసాగర్-10/717)

కృష్ణుని చేతవెన్న ముద్ద ఉంది మోకాళ్ళ బలంతో నడుస్తున్నాడు అందువల్ల శరీరమంతా ధూళిధూసరితమై ఉంది ముఖమంతా పెరుగు పులుముకున్నాడు. చెక్కిళ్ళ అందం, నేత్రముల చందం, నొసట తిలకం చూడముచ్చటగా ముద్దుగొల్పుతున్నాడు ఉంగరాల జుత్తు ముఖమును కప్పుతోంది మత్తెక్కిన మధుపగణము మధురస గానం చేస్తున్నట్టుగా ఉంది కంఠమున కంటె ఉంది అందు వజ్రము సింహనఖము చెక్కబడి వృక్షస్థలమున శోభిల్లుతోంది ఈ సౌందర్యమును దర్శించిన ఒక్క క్షణం చాలు అంటాడు సూరదాసు నూరుకల్పముల జీవిత మెందుకు, వ్యర్థమంటాడు '[6]

ఇలాగే అన్నమాచార్య, లీలాశుకాదులు బాలకృష్ణునిలీలల్ని అత్యంత మనోజ్ఞంగా వర్ణించి మనల్ని ముగ్ధుల్ని చేసిన తీరు పూర్వోక్తం ఎందరెన్ని విధాల

వర్ణించిన శ్రీకృష్ణుని లీలలు అందరికీ ఆస్వాదయోగ్యాలే అన్ని కాలాలకు ఉపకరించేవే.

మహాభక్తురాలు మీరా గీతాలలో మధుర భక్తి ప్రధాన భూతమై ఉంటుంది. సకల మానవజాతిని ప్రీతితో పునీతం చేస్తుంది బాలకృష్ణుని వర్ణన పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది

'బసో మేరేనైననమేం నందలాల్
మోహనీ మూరత, సాంవరీ సూరతి నైనా బనేబిసాల్।
అధర సుధారస మురలి రాజత ఉరపై జయంతీమాల్
క్షుద్రఘంటికా కటితట సోభిత నూపుర సబ్దరసాల్ ।
మీరా ప్రభుసంతన సుఖ దాయా భగత బఛల గోపాల్॥'

'కనులలో కొలువుండురా, గోపాల
కనులలో కొలువుండు, నందనందన నాదు॥

శ్రావణ మేఘము గేరుసుభగ
మోహనమౌమేని తీరు
చేరెదేసికనుల చిలిపి మాపులురల
సుధ చిందు మోవిపై, సొబగొందు మురళితో,
మొలనూలి మువ్వలు మొరయ, మంజునూపుర రవళితో నొరయ
మీరా ప్రభు సజ్జన సుఖదాయీ
ఏల బాలము భక్తవత్సల గోపాల॥'[7]

ఇలాగా తులనాత్మకంగా పరిశీలించడం వల్ల అత్యంత సూక్ష్మ భక్తితత్వం స్పష్టమవుతుంది జ్ఞానదేవ్, నామదేవ్‌ల భక్తితత్వమూ, వల్లభాచార్యుల పుష్టిమార్గమూ మీరా అచంచల కృష్ణభక్తి అన్నివిధాలా అన్నమాచార్యులతో పోల్చదగిన సూరదాసు మహిమాన్విత భక్తి విశిష్టత విదితమవుతున్నాయి ఈ కృష్ణభక్తి తత్వం దక్షిణభారతంనుంచి ఉత్తర భారతానికి తరలి వెళ్ళింది అంతకు పూర్వమే దక్షిణ భారతంలో ఈ కృష్ణభక్తి ఉన్నట్లు విదితమవుతుంది

## 5. 3 దాక్షిణాత్య వాగ్గేయకారులు

తమిళంలో పన్నిద్దరాళ్వారులు మహాభక్తులు వారి పాసురాల ద్వారా కృష్ణ భక్తి ప్రతిపత్తిని ప్రకటించినవారు ఆలాగే కన్నడంలో హరిదాసులు మహాభక్తులు పురందర కనకదాసాదులు అనన్యసామాన్యమైన భక్తిని ప్రకటించి ఒక విశిష్టతను సాధించారు

### 5 3 1 పన్నిద్దరాళ్వారులు

పన్నిద్ద రాళ్వారులు పాసురాలనబడే పాటలు భక్తి పూర్వకంగా పాడారు. తమిళంలో ఈ పాసురాలు అతిప్రాచినమైనవి అన్నమాచార్యులు సంస్కృతంలోను కొన్ని పదాలు రచించినా తెలుగులోనె ఎక్కువ పదాలు రచించి తన భక్తితత్పరతని ప్రకటించాడు.

వాస్తవానికి ఆళ్వారుల నాలాయిర ప్రబంధం జానపద గేయగుచ్ఛం అనడమే సముచితం ఆలాగే అన్నమాచార్యుగు తనకు ముందు, సమకాలంలోను ఉన్న అనేక జానపదగేయ రీతుల్ని గ్రహించి నిబద్ధంచేసి పదరచన చేశాడు

ఆళ్వారులు, అన్నమాచార్యుడు శ్రీకృష్ణ భక్తిని వివిధ రీతుల వర్ణించి వైష్ణవ భక్తినీ, మధుర శృంగార రీతుల్ని వివరించారు.

"ఆంధ్ర సంకీర్తనములు - ద్రవిడ పాసురములు ఆళ్వారులు రచింపగా నరవమున ద్రావిడ వేదమని, పంచమాగమమని పేర్కొనబడు దివ్యప్రబంధము నాల్గువేల సంకీర్తనములు పాట్టులు (సీసపద్యాల వంటివి) కలదికాగా, అన్నమాచార్యుడొక్కడే రచించిన యాంధ్రవేదము ముప్పది రెండువేల పాటలుగలది ఈ సంకీర్తనలు దివ్యప్రబంధముల ననువర్తించియే పరమాత్మునకు భక్తజీవులకు పతి పత్నీ భావము, నాయికా నాయక భావము కల్పించి, యుజ్జ్వల రసానుభూతి నొదవించుచు, శరణాగతి మహత్త్వము ను బ్రతిపాదించుచు నింకననేక విధముల లోకనీతి ధర్మోద్బోధ భూతదయాది విశేషాంశముల వెలయించుచు, నెంతో వింతగా వేడుకగా సంగీత సారస్యముతో సరసని భాషతో వెదవేదాంతేతిహాసాది సూక్తి, తదర్థ ప్రతిపాదకములతో పెల్లరిసి, పెరియ వాచ్చాంబిళ్లై వంటి వ్యాఖ్యాత వెలసెనేని యఖండానంద తాండవముగా పెదపెద్ద వ్యాఖ్యాచమత్కారములు త్రవ్వి తీయదగినట్లు విజ్ఞాన నిధులై విరాజిల్లుచున్నవి "[8]

"అన్నమాచార్యులు ఆంధ్రవేదముగా సంకీర్తనములు రచించినా, తాళ్ళపాక వారికి ద్రావిడవేదమంటె ఎంత గౌరవమో సూచించటానికో అన్నట్లు అన్నమాచార్య చరితను ద్విపదలో వ్రాసిన చిన్నన్న 'పరమయోగి విలాసము' అనుపేర ఆళ్వారుల చరిత్రను సూక్ష్మంగాను ద్విపదలో ఉద్గ్రంథంగా రచించాడు."[9]

ఇలాగా ఆళ్వారులు అత్యంత ప్రాచీనకాలంలోనే విష్ణుభక్తి ప్రతిపాదకంగా ద్రావిడ వేదమనబడే పాశురాలు 'నాలాయిర ప్రబంధం' రచించి భక్తులకు మార్గోపదేశ కులయ్యారు. అదేరీతిగా అన్నమాచార్యులు ముప్పైరెండు వేలపదాలు రచించి భక్తి, నీతి, వైరాగ్యాది విశేషాలను పొందుపరచి సంగీత సాహిత్యాభినయ రంగాలలో ఎంతో సేవచేశాడు.

ఆళ్వారుల పాశురాలు తమిళంలో అతిప్రాచీనమైనవి. ఇందులో జానపదగేయ రీతులున్నాయి. ప్రాచీన సంగీతముంది. ఈ పాశురాలు భక్తిప్రబోధకాలు. అన్నమాచార్య పదాల్లో సంగీతసాహిత్యాలు పోటీపడుతున్నాయి. కృష్ణభక్తి నిర్భరంగా ఉన్నాయీ పదాలు. జానపదగేయ ఫణితులున్నాయి. అందులో అన్నమాచార్యుల జోలపాట చాలా ప్రసిద్ధమైంది.

"జో అచ్యుతానంద - జోజో ముకుంద
రావె పరమానంద - రామగోవింద ॥జో॥[10]

తెలుగు జానపద సాహిత్యంలోను ఉంది. ఈ జోలపాట ప్రతినోట తెలుగునాట వినిపిస్తూనే ఉంటుంది. తమిళంలోను ఇలాంటి జోలపాట ఉండడం గమనించదగ్గ అంశం. "ఈజోలపాట వలెనే పెరియాళ్వారులు తమిళమున కొన్ని జోలపాటలను రచించియున్నారు. తెలుగు జోలపాటలలో 'జోజో' అను శబ్దము పునరావృత్త మగుచుండునట్లే తమిళమునగూడ - 'తాలేలో' అను శబ్దము వీరిజోల పాటలలో పునరావృతమగుచుండును. పెరియాళ్వారులు రచించిన ఇట్టి జోలపాటలలో - అన్నిటికంటెను ముఖ్యముగా - కృష్ణుని ఉయ్యెలలో పరుండబెట్టి, యశోదపాడిన జోలపాట ఒకటి అధిక ప్రచారముతో నున్నది. పరిశీలింపుడు—

"మాణిక్కఙ్గట్టి వయిర మిడై కట్టి
ఆణిప్పొన్నాల్ శెయ్ దవణ్ణ చ్చిఱుత్తొట్టిల్
పేణి యునక్కు ప్పిరమన్ విడు తన్దాన్
మాణిక్కుఱళనే తాలేలో - వైయమళన్దానే తాలేలో,

శజ్జిన్ వలమ్పురియన్ సేవచిక్కెణ్గిలియుమ్
అజ్గచ్చరిపశైయుమ్ నాణమ్శై క్రొడరుమ్
అజ్గణ్ విసుమ్బిల్ అమరర్‌కళ్ పోత్తన్దార్
సెజ్గట్కరుమగిరే తాలేలో తేవకి శిజ్గమే తాలేలో.

వానార్ నరుమ్బుకాయ్ శైవెయ్ తి కణ్ణియుమ్
వానార్ పొలణ్డళ్లై కట్టక త్తిన్ వాశైయుమ్
తేనార్ మలర్మేల్ తిరుమజ్గయి పోత్తన్దాళ్
కోనే యళేలేల్ తాలేలో-కుడన్దై క్కిడన్దానె తాలేలో॥[11]

ఇలాగా ఎంతో మధుర మంజులంగా ఈ పాశురాలు అన్నమాచార్యుల పదాలు సన్నిహితంగా ఉన్నట్లు స్పష్టమవుతుంది

ఆళ్వారులు బాలకృష్ణుని లీలల్ని అతి మధురంగా వర్ణించి అత్యంతానందాన్ని పొందారు బాలకృష్ణుడు ప్రతి మానవునికి ఆనందకందం బాలకృష్ణుని చేష్టలు సర్వ మానవకోటికి ఆనందాపాది అయి సర్వేంద్రియ సంతుష్టి కారణం కావడంలో సందేహ మేముంది? ఇలాగే అన్నమాచార్యుల సంకీర్తనల్లోను బాలకృష్ణుని చేష్టలు వివిధ రీతుల వర్ణితమై సమస్త భక్తకోటికి సంతోషానికి ఆలవాలం కావడం మనం గమ నించగలం

ఇలాగా ఆళ్వారులలో సమానంగా అన్నమాచార్యులు భక్తి ప్రపత్తుల్ని అభి వ్యక్తీకరించి తరించిన మహాభక్తాగ్రేసరుడనడం సముచితం.

## 5.3 2 కన్నడ హరిదాసులు ·

అన్నమాచార్యుడు సంగీత జ్ఞాన సంపన్నుడైనా దేశిసాహిత్యంలో తెలుగులో పదరచనచేసి సామాన్య జననానికి జ్ఞానోపదేశం చేసిన మహనీయుడు

అలాగే పురందరదాస కనకదాసులు దాసకూటమిలోని మహనీయులలాగే సంస్కృత జ్ఞానవంతులైనా, కన్నడంలో పదరచన చేసి, అర్చన సమయంలో పాడ డం మొదలు పెట్టిన మహనీయులు. తద్వారా సామాన్య ప్రజానీకానికి సేవచేసిన పరోపకార బుద్ధులు.

అన్నమాచార్యులలాగే పురందర కనకదాసులు శృంగారం సత్కృత్తుగా, భక్తి, మధురభక్తి, నిర్వైరాగ్యాల్ని మిక్కిలిగా ప్రబోధించారు

ఎరందరికీ కులం, మతం, వర్ణం, వర్గం, జాతి మొదలైనవాటితో ప్రమేయం లేని భక్తి ముఖ్యం సర్వప్రాణి సమానత్వం వారి లక్ష్యం

అన్నమాచార్యులు శ్రీరామానుజ మతమైన విశిష్టాద్వైత మతానుయాయి వ్యాసరాయ, పురందర, కనకదాసులు మధ్వాచార్యుల ద్వైతమతానుయాయులు. అయినా లక్ష్యకమొక్కటే, మోక్షం

తెలుగులో పదకవితాపితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ ప్రసిద్ధికెక్కిన మహనీయుడు అన్నమాచార్యులు తన పదాలకు రాగతాళాలుపయోగించి, ఆడిపాడి, అభినయంగూడా కూర్చిన ఘనుడు తనకంటె ముందు మహనీయులున్నప్పటికీ, పురందరదాసు కర్ణాటక సంగీతానికి చక్కని ప్రణాళిక నేర్పరిచి, కర్ణాటక సంగీత పితామహ దన్న బిరుదం పొందినవాడు సంకీర్తన లక్షణం సంస్కృతంలో రచించి, పాటకు నిబద్ధతను కూర్చిన పండితుడు అన్నమాచార్యుడు పదసాహిత్యానికి పట్టం గట్టిన ఘనుడు అలాగే కన్నడంలో పదాలకు ప్రాముఖ్యం తెచ్చినవాడు పురందర దాసు

అన్నమాచార్యుడు ఆ మరణమూ జీవిత సర్వస్వమూ శ్రీ వేంకటేశ్వర కైంకర్యానికి అంకితం చేసిన మహాభక్తుడు, వాగ్గేయకారుడు రాజసత్కారాలను తిరస్కరించిన ఘనుడు పురందరదాసు 'నవకోటి నారాయణ' బిరుదాంకితుడై, సర్వ సంపదల్ని పరిత్యజించి మహాభక్తుడై హరిదాసుగా భిక్షాటనతో జీవితం సాగించిన మహాత్ముడు మండలాధిపతిగా ఉండి, తల్లిదండ్రులు, భార్య మరణించిన వెనుక సమస్తైశ్వర్యాలు త్యజించి భక్తుడై మహా హరిదాసుగా మారిపోయి, హరిదాస సాహిత్యానికే ఎంతో ఘనత తెచ్చిన మాననీయుడు కనకదాసు అన్నమాచార్యుడు సంసారి అయి గూడా దైవసేవా నిమగ్నుడై గృహస్థాశ్రమాన్ని కొనసాగించిన వాడు పురందరదాసు స్వసంపదల్ని త్యజించి భిక్షాటనతో ఆలుబిడ్డల్ని పోషించిన హరిదాసు మండలాధిపతి అయిఉండి గూడా, అన్నిటినీవదలి సన్యసించిన హరిదాసు కనకదాసు.

## 5.3.2 1. పురందరదాసు

అన్నమాచార్య పురందరదాసు లిద్దరూ నరస్తుతి నంగీకరించనివారే అన్నమా

చార్యులు శ్రీవేంకటేశ్వరునిపై శృంగార పదరచన చేసి పాడుతూ ఉండగా, సంత సించిన అతని బాల్యమిత్రుడు, పెనుగొండ విజయనగరాధిపతి అయిన సాళువ నర సింగరాయలు తనపై శృంగార పదాలు రచించుమని కోరాడు అన్నమాచార్యులు తిర స్కరించాడు. రాజు అన్నమాచార్యునికి సంకెళ్ళు వేయించి, కారాగార బద్ధుని చేశా డట. అప్పుడు అన్నమాచార్యులు

"ఆఁకటి వేళల నలపైన వేళలను
తేఁకువ హరినామమే దిక్కు మఱిలేదు" (అధ్యా సం 5-100)

అని భగవంతునిపై పదాలు పాడగానే సంకెళ్ళు ఊడిపోగా, అతని మహిమకు అబ్బుర పడిన రాజు క్షమించుమని శరణువేడుకొని అన్నమాచార్యుని ఘనంగా సత్క రించి పంపాడట. ఇలాగే పురందరదాసు నరస్తుతిని వ్యతిరేకించాడు. ఎవరి దయాదాక్షిణ్యాలను ఆశించలేదు. ఉన్న సంపదల్ని వదలి భిక్షుక చేసి సంసారం సాగించిన భగవద్భక్తి సంపన్నుడు నరస్తుతిపైముఖ్యాన్ని ఈపదంలో వివరించాడు

"హిందెల్లా స్వామి ముందిల్లా ।గో।
వింద నినిల్లదె ఇహాపర విల్ల ॥ప॥
ఎరెర బేడివ్వంతె గతియాయితిల్ల
నరర స్తుతిసి నాలిగె బరడాయిత్తల్ల
పరవిన ఇహావిల్ల నరజన్మ స్థిరవల్ల
నరగె పామరగె పాలవ ఎంజరగె ॥హిందె॥
(పురందర దాసర పదగళు - 1-102)

"వేంకట రమణ వేదాంత ఎన్నుయి పాద
పంకజకండమేలె మంకు మానవన వెడినువుదుచితవే
శంఖ చక్రాంకితనే ॥ప॥" (1-104)

(ముందూ వెనుకా ఏమీలేదు గోవిందుడు లేకపోతే ఇహాపరాలులేవు ఇతరు లను స్తుతించడం నాకు చేతకాదు నరులను స్తుతించే నాలుక నిస్సారమైంది) (వేంకట రమణా! నిన్ను స్తుతించిన వెనుక మంకు మానవులను స్తుతించడం ఉచితమా) అని ఇలాగా పరిపరి విధాలా నరస్తుతి ఉచితం కాదని వంరోక్తిగా చెప్పుకొన్నాడు పురం దరదాసు. దీని వల్ల పరస్తుతి యందు భావం ఉపేక్షనని స్పష్టమవుతుంది

అన్నమాచార్యుల ఆరాధ్య దైవం శ్రీ వేంకటేశ్వరుడు అతని పదాలన్నిటా శ్రీవేంకటేశ్వర ముద్ర ఉండి తీరుతుంది పురందరదాసు ఆరాధ్య దైవం పురందర విఠలుడు ఇతని పదాల్లో ఈ ముద్ర ఉంటుంది ఈ వాగ్గేయకారులిద్దరూ దశావతార, శ్రీరామ, అహోబిల నారసింహ, హనుమంతులను స్మరించి, ఎక్కువగా శ్రీకృష్ణలీలా విశేషాలను అభివర్ణించి తరించారు అంతేగాక పురందర విఠలుని అన్నమాచార్యులు, శ్రీవేంకటేశ్వరుని పురందరదాసు తమ పదాల్లో ఆరాధించి ఉండడం ముఖ్యంగా గమనించ దగ్గ అంశం ఉదాహరణకు ఒక్కొక్క పదం పరిశీలిద్దాము

"మొక్కలీడవయ్యా నివు ముద్దు విఠ్ఠలా మా
ఎక్కువాయె నెప్పుడును పండరంగి విట్ఠలా ॥ప॥

చిక్కని చల్ల అమ్మఁగాఁ జేరి విట్ఠలా మా
జిక్కవు చన్నులంటేవు సారె విట్ఠలా
తొక్కేవు మా పాదాలు దొమ్మి విట్ఠలా
ఎక్కని మైచెమరించేఁ బండరంగి విట్ఠలా ॥మొక్క॥

వేఁగాచి వచ్చేవు మావెంట విట్ఠలా కడు
మేలము లాడఁ జేరేవు మేటి విట్ఠలా
కోలు ముంపై చెనకేవు గొంటు విట్ఠలా
వాలుగాంచి (చే?) వేళనే పండరంగి విట్ఠలా ॥మొక్క॥

సోరిది గచ్చకాయలు చూపి విట్ఠలా
సరిపెనులాడేవు జాణవిట్ఠలా
గోరపై శ్రీవేంకటాద్రిఁ గూడి విట్ఠలా
ఎరగ మావద్ద నుంటి పండరంగి విట్ఠలా ॥మొక్క॥

(శృం సం 24-369)

అని మనసారా అన్నమాచార్యులు విట్ఠలుని స్తుతించాడు ఇలాగే పురందర దాసు శ్రీవేంకటేశ్వరుని స్తుతించిన పదం ,

"వేంకటాచల నిలయం వైకుంఠపురవాసం
పంకజ నేత్రం పరమ పవిత్రం
శంఖ చక్రధరం చిన్మయ రూపం ॥ప॥

అంబుజోద్భవ వినుతం అగణిత గుణ నామం
తుంబురు నారద గాన విలోలం
అంబుధి శయనం ఆత్మాభిరామం ॥వెంక॥

పాహి పాండవపక్షం కౌరవ మదహరణం
బాహు పరాక్రమ పూర్ణం
అహల్యా శాపభయ నివారణం ॥వేంక॥

సకల వేద విచారం సర్వజీవనికరం
మకర కుండల ధర మదన గోపాలం
భక్త పోషక శ్రీపురందర విఠలం ॥వెంక॥ (1-71)

ఇలాంటిదే మరో పదం

"తిరుపతి వెంకటరమణ నిన-గేతకె బారదు కరుణ' (1-134)

ఇలాగా ఇద్దరి భావన ఒకేలా ఉండడం గమనించ వలసిన అంశం.

ఇద్దరి పదాల్లో సామ్యం గోచరిస్తుంది.

"శరణు శరణు సురేంద్ర సన్నుత శరణు శ్రీపతి వల్లభా
శరణు రాక్షస గర్వ సంహార శరణు వేంకట నాయకా॥"[12]

ఇలాగే రచించబడ్డ పురందరదాసు పదం

"శరణు శరణు సురేంద్ర వందిత శరణు శ్రీపతి సేవిత
శరణు పార్వతి తనయ మూరుతి శరణు సిద్ధి వినాయకా॥"[13]

ఇలాంటిదే పురందర దాసు మరో పదం

"శరణు శరణు సురేంద్ర వందిత శంఖ చక్రగదా ధర ॥ప॥
శరణు సర్వేశ్వరనె అహోబల గిరియ నరసింహామూర్తిగె
॥అ ప॥ (1-331)

భజనపద్ధతిలో బాగా ప్రచారంలో ఉన్న అన్నమాచార్య ప్రసిద్ధ పదం

"నారాయణతే నమో నమో
నారద సన్నుత నమో నమో ॥నారా॥

మురహర భవహర ముకుంద మాధవ
గరుడగమన పంకజనాభ
పరమ పురుష భవబంధ విమోచన
నరమృగశరీర నమో నమో ॥నారా॥" 11

ఇదే అనిపించే పురందరదాసు పదం

'నారాయణతే నమో నమో భవ
నారద సన్నుత నమో నమో ॥న॥

మురహర నగధర ముకుంద మాధవ
గరుడగమన పంకజనాభ
పరమపురుష భవభంజన కేశవ
నరమృగశరీర నమో నమో ॥నారా॥ (1-72)

మరింత చక్కటి సాదృశ్యం గల మరో పదం పరిశీలనార్హం అన్నమాచార్యులు కలలో శ్రీవేంకటేశ్వరుని గాంచి వర్ణించిన పదం

"ఇప్పుడిటు కలగంటి నెల్ల లోకములకు
నప్పుడగు తిరువేంకటాద్రీశుఁ గంటి ॥పల్లవి॥

అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి
ప్రతిలేని గోపుర ప్రభలు గంటి
శతకోటి సూర్యతేజములు వెలుగ గంటి
చతురాస్యుఁ బొడగంటిఁ జయ్యన మేలుకంటి ॥ఇప్పు॥
(అధ్యా సం 5-38)

అన్ని విధాలా చక్కటి సాదృశ్యంగల పురందరదాసు శ్రీవేంకటేశ్వరుని గాంచి వర్ణించిన పదం

"కండె కండె స్వామియ నెడిగొండె ॥ప॥

కండె తిరుపతి వేంకటేశన కారుణ్యాత్మక సార్వభౌమన
కొండు తార్కిగెప్ప దేవన కరుణానిధి ఎందెనిసి మెరెదవన ॥అ॥

కోటి సూర్య ప్రకాశవెనిప కిరీటవన్ను మస్తకది కండెను
నోటి కాశ్చర్య వాద వనెముఖ నొసలొళెసలి తిరుమణియ కండెను
సాటి యిల్లద శంఖచక్రవు చతురహస్తదిం కండెను
బూటకద మాతల్ల కేళిరో భూరిదేవర గండనంప్రియ ॥కండె॥"
(1-193)

ఇలాంటిదే పురందరదాసు మరో పదం

'కండెనా కనసినలి గోవిందన ॥ప॥
కండెనా కనసినలి కనక రత్నద మణిమయ
నందన కండె ముకుందన చరణ ॥అ॥ (1-35)

కాగా కొన్ని ఇతర పదరీతుల్లో సామ్యం గోచరిస్తుంది

అన్నమాచార్యుల జోలపాట

'జోవచ్చు తానంద జోజో ముకుంద
రావె పరమానంద రామ గోవింద॥" [15]

పురందరదాసు జోలపాట

"జోజో శ్రీకృష్ణ పరమానంద
నంద గోపియ కంద ముకుంద" (1-58)

అన్నమాచార్యుల శోభనం పదం

"శోభనమే శోభనమే
వైభవముల పావనమూర్తికి" (శృ సం. 2-18)

పురందరదాసు శోభనం పదం

"శోభాన శోభానవే
మాదేవి యరస వేంకట రాయగె శోభాన శోభానవే॥ (1-352)

అన్నమాచార్యుల మంగళం

"మాధవునకు మంగళము
సాధుప్రియునకు జయమంగళము" (శృం సం 3-227)

పురందరదాసు మంగళం

"జయమంగళం నిత్య శుభమంగళం
ఇందిరారమణగె ఇభరాజవరదగె" (1-312)

అన్నమాచార్య పురందరదాసుల భావసామ్య మెంతగానో స్పష్టమవుతుంది జీవాత్మ పరమాత్మల అల్పత్వానల్పత్వాన్ని గూర్చి అన్నమాచార్యులు అనవద్యంగా హృద్యంగా వర్ణించిన పదం

"కొసరనేల నా గుణములివి
రసికత నీవిన్నిటా రక్షించుకొనుమా ॥ప॥
నేరమి నాది నేరుపు నిది
మారునాది బంధుడవు నీవు
కోరుదు నేను కొమ్మని యిత్తువు
కారుణ్యాత్మక గతినీవు సుమా ॥కొస॥
నేను యాచకుడ నీవే దాతవు
హీనుడనే పర దేవుడవు
జ్ఞాన రహితుడను సర్వజ్ఞ నిధివి
శ్రీనిధి యిక నను చేరి కావు మీ ॥కొస॥
అరయ నే జీవుడ నంతర్యామివి
యిరవుగ దాసుడ నేలికవు
చిరజీవిని నె శ్రీవెంకటపతివి
వరదుడ నను జే వదలకుమీ ॥కొస॥" (అధ్యా సం. 10-176)

ఇలాంటిదే చాలా చక్కటి సాదృశ్యంగల పురందరదాసు పదం

"మందమతియో నాను మదన జనకను నీను
కుందుగళ నెనసదె దయమాడి సలహో ॥ప॥

పాపకర్తను నాను పావ నాకను నీను
కోప మదమత్సరది సుళిదెనాను
తాపవను తరిదు నిర్భయప మాడువెనీను
బాపభాయకె మరుళ గొండెనో నాను ॥మంద॥

శరణ రక్షక నీను పరమ పాతకి నాను
దురిత పర్వతద పరిహారివె నీను
మరుళ గొండెను నాను అరితు రక్షిపె నిను
గురువాహంకారి నాను అగమ్యనీను ॥మంద॥

మంద భాగ్యను నాను ఇందిరాపతి నిను
హిందు ముందిన సుద్ది అరియ వదన నాను
తందె శ్రీ పురందర విఠలన రాయనె
ఎందెందు భక్త రను సలువావెయోనీను ॥మంద॥ (1-160)

ఇంకా ఇలాగే అనేక భావాల సామ్యం ఇద్దరు వాగ్గేయకారుల్లోను సమానమే ఇందుకెన్ని ఉదాహరణలనైనా ఇవ్వవచ్చును

ఇంతేగాక ఈ మహానుభావులు ఇద్దరి భావనల్లను, శృంగారం, భక్తి, మధుర భక్తి, జ్ఞానం, నీతి, వైరాగ్యం మొదలైనవాటి వివరణల్లో అత్యంత సాదృశ్యం గోచరిస్తుంది ఇంతఃపూర్వమే అన్నమాచార్యుల సంకీర్తనల్లో స్పష్టమయ్యే అంశాలన్ని వివరించడం జరిగింది అవన్నీ పురందరదాసు పదాల్లో విదితమయ్యే తీరు మనం గమనించగలం

పురందరదాసు పదాల్లో నవవిధభక్తి రీతులున్నాయి అన్నిటికంటే ప్రధానం దృఢభక్తి అంటాడు పురందరదాసు తక్కినవన్నీ లేకున్నా ప్రమాదం లేదు

"తనువ నీరొళగద్ది ఫలవేను
మనదల్లి దృఢభక్తి యిల్లద మనుజను॥' (2-80)

## కీర్తనం

పురందరదాసు పదాలన్నీ కీర్తన కుదాహరణలే అవుతాయి

శ్రవణం

"హరికథా శ్రవణమాడో పాడో
హరికథా శ్రవణమాడో" (1-255)

పాదసేవనం.

"ఎనగది నీనేమతి ఏనేస్వామి
నీనల్ల దన్యత్ర దైవగళ నానరియే ॥ప॥
నిన్న పాదారవింద సేవెయ మాడి
నిన్న ధ్యానదలిరువ హాగెమాడు॥ (1-205)

వందనం.

'వందిసిదవరె ధన్యరు ॥ప॥
నమ్మ ఇందిరాపతిగడ్డ బీళుతలొమ్మె॥ (1-330)

స్మరణం

"హరినారాయణ హరినారాయణ హరినారాయణ ఎనుమనవె" (1-121)

దాస్యం.

"నిన్నదయదృష్టిగె చిత్తవిల్లదిరె" (1-154)

ఇలాగే తక్కినవన్నీ పురందరదాసు పదాల్లో ఉన్నాయి

శరణాగతి:

"కాయబేకెన్న గోపాల
ఒందుపాయ వనరియె నెందు భకుతరపాల" (1-319)

నీతి

"మానవజన్మ దొడ్డదు ఇద
హానిమాడలు బేడి హుచ్చప్పగళిరా ॥ప॥"
కణ్ణు కై కాలు కివి నాలిగె ఇరలిక్కె
మణ్ణు ముక్కి హుచ్చరాగువరె
హెణ్ణు మక్కళిగాగి హరినామామృత
ఉణ్ణదె ఉపవాస ఇరువరె ఖోడి॥' (2-33)

వైరాగ్యం :

"విషయవివార విధి విహితకర్మవ మాడు
వైరాగ్యభాగ్యవెడు ॥ప॥" (2-10)

ఇలాగా పురందరదాసులో అన్ని భావాల్ని మనం చూడగలము. అన్నమాచార్య పురందరదాసులు మహాభక్తులు. అసామాన్య వాగ్గేయకారులు వారి భాషవేరైనా భావం ఒక్కటే ఆభావంలోని భక్తి ఒక్కటే

5 3 2 2 కనకదాసు

ఇదేవిధంగా అన్నమాచార్య కనకదాసులలో కూడా అన్ని అంశాల్లోను సామ్యాంశ్యంగమనించగలం కనకదాసు తండ్రి బీరప్ప మొదటశైవుడు ఆ వెనుక వైష్ణవుడయ్యాడు శ్రీవెంకటేశ్వరుని భక్తుడై 'తిమ్మప్ప' అని తన కుమారునకు పేరుంచుకొన్నాడు తిమ్మప్ప తరువాత కాలంలో కనకదాసయ్యాడన్న సంగతిమనకు తెలిసిందే మండలాధిపతిగా ఉండిన కనకదాసు సర్వంత్యజించి భక్తుడయ్యాడు తన పదాల్లో కాగినెల్లిలోని ఆదికేశవుని ముద్రతో పదరచనచేసి తరించాడు

భక్తుడైన కనకదాసు అనేక మహిమలు చూపించినట్లు విశదమవుతుంది వ్యాసరాయ నిర్మాణమైన వ్యాససముద్రంలో బండను యమధర్మరాజు వాహనమైన దున్నపోతుతో పగులగొట్టించడం, కుక్క రూపంలో భగవంతుని దర్శింపజేయడం, తిరుపతి, ఉడిపి క్షేత్రాలలో తన భక్తిమహిమను స్పష్టపరచడం, ముక్తికర్త దెవ్వరన్న ప్రశ్నకు చక్కటి సమాధానం చెప్పి పండితులచేత ప్రశంసించబడడం మొదలైన అంశాలన్నీ ఇందుకుదాహరణలు

పురందర కనకదాసుల కీర్తనలు హరిభక్తి పూరితాలు అన్నమాచార్యుల సంకీర్తనతో సమానం అన్నమాచార్యుల సంక్షిప్తత పురందరదాసు కీర్తనల్లో కనిపిస్తూ ఉండగా, కనకదాసు క్లుప్తంగా చెప్పడంలో సంతృప్తి చెందక విస్తారంగా వివరించి చెబుతాడు ఏ విషయాన్నైనా ఈ ముగ్గురు భక్తులపదాల్లోను అష్టాదశ పురాణాల్లోని వివిధాంశాలుండడం గమనించగలం అన్నమాచార్యులు పురందరదాసులు వేదాంతోపనిషత్సారాన్ని సామాన్య ప్రజలకోసం తమ పదాల్లో వివరించి

ఉండగా కనకదాసు అత్యంతం హెచ్చు గ్రంథపరనంపల్లి పండితులైనా అతి సామాన్య పద్ధతిలో భాగవతభక్తిని తన పదాల్లో నిరూపించాడు

పురందరదాసు పదరచన సరళంగా ఉండగా కనకదాసు రచన నిగూఢమై ఆధ్యాత్మికతను ప్రకటిస్తూ ఉంటుంది కనకదాసు పదాలు వ్యంగోక్తి ప్రాధాన్యకంగా అంటే వ్యాజ స్తుతిపరంగా ఉంటాయి తిరుపతి వెంకటేశ్వరుని పేర జరుగుతున్న ధనార్జనను గూర్చి వ్యంగ్యంగా ఇలా పాడుకొన్నాడు

'బందెపయ్యా గోవిందశెట్టి ॥ప॥
ఇందు నిమ్మ వారివాణ ప్రసాద పుంటినలాగి ॥అ॥

శేషగిరియ మేలె ఇప్ప తిమ్మశెట్టి
దేశకె ప్రసాదవ నడసువ శెట్టి
ఆనెయింద హణకాసుగళిసువ - ఆది
కేశవనారాయణశెంబ శెట్టి" (కనకదాసర హాడుగళు 151)
(గోవిందశెట్టీ! వచ్చావా? తిరుమలగిరిపై వెలసిన తిమ్మ
శెట్టి! దేశానికంతటికీని ప్రసాదం పంచిపెట్టెశెట్టీ!
ఆశతో డబ్బుతీసుకొనె
శెట్టి! ఆదికేశవనారాయణ శెట్టి!)

ఇలాగే బంకాపురం వెళ్ళిన కనకదాసు అక్కడి లక్ష్మీనరసింహస్వామిని చూసి "మానమర్యాద ఉండక్కరలేదా? అందరి సమక్షంలో సభామధ్యంలో తొడపై భార్య నుంచుకొని సరసమాడుతావా" అని వ్యంగ్యంగా స్తుతించాడు

"ఆవుదొళ్ళెయదో నిన్నంగ దెలుప
దేవ బంకాపురద లకుమినరసింహా ॥ప॥

హొడవిపతి కేళు శ్రీఆదికేశవనె హిం
గడెయల్లి మనెయ కట్టిసబారదె?
బిడెయవిల్లదె సభామధ్యదలి హెండతియ
తొడెయ మేల్కుళ్ళిరిసికొండిర్ప హిరియతనవు" (క హా - 68)

కలియుగంలో ముక్తికిమార్గం భక్తి అని కనకదాసు దృఢాభిప్రాయం అంతే గాక ఆతని పదాల్లో ఆతని హృదయంలోని భక్తి జ్ఞాన నీతి వైరాగ్యాల్ని సందర్భాను సారంగా వివరించాడు దాసుని ఆత్మ పరిపక్వఫల నిదర్శనమే ఆతని పదాలంటే తప్పులేదు

శ్రీహరి సర్వోత్తముడని విశ్వసించి, దాసదాసాను దాసుడై ఉండడం దాసుని ఉత్తమ లక్షణ మని అనేక రీతుల తెలిపాడు కనకదాసు

"దాస దాసర మనెయ దాసాను దాస నాను
శ్రీశ శ్రీరంగ నిమ్మ మనెయ దాస ॥ప॥

పంకజనాభన మనెయ మంకుదాసనయ్య
కొంకుదాసను నాను కురుడు దాస
సంకీర్తనెయ మాడి నెనెవ భక్తర మనెయ
బింకద బాగిల కాయ్వ బడదాస నాను ॥దాస॥
(క-హా 68)

అగ్రకులాల వల్ల అవమానితుడైన కనకదాసు కులాన్ని పరి పరి విధాలా ఖండించాడు. నీతిని బోధించాడు ఈ దేహమస్థిరమని, హరి సర్వోత్తముడనీ, తద్భక్తియే ముక్తికి మార్గమని నిరూపించాడు.

"కుల కుల కుల వెన్నుతి హారో
కులవావుదు సత్య సుజనరిగె ॥ప॥

కెసరొళు తావరె పుట్టలు అదర తందు
కుసుమ నాభనిగె అర్పిసరేనయ్య ?
ఎసువిన మాంస హాలుత్పత్తి పరిప
వసుధెయొళగె భూసుర రుణ్ణవేనయ్య ॥కుల॥

ఆ శాండిల్య ఎరాశర ఎనిసను
వేశెయ పుత్ర వసిష్ఠ ముని
దాసియ నందన నారద ఎనిపను
కాశ్యప పౌత్రన కులపేళిరయ్య ॥కుల॥

ఆత్మ నాపకుల జీవనాం కుల
తత్వేంద్రియ గళ కుల పేళిరయ్య
ఆత్మను కాగినెలె యాదికేశవ నొందద
భక్తిరిగె కులవావుదు పేళిరయ్య ॥కుల॥ (క వా 120)

'కుల కుల కులవెందు హోరాడిదిరి నిమ్మ
కులద నెలెయి నేనాదయా బల్లిరా ॥ప॥

హుట్టిదా యోనిగళెల్ల మెట్టిదా భూమిగళెల్ల
అట్టు ఉణ్ణద వస్తు గళెల్లవూ
గుట్టు కాణిసి బంతు హిరిదేను కిరిదేను
నెట్టనె సర్వజ్ఞన నెనెకాణో మనుజ ॥కుల॥

జలవె సకల కులకె తాయి యల్లవె ఆ
జలద కులవసేనాదయా బల్లిరా ?
జలద బొబ్బుళియంతె స్థిరవల్ల ఈ దేహ
నెలెయ నరితు నీ హరియ నెనె మనుజ ॥కుల॥

హరియే సర్వోత్తమ హరియే సర్వేశ్వర
హరిమయవెల్లవెనుత తిళిదు
సిరికాగెనెపలి యాదికేశవ రాయన
చరణ కమల వను కీర్తిసువనె కులజ ॥కుల॥ (క వా 121)

సంపదలు నశ్వరమని భగవద్భక్తి ముఖ్యమని తెలిపాడు కనకదాసు

"నంబనెడి సిరియు తన్నదె ॥ప॥

నంబొడి సిరియు తన్న దెంబ నిమిష దొళగేనాంచో
డంబతన విదేకె హరి పదాంబుజవను భజిసి నరరు ॥అ॥"

(క హా 115)

ఎన్నో లౌకిక సత్యాల్ని వివరించాడు కనకదాసు ఎవరు ఏమిచేసినా పొట్ట కోసం, ఇంత బట్ట కోసమేనంటూ వివరించాడు

"ఎల్లరూ మాడువుదు హొట్టెగాగి గేణు బట్టెగాగి ॥ప॥

నెల్లుగళ కుట్టకొండు బిదురు గళ హొత్తుకొండు
టాలిగళ మాడువుదు హొట్టెగాగి గేణుబట్టెగాగి ॥ఎల్ల॥

నాలుకు వేద పురాణ శాస్త్ర పంచాంగ హేళికొండు
కాలకళెయువుదెల్ల హొట్టెగాగి గేణ బట్టెగాగి ॥ఎల్ల॥
" (క హా 134)

ఇలాగా ఎన్నో నిత్య సత్యాలు చెప్పి, నీతిబోధ చేసిన మహనీయుడు కనక దాసు

మూఢ విశ్వాసాలమీద, ఆచారాల పేర జరుగుతూండే అనాచారాలమీద కనక దాసు ధ్వజమెత్తి ఖండించాడు దేవదాసీ పద్ధతిని వదలి, కోడి, గొర్రె, మేక, దున్న పోతు మొదలైన ప్రాణుల్ని క్షుద్ర దేవతలకు బలియిచ్చే దుష్కార్యాన్ని త్యజించం తని చక్కగా ఉద్బోధించి అందుకై పాటుపడ్డ ఆనాటి సంస్కర్తగా కనకదాసని చెప్పడంలో దోషం లేదు అందుకోసమే ఈ కీర్తన

"కణియ హేళబందె నారాయణన పల్లదిల్ల పెందు
బినుగు దైవద గొడవె పీడి నరక తప్పదో ॥ప॥

హాళ్ళి యపరు హెళ్ళియపరు సూళెరెల్లా కూడికొండు
పెళ్ళన్న పెళహ తనక నీరదడదల్లి
గుళ్ళు గుసుగు కూడిసికొంతు కిళ్ళకొడన బరిదమాడిద
కళ్ళ దైవద గొడవ పిడి నరక తప్పదో ॥కణి॥

ఎగెడవర మాతదేకె? గాళిరెల్ల ఎాడికొండు
హాసమాడి కై యొద్ద హొన్నహణగళ
బాయ తిప్ప కురి కోణంగళ నెదవిళనె కొండుకడహా
నిళెగెడి నరకక్కెొందు హేళ బందెరో ॥కడి॥

గుత్తి యపర మాతకేనె గాత్తి ఎల్లమ్మని గొలిదు
బత్తరే బాగిలొళు నింత పరియ నోడిదరో
మత్తె చెవి నుడిగె గళను అత్తియుంచ తట్టుకొండు
ముక్తి ఎరెదెపెంబు దొందు శక్తి కాణిరో ॥కడి॥

మెక్క నాతియర కాటి తొగియరు కన్యయను
బిత్తరే బాగిలొళు నింత నైర దెవరు
మత్తె మారి మసణి దుర్గి మైలారి మొదలాదరు ఈ
ఠక్క దైవద గొడవె బెడి నరక తప్పదో ॥కడి॥

పురవి గధిక భాగా నగర దొరెయ పట్టి వెంకట భీమన
కడు చల్వినాళువ నమ్మ కనక నొడయన
ఒడయ నాదికేశవన దృఢ భకుతి యిందలి భజిసి
నొదరు దైవద గొడవె బెడి నరక తప్పదో ॥కడి॥

(శ్రీ కనక దాసర పదగళు - 138)

ఇలాగా తన బంధువుల్ని కనకదాసును జాతరకు తీసుకొనిపోగా అక్కడికి వెళ్ళి ఈ రీతిగా పాడి, ఆనాటి సమాజాన్ని మార్చివేశాడు

భక్తి, జ్ఞానం, నీతి, వైరాగ్యాలతోపాటు సంఘంలో దురాచారాల్ని దుయ్యబట్టడం కనకదాసు పదాల్లో మనం చూడగలం

కనకదాసు తనపదాల్లో సుమారు ముప్పైఆరు ప్రసిద్ధ రాగాలను ప్రయోగించడం గమనించగలము పల్లవితోపాటు అనుపల్లవిని కూడా ఇతడు కొన్నిపదాల్లో వాడి పదానికి పుష్టిని గూర్చాడు అన్నమాచార్యునిలో తక్కువగా పురందరదాసులో మరికొంత ఎక్కువగా ఈ అనుపల్లవి గోచరిస్తుంది

ఈ రీతిగా తెలుగు కన్నడ సాహిత్యాలలో ఈ పద సాహిత్యాన్ని కత్యంత ప్రాధాన్యం సంపాదించి పెట్టిన మహా వాగ్గేయకారులు భాషవేరైనా భావాలు, భావాలతోపాటు భక్తి ఒక్కటేనని నిరూపించిన మహానీయులు, సర్వకాలాలలో మాననీయులు,

# సూ చి క లు

1 ఇందులోని కుండలీకరణాలలో ఉదాహరించిన పద్యాలు శ్రీకృష్ణకర్ణామృతాన్ని తెలుగు పద్యాలుగా అనుసరించిన వెలగపూడి వెంగనార్యునివి

2 రజనీకాంతరావు, బాలాంత్రపు ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము పు 181

3 వేటూరి ప్రభాకర శాస్త్రి (సం) ప్రథమముద్రణ
గౌరిపెద్ది రామసుబ్బశర్మ(సం) తృతీయ ముద్రణ
తాళ్ళపాక చిన తిరువేంగళనాథుడు - రచయిత
} అన్నమాచార్య జీవిత చరిత్ర పు 36, 37

4 ఆయావితుల హనుమచ్ఛాస్త్రి హింది సాహిత్యము vol I పు 236, 2̇7 –1956

5 పైదే పు 242, 243

6 సాహిత్యోపన్యాసములు-16 డా॥ సి వెంప్ రాములు - యారదాయి కవితా సౌందర్యం - పు 25

7 పై 4వ సూచికలోనిదే పు 278

8 ప్రభాకరశాస్త్రి, వేటూరి టీకక - అన్నమాచార్యుల జీవితచరిత్రము పు-122

9 పై 2వ సూచికలోనిదే పు 112, 113

10 పై 8వ సూచికలోనిది పు 61, 62

11. వరదాచార్యులు, ధనకుధరం ఆళ్వారులు-దివ్యప్రబంధములు పు 212, 213

12 అన్నమాచార్యుల సంకీర్తనలు (హర్ప) తానిపెట్టి శ్రీనివాసులు-పదం 29

13 పై 8వ సూచికలోనిదే పు 68

14 పై 12వ సూచికలోనిదే పదం 27

15 పైదే పదం - 52



# 6.0 తెలుగు ప్రముఖ వాగ్గేయకారులు :

ఇంతవరకు అన్నమాచార్యులతోపాటు సంస్కృతంలోను, ఔత్తరాహ, దాక్షిణాత్య భాషల్లోను వెలసిన కృష్ణభక్తిప్రేరిత పదకర్తలూ, వాగ్గేయకారులూ అయిన వారి జీవితరేఖలను, తులనాత్మక పరిశీలనతో ఆయా వ్యక్తుల జీవితతత్వాలను, వారి రచనాతత్వాన్ని తెలుసుకోవడం జరిగింది

అంతేగాక అన్నమాచార్యుల పూర్వుడూ, వచనకారుడూ అయిన కృష్ణమాచార్యుల గూర్చి, తరువాతి వారైన అన్నమాచార్యుల పుత్రపౌత్రులు పెద, చిన తిరుమలాచార్యులను, క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, త్యాగరాజు అనే మహాపదకర్తల వాగ్గేయకారుల జీవిత చరిత్రలను తెలుసుకొన్నాము పేరుకు వచనాలే అయినా పాడుకోవానికి అనుకూలమైన తాళగంధి వచన రచయిత కృష్ణమాచార్యుల దగ్గరనుంచి, నిబద్ధమైన పదకవితా స్వరూపనిరూపణకు చక్కటి నిదర్శనాలుగా నిలిచే వేలసంకీర్తనలు రచించిన అన్నమాచార్యుల పదం తరువాతి కాలంలో క్రమ వికాసంతో భక్తి, శృంగార, మధురభక్తి, నీతి, వైరాగ్యాది ప్రబోధకమై కృతిగా త్యాగరాజులో ఎలా పరిణమించిందో గూడా - స్థూలంగానేకావచ్చు - గ్రహించగలిగాము

అన్నమాచార్యులలో తెలుగులో ప్రసిద్ధికెక్కిన తదితర వాగ్గేయకారుల పదాల తులనాత్మక పరిశీలన ప్రస్తుతాంశం ఈ అధ్యయనం ఆయా వాగ్గేయకారుల తత్వ నిరూపణకు అత్యంతముపకరిస్తుంది

## 6.1. కృష్ణమాచార్యులు :

అన్నమాచార్యులు బాల్యంలోనే ఈ ప్రపంచాన్ని రోసి భగవంతుణ్ణి అన్వేషిస్తూ వెళ్ళి తిరుపతిలో అలమేలుమంగా వేంకటేశ్వరుల అనుగ్రహానికి పాత్రుడైన మహానుభావుడు ఆ వెనుక సంకీర్తనలు వేలలో రాసి అమరమైన దేవతా శృంగారాన్ని ఆత్మ పరమాత్మల పరంగా మధురభక్తి తత్వోపదేశపరంగా, అధ్యాత్మికత విస్పష్టమయ్యేరీతిలో నిరూపించిన మహాభక్తుడు ఆతడు రాసిన పదాలన్నీ నిబద్ధ పదాలు రాగతాళాలలో ఆలపించుకోవడానికి తగిన సంకీర్తనలు కృష్ణమాచార్యుడు

భాగవతులకు గురువుపై గురి ప్రభావం

'దేవా, శ్రీరామానుజ సిద్ధాంతమునకు బోలు మఱి సిద్ధాంతము(లేదు) పరమాచార్యులంబోలు మఱి యాచార్యులు లేరు పరమ భాగవతులబోలు మఱి సమ్మోద పరులు లేరు వారి కైంకర్య పరులంబోలు మఱి కైంకర్యులు లేరు 'అస్మద్గురుభ్యోన్నమః' అనుమంత్రమునకు సరియైన మంత్రం ఎవేదు పరమ రహస్యంబునుం బోలు మఱి రహస్యం ఎవేదు పరమ నాంసారిబోలు మరి జననిలేదు అనాథపతి, స్వామి, నరహరిబోలు మఱి దైవం ఎవేదు స్వామీ సింహగిరి నరహరీ, నమోనమో దయానిధీ" (సిం వ 17)

ఇలాగే శ్రీవిష్ణు దాసదాసాను దాసులు ఉత్తములని భాగవతరీతిని తెలిపాడు (సిం వ 11, 47)

'కులం తిన్న గుణం మిన్న' అని ఏనాడో కృష్ణమాచార్యుడు తెలిపి, నీతి ప్రబోధించాడు

'దేవా, విష్ణుభక్తిలేని విద్వాంసునికంటె హరికీర్తనము సేయునతఁడె కులజుండు శ్వపచుండైననేమి? ఏ వర్ణుండైననేమి? ద్విజునికంటె నతఁడె కులజుండు సంధ్యా (వందనాది) నిత్య కర్మానుష్ఠానం బులు దప్పక నడిపిననేమి ? సకల ధర్మంబులు సేసిననేమి? మా సింహగిరి నరహరి దాసులకు దాయైనంగాని లేదుగతి ! స్వామీ! సింహగిరి నరహరీ! నమో నమో దయానిధీ" (సిం వ 11)

"దేవా! అంకిలి యిలిమెడు తెప్పింటికిఁ దిప్పు అసత్యకృతమే మువ్వు తగవు ధర్మము నడిపినదె యొన్వు అనాథపతీ, స్వామీ, నరహరీ, మిమ్ము దలంచనిదే తప్పు సింహగిరి నరహరీ, నమోనమో దయానిధీ! (సిం వ 59)

వైరాగ్యాన్ని ప్రబోధించాడు

'దేవా, తనువులు మాయ, తలపోసి తలపోసి చెప్పెదనంటినా కలకలల మోహామిది అతుకుల జల్లెడ యిది తన బ్రతుకు కొఱకు పోరాడి పోరాడి యొరులం జెఱచెడు దుర్గంధపు బొంక యిది నిరు బుగ్గ ఱఁటచెలమ యాల్లిబాన .
" (సిం వ 4)

ఇలాగా భక్తి నీతివైరాగ్యాన్ని వివరించాడు కృష్ణమాచార్యుడు తన వచనాల్లో

పైని పేర్కొన్న 'దేవా! విష్ణు భక్తిలేని విద్వాంసుని కంటె హరి కీర్తనము సేయునతఁ డెకులజుండు . దయానిధీ' అనే వచనానికి సమాన భావాలతో కూడిన అన్నమాచార్యుల పదాలెన్నో మనం గమనించవచ్చును

'సింహాగిరి నరహరి'ని స్మరించడంతోపాటు రామానుజాచార్యులను గౌరవ భక్తి పురస్సరంగా వచనాలలో పేర్కొనడం కృష్ణమాచార్యులకు అనివార్యమైన సంగతి అని స్పష్టమవుతుంది విశిష్టాద్వైతమతం ప్రధానమైంది తదనుసారమైన రచన కొనసాగించి తాళ్ళపాకకవులుగా నిరూపించి తెలుగులో తదనంతర వాగ్గేయకారు లకు ఆదర్శమయ్యాడనడంలో సందేహంలేదు అన్నమాచార్యులు ఈ మతమే స్వీక రించి తదనుగుణ పదరచన చేయడం మనకు విదితమే ఈ అంశం పదకర్త లందరి లోను సమానాంశంగానే విదితమవుతుంది

## 6 2. పెదతిరుమలాచార్యుడు, చిన తిరుమలాచార్యుడు .

అన్నమాచార్యులు చూపిన మార్గంలోనె నడచివెళ్ళి అతని పుత్రుడు పెద తిరు మలాచార్యుడు, పౌత్రుడు చిన తిరుమలాచార్యుడు శృంగార, అధ్యాత్మ పదాలు రచించి, రాగి తామ్రాలతో వాగ్గేయకారులుగా నిరూపించుకొని, రామానుజ మతమైన విశిష్టాద్వైత మతాన్ని భక్తి పురస్సరంగా వ్యాపింపజేసిన అన్నమాచార్యులతో సరి తూగగల వారు వీరిలోను భక్తి, మధురభక్తి, శృంగారం, నీతి, వైరాగ్యాలు, నిరాడం బరత మొదలైనవి కనిపించే ముఖ్యాంశాలు తాళ్ళపాక వాగ్గేయకారులు రాజాదరణ విముఖులు భగవంతుని చరణాలే శరణ్యమని నమ్మిన భక్తవరేణ్యులు

### 6 2 1 పెద తిరుమలాచార్యుడు

పెదతిరుమలాచార్యుడు అన్నమాచార్యునికి తగిన కుమారుడు తండ్రి అంతటి వాడు కేవలం పదాలేగాక ఇతర దేశిరచనలు చేశాడు అవి వైరాగ్య వచనమాలిక, దండకం, రగడ, శతకాలు, వచన భగవద్గీత మొదలైనవి

తండ్రికి తీసిపోని రీతిని పదరచన చేశాడు వాటిని పరిశీలిస్తే ఈ అంశం స్పష్టమవుతుంది

మనోజ్ఞమైన పదరచన

"ఇద్దరి చిట్టరిపెలు మించిమించి పోలుచరే
సుద్దులనె మోహాకము సూటిపడుఁగాని ॥పల్లవి॥

పెద తిరుమలాచార్యుని షడృతు వర్ణన

"అంగన విసుగూదేదది యేకాలమోకాక
అంగజునికిది గాలమాయనోకాక ॥పల్లవి॥

చెలియకెంపల నుండి సేవంతిరేకు రేరాచె
అలరు వసంతకాలమోకాక
కలికి కన్నులనుండి కన్నీటివొట్లు రాచె
మెలమి వానకాలమిదియో కాక ॥అంగన॥

కాంత విరహపుమేనఁగాకల మెండలుగాసె
యింతలో వేసవికాల మిదియోకాక
వింతపులక మొగము వెన్నెలతేటలుగాసె
యింతట శరత్కాలమిదియోకాక ॥అంగన॥

శ్రీవేంకటేశుఁ జూచి సిగ్గు లికాలుని చిందె
యీవేళ హిమంతకాలమిదియో కాక
భావించి యితని గూడి పయ్యెద మేనఁగప్పె
ఆవటించు చలికాల మదియో కాక ॥అంగన॥"
(శృం సం 23 - 525)

కన్యావివాహాంతరంగా గుంపు ష్టిన చేయబడింది నికి ఆధారం అన్నమాచార్యుని పదమే

"కాలము లారును గలిగె నీకు
బాలకి యిందే పైపై నీకు ॥పల్లవి॥

సతికొప్పు విరులు జలజలరాలిన
లతల వసంతకాలము నీకు
కతగాదన మైకాకలు చూపిన
అతివేసవి కాలమప్పుడే నీకు ॥కాలము॥

కాఁగిట చెమటల కరునినుఁదడిపిన
కాఁగల వొలకరి కాలమది
వీఁగని చూపుల వెన్నెలచల్లిన
భోగిప పలికే శరత్కాలము ॥కాలము॥

లంచిపుఁబులకల లలిని నీరతుల
కంచపు హేమంత కాలమది
పెంచఁగ శ్రీవేంకటేశ వలపు నతి
వంచ శిశిరకాల వైభవమాయ ॥కాలము॥"

(శృం సం 26 - 88)

పెద తిరుమలాచార్యులలో అన్నమాచార్యులలాగే భావ, పదచిత్రాలు ఎన్నో ఉన్నాయి మచ్చుకు పదమంతటా విదితమవుతాయి చరణంలోని రెండు రెండు ఎంక్తులు ఒక భావ చిత్రంగా గోచరిస్తుంది

"తలపులో విరహమో తరుణిపై మోహమో
చెలియ సింగారమో చెప్పరమ్మా చెలులు ॥పల్లవి॥

చిత్తరుపటముమీఁదఁ చెలియ నెమ్మోము వ్రాసి
గుత్తపుఁ జందురుఁడని గుండె వగిలె
కొత్తగాఁ గ్రమ్మరనాకె కుచమండలము వ్రాసి
విత్తరి జక్కవలని ప్రియుఁడప్టే భ్రమసె ॥తలపు॥

ప్రేమపురమణి మేటి పిఱుదు దా వ్రేవ్రాసి
కాముని తేరనుచుఁ గలఁగఁబారే
కాముకుఁడై పతి ఇంతి కరంఘ్రములు వ్రాసి
ఆమని జలజ బాణాలని చూచివెఱచె ॥తలపు॥

అనుఁగుఁదురుము వ్రాసి అళులంటా వెఱగందె
ఘనుఁడయిన శ్రీవేంకట విభుఁడు
వనిత నింతా వ్రాసి వనిత కౌఁగిటిలోన
తనరూపు వ్రాసుకొని తాపమెల్లా నడఁచె ॥తలపు॥

(శృం సం 23 - 511)

ఇలాగా పద, భావ చిత్రాలను అభివ్యక్తీకరిస్తూనె రెండు చరణాల్లోను అంత్యప్రాస అనుసరించబడింది

అన్నమాచార్యుల లాగానే పెదతిరుమలాచార్యులుగూడా జానపదగేయరీతులను తన పదాల్లో వాడుకొన్నాడు అనేక పద్ధతుల్లో రచించాడు ఒక చక్కటి చందమామ పదం

"సారెకు మగనాలి సంగాతమిది అట్టు చందమామా, నీవు
చేరి దగ్గరితే నీకటి తప్పవును చందమామా ॥పల్లవి॥
సంచెకాడ నీ వాయలు మానేవు చందమామా, భూమి
నిందలు గట్టేరు నిన్నుఁ జూచితేను చందమామా
విందుల నీరాక వెల్లివిరాయను చందమామా, నీవు
ముందు నానాటికి మోసపోకువయ్య చందమామా ॥సారె॥"
(శృం సం 23-516)

తన పదాలలో అలంకార ప్రయోగం మనోజ్ఞంగా చేశాడు పెదతిరుమలాచార్యుడు

ఉపమ :

"మగవాఁడెంత చక్కని మగువ గలిగినాను
మిగుల వేరొకతెతో మేలమాడును
తొగరుఁ దామెరలలో తుమ్మిద పంటివాఁడు
పెగటున నీవేల వెంగెమూలాడేవే
చెలుపుఁ డెంతటి సతి చేతులఁదనిపినాను
చెలుల చన్నుల మీఁద చేయి వాచును
చెలఁగి వనములలో చిలుకవంటి వాఁడు
కొలఁది మీర నేల కోపగించేవు" (శృం సం 23-156)

రూపకం

"నీ మేని చెమట నిండిన నా విరహాగ్ని
ఆముకొని యారవద్దా ఆరదుగాక
మోము చంద్రకళలకు ముంచి నామతి నీకటి
యేమైనాఁ బాయఁ గద్దా చెక్కుడయ్యీఁగాక"
(శృం సం 23-351)

నిందాస్తుతి .

"గొల్ల నందగోపుగారి కొడుకు నేడు మనపుమాడ
వొల్లి మోరగద్ద నెక్కి పోవు వాడదే
గుల్ల సేతఁ బట్టినుట్టి కుదురువంటి కత్తి పట్టి
తెల్లపిల్ల సూపువాఁడు దేవరట వీఁడు
పచ్చఁ బూస అరతఁ గట్టి పసుపువన్నె పొరగట్టి
పచ్చనలము నెత్తిఁ బెట్టి పచ్చు వాఁడదే
పచ్చిపాలు దాగ మరిగి పసులగాసె నిన్నాళ్ళ
దిచ్చరీఁడు వీఁడు మంచి దేవరట వీఁడూ" (శృం సం 23-438)

ఉత్ప్రేక్ష .

"మేటి పాలజలధిలో మీఁగడ లంటెనో కాని
వీటనె దొంగిలినట్టి వెన్న లంటెనో
మాటుక యాకాశ గంగ మంగలంటెనో యనఁగ
ఆటలఁ గర్పూర కాపు అమరె దేవునికి
శిసువులఁ దెచ్చువాఁడు ఒకటి యంటెనోకాని
మసలక కరిఁగాచే మదమంటెనో
సుసరాన నిలికాసె సొగ టంటెనో యనఁగ
అసుదై పుణుఁగు కాపు అమరె దేవునికి" (శృం సం. 23-526)

ఇలాగా ఆలంకారిక రచన మనోజ్ఞమై ఒప్పుతూంది శబ్దాలంకారాలు సైతం పెద తిరుమలాచార్యుడు తన పదాలలో ప్రయోగించాడు వాటన్నిటికీ ఉదాహరణలు మనం చూడగలం

భాషా ప్రయోగంలో, రాయలసీమ మాండలిక ప్రయోగంలో కుమారుడు తండ్రిని అనుసరించినట్లు గమనించగలము. ఇంకా అన్నమాచార్యులలో లాగానె పెద తిరుమలాచార్యులలో సున్నితమైన భావ ప్రయోగాలున్నాయి ఇంకా కన్నుల దిట్టుతా (304), కంచుపు హొవిపొత్తు (332), కన్నుల నవ్వేవు (340), పొగరు వెన్నెల (485) లాంటి ఉపరూప ప్రయోగాలు ఉన్నాయి.

శృంగార పదాలన్నిటా తండ్రికంటే కొంచెం అధికంగా లౌకిక శృంగారం పెద తిరుమలయ్య అభివర్ణించడం విదితమవుతుంది. దైవ పరమైన శృంగారమే అయినా అన్నమాచార్యులలో లాగాకాక సామాన్య శృంగారం వర్ణితం. అయితే అలౌకికమైన శృంగారం అక్కడక్కడా లేకపోలేదు.

కేవలం భావరతిని ఈ పదంలో వర్ణించి క్రియాత్మకంగా ఉసామాన్య శృంగార వాసనా విలసితం చేశాడు పెదతిరుమలాచార్యుడు.

"ఏమూ చిక్కవు నాకు చెయిలోని భావంతి
కామించి మేను మేను గలయుము గాని ॥పల్లవి॥

తలపు లోపల నుండు దగ్గరి నీహూ మగవాడు
పిలిచితే బయటికి వెళితే కాని
కలసినట్లు నుండు కలలోన రతి
తెలిసినప్పుడు గుండె దిగులాయెగాని (శృం సం 23-361)

## నాయికా విరహం

చెలి నాయకునితో చెప్పి విలపిస్తుంది

'ఈ రీతి రతిగానెను యింతకీ నీపై వలపు
యే రీతిఁ బొట్టుగడవు నింటికి రావయ్య ॥పల్లవి॥

చిత్తరుపు వ్రాయఁబోతే చెలి నాకు నింతలోనే
వార్త నీ మాపే బొరలి వాస్తవముంచు
మత్తిలి యెవ్వరితోడ మాటాడఁ బోనికాను
బత్తితో నీ పేరే పప్పు వరగ నోరికని ॥ఈ రీతి॥

ఆలకించి వింటేను అన్నియు నీ పలుకులై
వెల సంఖ్యలై తోఁచె వీనులకు
తాలిమి సట్టారుప్పు మొత్తములఁ దొలఁగితేను
మేలిమి నీ వాసనే మెయిసి ముక్కునను ॥ఈ రీతి॥

[శృం సం 23-190]

నాయకుని విరహం .

చెలులు తమలో తామనుకొంటున్న మాటలు

'తలఁపులో విరహమో తరుణిపై మోహమో
చెలియ సింగారమో చెప్పరమ్మా చెలులు ॥పల్లవి॥

చిత్తరు పటము మీదఁ జెలియనెమ్మోము వ్రాసి
గుత్తిపుఁ జందురుఁడని గుంపె వగిలె
కొత్తగాఁ గ్రమ్మర నాకె కుచమండలము వ్రాసి
చిత్తరి జక్కవలని ప్రియుఁడట్టె భ్రమసె ॥తలఁపు॥

ప్రేమపు రమణి మేటి పిఱుదు దానే వ్రాసి
కాముని తేరనుచుఁ గలఁగఁ బారే
కాముకుడై పతి యింతి కర పద్మములు వ్రాసి
ఆమని జలజబాణాలని చూచి వెఱచె ॥తలఁపు॥

[శృం సం 23-511]

ఇలాగా నాయికా నాయకుల విరహం చిత్రపట రచన మూలంగా కలిగినదని వర్ణించడంలో పెద తిరుమలాచార్యుని రచనా నైపుణ్యం, ఊహ, కల్పన, భావుకత మొదలైన గుణాలు అభివ్యక్తిమవుతాయి

నాయికలలో ముగ్ధా నాయిక వర్ణన

"మచ్చి తెలుగుదు గాని మనసెఱుగ, నిన్ను
మెచ్చి చెలుగుదు గాని మీదేమీ నెఱుగా ॥పల్లవి॥

కామించి పతిచూపే కను చెరుగుదు గాని
ఆ మీదటి పనులవి యెఱుగా
నా మోమత(డు చూచి నవ్వ చెఱుగుదుగాని
యేమని పలికెనో యేమియు నెఱుగ ॥మచ్చి॥ [శృం సం. 23-54]

సంశ్లిష్ట నాయికా వర్ణన :

"పాెర వేసరించ నేల చప్పని వలపులేల
మేరకో నీవు పేసిన మేలు నాకు చాలదా ॥పల్లవి॥

చదరంగం పేర్కొనబడింది

"చదరంగమాడఁగాను జంటగా పగురంటించి
కదిమి తెరలోనికిఁ బదమసీని" (శృం సం 23-198)

సంగీతం, చంధె, కిన్నెర ప్రస్తావన ఉంది

"అతని మాటకు మీరు సెందాలు చెప్పేరుగాక
దాతుమాతెచెఁగి యింకా తగ వేటితగవే" (శృ సం 23-399)

'దండెమీటి పాటవాడి తరుణినిన్ను చేపి
నిండు గూరిముల నాపె నిన్నుగూడెను" (శృం సం 23-387)

"కిన్నెర మీటిన నులికి కిమ్ముల నూరడపలికి
పన్నెల నాతనితో కళవళమిదిగాఁబోలు" (శృం సం 23-390)

అన్నమాచార్యుల కంటే పెద తిరుమలాచార్యుడు ఎక్కువగా రచనలుచేసి, తన పాండిత్యాన్ని ప్రదర్శించాడు అయితే రచనలో, శైలిలో తండ్రితో ఒక రాసి తక్కువనే చెప్పవలసి ఉంది అక్కడక్కడ శైధిల్యం కనిపిస్తుంది రచనలో అయితే ప్రతిభకు కొరతలేదు శృంగార వర్ణనలో కొంత లౌకికత గోచరిస్తుంది తనయునిలో తండ్రిదంతా అలౌకికమే తండ్రివేసిన బాటలో పయనిస్తూ సుసంపన్నం చేసినవాడు తనయుడు దాన్ని కొనసాగించినవాడు మనుమడు చిన తిరుమలాచార్యుడు

## 6.2.2 చిన తిరుమలాచార్యుడు

తాత తండ్రులలాగానె చిన తిరుమలాచార్యుడు శ్రీవేంకటేశ్వర కైంకర్య కార్యక్రమాన్ని కొనసాగించడమేగాక భక్తిశ్రద్ధన్ని ప్రకటిస్తూ, శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రచించి తరించాడు

శృంగారం చక్కగా వర్ణితం

నాయికా విరహం

"పదతి నీ యానవె బతికున్నది
మొదయక ని వింకనెట్టయినా చేయుమీ ॥పల్లవి॥

గుబ్బల మీఁదఁజెలి కొంగుపేయదు
నిబ్బరపు మోహమున నిన్నుఁదలఁచి
గబ్బిపైన మరునిచే కాఁకలుబెట్టు
అబ్బురపు విరహమూ నాఁపలేక వున్నది ॥పదతి॥

పొలఁతి మేనఁగస్తూరిపూయ నొల్లదు
నెలకొన్న వలపుల నిన్నుఁ దలఁచి
కలువ బాణాల చేతిగాసియూవెట్టు
బలిమైన తాపముల బారిఁబడియున్నది ॥పదతి॥

(శృ సం. 16-16)

నాయిక నాయకుని దూరడం

శృంగార చిహ్నాలను చూచిన నాయిక నాయకుని నిందిస్తూంది

"మానరా నాతో నింక మరఁగులు
పోనీనెంతైనా నిన్ను పొంకకు నాతోను ॥పల్లవి॥

గుబ్బతైన యాకెమేని కుంకుమ పరిమళము
మెఱయ నేఁటికిరా నీ మేనియందును
మెఱుఁగు నీ పైనిమీఁద మించిన కెంపేలవచ్చె
పొలు పొచ్చముల నీవు బొంకకు నాతోను ॥మాన॥

అలన పాదాన నున్న లత్తుక నీ నొసలను
కలుగ నేటికి వేగన చెప్పరా
కలికి పుక్కిట నున్న కప్పురపుఁ దమ్ములము
పొలుపై నికేల పచ్చె పొంకకు నాతోను ॥మాన॥

పడలి నీమేన నిట్టె బాగుగా నించిన యట్టి
జిగిగొన్న కొనగోళ్ళ జాడలేదవి
కడఁగి నన్ను శ్రీవేంకటనాథ కూడితివి
పొడపైన చెలి నుద్ది బొంకకు నాతోను ॥మాన॥

(శృం సం 16-4)

నాయకుడు నాయికపై లసకున్న వలపు తలపును వివరిస్తున్నాడు

'తగు నెకు సాకును దయ్యమె వారిచినాడు
నగవుల సరసాలె నయమాయ మనకు ॥పల్లవి॥

జూపుల జూపులనె నన్ను జూచేటి నీ జవరాల
పాటి నా మనసు నిప్పై కోటుగ్గొనె
నాయవొన్న భమకము నాకు నీకు నొక్కపాపె
యేఁవల సూడాల నెరి పేటికింద మనకు ॥తగు॥

ఆన మాటలనె నన్ను సద్దరించే కొలంతి
వాసి నా మోహము నీతో వావిగలనె
యాసుల మనని లోక యిద్దరికి నొక్కనరె
వేసాల జగడముల వేగ వేల మనకు ॥తగు॥

పళ్ళాలు చల్లి నన్నె వలవ నీసేసె కాంత
వెలసి నే నీతోడ కెసితి నిట్టె
నిలువైన శ్రీ వేంకటనాయడ నిన్ను గూడి
పలుకు వేకి పుండగా నొనగూడె మనకు ॥తగు॥

(శృం సం 16-17)

ఇలా తాత తండ్రులలాగానే భక్తి ప్రేరితమైన భగవత్పరకమైన శృంగారవర్ణన చిన తిరుమలాచార్యుడూ చేశాడు. అయితే తాత కంటె తండ్రి, తండ్రి కంటే తన యిడు క్రమంలో పూర్వ ప్రాభవాలు క్రమలభావంచని తెలుస్తుంది. తాతవేసిన బాట తనయునికి, మనుమనికి పదరచనా ప్రయాణానికి ఎంతగానో ఉపకరించందనడంలో సందేహం లేదు.

చిన తిరుమలాచార్యుడు భక్తి, నీతి, వైరాగ్యాన్ని ఎంతగానో చిత్రించాడు. పైగా రామానుజమతమైన విశిష్టాద్వైత మత ప్రచారం చేయడంలో ఇతడ గ్రేసరుడు. తాత తండ్రుల కాలం నుంచి ప్రారంభించబడి, ప్రచారం పొందిన ఈ భక్తితత్వాన్ని పటిపోల్లకు వెళ్ళి ప్రజల్లో ఈ మత ప్రచారం చేశారు.

సగుణుడు భగవంతుడు నిర్గుణుడు కాడు 'అహం బ్రహ్మాస్మి' శంకర ప్రతిపాదిత 'అద్వైత' మతం కంటె రామానుజ మతమైన విశిష్టాద్వైతమే ముఖ్యమని ఘంటా పథంగా వక్కాణించాడు చిన తిరుమలాచార్యుడు ద్వైతమతావలంబులైన మాధ్వుల్లాగా స్వర్గం వేదనరకాన్ని ఖండించాడు

"సకల పురాణములు చాటినను నొగడఁగా
తకమికలుగా నల్పార్థము చెప్పఁ దగునా ॥పల్లవి॥

నిను నిర్గుఁ డనేటి నీచజాతుల యందు
చెనయు దుర్గుణము దానెంతో
కనకంబు నిను మనుమ వారునాయం బలను
మెనలేని దుర్వాదుల నేమనఁగ గలము ॥సకల॥

నీవె తామసు కొనేటి నిందితాత్ములు దాము
కావింపు ద్రోహం బు కడమా
దాపతులఁ దన్నుఁ గన్న తల్లి గొడ్డని యెల్క-
దేవతానిందకులఁ దెలుపఁగ వశమా ॥సకల॥

అమరు సర్గము మిథ్యయను శూన్యభాషలకు
తమితోడ భ్రమయేల తరగు
తమ గురువు శాస్త్రంబు రామె కల్లనఁ గాను
క్రమ బుద్ధి శ్రీ వేంకటనాథ యిత్తువా ॥సకల॥

(అధ్యా సం 16-58)

శ్రీ హరినామ సంకీర్తనమే సర్వశాంతి

'సంతె లేక తలఁచిన జ్ఞానులకు
సంకీర్తనమెపో సర్వశాంతి ॥పల్లవి॥

భవహారమగు శ్రీపతి నామమె
జపకట్టి తలఁచితే జన్మశాంతి
తవిలి హరి పూజ తాశేయుచె
కుపలయుపమున నిదిగో గృహశాంతి ॥సంతె॥

అంది ద్రుపద వరదుఁడ యనినచె
కందువైన సర్వగ్రహ శాంతి
యిందు రవి నయనుని నెరుఁగుటె
చందమైన దిదివో నక్షత్ర శాంతి ॥సంతె॥

భావించి యనంతునిఁ బలుకుటె
కావించిన దిదివో కాల శాంతి
శ్రీవేంకట నాథునిఁ జెరుటె
దేవ మానవులకు ని దేహశాంతి ॥సంతె॥ [అధ్యా సం. 16-20]

ఇందులో నవవిధ భక్తితత్వం ప్రతిపాదితమైంది

భక్తి ముఖ్యం తద్వినా ముక్తిలేదు

గోవింద గోవింద యని కొలువరె
గోవిందా యని కొలువరె ॥పల్లవి॥

హరి యచ్యుతా యనియాడరె
పురుషోత్తమాయని పొగడరె
పరమ పురుషాయని పలుకరె
సిరివర యనుచును జెలగరె జనులు ॥గోవింద॥

పాండవ వరద యని పాడరె
అండజవాహను గొని యాడరె
కొండల రాయనినె కోరరె
దండితో మాధవునినె తలఁచరె జనులు ॥గోవింద॥

దేవుఁడు శ్రీ విభుఁడని తెలియరె
సోవల ననంతుని జూడరె
శ్రీ వేంకట నాథుని జేరరె
పావనమై యెప్పుడును బ్రదుకరె జనులు ॥గోవింద॥
[అధ్యా సం 16-2]

ఇలాగా హరిభక్తి తత్వాన్ని, మహత్వాన్ని తత్ప్రయోజనాన్ని పలువిధాలా ప్రకటించాడు

తత్వజ్ఞానికి అంతా సమానమేనని నీతిని ప్రబోధించాడు

"ఇనుమేమి పసిఁడేమి ఎంచి చూచితె
మనసు దెలిసిన నిర్మలునికి
ఘనమేమి కిరుదేమి కలపెల్లా నీ
తనువుగఁ దెలిసిన తత్వజ్ఞానికి (అధ్యా సం. 16-48)

కులం, గుణాల కన్న భక్తి ముఖ్యమంటాడు

'కులమేమి సేసెని గుణమేమి సేసీని
నలువైన శ్రీ వెంకటనాథు డుండఁగా
అలరి వాల్మికికి అలనారదహల్యకు
కులమేమి సేసెనయ్య గుణమేమి సేసెను " (అధ్యా సం 16-43)

ఇల్లు వాకిలి, సతులు సుతులు, ధనధాన్యాలు వదలి భగవంతుని విశ్వసించడమే ముఖ్యమంటాడు

"సతుల సుతుల జూచి జగములో వారెల్లా
మతిలోన భ్రమయక మానరు
రతిరెక్కగా హేయరాగ రహితుఁడవై
సతతము గలిగిన స్వామివి నీవు దక్క

ధన ధాన్యములు చూచి తగిని జీవులు వాని
వెనువెంటఁ దిరుగక విడువరు
వని లాని యాశాపాశ దూరుఁడవై
ఘనత గలుగు శ్రీకాంతుఁడ నీవు దక్క

యిల్లు ముంగిలి చూచి యీ దేహాలు వాని
నొల్లమనుచు రోసి పుడుగరు
వెల్లవిరిగ శ్రీ వేంకట నాథుడవై
తెల్లమైన యట్టి దేవుఁడవు దక్క" (అధ్యా సం. 16-44)

ఇలాగా నీతిని ఎలురీతుల ప్రబోధించాడు.

అరిషడ్వర్గాన్ని జయించవలసి ఉంది ఈ ప్రపంచమంతా నాటకమూ, బూటకమూనని, కనుక వైరాగ్యమే ముఖ్యమని వివరిస్తున్నాడు

మచ్చరములుఁ గపటంబులు మానినంత మఱికదా
విచ్చలవిడి నాయాసల వీఁగ వోలనోపుటా ॥పల్లవి॥

చంచలమగు నా మనసిది మంచిదైన మఱికదా
పంచేంద్రియముల పోరునఁ బడక మానుటా
కొంచెపు పరచు నా కోపముఁ గోసివేసి మఱికదా
కించపుఁ బాపంబులలోఁ గడతేరుటా ॥మచ్చ॥

పుడి గాని సింపనమున కోరిచి(ఎ)సె మఱికదా
జడవట్టిన నాజిహ్వాచాపల్యము మానుటా
చిడుముడి నా భోగంబులఁ జిక్కువడక మఱికదా
విడువని సంసార మనెటి వెల్లి దాఁట నోపుటా ॥మచ్చ॥"

(ఆధ్యా సం 16-4)

ఇలాగా భక్తి, నీతి, వైరాగ్యాల్ని తన పదాల్లో విదితం చేశాడు చిన తిరుమలాచార్యుడు

సంగీతసాహిత్యాల రెంటను తన సామర్థ్యాన్ని ప్రకటించిన వాడు చిన తిరుమలాచార్యుడు తన పదాలకు ఇరవైఎనిమిది ప్రసిద్ధ రాగాలను వాడుకొన్నాడు

చిన తిరుమాలాచార్యుడు దైవం, ఆచార్యుడు అని, మహావేత్త, రామానుజ మతానుయాయి అని అన్నమాచార్యుల్ని ఎంతగానో స్తుతించా డీ పదంలో

"అప్పని వరప్రసాది అన్నమయ్యా
అప్పనము మాకె కలఁడన్నమయ్యా ॥పల్లవి॥

అంతటికి నేలికైన ఆదినారాయణుఁ దన
యంతరంగాన నిలిపీ నన్నమయ్యా
సంతసానఁ జెలువొందె సనకసనంద నాదు
లంతటివాఁడు తాళ్ళపాకన్నమయ్యా ॥అప్ప॥

విరుదు టెక్కెములుగా వెక్కు సంకీర్తనములు
వారిమీద విన్నవించె నన్నమయ్యా
విరివి గలిగినట్టి వేదముల యర్థమెల్లా
అరసి తెలిపినాడు అన్నమయ్యా ॥అప్ప॥

అందమైన రామానుజాచార్య మతమున
అందుకొని నిలిచినా డన్నమయ్యా
విందువలె మాకును శ్రీవేంకటనాథుని నిచ్చె
అందరిలో దాళ్ళపాక అన్నమయ్యా ॥అప్ప॥
(అధ్యా సం 16-23)

ఇలాగా శ్రీవేంకటేశ్వర భక్తి ప్రపత్తితో, విశిష్టాద్వైత మతావలంబనమేగాక, తర్వాతి కాలంలో తాత తండ్రులల్లే చినతిరుమలాచార్యుడు నడచుకొన్నట్లు తెలుస్తుంది ఈ ముగ్గురు వాగ్గేయకారుల్లోను ఎన్నో సాదృశ్యాలు విదితమవుతాయి సంగీత సాహిత్యాలకు, భక్తి, నీతి వైరాగ్యాలకు, ఎంతో సేవచేసిన మహానీయులు వీరని తెలుస్తుంది

పెదతిరుమలాచార్యుడు, చినతిరుమలాచార్యుడు అన్నమాచార్యుల తదనంతరం వాగ్గేయకారులుగా, విశిష్టాద్వైత మతప్రచారకులుగా, మహాభక్తులుగా, సాహితీవేత్తలుగా నిరూపించుకొన్నారు

## 6.3 క్షేత్రయ్య

పదం అంటే క్షేత్రయ్య పదమనీ, పదమంటే శృంగారపదమనీ పదానికి విశిష్టతను సంపాదించిపెట్టిన ఘనుడు క్షేత్రయ్య అన్నమాచార్యుడు రాజధిక్కారం చేసిన భగవద్భక్తుడు క్షేత్రయ్య ఆరంభంలో రాజాశ్రయాన్ని పొందినా, సన్మానాలు అందుకొన్నా ఆ వెనుక భగవంతుణ్ణి శరణువొచ్చి పద రచనచేసిన మధురభక్తి పరాయణుడైనవాడు, అన్నమాచార్యులు అధ్యాత్మ శృంగార సంకీర్తనలు రచించగా క్షేత్రయ్య కేవలం శృంగార పదాలు మాత్రమే రచించినవాడు అన్నమాచార్యులతో ప్రారంభమైన పదరచన క్షేత్రయ్యలో పరిపూర్ణత్వం పొందింది అన్నమాచార్యుడు భక్తి పురస్సరంగా పదరచనచేసి ఆడిపాడుకొనేవాడు క్షేత్రయ్య వీటికి అభినయం

జ్ఞాపించిన అభినవుజ్ఞుడు అన్నమాచార్యుని వలెంటి మనకున్నం మున్నందొంక దానికి ఒక అస్తిత్వాన్ని ప్రసాదించి ప్రచారంలోకి తెచ్చిన వాడు క్షేత్రయ్యేది. పదకవితా పితామహుడు అన్నమాచార్యుడైతే పదకవితా జనకుడే క్షేత్రయ్య అని చెప్పిన రాళ్ళపల్లివారి సముచితాభిప్రాయం వారోక్తం. అన్నమాచార్యునికి శ్రీవేంకటేశ్వరుడు ఆరాధ్య దేవుడు క్షేత్రయ్యకు మువ్వగోపాలుడు అధిదైవతం. అన్నమాచార్యుడు పెద్ద సంసారి. అతని కుటుంబం, పుత్రపౌత్రులు మూడు తరాలుగా కవి కుటుంబం కావడం విశేషం. క్షేత్రయ్య సాంసారిక జీవితం విస్పష్టరేఖలతో తెలియరావేదు అందుకు తగిన ఆధారాలు లభించలేదు. ఈ మహావాగ్గేయకారుల ఇద్దరిలో అనేక సామ్యాలు, సాధర్మ్యాలు మనం చూడగలం.

అన్నమాచార్యులకు చక్కటి అనుయాయి క్షేత్రయ్య. భావంలో, భావనలో, పదరచనాశిల్పంలో, వర్ణనలో, అలంకార రచనలో భక్తి, మధురభక్తి, రక్తి అనే అంశాల్లో అత్యంత సన్నిహితంగా ఉంటూనే ముందుకు వెళ్ళినవాడు క్షేత్రయ్య.

నాయికా నాయక వర్ణనలో క్షేత్రయ్య సూక్ష్మాతిసూక్ష్మంగా తన ప్రతిభను ప్రకటించినట్లు స్పష్టమవుతుంది.

నాయికావర్ణన అమోఘంగాచేసి అపూర్వమైన తన వర్ణనా వైదగ్ధ్యాన్ని తెలుపుకొన్నాడు. చక్కటి ఉదాహరణ

'ఏల వలచితి నోయమ్మా! ఎట్లా ఓర్తునె నా మ్మా! ॥పల్లవి॥
ఈలాగౌట ఎరుగనైతి - మెదుగిరి చెలువరాయునిపై ॥ఏల॥
ఉన్నచోట నుండనీదు ఒరగుపై నిన్నొరగనీదు
అన్నాహారము లేదు ఆసలాలు తేనె వేదు ॥ఏల॥
వలువలైతే సైచవాయ జాజులెంతో మొనలాయ
నిలువరాని మోహమాయ నిట్టూర్పులగ్గలమాయె ॥ఏల॥
తలపు వానిమీదనాయె తలవాకిలె ఇల్లాయె
పలుమారు గడిసిన మువ్వగోపాలుడౌ చెలువరాయునిపై ॥ఏల॥

(సే గీ వేం ప 33)

ఇది విరహోత్కంఠిత అయిన నాయికా వర్ణన. ఇలాగే నాయక వర్ణన గూడా ఉంది

"ఎంత చక్కనివాడే ఎనెంత చక్కనివాడే ॥పల్లవి॥

ఇంతి మువ్వగోపాలుడు సంతతము నామదికి
సంతోషము చేసునే ॥అ ప॥

మొలకనవ్వుల వాడె ముద్దు మాటలవాడే
తళుకారు చెక్కుటద్దములవాడే
తలిరాకు బిగిదెగడదగు మోముగలవాడే
తెలితమ్మిరేకు కన్నుల నమరువాడే ॥ఎంత॥

విరుతప్రాయమువాడె చెలువొందు సిరియ చం
దురుగేరు నాసలచే మెరయువాడే
చెరుకువిలుని గన్న దొరవలెనున్నాడే
మెరుగు శామన కాయ మేనమరువాడే ॥ఎంత॥

పొదలు కెందామరలు పెంపొదవు పదములవాడే
కొదనుసింగపు నడుము కొమరమరువాడే
మదకరికరము లమరు కేలవాడే
సుదతి మువ్వగోపాలు డెంత సొగసులవాడే ॥ఎంత॥

(సె గ వేం స్వీ 161)

ఇందు మువ్వగోపాలుని రూపురేఖలు వర్ణించి దృశ్యసాక్షాత్కారం చేశాడు క్షేత్రయ్య

క్షేత్రయ్య పదకవితలో శ్లేష, దాని మొదలైన గుణాలు సైతం మనం గమనించగలము

"మోసపోదునా వానికి నేడూ మోసపోదునా ॥పల్లవి॥

మోసపోదునా నేటి మువ్వగోపాలుడు
ఆసలెల్ల గన్నలయినగాని జూచెనే ॥అ.వ॥

కోరికగోరి వానిపేడుక కొంకక
గోటుపంప తెమ్మని నేగి
గారిమి నా చెలి గోరువంక తెచ్చి
సాగెను చెక్కిలి చూపెను వాడు నే బాలగాన ॥మోవ॥

బలు గాదు నా చేతియుంగరాని కొక్క
పలుకెంపు పేడినవే పోయి
అందాని బలుకెంపు అతివ తెచ్చినను
విరిపి అని మోవిజూపెను వాడు విన్నదానగాన ॥మోవ॥
విరిపోసి అనవో సరిపెనలు
పెరచి ఇపుడే తెచ్చెదనని
నటించి గా పుష్పగోపాలుడు సమరతి యేరి యిదె
సరిగె సలని నవెంను నే కొదమగాన ॥మోవ॥"

(సీ గి పేం స్వీ - 140)

ఇందులో గోటుపంప, పలుకెంపు, సరిపెనలు - అనే శబ్దాలకున్న అర్థద్వయంతో చక్కని ... వైభవాన్ని సాధించాడు క్షేత్రయ్య ఇది సహృదయ హృదయైక వేద్యం.

ఎచ్చి శృంగారమూ, అతిమోహమూ, నిర్మలానురాగమూ గల నాయికల మనః ప్రవృత్తులను అత్యంత మనోజ్ఞంగా వర్ణించి తరించాడు క్షేత్రయ్య విరహవ్యథా భరిత మనస్కలైన నాయికలను వర్ణించాడు దుర్భర విరహవ్యథాభరిత అయిన

నాయికా వర్ణన :

"ఇంత విరహము పలుక వెరవగు యింతి తానెటు సైచునో ॥పల్లవి॥
కంటుదద్భుతమనగ నిన్నున కారణమేమి శ్రీ వీరరామవ ॥అ ప॥
గంధ మెందిన గంధపతి కుచ కలశముల గన్నీటి పెల్లవ
చింది కళపెళ యుడికి చెలిపై చింది మీసై మిట్టి ఎదినది
రంచె హారము సీలసరమై కర్పూరము నీరాజనంపై
... మందిరము దెసమరచి చూడదు ॥ఇంత॥

చంచరేక్షణ పెంచి నంసయు కొంచనమ్మున చెలువు తామర
కొంచురాగ సూర్పు పెగలను మించ సొరగను గాంచు మీ
మంచునీరు కషాయముగ నటుదించి మించునతి వేలుంచ చుయ్యనే
మించునని చెంగలువ చెలికోపించి వైవిన ముగ్ధగనుమా ॥ఇంత॥

ధ్యానమున నినుజేరి అమృతపానమున కళలూరి కలయుచు
మేనుమరచినదేమొ తెలియదు పాన పరవశగలిని ఉన్నది
నెను కావలసినదెకాక మన్నించి కరుణించి అని
మానమున మాచెలికి ప్రాణదానమొసగు శ్రీమువ్వగోపాల ॥ఇంత॥

(సీ గి వేం సా 11)

క్షేత్రయ్య నాయిక అయి మువ్వగోపాలుని నాయకునిగా భావించి ప్రకటించిన మధురభక్తి అనన్యసామాన్యమూ, అనితరసాధ్యమూ ఒక చక్కటి ఉదాహరణ

"ఇంత తెలిసియుండి ఈ గుణమేలరా ॥పల్లవి॥
పంతమా మువ్వగోపాల నా సామిగ ॥అ ప॥

అలుకచేసి యింటికి రావైతివి నెవరైన
చెలికత్తెలున్నారా ? పిలుపిసచ్చేరా ?
చెలికత్తెవైన నీవే చెలుడవైన నీవే
తలచిచూడ నాపాలి దైవము నీవే ॥ఇంత॥

వింతదానివలె నన్ను వెరుచేసి రావైతివి
అంతరంగులున్నారా ? నన్నాదరించేరా
అంతరంగమైన నీవే నన్నాదరించిన నీవే
వింతించి చూడ నా జీవస్వామివి నీవే ॥ఇంత॥

శ్రీనిధి మువ్వగోపాల చేపట్టి నన్నేలితివి
నానేర్పు లెవరైనా నానందించేరా ?
నా నేర్పులైనా నీవే నమ్మికలిచ్చినా నివే
అనగా బిఱ్ఱుదు నాయానందమైన నీవే ॥ఇంత॥

(సి గి వేం స్వ. 47)

ఇందులో నాయిక నాయకుని - భగవంతుని - తన చెలికత్తెగాను, చెలువుడు గాను, దైవంగాను భావించి, ఆత్మపరమాత్మల సమైక్యాన్ని స్పష్టం చేయడం గమనిస్తాము

ఇలాగా పదకవితా చక్రవర్తిగా, మధురభక్తిపరుడుగా క్షేత్రయ్య సాక్షాత్కరిస్తాడు

క్షేత్రయ్య పదకవితలో ఇతర రాంధ్రకవులతో పోలికలున్నమాట వాస్తవమే. అంతకంటే పదకవితాపితామహుడైన అన్నమాచార్యులతో అనేకవిధాల క్షేత్రయ్య పోలినవ్యక్తి వీరిద్దరిలో పోలికలుండవచ్చు కానీ క్షేత్రయ్య అన్నమయ్యను అనుకరించినాడనడం క్షేత్రయ్య ప్రతిభను కించపరచడమే. ఆ మహాపదకవులిద్దరిలోను అన్నివిధాలైన సామ్యాల్ని గుర్తించగలము అంటే వీరిద్దరూ ఎంత గొప్ప పదకవులో, వారిద్దరి ప్రతిభా పాండిత్యా లెంతటివో విదితమవుతుంది పూర్వోక్తమైనట్లు వీరిద్దరి భావుకతలో, భాషలో, ప్రయోగంలో, భావనలో, భావంలో సామ్యం గోచరిస్తుంది కొన్ని ఉదాహరణలు

క్షేత్రయ్య మనోజ్ఞ పదరచనలో మహాశిల్పి. అక్షరశిల్పి చిత్రకారుడికి, శిల్పికి సాధ్యంగాని రీతిలో అక్షరశిల్పి అయిన క్షేత్రయ్య రచించి అమరుడయ్యాడు నాయకుని రత్యనంతర వేషాన్ని తిలకించిన నాయిక, ఆయన అన్యకాంతాభోగ చిహ్నాలను గాంచి తన సరసకు చేరకుమని తోసిపుచ్చుతూంది ఈ కిందిపదంలో

"చాలు చాలు ఈ చిన్నెలతో నాదుసరసకు చేరకుర ॥పల్లవి॥

చాలు ఈ చిన్నెలు సొగపు నావద్ద ముప్వగో
పాల ! భామపద్దికే పోర ॥అ ప॥

కన్నుల పీదెముతో కాటుక మోవితో
వెన్నున కీల్జడ చోటుతోను
కన్నియసంపుల గాజులనొక్కులతోను
పన్నెకాడ నుదుటను నున్న బొట్టుకతోను ॥చాలు॥

నిద్దురమబ్బుతోను నిందు బడలికతోను
ముద్దియ కలిసిన ముదముతోను

నిద్దంపుచెక్కుళ్ళ వెలయించితౌను
వద్దురాపద్దులు పగదాచె నాతోను ||వా||

ఆలదానికుచములు నలదిన జవ్వాది
తిల యురస్థలమునుగింటి పిన్నంటురాకు
బలిమిచే సేదేల బాలమువ్వగోపాల
అలనాదెనగూడిన చెలిమి పదిపేలు ||వా||

(సి గి పేం సొ. 49)

ఈ క్షేత్రయ్య పదానికి అన్నివిధాలా మూలమేమో అనదగ్గ అన్నమాచార్యుల సంకీర్తన ఉండడం విశేషం—

ఎప్పుడునెరుగనంటా యేంటికింటేవు
సఖిందె ముమ్మూ జూచి పలికేవు తెల్లను ||పల్లవి||

చెలియ నుదుటిమీది పన్నీరుకస్తూరిబొట్టు
చెలువుటురిగ నీ చెక్కులనంటె
నలువునామము నీదె నెంత సుమ్మటనంటె
తలపోన్నగురుతులు తారుమారులాయను ||ఎప్పు||

కొంతకన్నుల వెట్టిన కాటుకెల్లా నీమోవి
వింతదాగురై నేడు వెలసున్నది
రంతుల నీవాహంపురి రసుదే నందినదిక్కై
యింతలోనే మీచేత విప్పులప్పులాయను ||ఎప్పు||

సరిపెలచెమ్మంగ చరణములలత్తుక
నొరిసి నీపురమున జూపట్టెను
గరిమ శ్రీవేంకటేశకౌస్తుభ మింతికిరొమ్మై
దొరసె మీవలపులు తోడునీడలాయను ||ఎప్పు||

(24-477)

అన్నమాచార్య పద మెదుట పెట్టుకొని క్షేత్రయ్య రచించిన చేతా అన్నంత సన్నిహితంగా ఉంటుచున భావం, భాషలు, ప్రతిభ, ప్రయోగం అన్ని విధాలా కుదిరి సమానస్థాయి నందుకొని ఆ మహావాగ్గేయకారులు ఏరాదేనా అన్న

ట్లుండడం మన కాశ్చర్యాన్ని కలిగించే అంశం అన్నమయ్యకంటే క్షేత్రయ్య ఒక అడుగు ముందుకు వెళ్ళినట్లు తెలుస్తుంది కారణం అన్నమయ్యలో వాచ్యం పా లెక్కువ క్షేత్రయ్యలో వ్యంగ్యం, ధ్వనీ ఉన్నాయి అయితే అన్నమయ్య మూడు చరణాల్లో విషయవివరణ చేస్తూ చెప్పేతీరులో సమతను సాధించిన మహాకవి భాషలో బరువుంది అన్నమయ్య పదంలో క్షేత్రయ్యలో లాలిత్యముంది. సారళ్య ముంది ఈనాడు పుస్తకాలు లభ్యమైనంత సులువుగా ఆనాడు వారికేవి కాదనడంలో సందేహం లేదు. పైగా ఇద్దరిమధ్య కాలవ్యవధానముంది అలాంటి క్షేత్రయ్య అన్నమయ్య పదసాహిత్యాన్ని చూసి అంవాదనడానికి అవకాశం చాలా తక్కువ అందుకే ప్రతిభాసంపన్నులైన మహాకవుల ఆలోచనల్లో సామ్యముంటుంది (Great men think alike) అనడమే సముచితమని నా భావన

ఇలాంటిదే అన్నమాచార్యుల మరో పదం పై పదంలోలాగా వ్యంగ్య స్ఫూర్తి లేదు. కాని స్పష్టంగా నాయిక చెబుతుంది

"మగరూపు నాడరూపు మారుమకొని రిద్దరు
నొగిసెద్దము చూపరే చూచుకొనేరిద్దరు దామే ॥ఎల్లవి॥

కలిక కస్తూరిబొట్టు కాంతుని నొసలనించె
నిలుపునామము పైపై నెలతకంటె
అలివేణి కొప్పుబారి ఆతనికొప్పుపై వాలె
అలరె సీతన్విసిక ఆతని పాంటపైని ॥మగ॥

కుంకుమగుబ్బల పూత గురుతు విభునికంటె
అంకెబతిరొమ్ము బొచ్చు అరెకంటెను
కింకణాల గాటలచేయి ఘనునిసందిట జిక్కె
అంకపుసామ్ములచేయి ఆకెసంది జిక్కెను ॥మగ॥

మట్టెలపాదములవె మగిడె నాతనిమీద
నిట్ట పెద్దపాదాలు నిలిచెనందు
యిట్టె శ్రీవేంకటేశు డింతిగూడి పానుపుపై
పట్టపగలందరిని భ్రమయించిరిదివో ॥మగ॥

(శృం. సం. 26-309)

ఇలాంటి భావోపన్నమైన పదాలు మరి రెండున్నాయి

"లంజకాడ వౌదుపురా
లంజకాడ వౌదుపు నీలాగులెల్ల గానవచ్చె
ముండేతబెట్టిన సొమ్ముల కద్దమేలరా" (శృం సం. 12-84)
"అనబెట్టుదువు నీవప్పటి నా నోరణచి వోరి
నీ నిజానకు నాతో నేడైనా మానరా" (శృం.సం. 12-222)

వీటితో సామ్యమున్న క్షేత్రయ్య పదం—

"చల్లనాయె నామనసు చల్లనాయె నా ॥పల్లవి॥
చల్లనాయె ప్రాణేశ ! స్వామి ! మువ్వగోపాల ॥అ ప॥"
(సీ గి.వేం.స్వా 3)

కుపిత అయిన నాయిక చెలులతో నాయకునిగూర్చి చెప్పడం

క్షే త్ర య్య

"అడుగరమ్మా యతనిపై నూరక అలిగినా నటరే ॥ప॥
ఎడమతనము మాని మువ్వగోపాల రాయుని అనబెట్టి మీ ॥రడుగ॥"
(సీ గి వేం స్వా 4)

అ న్న మా చా ర్యు లు

"ఏదినిజమని మీరు మెట్టు వాడబరచేరే
ఆదినుండి యీ కతలు అడుగరే యాతని" (26-430)

చెరిగుమాసినదని సంకోచించవద్దని క్షేత్రయ్య నాయిక నాయకుని వేడుకోగా, చెరగుమాసినదనీ, సరసాలు పనికిరావనీ నాయకుని మొరబెట్టుకొంటూంది అన్నమాచార్యుల నాయిక.

క్షే త్ర య్య

"చెరగు మాసియున్నానని యోచన సేయవద్దుర సామి ॥పల్లవి॥
దొరయౌనా మువ్వగోపాల పరసతులకు దోసమెన్నడులేదురా ॥అ.ప॥

సరసకురమ్మని చాలా నేవేడితే శంకపడేవేలరా
అరసికుల తప్పుశాస్త్రము నిజమనుచు నమ్మవచ్చురా
దురుసుగ నే నీవద్దికి వచ్చితే మూరమరిగే వేమిరా
పలుపుమీర ఆవారనుండి నన్నంటక పకమ్ముద్దైన నిమ్మురా సామి ॥చెరగు

సదయా నాపయ్యెద తొలగించి నీమెద చనుమొనలను గ్రుమ్మెద
ఒదిగి మేనంటక నీదుతీయనిమోవి ఒనరగ నానెదను
మదనజనక అందుండి నీమొనపంట మడుపులందీయుదునా
మది నే పగనైనా ముందువెనుక మరి జూతురా నాసామి ॥చెరగు

తన్ను దానెరుగక కొలగుట యీపట్టి తప్పునీమము లేలరా
వన్నెలాడుల కిది సహజగుణంబని వార్తయు వినవేమిరా
నిన్నమొన్న ఓ ముప్వగోపాలా నీవింక నిది వినరా
ఇన్నాళ్ళవలెగాదురా నేటి సుఖ మెరిగితె మరిపవురా నాసామి ॥చెరగు

(సీ గి. వేం. ప - 93

అన్నమాచార్యులు

"చేయిముట్టి సరసాలు చెల్లవు నేడు
ఆయనాయ నికనేల అటువంటి పనులు ॥పల్లవి॥

చేరినన్ను నంటకురా చెలిగుమాసినదాన
అరసి మాట చెప్పరా అల్లంతనుండి
కోరి నీవేమన్న మాకును నప్పరాదురా
ఔరా నీమేమి సేయుమన్నా జేసేను ॥చేయి॥

మట్టుమీరి రాకురా మంచముపై నున్నదాన
యిట్టె నీపంపిన విడిమిడె హాలును
దిట్ట నీ జాణతనాలు తెలియపురా మాకు
వెట్టికి నాపీనుల వినేగాని ॥చేయి॥

ఇలిమి సేయకురా పవళించి వున్నదాన
అలరి నీవు నాకు లోనౌటే చాలు
చెలగి కూడితి విట్టె శ్రీవేంకటేశుడ నన్ను
అలుకలిన్నియు దీరెనట్టె కానీరా ॥చేయి॥
(శృం సం. 26-9)

"బుద్ధిచెప్పరే పతికి పొలాతులాల
అద్దుక యిట్టే జలకమాడుతానుందాననే ॥పల్లవి॥

చెఱగుమాసి నేను సిగ్గుతో నుండగాను
అఱలేక నన్నిత డేలంట వచ్చీ నే
నెఱయ మోనముతోడ నిలుచుక నేనుండగా
మఱియు నన్నితడేల మాటలాడించీనే ॥బుద్ధి॥

పాసివున్నతమకాన పరాకై నేనుండగాను
వేసరక విరులవేసీ నిదేలే
రాసి విరహాన గప్పురము మేనజల్లుకోగా
దోసమెరగక యేల దోసిలొగ్గీనే ॥బుద్ధి॥

చెలరేగి నే మఱుగుచీర గట్టుకొనగాను
కలసి యిప్పుడే యెట్టు కాగిలించీనే
యెలమి శ్రీవేంకటేశు డిటు నేగాచుకుండగా
బలిమిసేసి యెంత పచ్చిగా గూడీనే ॥బుద్ధి॥"
(శృం సం. 31—126)

నాయకుని చక్కదనాన్ని నాయికలు మెచ్చుకొనే తీరులో వాగ్గేయకారు లిద్దరు మనోజ్ఞవర్ణన చేశారు.

క్షే త్ర య్య

"ఎంత చక్కనివాడే నాసామి వీడెంత చక్కనివాడే" (సీ గి. వేం.స్వీ-161)

"చేత కాసులేదె ? కాని చేసైగలే" (సీ గి. వేం.సా - 52)

అన్నమాచార్యులు

"వలచివచ్చితి నేను వానికిగాను" (శృం సం. 24-14)

మార్మికత ఈ వాగ్గేయకారులిద్దరిలోనూ చూడగలం.

క్షేత్రయ్య

"లలనామణిరో యీ భావము దెలుపరే లలితముగా నిపుడు"

(సీ గి. వేం. సా - 82)

అన్నమాచార్యులు

"చెప్పితే నారచితకత చెప్పకుండితే వెత" (శృం సం. 25-421)

రత్యనంతర నాయికావర్ణన ఇద్దరు వాగ్గేయకారులు మనోహరంగా చేశారు. అయితే క్షేత్రయ్య నాయిక కేళికామందిరం వెడలినట్లు వర్ణిస్తే అన్నమాచార్యులు నాయిక పవళించినట్లు చిత్రించాడు అన్నమాచార్యుల పదమే క్షేత్రయ్యకు మూలమూ అన్నట్లుంది

క్షేత్రయ్య

"మగువ తన కేళికామందిరము వెడలెన్ ॥పల్లవి॥
పగకాడ మాకంచివరద తెల్లవారెననుచు ॥అ ప॥

విడజారుగొజ్జంగి విరిదండజడతోను
కడు చిక్కుపడిపెనగు కంటసరిలోను
నిడుదకన్నులదేరు నిదురమబ్బుతోను
తొడరి పదయుగమున తడబడెడు నడతోను ॥మగువ॥

సొగసిసొగయని వలపుసొంపు జూపులలోను
వగపగల ఘనసార వాసనలతోను
జిగిమించుకెమ్మోవి చిగురుకెంపులతోను
నగముకుచముల విదియ చందురులతోను ॥మగువ॥

తరితీపు సే[illegible]గమసురత బడలికతోను
[illegible]రగు జార్చై[illegible]తోను

ఇరుగడల కై దండలిమ్ము తరుణులతోను
పరమాత్మ ముప్వగోపాల తెల్లవారెననుచు ॥మగువ॥"
(సి గి వేం ప - 19)

ఇది క్షేత్రయ్య అత్యుత్తమ మనోజ్ఞపదాల్లో ఒకటి. దీనికి మూలమన్నట్లున్న అన్నమాచార్యుల పదం

అన్నమాచార్యులు

"పలుకుదేనెలతల్లి పవళించెను
కలికితనముల విభుని గలిసినదిగాన ॥పల్లవి॥

నిగనిగని మోముపై నెరులు గెలకులజెదర
పగలైనదాక చెలి పవళించెను
తెగనిపరిణతులతో తెల్లవారినదాక
జగదేకపతి మనసు జట్టిగొనెగాక ॥పలుకు॥

కొంగుజారిన మెరుగుగుబ్బలొలయగ దరుణి
బంగారుమేడపై బవళించెను
చెంగలువ కనుగొనల సింగారములు దొలక
నంగజు గురునితోడ నలసినదిగాన ॥పలుకు॥

మురిపెంపునటనతో ముత్యాల మలుగుపై
పరవశంబున దరుణి పవళించెను
తిరువేంకటాచలాధిపుని కౌగిటగలసి
అరవిరైన నునుజెమట నంటినదిగాన ॥పలుకు॥
(శృం.సం. 4 - 74)

కానీ క్షేత్రయ్య పదానికి చక్కటి మూలమనదగ్గ సురతానంద పరవశ అయిన నాయికావర్ణన అన్నమాచార్యుల పదంలో గమనించగలము .

"ఎవ్వరికి గలదమ్మ యింతభాగ్యము
ఇవ్వల నీతో సరిపెంచరానే వారుల ॥పల్లవి॥

వీడినతురుముతోడ విరులు పైపైరాల
వాడినకన్నులతోడ వచ్చేవేమే
యేడనుంటివిందాకా చెప్పవదు నిన్ను దోగించె
చేదె నీ సొబగులిదే చెప్పరాదె నేడు ॥ఎవ్వ॥

. ... . . . .... .. . .

నిద్దురకన్నులతోడ నిండు బలకలతోడ
ముద్దుగారేమోముతోడ మురిసేవేమే
నొద్దనె శ్రీవేంకటేశుదాగి గూడుబెరగమె
ముద్దరాల నేడు నీ మోహమెంచరాదె ॥ఎవ్వ॥

(శృం సం 13 - 42)

అరమరికలేని అత్యంతానురాగం నాయకునిపై నాయిక కున్నట్లు ఇద్దరు వాగ్గేయకారులు పర్ణించారు.

క్షేత్రయ్య.

"ఇంత తెలిసియుండి యీ గుణమేలరా ॥పల్లవి॥
పంతమా మువ్వగోపాల నాసామి ॥అ ప॥"

(సి.గి వేం.స్వీ 47)

అన్నమాచార్యులు

"కటకటా అయ్యో కాంత నింత యేపుదురా
అటమటగాదు నీయాన సుమ్మీ నిజమయ్యా ॥పల్లవి॥

(స్వరకుసుమాంజలి - 29)

పరిపూర్ణానురాగం పొందలేని అనురాగం పనికిరాదంటారు ఇద్దరూను

క్షేత్రయ్య

"మానినిరో చేరరమ్మని పిలుపని మాలిమేటిమాలిమే ॥పల్లవి॥
మాని దానిప్రాయ మనుభవింపగలేని
పురుషుడేటి పురుషుడే ఓ చెలియా ॥అ.ప॥"

(సి గి వేం.స్వీ 135)

అన్నమాచార్యులు

"ఏటి పొందు యేటి గుణము యేటి సవరందినము మనసు
నాటుకొలపంజేయలేని నటనలేటికే ॥పల్లవి॥

నాయకుడు నాయికా చిత్రాన్ని చిత్రించబోయి భ్రమతో పైమరచిపోయే మనోజ్ఞమైన నిర్మలానురాగం పదాలలో చిత్రించిన చిత్రకారు లీ వాగ్గేయకారు లిద్దరూ!

క్షేత్రయ్య

"ఏమిచేయుదు మోహ మెటువలె దీరును ॥పల్లవి॥
భామినీమణిని యెవ్వరు తోడితెచ్చేరు ॥అ ప॥

వెలది నీదు ముఖారవిందంబు లిఖియించి
అలరువాసనలు వ్రాయగ నేరనైతి
కళలొల్కు నీ మోవిగదసి వ్రాసితిగాని
నెలత తేనియలుంచనేరనైతి ॥ఏమి॥

కలికి సొగసైన కసులు వ్రాసితిగాని
వెలకుచూపులు వ్రాయ వితమెరుగనైతి
గళము రేఖలు దెలియగాను వ్రాసితిగాని
చెలగు కోకిలవంటి పలుకు వ్రాయగనైతి ॥ఏమి॥

(పీ గి వేం.స్వీ - 168)

అన్నమాచార్యులు

"ఒకటికొకటి యాసనుండ జెలిభావమిది
మొకమెదుటనె నన్ను మోవ వ్రాసెనే ॥పల్లవి॥

పొలతి కురులు వ్రాయబోతే దుమ్మిదలాయ
తలగకుండ మోముదమ్మి వ్రాసి నే
కలికి కన్నులువ్రాయగ గండుమీలై పొడచూపె
చెలపచెమట నీటిచెక్కులు వ్రాసి నే ॥ఒక॥"

(శృం.సం.15-70)

ఇలాగా సమాన భావాల వ్యక్తీకరణకై చక్కటి పదరచన సమానంగా చేసిన మహనీయులీ వాగ్గేయకారులు

ఇంకా వీరిద్దరి పదప్రయోగాలు సమానంగా ఉండడం విదితమవుతుంది

మందిమేళము, తీరితీపు, మోవనాడివద్దు, దక్కగొను, అసురుసురు, చెరిగు మాసిన, బొంచులేలవినేవే, వదరక, మోరతోపు, మెమ్మెలు, ఎటువంటివలపో, ముయికిముయి, మంకు, వెసవెల్లతనము, ఇన్నాళ్ళవలెగాదమ్మా, ఆయనాయ, సేనా సేనా — మొదలైన పదాలు పలుచోట్ల ప్రయోగించి ఈ పదాలకు ఎంతో విశిష్టతను సాధించారీ వాగ్గేయకారులు

ఈ విధంగా అన్నమాచార్యులను క్షేత్రయ్య అనుసరించాడనుకొన్నా, తన విశిష్టతను నిలబెట్టుకొన్న క్షేత్రయ్య అన్నమాచార్యులంతటి వాగ్గేయకారుడు లేదా ఒక మెట్టు అధిగమించినవాడన్నా తప్పులేదు సాహిత్యంలోనేగాక, సంగీతంలో అంతకంటే అభినయంలో సాటిలేని మేటి అంటేను వాస్తవమే ఎన్నో అపూర్వ రాగాల్ని క్షేత్రయ్య వాడుకచేసి సంగీతానికి పుష్టిని తుష్టిని చేకూర్చాడు అన్నమాచార్యుల సంకీర్తనల్లో అణగి మణగి తారాడుతూ, అలరిస్తూ వచ్చిన అభినయం క్షేత్రయ్య పదాలంటే శృంగారపదాలని, పదాభినయపదాలనీ పేరెన్నికగన్నేట్టు చేసిన అభినయాచార్యుడు క్షేత్రయ్య. అసిగూరా తేనెలూరు తేట తెనుగుమాటలలో పదాలు రచించి, అత్యంత మనోహర పదకవితా చక్రవర్తిగా పేరెన్నికగన్నవాడు క్షేత్రయ్య.

## 6.4 భద్రాచల రామదాసు :

రామదాసు భజన సంప్రదాయానికి చక్కటి రాజమార్గం ఏర్పరచిన వాగ్గేయకారుడు ఆయన భక్తితత్వం భక్తులందరిదీ కనుకనే రామదాసు ఆనాటినుంచీ ఈనాటికీ, ఏనాటికీ తెలుగుప్రజల హృదయకుహరాల్లో గూడుకొట్టుకొని నిలిచి ఉన్నాడు, ఉంటాడు

అన్నమాచార్యులు రాజాజ్ఞను ధిక్కరించి భగవంతునే నమ్మిన మహనీయుడు. భక్తిరక్తులతో అధ్యాత్మ శృంగార సంకీర్తనలు రచించిన వాగ్గేయకారుడు రామదాసు సర్కారువారి కొలువులో ఉంటూ జీవితమంతా రామభక్తికే అంకితం చేసిన భక్తాగ్రే

సరుడు. కేవలం భక్తితత్పరతతో, ఆర్తితో భక్తిప్రపత్తులను ప్రకటిస్తూ కీర్తనలు రచించినవాడు. రాజాధికారానికి గురిఅయి కారాగార శిక్ష ననుభవించినవాడు అన్నమాచార్యుడు ప్రభుత్వధనం దైవకార్యాలకు వినియోగించి రాజదండనకు లోనై కారాగారంలో పన్నెండేండ్లు ఘోర దుఃఖాలు, కష్టాలు అనుభవించి శ్రీరాముని అనుగ్రహానికి పాత్రుడైన రామభక్తుడు రామదాసు అన్నమాచార్యునితో ప్రారంభమైన సంకీర్తన పదమై, రామదాసు నాటికి భజనగోష్ఠులలో గుంపులు గుంపులుగా పాడుకోడానికి ఉపకరించే కీర్తనగా వ్యాప్తిపొందింది. తెలుగు వాగ్గేయకారుల్లో ఒకడుగా రామదాసుకు పేరు ప్రఖ్యాతులున్నాయి.

రామదాసు కీర్తనల్లో ఆర్తితోకూడిన భక్తి ప్రాముఖ్యం వహిస్తుంది. భక్తి ప్రపత్తులతో రచించిన రామదాసు కీర్తనల్లో సాహిత్యపు విలువలు - అన్నమాచార్య క్షేత్రయ్యల పదాల్లోలాగా లేకపోవచ్చుగాక - ఎంతో లలితమనోహరంగా, సామాన్య జనైకవేద్యంగా వుండి సర్వులను సమ్మోహపరిచేవిగా వుండటం గమనించగలము. భాషలో సారళ్యముంది.

చక్కటి పదరచన రామదాసు కీర్తనల్లోను ఉంది. ఒక మంచి ఉదాహరణ

"ఏలాగు తాళుదు నేమిసేతురా రామా
ఈ జాలిచేతను తాళజాలనురా రామా ||ఏలాగు||

. ... . .

రాతికైన చెమట రంపిల్లునే రామా
ఆ తీరు నీమనసు నొంచదే రామా ||ఏలాగు||
(భ. రా కీ 87)

అని ఇలా రచించిన కీర్తనల్లో - పొద్దిగానే గావచ్చుగాక - కవితాస్పర్శ లేక పోలేదు. అయితే అన్నమాచార్యుల సంకీర్తనల్లో కవితాంశమే అంటే ఉపమలో దుఃఖంలేదు. కేవల భక్తిసూత్రమే నిండివుండేది విలువిల్లా. రామదాసు కారాగారశిక్ష అనుభవించినప్పుడు అత్యంత దుఃఖ సముద్రంలో మునిగిపోయాడు. మొరపెట్టుకొన్నాడు తన్ను రక్షించుమని. అన్నమాచార్యుడు కారాగారశిక్ష పొందినా లెక్కచేయ

లేదు తానే తన భక్తి మహిమన్ని ప్రదర్శించి సాళ్వనరసింగరాయలను భక్తిప మార్చిన మహాభక్తాగ్రేసరుడు. రామదాసుకు కలిగిన దుఃఖాన్ని పోగొట్టడానికి, భక్తికి మెచ్చి రాముడు సలక్ష్మణుడై వచ్చి తానీషాకు పైకంచెల్లించి కారాగా నుంచి తొలగించి, మహమ్మదీయుడైన తానీషాను రామభక్తునిగా మార్చివేశాడ ఆనందంతో కీర్తనలు రచించాడు రామదాసు శిక్షకు పూర్వమూ, శిక్ష సమయ శిక్షానంతరం రామదాసు క్రమంగా భక్తితో, ఆర్తితో, ఆనందంతో కీర్తన చేశాడు. అన్నమాచార్యుడు సర్వవేళల్లో, సర్వావస్థల్లో శ్రీవేంకటేశ్వరుని ప లుగా ఆడి పాడి తరించాడు.

రామదాసు మంచి కీర్తన రచనారీతికి చక్కటి ఉదాహరణలు

"రామజోగి మందుకొనరే ఓ జనులారా ॥పల్లవి॥

రామజోగి మందు కొని ప్రేమతో భుజియించుడిన్ని
కామక్రోధ మోహ ఘనమైన రోగాలకు మందు ॥అ ప॥

కాటుకకొండలవంటి కర్మములెడబాపే మందు
సాటిలేనిజగమునందు స్వామి రామజోగి మందు ॥రామ॥

వాదుకు చెప్పినగాని వారి పాపములు గొట్టి
ముదముతోనే మోక్షమిచ్చే ముద్దు రామజోగి మందు ॥రామ॥

ముదముతో భద్రాద్రియందు ముక్తిని పొందించే మందు
సదయుడై రామదాసు ముదముతో సేవించే మందు ॥రామ॥
(భ రా. కీ 64

వర్ణనలు సైతం రామదాసు మనోజ్ఞంగా చేశాడు భద్రాద్రి వర్ణన

కలియుగవైకుంఠము భద్రాచల నిలయము
సేవింతము సేవింతము ॥పల్ల॥

అలివేణులార మీరానందముగ వేగ
విలసితమైనట్టి వేడుక చూడరె ॥అ.ప॥

కాంచనసౌధములు మానికములు మించిన దూలములు
వజ్రములు చెక్కించిన స్తంభములు
పగడములని భ్రమియించు ద్వారములు
అంచయాన మరి వెంచ లేరుగదె
మంచి నచ్చులుకిూర్చిన వాకిళ్ల ॥కలి॥
బంగారు గోపురములు దేవళముల వెలుగు మాణిక్యములు
భేరిమృదంగాదినాదములు
భాగవతులసంకీర్తనలు
రంగైన కల్యాణమంటపములు
శృంగారమేమని వెలియ విన్నవింతు ॥కలి॥

. . .. ...
వామాజలాడగను సీతతో సామసీరమున సంపూర్ణకళలు
మోమున వెలుగగ పరివారములు
ప్రేమతో గొలుపగను భద్రాద్రి
రామదాసుని స్వామియైన శ్రీ
కోదండరాము నివాసము ॥కలి॥" (భ రా.కీ 39)

ఇలాగే భద్రాద్రి, గౌతమి, శ్రీరాముని గూర్చిన వర్ణన.

"అదిగో భద్రాద్రి గౌతమి ఇదిగో చూడండి" (భ రా కీ 102)

శ్రీరామచంద్రుని అతిలోక మంగళస్వరూపాన్ని అత్యంత మనోహరంగా వర్ణించాడు రామదాసు

"పదియారువన్నె బంగరుశాలువ దట్టి
గట్టి విదియ చంద్రుని గేరు
నుదుట కస్తురి నామమునుదిద్ది
తామరలవంటి మృదుపదములందు
కదిసి పుష్పలు పాదరసములందెలు ఘల్లు
ఘల్లుమన ఖొంకముగా నుంచియు,
కదిసి వడ్యాణములు మొలనూలు ఘంటలు
హరికి అలరించువేళ ॥నక॥ (భ. రా. కీ. 86)

రామదాసు రచన సరళమూ, నిరలంకారమూ అన్నప్పటికి అక్కడక్కడా ఆలంకారిక రచన లేకపోలేదు రూపకం

"సోహంబని పెడి కత్తిచేగొని అష్టే
మోహపాశము లన్నెల్ల మొదటనే ద్రుంచి ॥తరలి॥

ఈషణత్రయములెల్ల ఇలలోనే డించి సం
తోష సాగరంబునందె సంచరించుము ॥తరలి॥

తారకమంత్రౌషధధారలు గ్రోలి ఏపు
మీరగాను మోక్షపదవి మెచ్చనుమగాంచి ॥తరలి॥"

(భ రా. కీ 38)

అంత్యప్రాసతో గూడిన శబ్దాలంకారాలున్నాయి
"శరణా గతరక్షణ బిరుదని నే శరణంటిగదయ్యా
వెరపకుమని యభయం బొసగవె వినుగన్న తండ్రివయ్యా (భ. రా కీ 113)

ఇంతకంటే ముఖ్యంగా రామదాసు భక్తి వేయిరెట్లుగా విలసిల్లుతూంది అన్నమాచార్యుల భక్తికి తీసిపోనిరీతిలో రామదాసుభక్తి ఆర్తితోగూడి నవవిధ భక్తులు విదితమవుతాయి. అన్నమాచార్యులతో సరిపోల్చదగ్గ కీర్తన

"కంటి మారాములను కనుగొంటి నేను ॥కంటి॥

కంటినేడు భక్తి గుణముల ప్రోపు మా
యింటి వేలుపు భద్రగిరి నున్న వాని ॥కంటి॥

చెలువొప్పు చున్నట్టి సీతాసమేతుడై
కొలువు తీరిన మా కోదండరాముని ॥కంటి॥

తరణికులతిలకుని ఘనసీలగాత్రుని
కరుణారసము కురియు కందోయి గలవాని ॥కంటి॥

హారముమీద ముత్యాల సరములు మెరయగా
మురిపెంపు చిరునవ్వు మోము గలిగినవాని ॥కంటి॥

ఘల్లు ఘల్లుమను పైడిగజ్జెలందెలు మ్రోయగ
భక్తుల కొసగు పాదతలము గలిగినవాని ॥కంటి॥

కరకు బంగరు చేల కాంతి జగములు గప్ప
శరచాపములు కేలధరియించు స్వామిని ॥కంటి॥

ధరణిపై శ్రీరామదాసునేలెడు వాని
పరమ పురుషుండైన భద్రగిరి స్వామిని ॥కంటి॥"

(భ. రా. కీ 15)

అన్నమాచార్యుని సంకీర్తన

"ఇప్పుడిటు కలగంటి నెల్లలోకములకు
నప్పడగు తిరువేంకటాద్రీశు గంటి ॥పల్లవి॥

అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి
ప్రతిలేని గోపురప్రభలు గంటి
శతకోటి సూర్యతేజములు వెలుగగ గంటి
చతురాస్యు బొడగంటి చయ్యన మేలుకంటి ॥ఇప్పు॥

కనకరత్న కవాటకాంతు లిరుగడ గంటి
ఘనమైన దీప సంఘములు గంటి
అనుపమ మణిమయమగు కిరీటముగంటి
కనకాంబరము గంటి గక్కన మేలు కంటి ॥ఇప్పు॥

అరుదైన శంఖచక్రాదు లిరుగడ గంటి
సరిలేని అభయహస్తము గంటిని
తిరువేంకటాచలాధిపుని జూడగగంటి
హరిగంటిగురుగంటి నంతట మేలుకంటి ॥ఇప్పు॥"

(అ సం 1-38)

ఇలాగా అన్నమాచార్యులు కలలో శ్రీ వేంకటేశ్వరునిగాంచి రచించిన పదమది. రామదాసు స్వయంగా భద్రాద్రిరాముని చూచి పాడుకొన్న కీర్తన అది ఇంతే తేడా కానీ ఇద్దరు తమతమ దైవతా స్వరూప నిరూపణంలో అత్యంతాత్మ సంతృప్తిని అభివ్యక్తీకరించారు

కాగా ఇందాకే తెలిపినట్లు రామదాసు, భక్తి తత్పరతా నివేదనంలో అన్నమాచార్యులకు తీసిపోనివాడు. పైగా అన్నమాచార్యునికి కలగని ఆపద రామదాసుకు

సంభవించడంతో ఆర్తి, మొర, ఆవేదన, వేడికోలు మొదలైన వాటి భావసాంద్రత భక్తిలో మిళితమై ఆయన కీర్తనల్లో ప్రస్ఫుటమవుతాయి

రామదాసు మహాభక్తాగ్రేసరుడు ఆయనకు సమస్తమూ రామమయంగానే తోస్తుంది 'అంతా రామమయం బీజగమంతా రామమయం "(భ రా కీ 101) అని కీర్తిస్తూ పైమరచిపోతాడు

రామదాసు ఒకే కీర్తనలో నవవిధ భక్తితత్వాన్ని ప్రతిపాదించడం గమనించగలం.

"రామరామ శ్రీరామ రామ
రామ యనరాదా మనసా
కామిత ఫలదుండగు శ్రీసీతా
కాంతుని గనరాదా మనసా" (భ. రా కీ 63) కీర్తనలో శ్రీరాముని హృదయ పీఠంపై అధిష్ఠింపజేసుకొని ధ్యాన ఆవాహనాదులను గావించి, అర్చించి వస్త్ర మాల్యగంధాదుల నొసగి, నృత్యగీత వాద్యాదులతో ఆనందింపజేసి ఆ దయామయుని త్రికరణ శుద్ధిగా శరణు వేడుకొంటున్నాడు రామదాసు

నవవిధ భక్తికి రామదాసు కీర్తనలు కొన్ని ఉదాహరణలు .

స్మరణం

"ఓరామ నీ నామమేమి రుచిరా
శ్రీరామ నీ నామమేమి రుచిరా" (భ రా కీ 108)

కీర్తనం

"అంతా రామమయం బీజగమంతా రామయం" (భ రా కీ. 101)

వందనం

"వందనము రఘునాయకా ఆనందము శ్రీ రఘునాయకా
పొందుగ పాదారవిందమును కనుగొందునా రఘునాయకా' (భ రా. కీ 65)

పాద సేవనం

"భామ నీదయరాదుగా పతితపావన" (భ రా కీ 69)

దాస్యం

పావన రామనామ సుధారస
పానము జేసేదెన్నటికో
సేవించియు శ్రీహరి పాదంబులు
చిత్తమునుంచే దెన్నటికో" (భ రా. కీ 52)

వాత్సల్యభక్తి

రామదాసు తానే యశోద అయి బాలకృష్ణుని బుజ్జగించ యత్నించడంలో వాత్సల్య భక్తిపూరితమైఉంది

'బూచివాని పిలువబోదునా ఓ గోపాలక్రిష్ణా ।।పల్లవి।।
బూచివాని పిలువబోతే వద్దు వద్దు వద్దనేవు
ఆ చిచ్చిజోలపాడి ఆయి ఊచిన నిదురబోవు ।।అ ప।।
(భ. రా. కీ 105)

అన్నమాచార్యుల కంటే రామదాసులో ఆర్తి, మొర, వేడికోలు, నిందాస్తుతి గోచరిస్తాయి

భక్తితోపాటు రామదాసులో నీతి వైరాగ్యాలు ఉన్నాయి.

నీతి

సామాన్య ప్రజలకు నీత్యుపదేశం చేయడం రామదాసులోని ఒక అత్యుత్తమ గుణం

"పరవారి నమ్మక నరులను నమ్మితే
నరజన్మ మీదేరునా ఓ మనసా ।।పల్లవి।।
చెఱకు లుండగ వెట్టి చెరకులు నమిలితె
జిహ్వకు రుచి పుట్టునా ఓ మనసా ।।అ ప।।
కాళ్ళుండగ మోకాళ్ళతో నడచితె
కాశికి పోవచ్చునా ఓ మనసా
నీళ్ళుండగ నుమ్మనీళ్ళను మ్రింగితే
నిండుదాహము తీరునా ఓమనసా ।।పర।।

కొమ్మయుండగ కొయ్యబొమ్మను కలసితె
కోరిక కొనసాగునా ఓ మనసా
అమ్మ యుండగ పెద్దమ్మను యడిగితె
నర్థము చేకూరునా ఓమనసా ॥నర॥

అన్నముండగ గుల్ల సున్నము తింటె
యాకలి వెతతీరునా ఓమనసా
కన్నెలుండగ చిత్ర కన్నెల గలిసిన
కామపువ్యథ తీరున ఓ మనసా ॥నర॥

క్షుద్ర బాధలచే సుంత ఎంతయినవేళ
నిద్ర కంటికి వచ్చునా ఓ మనసా
భద్రగిరీంద్రుపై భక్తిలేని నరుడు
పదమును గననేర్చునా ఓమనసా ॥నర॥

(భ రా కీ 78)

ఇట్లే అన్నమాచార్యులు తన సంకీర్తనలో నా యాపహారుల బార్చి నిందించినా, ప్రజా సముదాయానికి నీతుల్యసందేశం చేసినట్లున్న సంకీర్తన రామదాసు కీర్తనభావాన్ని గుర్తుకుతెస్తుంది

"వెల్లులాల మీకువేడుక గలితేను
అట్టువంచి ఆడుకట్లంగ రాదా ॥ఎల్లవి॥

ముడిచివేసిన పువ్వు ముడువ యోగ్యముగాదు
కుడిచివేసినపుల్లె కుడువగా గాదు
ఇడి నొకరుచెప్పిన బ్రతి చెప్పబోతేను
అడరి శ్రీహరికది అరుహము గాదు ॥వెల్లు॥

. . .

(అన్నమాచార్య చరిత్ర పీఠిక పు. 102-104)

వైరాగ్యం

'గోవింద సుందరమోహన దీనమందార
గరుడవాహన భవబంధభారిదుష్కర్మ
దహన భక్తవత్సల త్రిలోకపావన ॥పల్లవి॥

సతి సుతులపై ప్రేమరోసితి సం
తతము మీపై భారము వేసితి
మదిలోన మిముకనుల జూడనెంచి
మీ దయ కెపు డెదురు జూచితి ॥గోవింద॥

.. .. " (భ.రా.కీ 121)

"తరలి పోదాము వాలా దయ యుంచండి యిక" (భ.రా.కీ. 38)

ఆర్తి, ఆవేదన, మొర, వేడికోలులో శృంగారం చొప్పించాడు రామదాసు. శ్రీరాముని మొరపెట్టుకొని విసిగిపోయిన రామదాసు సీతమ్మను వేడుకొంటున్నాడు. ప్రార్థిస్తున్నాడు. శృంగార సంబంధమైన కీర్తన ఇదొక్కటే అన్నమాచార్యులు ఆధ్యాత్మ శృంగార కీర్తనలు రచించిన సంగతి మనకు తెలిసిందే.

"నను బ్రోవమని చెప్పవే సితమ్మ తల్లి ॥పల్లవి॥

నను బ్రోవమని చెప్పవే నారీశిరోమణి
జనకుని కూతుర జనని జానకమ్మ ॥నను॥

ప్రక్కన చేరక చెక్కిలి నొక్కుచు
చక్కగ మరుకేళి సొక్కుచుండెడి వేళ ॥నను॥

ఏకాంతరంగుడు శ్రీకాంత నినుఁ గూడి
ఏకాంతమున నేక శయ్యనున్న వేళ ॥నను॥

అద్రిజ వినుతుడు భద్ర గిరీశుడు
నిద్ర మేల్కొనువేళ నెలతరో బోధించి ॥నను॥

(భ రా.కీ. 112)

రామదాసు సంస్కృతంలోను కీర్తన రచనచేసి తన ఉభయ భాషా పాండిత్యాన్ని నిరూపించుకొన్నాడు అన్నమాచార్యులు పంద దాకా సంస్కృత సంకీర్తనలు రచించిన విషయం విదితమే.

రామదాసు కీర్తనలకు అన్నమాచార్యుల సంకీర్తనలకున్నంత సాహిత్య గౌరవంగాని, త్యాగరాజు కృతుల కున్నంత సంగీత ప్రతిపత్తిగాని లేకపోవచ్చు గాక సామాన్య ప్రజలలో, భజన కూటములలో సర్వత్రాస్మరింపబడి కీర్తించబడే కీర్తనలు రామదాసు కీర్తనలే అనే విషయం సర్వ జనైకవేద్యం రామదాసు కీర్తనల కున్న ప్రజాదరణ (Popularity) అటువంటిదని స్పష్టమవుతుంది. బాగా ప్రచారంలో ఉన్న రామదాసు కీర్తనలు కొన్ని తారకమంత్రము, ఏ తీరుగనను, తక్కువేమి మనకు, పలుకే బంగారమాయెనా, పాహి రామప్రభో, రామ జోగిమందు, ఇక్ష్వాకు కుల తిలక, పాహిరాం శ్రీరామ, ఏడనున్నాడో, అంతారామ మయం, అదిగో భద్రాద్రి, ఎన్నగాను, ఓరామ నీరామ, నను బ్రోవమని గరుడగమన, రామ చంద్రాయ - ఈ కీర్తనలన్నీ బహుళ ప్రచారం పొందిన రామదాసు, కీర్తనలు.

ఆధ్యాత్మిక, భక్తి, నీతి, వైరాగ్యాలలో అన్నమాచార్యులకు సరితూగ గల భక్తాగ్రేసరుడు, ఆర్తి, మొర మొదలైన గుణాల్లో అత్యున్నతుడు రామదాసు

## 6.5 సారంగపాణి :

చిత్తూరుజిల్లా కార్వేటి నగరం సంస్థానంలో ఆస్థానకవిగా ఉండేవాడు సారంగపాణి తిరుమలలో వెలసిన వేంకటేశ్వర స్వామి ఆస్థానకవిగా ఆమరణమూ ఉండేవాడు అన్నమాచార్యులు. సారంగపాణి జీవిత చరమావస్థలో పదచ్యుతుడైనట్లు తెలుస్తుంది సారంగపాణి శృంగార, దేశీయ, జాతీయ పదాలు, కీర్తనలు కార్వేటి నగరంలో వెలసిన వేణుగోపాలునిపై రెండు వందలకు పైగా రచించాడు అన్నమాచార్యులు అధ్యాత్మ శృంగార సంకీర్తనలు వేలకొలదిగా రచించిన అంశం పూర్వోక్తం అన్నమాచార్యుల సంకీర్తనల్లో శృంగారసంకీర్తనలు క్షేత్రయ్యలో, సారంగపాణిలో పదాలుగా ప్రసిద్ధమయ్యాయి. అధ్యాత్మ సంకీర్తనలే రామదాసులో, సారంగపాణిలో కీర్తనలుగా రూపుదిద్దుకొన్నాయి కాగా భాషలో, భావనలో, భక్తి, రక్తి, నీతి, వైరాగ్యాలలో అన్నమాచార్యులతో సర్వవిధాలా సరిపోయే వాగ్గేయకారుడు సారంగపాణి క్షేత్రయ్యతో పద రచనలో, భాషలోను సరిపోల్చ దగ్గవాడు సారంగపాణి సంగీతంలోనే గాక సాహిత్యంలోను తన పూర్వులను సారంగపాణి అనుసరించినట్లు తెలుస్తుంది అనుసరించినా, అను సరించకపోయినా, అన్నమాచార్యులతో సరిపోలే వాగ్గేయకారుడు సారంగపాణి.

సారంగపాణి కార్వేటి నగరం సంస్థానంలో రాజాశ్రమంలో ఉంటూనే భక్తి, నీతి, వైరాగ్యాలు, శృంగారంతో పాటు పదాలలో చెప్పుకొన్నాడు. తన పాండిత్య

ప్రకర్షను, ప్రతిభను ప్రకటించుకొన్నాడు రాజాశ్రయం పోయాక నరుల సేవను గర్హించినట్లు విదితమవుతుంది కానీ అన్నమాచార్యులు మొదటినుంచి నరుల ఆశ్రయాన్ని కోరలేదు పైగా ధిక్కరించాడు. నరుల సేవను సారంగపాణి ఈ రీతిని గర్హించాడు. కరుణతో చూడుమని భగవంతుని వేడుకొంటున్నాడు

"నరుల సేవ సేయలేనయ్య పద్మ
నాభ దండాలు పెట్టేనయ్యా
కరుణ యించుక చూడవయ్యా - యింత
కఠిన చిత్తము కారాదయ్య" (సా ప. 178)

అందుకే భక్తి ప్రధానమనీ, భక్తి లేని పూజవ్యర్థమని అనేకోపమలతో ఉదాహరించాడు సారంగపాణి .

"భక్తి లేనీ పూజలేమిటికి ప్రతి దొరకగానే
భక్తి లేని పూజలేమిటికి ॥పల్లవి॥
భక్తి లేని పూజలేమిటికి
భాషించని మగడేమిటికి ॥అ ప॥
రక్తి పాడని పదమేమిటికి
రహిని వేణుగోపాలుని పాద ॥భక్తి॥
జీతము ముట్టని కొలువేమిటికి
చిలుక లేని పంజర మేమిటికి
దాతలు దొరకని యూరేమిటికి
దైవము చేరని గుడి యేమిటికి ॥భక్తి॥ (సా.ప 180)

కనుకనే ప్రగాఢమైన, త్రికరణశుద్ధిగల హరిస్మరణమే తప్ప ఇతర దేవతా స్మరణ పనికి రాదని గట్టిగా నమ్మి పాడుకొన్నాడు సారంగపాణి

"వేణుగోపాలుని విడువము - మరి
వేరే వక్కరిపేరు నుడువము ॥పల్లవి॥
నీలుగ కాశికి నడుపము ఖలుల
వి త్తము కొంగున గట్టము మా ॥అ.ప ॥" (సా ప. 158)

"కొలిచితే వేణుగోపాల దేవుని కొలువు కొలువవలెను ॥పల్లవి॥

తలచితే విష్ణు చారిత్రంబులు తలచుచుండవలెను - ఓ జనులార
॥అ ప.॥ (సా.ప. 160)

"హరి నామ స్మరణే సేయకుంటే
అవతల గతియేమి" (సా ప 168)

ఇలాగే అన్నమాచార్యులు సైతం హరినే స్మరించాలని స్పష్టం చేశాడు. ఆయన అధ్యాత్మ సంకీర్తన లన్నిటా మనం గమనించగలము

"గరిమల నెరగరుగాక మానవులు
సిరుల దియ్యని నోర జేదు మేసేదా ॥పల్లవి॥

హరి నారాయణ యనియెడి నోరను
ధర నితరుల పేర్ల దడవుటెట్టు
సరవిలో వేదములు చదివేటి నోరను
పరులమీది పదాలు పాడేదా ॥గరి॥" (అధ్యా నం 8-167)

హరినేగాదు హరి స్వరూపులైన హరిదాసులను సైతం గౌరవించాలని సారంగ

మదిలో సర ॥పల్లవి॥

లుడైన నర ॥అ ప ॥

గతాళి జేసేది

గాయ పగిది ॥హరి॥

బురదమట్టి

పురుగు చందాన ॥హరి॥

పాక్షిగ

ఋంచి చెత్తినట్లు ॥హరి॥

(సా. ప. 187)

ఇలాగే అనేక రీతుల హరిదాసుల మహిమలను గూర్చి అన్నమాచార్యులు వర్ణించి తరించాడు.

"ఉమ్మడి కర్మములాల వుండ చోటు మీకు లేదు
యిమ్ముల నెందైనా పోరో యివిలేని చోటికి ॥పల్లవి॥

పెట్టినది నుదుటను పెరుమాళ్ళ లాంఛనము
దట్టమై భుజమునందు దైవ శిఖామణి ముద్ర
నెట్టన నాలుకమీద నీలవర్ణు నామమిదె
అట్టె హరిదాసుల కంటునా పాపములు ॥ఉమ్మ॥

మనసున దలచే మాధవుని పాదములు
దీనము గడుపునించేది హరిప్రసాదము
తనువుపై దులసి పద్మాణి మాలికలు
చెనకి హరిదాసుల జేరునా బంధములు ॥ఉమ్మ॥

సంతతము జేసేది సదాచార్య సేవ
అంతరంగమున శరణాగతుల సంగమిదే
యింతటాను శ్రీవేంకటేశుడు మమ్మేలినాడు
అంతటా హరిదాసుల నందునా అజ్ఞానము ॥ఉమ్మ॥

(అధ్యా సం. 132)

కవితా కామనీయకంలోను ఒకరినొకరు నరిపోలు నట్లుండడం విశేషం వర్ణనలో, చమత్కార నైపుణ్యంలో, నాయికాది శృంగార వర్ణనలో సామ్యం గోచరిస్తుంది

రథోత్సవ వర్ణన మనోజ్ఞంగా ఉంది ఇద్దరిలోను. సారంగపాణి వేణుగోపాల స్వామి రథోత్సవ వర్ణనచేస్తే, అన్నమాచార్యులు శ్రీవేంకటేశ్వరస్వామి రథోత్సవ వర్ణన అత్యంత మనోహరంగాచేశాడు.

"కదలివచ్చెనుజూడరే వేణు
గోపాలుడు కనులపండుగ గాను ॥పల్లవి॥

పదిలుడై గరుడునిపై నెక్కి భక్తుల
ముదమంద జేయుచు ఇదిగో రాజమార్గమున ॥అ.ప॥

సురలు నుతింపగ వేదము లవనీసురులు పఠింపగను
ధరణీశు లతి భక్తితను సేవింపగాను
సరసీజాక్షులు నాట్యసరణి నభినయింపగాను ॥కద॥

పగలు పత్తులు వెలుగగా ఛత్ర చామరలు
బాణ విద్యలు మెరయగా
మృగమద తిలకము మోము కళలూరగ
వగగా కీర్తన భాగవతులు పాడుచురాగా ॥కద॥

భేరిదుందుభులు మ్రోయ వంది మాగధులు
చేరి హెచ్చరిక సేయా
వారణ హయములు వరుస గుంపులై డాయ
మీరి సంతోషమున మింట చందురుడుగాయ ॥కద॥"

(సా ప. 170)

అన్నమాచార్యులు సైతం అతిమనోహరంగా వర్ణించాడు

"దిక్కులెల్లా సాధించి దేవదుందుభులుమ్రోయ
నెక్కడ చూచిన దానె యేగీ సేవించ రో ॥పల్లవి॥

అదివో శ్రీహరితేరు అదె గరుడధ్వజము
కదలేటి ఘన తురంగములవిగో
పొదలు బూదండలవే పూచి వాగే ఘంటలవే
యెదుట దిరువీధుల నేగీ సేవించరో ॥దిక్కు॥

వారే అచ్చరలేములు వారే మునులు ఋషులు
వారక కొలిచే దేవతలు వారే
వీరే యనంత గరుడ విష్వక్సేనాదులు
యీ రీతి బ్రహ్మాపాన నేగీ సేవించరో ॥దిక్కు॥

వీడె శ్రీవేంకటేశుడు వీడలమేల్మంగపతి
వీడె శంఖచక్రాదుల వెలసినాడు
వోడిమి వరములిచ్చి బొసగ దాసులెల్లా
యేదెడు దప్పకుండాను యేగి సేవించరో ॥దిక్కు॥
(అధ్యా సం 9-212)

"దేవ దుందుభులతోడ దివ్యులతోడ
యీవేళ శ్రీహరితేరు యేగి వీధులను" (అధ్యా. సం 9.221)

సారంగపాణి కార్వేటి నగరంలో తాను స్వయంగా పాల్గొని వేణుగోపాల స్వామి తేరులాగిన రీతిని అభివర్ణించాడు అలాగే అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని రథోత్సవాన్ని వర్ణించాడు మొదటిది లౌకికంగాఉంది రెండోది అలౌకికంగా ఉంది ఇక్కడ దేవతలే రథోత్సవంలో పాల్గొన్నట్లు రచించాడు అన్నమాచార్యులు సారంగపాణి ప్రజలలో ఒకడై రచించాడు

ఈ వాగ్గేయకారుల్లో పాండిత్య ప్రకర్షతోపాటు ప్రతిభానంపద సమున్నతంగా ఉందని స్పష్టమవుతుంది కవితా కామనీయకం మనోజ్ఞమై సహృదయ హృదయైక వేద్యమై ఉంటుంది చమత్కారయుత పదరచన లిద్దరిలోను చూడగలము

సారంగపాణి పదాలను చమత్కార పూర్వకంగా రచించిన తీరు గమనిస్తాము

"ఏమిటికే నీ పేరేమని యడిగితివి ॥పల్లవి॥
కోమలి నను వేణుగోపాలుడని తెలిసి ॥అ ప॥

పడతి నీమోము ముద్దిడు కొన్నప్పటినుంచి
పద్మాక్షుడని నను బిలుకుదురే
జడియక నీమకిలీజడ యల్లినదే మొదలు
తొడరి శేషశయను డనుచు బిలుతురే ॥ఏమిటి॥

అలివేణి నీమోవి యానినవేపమున
తలకొని మధుసూదను డందురె
బలిమి నీ గుబ్బలుబట్టి జూమటజేసి
తరిగుబోడి మందరధరుడని తలతురే ॥ఏమిటి॥

మరుకేళి నినుగూడి మరిగినదే గురిజేసి
మదన జనకుడని ప్రేమను గొలుతురే
పరిమళవతి నీమై పసుపు దుప్పైటైనది
అరసి పీతాంబరధరు డనుకొందురే ॥ఏమిటి॥

(సా. వ. 9)

ఇదేరీతిలో శృంగార వర్ణనతో సార్థక పదప్రయోగంతో అన్నమాచార్యులు చమత్కారంగా ధ్వని పూర్ణంగా పదరచనచేసి ప్రతిభను ప్రకటించుకొన్నాడు.

"నిన్ను గూడిన విభుని నిలువెల్ల నొంపాయ
నిన్నియును నొనగూడె నింత లోపలనె ॥పల్లవి॥

నొలపు నీ కడగంటి చూపు హృదయము గాడి
లలినితడు శ్రీ వత్స లాంఛనుండాయ
వెలది నిను బెడబాసి విరహంపు మెయిగాక
వలన నీతడు నీల వర్ణుడైనాడు ॥నిన్ను॥

అదన నీచనుగుబ్బలను చక్రములచేత
బదిల పరపుచు చక్రపాణియైనాడు
సుదతి నీ దేహమున నొబగు కుంకుమ పూత
లెదిగి పీతాంబరం బీతనికి నాయ ॥నిన్ను॥

ఆలింగ నాపేక్ష ననయంబు నినుగూడ
లోలుడటు గాన నాలుగు చేతులాయ
శ్రీ లలితమూర్తి యగు శ్రీవేంకటేశ్వరుడు
పాలించె నిను నీకు బరితోషమాయ ॥నిన్ను॥

(శృ సం. 12-376)

శృంగారం వివిధ రీతుల వర్ణితం కావడం ఇద్దరు వాగ్గేయాకారుల్లోను చూడ గలము. స్వీయ, సామాన్య నాయికా శృంగార వర్ణన అన్నమాచార్యుల సంకీర్తనల్లో అత్యధికం, అత్యున్నతం. సారంగపాణి, స్వీయ, పరకీయ, సామాన్యా నాయికల శృంగారాన్ని అభివర్ణించాడు తన పదాల్లో.

నాయిక నాయకునితోడి తెమ్మని చెలి సుద్బోధించడం ఇద్దరు వాగ్గేయకారులు చక్కగా వర్ణించారు సారంగపాణి పదం

"రమ్మనే సామిని రమ్మనే ॥పల్లవి॥
కొమ్మ నీవే నా మనవి గై
కొమ్మని వేణు గోపాలుని ॥అ ప॥

మచ్చు మీదనే సుండగ మచ్చుమీద జల్లినవాని ॥రమ్మ॥
ఇందుకాక కోర్కెపెంచె యిందుకా కసరిం దీ వేళ ,,
అలసీమాటితో రేయెల్ల అలసి మాటాడకున్నాడు ,,
కూడిన సామిని నీతో కూడిన నాపై దయయుంచి ॥రమ్మ॥
(సా. ప. 23)

శబ్దాలంకార సహితంగా పదరచన చేయడం సారంగపాణి భాషాభిజ్ఞతకు నిదర్శనం.

ఇలాగే అన్నమాచార్యుల పదరచనా ప్రతిభా పాండిత్యాలలో శృంగార నాయికా వర్ణన మత్యంత మనోహారం.

"రమ్మనవే వాని రమ్మనవే యీ
తమ్మి కనుగొనల తళుకుల వాని ॥పల్లవి॥

మెలుపున నేను మేడమీద యీ
చిలుక చేరుకొని పిలువగను
అలపున వీధి దానరుగుచును తను
బిలిచితి నంటా బలికిన వాని ॥రమ్మ॥

కేరడమైన కిన్నెరలో యీ
నారణి మిట్టుచు నలుగడను
చేరువల తా పెలగుచును యిటు
పేరుకొసుచు నను బిలిచిన వాని ॥రమ్మ॥

పరవశమై నే బానువున యీ
గిరికుచముల నొద్ద గిలగాను
తిరువేంకట ఘనగిరిపతి ననుచు యీ
సిరులుగ ననునిటు చెనకిన వాని ॥రమ్మ॥ (శృం సం. 12-283)

అన్నమాచార్యుల లాగానే సారంగపాణి జానపద బాణీలేగాదు. జాన పద రీతిలో జాతీయ, దేశీయ పదాలను రచించాడు ఎచ్చరిక, లాలి, మంగళం వీరిద్దరిలోను సమంగా ఉన్నాయి పై పెచ్చు ఇవి అన్నమాచార్యుల పదాలకు సమీ పంగా ఉండడం గమనించ దగ్గ అంశం సారంగపాణి హెచ్చరికె పదం

"హెచ్చరికె పరాకిందిరా రమణా ॥పల్లవి॥
హెచ్చరికె జతనంపు హేమాబ్జచరణా
పచ్చ విల్తుని గన్న భవపాశ హరణా ॥అ ప॥ (సా ప 197)

అన్నమాచార్యుల్లో మనోజ్ఞంగా ఈ ఎచ్చరిక పదం ఉంది

"శరణు శరణు సురేంద్ర సన్నుత శరణు శ్రీసతి వల్లభా
శరణు రాక్షస గర్వ సంహార శరణు వేంకటనాయకా ॥పల్లవి॥
(శృం సం. 12-17)

ఇద్దరు వాగ్గేయకారులు పరమాత్ముని లాలించారు సారంగపాణి లాలిపదం

"లాలెనుచు వూచేరు లలన లింపునను
శ్రీల చెన్నలరు సుయ్యాల పాన్పునను
గోల రుక్మిణీదేవి కోరి పెంపునను
బాళితో వచ్చె నీపై తలంపు ననూ ॥లాలీ॥ (సా ప 199)

శ్రీకృష్ణలీలా విశేషాలను వర్ణిస్తూ లాలి పాడాడు సారంగపాణి.

ఇలాగే తెలుగు వారందరికీ లాలి పాటనందించిన మహనీయుడు అన్నమా చార్యులు.

"లాలనుచు నూచేరు లలన లిరుగడల
బాల గండవర గోపాల నిను జాల ॥పల్లవి॥
(అన్నమాచార్య చరిత్ర - పీఠిక - పు. 63, 64).

మంగళం సైతం ఇద్దరు వాగ్గేయకారుల్లో చక్కగా రచితమై ఉండడం చూడ గలము. సారంగపాణి మంగళం సముచితంగా సాగింది.

"జయ మంగళము నిత్య శుభమంగళం ॥పల్లవి॥

ఇందిరా రమణునకు నిభరాజ వరదునకు
మందరోద్ధారునకు మాధవునకూ
నందనందనుడైన నవనీత చోరునకు
కందర్ప శతకోటి సుందరునకూ ॥జయ॥" (సా.ప. 200)

ఇలాంటివి మంగళహారతులు అన్నమాచార్యుల సంకీర్తనల్లో అనేకం. ఒక్క-చక్కటి ఉదాహరణ

"మరల మరలి జయమంగళము
సొరిది నిచ్చలును శుభ మంగళము ॥పల్లవి॥

కమలారమణికి గమలాక్షునకు
మమతల జయ జయ మంగళము
అమర జననికిని అమర వంద్యునకు
సుముహూర్తముతో శుభమంగళము ॥మర॥"

(ఆధ్యా సం 1-448)

ఇలా మనోజ్ఞంగా మంగళం రచితమై తరువాతి పదకవులకు మార్గదర్శక మైంది.

ఇలాగా పదకవుల పదాల్లో జానపద రీతులుండడమేకాదు, జానపదులభాషలోనే ఈ పదరచన సాగింది దీనికి మూలకర్త అన్నమాచార్యులే సారంగపాణి పదాల్లోని భాష సహజము, సామాన్యమూను. నిత్యం ప్రజల్లో వాడుకలో ఉన్నభాష అంతే గాదు చిత్తూరు జిల్లా మాండలికాన్ని ప్రయోగించాడు అతి సామాన్య ప్రజలు వాడే భాషనే యథాతథంగా ప్రయోగించాడు. ప్రత్యేకంగా సారంగపాణి ఈ సామాన్య ప్రజల వాడుకలకోసం దేశియ, జాతీయ పదాలు రచించాడు. ఒకతె మరొకతెను నిందిస్తున్న సారంగపాణి దేశియ పదం ,

'నీ వన్నేమి చిమిడిం దిపుడు
కోపగించేవు ఓసి ||పల్లవి||

పాపాత్మురాలా వేణు
గోపాలుడు నమ్మించినందుకు ||అ ప||

కోళ్ళా గుడిశంతా బోయి చుట్టు
కొల్లారింప్లాయ సులక
తాళ్ళా నల్లుల కుక్కి పదరి
కీళ్ళు మంచమాయె ||నీ ప||

తుందుగుడ్డ కట్టే మొద్దుకు
కంచె పీరాయె పురిటి
కుండలు తిరిపెమెత్తే లొత్తుకు
వెండి పాత్రలాయె ||నీప||
. .. " (సా.ప. 93)

ఇలాగే మరో జాతీయపదం మృచ్ఛకటికంలో శకారుని అప్రస్తుత ప్రసంగాన్ని తలపించే పదం సారంగపాణి ఎంతగానో సామ్యాల నుడికారంతో రచించాడు

"అగ్గి తిరుణాలంట అడ్డాని కతలంట
అవురా యెంత సోద్దెమే
వారతకత బౌరా యెన్నెన్నింతలే ||పల్లవి||

సుగ్గీజయము దీని సుట్టు బలాదూరు
అగ్గిరోరపు ఆయ్యోర్వెడిగే నీ సాప్పిగ ||అ ప||

యిగనేసు పయినెక్కి యీ దీపనూదొచ్చి
బిగుపెగ్గె లెన్నెన్నో బలికి దుశ్శాసుని
మొగము చూడగానె మొర్చనాయూలద్దె
గుగురుగురనకుండ గుడ్లెల్లగక్కె ||అగ్గి||
(సా.ప. 153)

ఈ పదకర్తలందరికీ మూల పురుషుడు అన్నమాచార్యులు అతని పదాల్లో నానారీతులున్నాయి జానపదుల వాడుక భాష నత్యంతమనోహరంగా తన పదాల్లో వాడుకొన్నాడు శ్రీ కృష్ణలీలల వర్ణన అతి సామాన్యమైన వాడుక భాషలో చేయబడింది

"సిన్నవాడవని నమ్మ సెల్లదు నిన్ను
సిన్నెనె యాటదెల్ల సిక్కుసీరై పోయను ॥పల్లవి॥

అపుర బాలకినునరాయడ సీవు సంటి పాలు
సవులంటా నెత్తురెల్ల సప్పరించగా
కపకప నవ్వినవ్వి కన్నులు దేలగిలగ
నవరన్ని(ని)యాటదెల్ల సప్పుసారై పోయెను ॥సిన్న॥
(శృ సం 12-15)

ఇలాంటిదే మరొక్కటి :

"నల్లుసూపుల నలమారి యిక
నెల్లదో నన్ను నెనకడుగా ॥పల్లవి॥

సంకు సక్రముల సక్క నయ్యేటు దన
వుంకువవో నావొళ్లెల్లా
సంకనున్న తన నదురాలి మొరగైన
సింకసూపు నాపై సిమ్మడుగా ॥నల్లు॥"
(శృం సం 12-370)

ఇలాగా ఎన్నెనైనా ఉదాహరించ వీలవుతుంది. వాగ్గేయకారులందరు జానపదులకు దగ్గరగా ఉండేభాషనే ప్రయోగించారు

వాగ్గేయకారుల రచనల్లో భక్తితోపాటు నీతి వైరాగ్యాలు ఉంటాయి. అన్నమాచార్యులు సారంగపాణి రచనల్లోని భక్తి నిత:పూర్వమే చవిమాశాము. నీతి వైరాగ్యాలను గూడ ఇక్కడ తడవడం అవసరం

భక్తి ప్రధానంగాని పైపై ఆడంబరులు పనికిరావని ఖండింపాడు,

సారంగపాణి

"భక్తిలేని వ్రతము లెన్ని జేసిన ఫలములేదు సుమ్మీవి ॥పల్లవి॥
రక్తులమని వేసాలు ధరించక రహిని వేణుగోపాలునిపాద ॥అ.ప॥

జడలు వెనక జీరాడిననేమి
జాహ్నవి లోపల మునిగిననేమి
కడుపుగట్టిన టియించిననేమి
కాళ్ళ పాదుకలు మెట్టిననేమి ॥భక్తి॥

కావివస్త్రములు గట్టిననేమి
కండ్లు మూసుకొని గొణిగిననేమి
లావుగ తిరుమణి మెత్తిననేమి
లక్షతులసి నర్చించిననేమి ॥భక్తి॥

మేనినిండ భస్మమలదిన నేమి
యొడల రుద్రాక్షలు పూనిననేమి
నానా భూముల తిరిగిననేమి
నదులు నిధులు గనుగొంటేనేమి ॥భక్తి॥

(సా. ప 184)

ఇలాగే ఇంకా "చన్నీళ్ళలో మునుగుటకంటే, మిగుల జన్మములు సలుపుట కంటే, వేదశాస్త్రములు చదువుట కంటే, తీర్థయాత్రలు పోవుటకంటే, తాపసిమై గుహలు చేరుటకంటే" అన్నిటికీ సులభమార్గం హరినామ స్మరణమేనని (సా.ప.183) గట్టిగానొక్కి చెప్పాడు సారంగపాణి సూటిగా నీతిని ప్రబోధించాడు

"పగవానింట కుడువగరాదు
బలవంతుల కెదమియ్యగరాదు
మగువల యాలోచన వినరాదు
మానఘనుల బోనాడగరాదు
అప్పులు మెండుగ సేయగరాదు
ఆవల పండ్లగిలించగరాదు" (సా. ప. 181)

ఇంతకుముందే అన్నమాచార్యుల నీతి ప్రబోధాన్ని గూర్చి సవిస్తరంగా వివరించడం జరిగింది సారంగపాణికేగాక ఈ వాగ్గేయకారులందరికీ అన్నమాచార్యులు అన్ని విధాలా మార్గదర్శకుడనడంలో తప్పులేదు

"ఎంత చదివిననేమి వినినతన
చింతయేల మాను సిరులేల కలుగు ॥పల్లవి॥

ఇతర దూషణములు విడసినగాక
అతికాముకుడుగాని యెప్పుడుగాక
మతిచంచల గొంతమానినగాక
గతియేల కలుగు దుర్గతులేలమాను ॥ఎంత॥"
(అధ్యా సం 1-62)

"ఎక్కువ కులజుడైన హీనకులజుడైన
నిక్కమెరిగిన మహానిత్యుడే ఘనుడు" (అధ్యా సం 1-318)

ఇలాంటివెన్నో చెప్పాడు అన్నమాచార్యులు

ఈ వాగ్గేయకారు లిద్దరూ వైరాగ్య స్వరూపనిరూపణమెంతో చక్కగా చేశారు తమ పదాల్లో

సారంగపాణి దేహాన్ని అద్దె కొంపవంటి దంటాడు.

"అద్దెకొంప వంటిది యీదేహ
మనిత్యమే మనసా ॥పల్లవి॥

మిద్దెమీది పరుగులు రెణ్ణాళ్ళు సు
మీ వేణుగోపాలుని సాక్షిగ ॥అ ప॥

బందెగొడ్ల వంటిది సంసారము
భ్రమయకే మనసా
యెవరున్న నదమంత్రమె జీవుని
కెవరు చేరు మనసా మున్ముటికి ॥అద్దె॥

పుష్పం పంటిది యౌవనమినగా
పొంగికే మనసా
నవ్వుగారు సిరులు మెరుపు పంటివి
నమ్మకే మనసా ముమ్మాటికి ॥అద్దె॥

పతితపావనుని పదపంకజములు
పట్టవే మనసా
మదిని వేణుగోపాలుని మంత్రము
మరువకే మనసా ముమ్మాటికి ॥అద్దె॥
(సా ఎ. 190)

ఇలాగే మానస సంబోధనతో అన్నమాచార్యులు వైరాగ్యాన్ని ప్రకటించాడు
"పారకుమీ వో మనసా పంతము విడువకుమీ వో మనసా
పారిన నీవేబడగమ్యేదవు చేరుపనాదే చెప్పనె మనసా ॥పల్లవి॥

. . .. .

కంతు వారకము వయసు ప్రాయములు కాపటికుండలు వోమనసా
. .. " (అధ్యా సం 188)
ఇలాంటివెన్నైనా ఉదాహరించవచ్చు

సారంగపాణి

"పాపాత్ముని ధర్మాధికారిగా
బంపేవొక రోత ॥పల్లవి॥

కోపము జేసే నరనాథు కొలువు
గొలిచే దొక రోతా - ఛీఛీ ॥అ ప॥"
(సా ప. 174)

అన్నమాచార్యులు
"ఏటికి నెవ్వరిపొందు యిస్సిరో ఛీఛీ
నాటకములాల ని నీ నమ్మిలిగా మిమ్మును ॥పల్లవి॥ (అధ్యా సం 195)

ఇలాగా అన్నమాచార్యులను సారంగపాణి భక్తిలో నీతిలో, వైరాగ్యంలో, శృంగారంలో, కవితా మాధుర్య ప్రకటనలో చక్కగా అనుసరించినట్లు విదితమవు తుంది తనకంటే ముందే ప్రసిద్ధిపొంది ప్రచారంలో ఉన్న అన్నమాచార్యుల సంకీర్తనలను సారంగపాణి విని ఉంటాడు వినివిని తన మనసుకెక్కించుకొని ఉంటాడు. అదే ఇది అనడంకంటే అలా రచింపాడనడమే సముచితం తద్వారా సారంగపాణి ప్రతిభా పాండిత్యాలు సైతం సువిదితమవుతాయి

## 6 6 మునిపల్లె సుబ్రహ్మణ్యకవి

అధ్యాత్మరామాయణ కీర్తనలను రచించిన వాగ్గేయకారుడు మునిపల్లెసుబ్రహ్మణ్య కవి. ఈయన కొన్ని శృంగారపదాలు సైతం రచించినట్లు తెలుస్తోంది పైగా ఈ పదాలు క్షేత్రయ్య పదరచనకు సన్నిహితంగా ఉన్నట్లు శ్రీరజనిగారి పక్కణ అయినా క్షేత్రయ్య తరువాత వెలసిన వాగ్గేయకారు డీ సుబ్రహ్మణ్యకవి అన్నమా చార్యుడు ఆధ్యాత్మ శృంగార సంకీర్తనన్ని రచించి పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ పేరుగాంచాడు శ్రీ వేంకటేశ్వరునిపై వేలలో పదాలు రచించి తరించాడు పురాణకథలనేకం వస్తువుగా స్వీకరించి సంకీర్తనలు రచించాడు. సుబ్రహ్మణ్యకవి కేవలం అధ్యాత్మరామాయణాన్ని గ్రహించి 104 కీర్తనలుగా తీర్చి దిద్దాడు శ్రీవేంకటేశ్వరుని ఆశ్రయించినవాడు అన్నమాచార్యులుకాగా, సుబ్ర హ్మణ్యకవి శివస్తుతితో, శివుడు పార్వతికి రామకథను చెప్పినట్లు కీర్తనరచనచేసిన అద్వైతి అన్నమాచార్యులు శ్రీవైష్ణవ మతావలంబి ద్రావిడవేదాన్ని తనపదాల ద్వారా అందించినవాడు అన్నమాచార్యులు. వేదాంతసారాన్ని అధ్యాత్మకీర్తనలద్వారా అందించినవాడు సుబ్రహ్మణ్యకవి భక్తి వైరాగ్య వేదాంత వివరణ ఈ కీర్తనల్లో విదితమవుతుంది రామాయణాన్ని 104 కీర్తనల్లో గానంచేసి 58 రాగాలు ప్రయో గించిన వాగ్గేయకారుడీకవి సుబ్రహ్మణ్యకవిలో సంగీత సాహిత్యాలకు సమాన స్థానముంది. అలాగే సంకీర్తన విధానానికి అన్నమాచార్యులు ఆచార్యులు కీర్తన విధానానికి సుబ్రహ్మణ్యకవి ఆద్యుడనవచ్చు అందుకే వీరిద్దరిని పోల్చే అవకాశం కలిగింది

భక్తి సంకీర్తన భక్తి అన్నమాచార్యులదైతే కీర్తన భక్తి సుబ్రహ్మణ్య కవిది అనేక సంకీర్తనకర్త అన్నమాచార్యులు 104 అధ్యాత్మరామాయణ కీర్తనకర్త

సుబ్రహ్మణ్యకవి భక్తి రీతులన్నీ అన్నమయ్యలో ఉన్నాయి. అధ్యాత్మరామాయణ కీర్తనల్లోను ఈభక్తి సమస్తమూ విదితమవుతుంది. భక్తి ప్రధానంగాని, ఇతరమైనవి గావని నవవిధ భక్తులను శ్రీరాముడు శబరికి వినిపించడం గమనించవచ్చు.

"కుల నామాశ్రమాదులు హేతువులుగా వ
లదు నను దెల్వియగ భక్తి యొకటివినా యజనదానతపోమంత్ర
ములు భక్తిహీనములైనవి ఫలములుగనుక దెలిపెద భక్తిమార్గము
సులభమగు నపవర్గము తొలుత సత్సంగతి యీ
వల మత్కథాలాపగుణరతు లనెను ॥హిత॥

నను గొనియాడుటయు ఘనగురు సేవ య
మనియమాదులను ననుమానించుట
ననుభవించు వారలను గని సంభావించుట సంలభ్యాలములు
నను రా గని శమదమములు నెనయుట విమలచిత్తములు
నను విచరించుటయు నివి నవవిధభక్తులని తిరుగా హరిబలికె" (అరణ్య-11)

ముక్తికోసం భక్తి అవసరమనీ, శ్రీరాముడే పరమాత్ముడనీ, అతని తెలుసుకొమ్మని హనుమంతుడు రావణునికి హితోపదేశం చేస్తాడు.

'దశముఖ సావధానమతివై యొకటివినరా ముక్తి
వెనకబ్బు హరిభక్తిగనరా దాన నిశితజ్ఞానముగల్గి మనరా జ్ఞానా
భ్యసనమునను సోహమనరా దాన నసమానభావము చేకొనరా యోరీ
దశరథాత్మజుడు ప్రకృతికంటెను పరుడు నిసరుపాలుడు విష్ణుడు
శ్రీదేవి - వసుధాపుత్రి ."

(సుందర - 8)

సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మరామాయణ కీర్తనల్లో శృంగారానికి మిక్కిలి తక్కువస్థానముంది. అయినా ఆయన కీర్తనలకు కూర్చిన పల్లవులను గమనిస్తే శృంగార రసాత్మకరచనలు చేయ సమర్థుడని, ఆయన పదాలను బట్టి గూడ ఈ విషయం స్పష్టమేనని మనకు తెలుస్తుంది. సుబ్రహ్మణ్యకవి కౌముది పదాలు ప్రకటింపబడ్డాయి. వేంకటేంద్రునిపై రచితమైన ముఖారిరాగంలోని శృంగార పదం

"మనసువచ్చితే రమ్మనవే దామరల కుమార వేంకటేంద్రుని ॥పల్లవి॥

వనితరో చెలగుచు ఒరిపిరిగతులను బహుబంధంబుల పెనగుచును నాసామిని ॥అ.ప॥

సదయుడవని మ్రొక్కి సారెకు వానిపై పదములు వినిపింతును
మదిరాక్షి నాసామి మది, దా, నడచి, దక్కి, మనవి అంతయు తెల్పుదు
మృదుపాదములు తమకమునను వాని తొడలమీద నుంచుకొందును
కుదురుగ బాగా లోనగి ఆకు మడుపును నే కోరికి సగమందింతును ॥నా సామిని॥

. . . . . . . . "

సుబ్రహ్మణ్యకవి పురుష విరహ వర్ణన మనోజ్ఞంగా చేశాడు

"చెలియ యీ విరహ వగ్గలమాగ నెట్లోర్తు - చెలిని తోడితేవే ॥పల్లవి॥

చెలగి చంద్రుడు కాయగ నెలమి మరుడేయగ
చిలకలు గూయగ అళులు రొద సేయగ. . "

ఈ పదరచనకు క్షేత్రయ్య పదరచన సన్నిహితమని రజనిగారి తీర్మానమైనా, సాహిత్యపు బరువును గమనిస్తే ఇవి అన్నమాచార్యులకే దగ్గరగా ఉన్నట్లు విదితమవుతుంది.

ఆధ్యాత్మిక చింతనా పరుడైన సుబ్రహ్మణ్య కవి వాసుదేవతత్త్వాన్ని వివరించి (1-2), వేదాంతం (1-5)లోని జీవాత్మ పరమాత్మలను (1-5) విద్యావిద్యలను (2-4, 3-3) శరీరం, మాయ (4-4), దైవం (3-10, 6-4)మొదలైన సర్వాంశాల్ని సవివరంగా చర్చించాడు ఏదీ నిత్యంగాదని నిరూపించాడు (2-4).

"జరమునశ్వరము యీ, జగము రక్షమ, తనవు సత్యమా యిది సత్యమా అట
పదభోగ ఫల మౌన్నత్యమా కలిమి పదతిచంచల సుజన స్తుత్యమా భ్రాంతి
యుడుగ కుండుట సత్కృత్యమా . . .... " (అయో-4)

వైరాగ్యం

వైరాగ్య ప్రబోధమూ ఉంది సుబ్రహ్మణ్యకవి కీర్తనల్లో.

"ఇల బుద్బుదముపలె జంచలము సంసారము క్షణ భంగురము
రోగము, పంచభూతముల
పలనై పంచవింశతి తత్వాత్మకమై జడమై పొలుపొందు బట్టి
తెలియ మాయము
ఇల నెపడు దీనియందు మమత సేయం మల మూత్రాదుల గంప
రోత కొంప హంకృతి తెంప
సలుపుకే మిటికి కలుషము సుఖాదుల నెందు చేది యది దేహము
దలుగ కట్టించుసుగు జీవునకు .. " (యుద్ధ-7)

అన్నమాచార్యులే యశోదగా శ్రీకృష్ణునిపై వాణితో సంకీర్తనలు రచించాడు అలాగే సుబ్రహ్మణ్యకవి సైతం బాల శ్రీరాముని కౌసల్య బుజ్జగించిన తీరు విదితమవుతుంది.

"చిన్నారి దొజ్జకో నన్ను గన్నవాడా నా పాపటి
పెన్నిధానమ రారా యోరి నా విన్ని
యన్న బూచి వచ్చేరారా పడుగెత్తలు
దన్న నాతో నలుగమేరా పాటపాడుప
నిన్ను లాలియూచేరాలా లాలబోసేసు
నున్ను చేతనంటపద్దు
పెన్న పెట్టేనను మ వాలా
మన్నించి పలుకు కౌసల్యకు మరులు రెట్టింప చేయు శ్రీ రాముని"
(బాల-10)

వర్ణనా వైదగ్ధ్యంలోను, అలంకారిక శైలీ విన్యాసంలోను అన్నమాచార్యులకు ఏ మాత్రం తీసిపోడు సుబ్రహ్మణ్య కవి కొన్ని ఉదాహరణలు

వర్ణనలు

బాల శ్రీరాముడు

"అల నల్లకలువ రేకుల ఛాయమేనితో
వెలగు వాని పసిడి చేల గట్టిన వాని
వెలయు నాల్గు భుజముల వాని కను గొ
ల్కొల సిరుణ రేఖలు కలవాని స్వర్ణకుం

డలలసిత గండ మండలముల వాని య
స్ఖలిత రవికోటి ప్రకాశుని రత్నో
జ్జ్వల కిరీటము వాని నళినీల కుటిల కుం
తలములచే ముద్దు గులుకు చుండెడి వాని ॥శ్రీరా॥ (బాల-9)

సీతను పెళ్ళికూతురు చేసిన తీరు

"పట్టు చీరె గటిగట్టి రవికె చను
కట్టుదిట్టముగ గట్టి మృగమదము
బొట్టు నుదుట నుంచి కనుల కాటుక
పెట్టి కురులు దువ్వి,
దట్టముగ కీల్జడి పైచి మరిన్
మట్టు మీర వేడుకచే సరములు
జుట్టి సర్వ భూషణములు మేనను
దట్టముగా బూని మొక్క చెలికేల్
బట్టి జనకుని పట్టి వారికి - పట్టంపురాణి నౌదునేనని" (బాల-14)

బంగారు జింక

"పదియారు వన్నియ బంగారు పలె దనువు
పొదల మేనిపై వెండి పువ్వుల వలె చుక్కలు
గుదిగొన మణిరుచుల గొమరారు కొమ్ములు
కొదమ రత్నములనగా గొరిసెలు దనరగ
నుదుట నీలముల పలె గగ్గాన యొప్పు మారీచుండు లేడిపై
కదలి శేష గిరీశుడగు రాఘవుడున్న పంచవటి జేరెను" (అర-6)

ఇలాగే సందర్భోచితంగా వర్ణనలు చేసి సుబ్రహ్మణ్యకవి ప్రతిభా పాండిత్యాలను ప్రకటించుకొన్నాడు

అలంకారాలు

ఉపమ

"రావణా యిటురమ్మని హుమ్మని యావాయుజుడు పిడికిట బొడుప సోలి వ్రాలి
వాపుదప్పె వాలికేల నాలపనుబాళి లేదిబో నెత్తురుల్ పదినోళ్ళ
బావి నీళ్ళెడ్చు కపిలెలో యనగా వెడలె.. . " (యుద్ధ-24)

"శ్రీమీర జనకుడు శృంగారవతియై సౌదామినీలత మాడ్కి దనరెడు
సీతా కోమలి" (దాల-16)

ఇంకా శబ్దాలంకారాలకు కొదవలేదు. పల్లవులన్నీ ప్రాసాను ప్రాణిత, యమకాములలో కూడి ఉన్నాయి అంత్య ప్రాసలతో కీర్తనలన్నీ నడిచాయి.

భాష

రచన మనోజ్ఞంగా ఉంటుంది భాష చక్కటి తెలుగులో సందర్భోచితంగా సమాసయుత రచనతో, కీర్తనలు రచించబడ్డాయి. కేవలం సంస్కృతం లోను కీర్తన రచన ఉంది సంస్కృతాంధ్ర భాషా పాండిత్య ప్రకర్షనిది వివరిస్తుంది.

అన్నమాచార్యులు సంకీర్తన రీతిని ప్రవేశపెట్టిన ప్రథమాంధ్ర వాగ్గేయ కారుడు సుబ్రహ్మణ్య కవి ఆధ్యాత్మకంగా కీర్తన రచనచేసి, 104 కీర్తనలకు 58 రాగాలను ప్రయోగించిన ప్రముఖ వాగ్గేయకారుడు సంగీత సాహిత్య రచనల్లో తన ప్రత్యేకతను నిరూపించుకొన్న ఉత్తమ వాగ్గేయకారుడు.

## 6.7 త్యాగరాజు :

ఇంతవరకు అన్నమాచార్యులకు, త్యాగరాజ పూర్వులైన వాగ్గేయకారులకు గల భేద సాదృశ్యాలను సముచితంగా పోల్చిచూడడం జరిగింది ప్రముఖ వాగ్గేయ కారులలో త్యాగరాజు ప్రాతస్మరణీయుడు. ఆ మహానుభావుని అన్నమాచార్యులతో సరిపోల్చి చూస్తే నాయీ పర్యాప్త పరిశీలనకు సమగ్రత సంపూర్ణతలు సిద్ధిస్తాయి. నాయీ తులనాత్మకాధ్యయన భవన నిర్మాణానికి పునాది అన్నమాచార్యులు కాగా, అత్యున్నత శిఖరమే త్యాగరాజు అత్యంత ప్రకాశమానమై ఆహ్లాదకర కాంతులను వెదజల్లుతూ దేదీప్యమానంగా వెలుగొందుతున్నాడు త్యాగయ్య. ఆ మహానీయుని స్మరణచేతనే, ఆదివ్య వాగ్గేయకారుని కృతుల మననం చేతనే మనం తరించగలమని నా భావన.

అన్నమాచార్యులు సన్యాసికాదు. పెద్ద సంసారి. అయినా గృహస్థాశ్రమాన్ని స్వీకరించినా త్రికరణ శుద్ధిగా దైవాంకితుడైన వాగ్గేయకారుడు. ఆధ్యాత్మ శృంగార సంకీర్తనకారుడు. త్యాగరాజు ఆముష్మికాన్నేగాని, ఐహిక సుఖాలను కోరలేదు. "నిధి చాల సుఖమో రాముని సన్నిధిసేవ సుఖమో" అని పాడి, రాముని సన్నిధినే

కాంక్షించిన మహాభక్తాగ్రేసరుడు లోకసంప్రదాయాన్ని, పెద్దలమాటను కాదనలేక కాబోలు రెండు వివాహాలు చేసుకొన్నా ఉంఛవృత్తితో నిరాడంబరంగా, నిర్లిప్తతతో జీవితం గడపిన మహాభక్తిపరేణ్యుడు అన్నమాచార్యుడు ఇద్దరు భార్యల ముద్దుల మగడు అన్నా నరులనుగాక నారాయణుని నమ్మిన భక్తి సంపన్నులు అన్నమాచార్యుడు రాజును ధిక్కరించి, కారాగార శిక్షకు గురికాగా, త్యాగరాజు రాజసత్కారాలను తిరస్కరించి అష్టకష్టాలను కొని తెచ్చుకొన్నాడు అన్నమాచార్యుడు వేలలో అధ్యాత్మ శృంగార సంకీర్తనలు రచించగా, ఎడనెడ శృంగారం సందర్భానుసారంగా కనిపించినా భక్తి ప్రధానంగా నాదోపాసన గావించిన మహనీయుడు త్యాగరాజు పద కవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ బిరుదులు అన్నమాచార్యునికున్నాయి ఆయన సంకీర్తనలకు ఆంధ్రవేదమని ప్రసిద్ధి ఉంది త్యాగరాజు కీర్తనలకు 'త్యాగబ్రహ్మోపనిషత్తు'ని ప్రఖ్యాతి ఉంది ధాతుమాతువుల్లో అంటే సంగీత సాహిత్యాల్లో తన సంకీర్తనల్లో సాహిత్యానికి ప్రాధాన్యమిచ్చినవాడు అన్నమాచార్యుడు త్యాగరాజు ధాతుమాతువుల్లో ధాతువు అంటే సంగీత రచనకె అత్యధిక ప్రాధాన్యమిచ్చి యావద్భారతంలోనే అజరామరంగా కర్ణాటక సంగీతానికి అనన్య సామాన్యమూ, అనితర సాధ్యమూ అయిన గౌరవ ప్రాభవాలను సంపాదించి పెట్టిన మహావాగ్గేయకారుడు అన్నమాచార్యులతో ఆరంభమైన సంకీర్తన త్యాగరాజుతో కృతిగా సంపూర్ణాకృతిని సంపాదించుకొంది ఈ మహావాగ్గేయకార ద్వయం మూలాన్నే సంగీత ప్రతిపత్తి ఎనలేని గౌరవాన్ని సంపాదించుకొన్న దంటే అతిశయోక్తికాదు. అత్యుక్తి అంతకంటేకాదు. స్వభావోక్తి అనడమే సహజం !

ముక్తికి భక్తి ప్రధానమని పరిపూర్ణంగా నమ్మిన భక్తాగ్రేసరుడు త్యాగరాజు. ఎంతమంది దేవతల్ని స్మరించినా శ్రీరాముడే తన నిజమైన దేవుడు పైగా తన తండ్రి రాముడు, మాతసీత.

"ఎవరని నిర్ణయించిరిరా ని
న్నెట్లారాధించిరిరా నరవరు ॥ఎవ॥

శివుడనో మాధవుడనో కమల
భవుడనో పరబ్రహ్మమనో ॥ఎవ॥

శివమంత్రమునకు 'మా' జీవము మా
ధవ మంత్రమునకు 'రా' జీవము ఈ
వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెదను
వితరణ గుణ త్యాగరాజ వినుత ని ॥స్నేహ॥ (త్యా కీ-65)

'ఇతర దైవముల వలన ఇలను సౌఖ్యమా రామ ॥ఇత॥
మత భేదము లేక సదా మదిని మరులు కొన్న తన ॥కిత॥
మనసు దెలిసి బ్రోచినను మరచినను నీవే
తనవాడన తరుణమిది త్యాగరాజ సన్నుత ॥ఇత॥ (త్యా కీ-33)

శ్రీరాముని తన నోము ఫలంగా, జీవనాధారంగా చెప్పుకోవడంలో కాదు త్యాగరాజు భక్తి పరినిష్ఠిత భావనకు నిదర్శనం. తన చూపు ప్రకాశంగా నాసికా, పరిమళంగా, జపవర్ణ రూపంగా, ప్రాణాసుమంగా భావించడంలో ఇది విస్పష్టమవుతుంది

"నా జీవాధార నా నోము ఫలమా
రాజీవలోచన రాజ రాజ శిరోమణి ॥నాజీ॥

నా చూపు ప్రకాశమా నా నాసికా పరిమళమా
నాజప వర్ణ రూపమా నాదు ప్రాణా సుమమా
త్యాగరాజ నుత ॥నాజీ॥ (త్యా కీ-266)

రామభక్తియే ముఖ్యం-రామభక్తి అనే భిక్ష యిమ్మని ప్రార్థిస్తాడు త్యాగరాజు.

"భక్తి బిచ్చమీయవే - భావుకమగు సాత్విక ॥భక్తి॥
ముక్తి కఖిల శక్తికి త్రిమూర్తుల కతి మేల్మి రామ ॥భక్తి॥

ప్రాణము లేని వానికి బంగారు పాగట్టి
అణివజ్ర భూషణ మురమందు బెట్టురీతి
జాణలకు పురాణాగమ శాస్త్రవేదజప ప్రసంగ
త్రాణగల్గి యేమి భక్త త్యాగరాజ నుత రామ ॥భక్తి॥
(త్యా కీ. - 371)

భావంలో, భక్తిలో, బహిరంతరాల అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని విశ్వసించి స్మరించినట్లే, త్యాగరాజు శ్రీరాముని స్మరించి, స్మరించి తరించాడు.

అన్నమాచార్యులు సంకీర్తన రచనలో సాహిత్యానికే ప్రాధాన్యమిచ్చినట్లు సర్వ పండిత లోకానికి తెలిసిన అంశం. త్యాగరాజు నాదోపాసకుడు. నాదోపాసనతో తన్మయుడై సిద్ధి పొందిన మహనీయుడు.

'నాద తను మనిశం శంకరం
నమామి మే మనసా శిరసా" (త్యా కీ - 271)

సద్యోజాతాది పంచవక్త్ర జ సరిగమపధనీ వర సప్తస్వర ॥నాద॥
స్వామి ఫలప్రద సప్త స్వరరాగ నిచయ సహిత ॥నాద॥
వారిహారాత్మ భూ సురపతి శరి జన్మ గణేశాది
పరిమోదు లుపాసింపరే ధర త్యాగరాజు తెలియ ॥నాద॥
(త్యా కీ. - 270)

"నీ దయచే రామ నిత్యా నందుడై తి
నాద బ్రహ్మానంద రసాకృతి గల ॥నీ ద॥ (త్యా కీ.-305)

'నాద సుధారసంబిలను నరాకృతాయె మనసా
వేద పురాణాగమ శాస్త్రాదుల కాధారమౌ ॥నాద॥ (త్యా.కీ.-272)

"నాదోపాసన చేసె శంకర నారాయణ
విధులు వెలసిరి ఓ మనసా ॥నాదో॥
వేదోద్ధరులు వేదాతీతులు
విశ్వమెల్ల నిండి యుండెడి వారలు ॥నాదో॥
మంత్రాత్ములు యంత్ర తంత్రాత్ములు మరి
మంత్రములన్నియు కిలవారలు
తంత్రీ లయ స్వరరాగ విలోలురు
త్యాగరాజ వంద్యులు స్వతంత్రులు ॥నాదో॥ (త్యా.కీ. - 274)

నవవిధ భక్తితత్వాన్ని గుర్తించి, లయపితంగా భక్తి ప్రపత్తిని నిరూపించుకొన్న మహానీయుడు శ్రీ భక్తుడు తదుపితంగా యదునందనుని అర్చించడం గమనించవచ్చు.

"గంధము పుయ్యరుగా పన్నీరు ॥గంధ॥
అందమైన యదునందనుపై
కుందరదన విరవొందగ పరిమెళ ॥గంధ॥

తిలకము దిద్దరుగా కస్తూరి తిలకము దిద్దరుగా
కలకలమను ముఖకళ గని సొక్కుచు
బలుకుల నమృతము లొలికెడు స్వామికి ॥గంధ॥

చేలము గట్టరుగా బంగరు చేలము గట్టరుగా
మాలిమితో గోపాల బాలులతో
నాలమేపిన విశాల నయనునికి ॥గంధ॥

హారతు లెత్తరుగా ముత్యాల హారతు లెత్తరుగా
నారీమణులకు వారము యౌవన
వారిక మొసగెడు వారిజాక్షునికి ॥గంధ॥

పూజలు సేయరుగా మనసార బూజలు సేయరుగా
జాజులు మరి విరిజాజులు దవనము
రాజిత త్యాగరాజ నుతునికి ॥గంధ॥" (త్యా కీ - 173)

త్యాగరాజు తన కృతులన్నిటా స్మరణం, కీర్తనం, వందనం పాదసేవనం మొదలైన నవవిధ భక్తి రీతుల్ని వెలియించి ధన్యుడయ్యాడు.

"పరిపాలయ మాం కోదండ పాణే
పావనాశ్రిత చింతామణే" (త్యా కీ - 473)

"రా రామా ఇంటిదాక రఘు
వీర సుకుమార మ్రొక్కేరా" (త్యా కీ. - 473)

"వందనము రఘునందన సేతు
బంధన భక్తచందన రామ ॥వంద॥ (త్యా కీ. - 496)

ఇంకా ద్వైతాద్వైతాలలో ఏది ముఖ్యమో గూడా ఆ భక్తుడు ఆనాడున్న వివాదాన్ని గూర్చి వివరించాడు

"ద్వైతము సుఖమా అద్వైతము సుఖమా ॥ద్వైత॥
చైతన్యమా విను సర్వసాక్షి వి
స్తారముగాను దెల్పుము నాతో ॥ద్వైత॥

గగన పవన తపన భువనాద్యవనిలో
నగధరాజ శివేంద్రాది సురలలో
భగవద్భక్తి వరాగ్రేసరులలో
బాగ రమించే త్యాగరాజార్చిత ॥ద్వైత॥ (త్యా.కీ. - 246)

ఈ సిద్ధాంతాలు వాదానికి పనికివచ్చేవే గాని సర్వప్రాణి కోటిలో సాక్షి భూత మైన చైతన్య మొక్కటే అని గమనిస్తే వాదోపవాదాల కవకాశంలేదని త్యాగరాజు నిశ్చితాభిప్రాయం

పూర్వోక్తమైనట్లు 'సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాదు తండ్రి"(త్యా కీ. 596) అని త్రికరణ శుద్ధిగా నమ్మిన భక్తవరేణ్యుడు త్యాగరాజు. ఏవేవో కర్మాను ష్ఠానాలలో నిమగ్నులై రామభక్తిని తెలుసుకోలేకపోతున్నా రీ జనులని త్యాగరాజు వాపోతున్నాడు.

"తెలియలేరు రామభక్తి మార్గమును ॥తె॥
ఇలనంతట తిరుగుచు కలవరించేరే గాని ॥తె॥

వేగలేచి నీటమునిగి భూతి పూసి
వేళ్ళ నెంచి వెలికి శ్లాఘనీయులై
బాగ పైక మార్జనలోలులై
రే గాని త్యాగరాజ వినుత ॥తె॥ (త్యా కీ - 222)

ఈ భక్తవరాగ్రగణ్యుడు తన పూర్వుడైన రామభక్తుడు రామదాసునుగూర్చి—

"కలియుగమున వరభద్రా
చలమున నెలకొన్న రామచంద్రుని పదభ
క్తులకెల్ల వరుడ నందగి
వెలసిన శ్రీరామదాసు వినుతింతు మదిన్" (I - పు 2, 3 )

ప్రహ్లాద భక్తి విజయం అని ప్రశంసించి, అంతటితో ఆగక, పురాణప్రసిద్ధ భక్తులలో శ్రీరామదాసును సైతం చేర్చి కీర్తింపడం ఎంతైనా ప్రశంసించ దగ్గ అంశం అంతేగాదు ఈ భక్తునికా భక్తునిపై ఎంతగౌరవముంటే తప్ప ఇలా తనకద్యతనపూర్వుడైన రామదాస భక్తుని ఇలా కీర్తిస్తాడు ?

"క్షీర సాగర శయన నన్ను చింతల బెట్టవలెనా రామ ॥క్షీర॥
వారణరాజును బ్రోవను వేగమె
వచ్చినది విన్నానురా రామ ॥క్షీర॥

నారీమణికి చీరలిచ్చినది నాడే నే విన్నానురా
ధీరుడౌ రామదాసుని బంధము దీర్చినది విన్నానురా
నీరజాక్షికై నీరధి దాటిన నీ కీర్తిని విన్నానురా
తారకనామ త్యాగరాజ నుత దయతో నేలుకోరా రామా ॥క్షీర॥"
(త్యా కీ - 629)

భద్రాచలం దర్శించి రామదాసు సర్వం భగవదర్పిత మొనర్చి కారాగారశిక్షకు గురియైన మహనీయుని సంస్మరించడం అంటటి మహాభక్తాగ్రేసరునికే తగును

అన్నమాచార్యులు శృంగారాధ్యాత్మ సంకీర్తనలు రచించి భగవత్పరక శృంగార విలాసాదులను వివిధ రీతుల వర్ణించి, వర్ణించి తరించాడు మధురభక్తి యుతంగా అపరనాయిక అయి ఎంతో మనోహరంగా ఆ పరమాత్మునిపై బాగిగాని విరహవేదనలను అనుభవించిన మహాభక్తుడు ఇలాగే అంతగా కాకపోయినా మధురభక్తి ప్రధానంగా నౌకాచరిత్రములో గోపికా ప్రణయమభివర్ణించాడు త్యాగ రాజు అక్కడక్కడ క్వచిత్తుగా ఆయన కృతులలోను ఈ విధ శృంగారం అవగత మవుతుంది.

"ఎన్నగ మనసుకురాని పన్నగ శాయి సొగసు
కన్నుల గనుగొనని కన్నులేలే కిన్నెర మిన్నెలేలే ॥ఎన్న॥

మోహముతో నీలవారివాహకాంతిని గేరిన
శ్రీహరిని గట్టుకొనని దేహమేలే ఈ గేహమేలే ॥ఎన్న॥

సరసిజ మల్లె తులసీ విరవాజి పారిజాత
విరులచే బూజించని కరములేలే ఈ కాపురములేలే ॥ఎన్న॥

మాలిమితో త్యాగరాజు నేలిన రామమూర్తిని
లాలించి పొగడని నాలికేలే సూత్ర మాలికేలే ॥ఎన్న॥
(I 66 త్రివేణి)

"నగుమోము గలవాని నా మనోహరుని
జగమేలు శూరుని జానకీవరుని" (II. 51 త్రివేణి)

పరమాత్మునిపై విరహంతో ఆతని పొందని తనువు తనువే కాదని నాయిక తన విరహ వ్యథను వివరిస్తుంది

"ఇందుకా యీ తనువును పెంచిన ॥దిందు॥
ఇందుముఖుడు రాక హృదయము పగులగ
సుందరిలో జాలి చెందనీయని యంద ॥మిందు॥
పాములకే మేను బలుగట్టిగా నుండ
నేనెమో కారణమని యెంచి యుంటినే ॥నిందు॥
మనకేల నెపమని మన్నించిరో లేక
తనువు వెల్లముగాదు తాళదు దైవ ॥మిందు॥
నా జయము జూచి నమ్మరె దేవుని
రానిల్లు శ్రీ త్యాగరాజ వరదుడు తా ॥నిందు॥
(అపూర్వ త్యాగరాజ కీర్తనలు - 11 పు 69)

ఇలాగా మధురభక్తి పూరిత శృంగారం త్యాగరాజులో కొద్దిగా ఉన్నట్లు స్పష్టం.

తాతదండ్రుల నుంచి తనకు సంక్రమించిన వేదాంతోపనిషత్సారమంతా త్యాగరాజులో ఫలవంతమైంది అందువల్లనే ఆయన కృతులు త్యాగబ్రహ్మోపనిషత్తుగా ప్రసిద్ధికెక్కాయి

తత్వమెరుగుట సులభంకాదని త్యాగరాజు వివరిస్తాడు

తత్త్వమెరుగ తరమా పర ॥తత్త్వ॥
తత్వమసియనే వాక్యార్థము రామనీవను పర ॥తత్త్వ॥

తామస రాజసగుణముల తన్నుకోళ్ళ బోదయా
రామ భక్తుడైన త్యాగరాజ వినుత వేదశాస్త్ర ॥తత్త్వ॥
(త్యా కీ 207)

'నిన్నాడనేల నీరజాక్ష ॥నిన్నా॥
కన్నవారిపైని కాక సేయనేల ॥నిన్నా॥

కర్మానికి తగినట్లు కార్యములునడిచేని
ధర్మానికి తగినట్లు దైవముబ్రోచేని ॥నిన్నా॥

చిత్తానికి తగినట్లు సిద్ధియుగలిగేని
విత్తానికి తగినట్లు వేడుక నడిచేని ॥నిన్నా॥

సత్యరూప నిన్ను సన్నుతిజేసి
తత్వము తెలిసిన త్యాగరాజునికి ॥నిన్నా॥
(త్యా కీ 287)

మానసబోధతో భక్తి నీతి ప్రబోధించేశాడు త్యాగరాజు.

"వాడేరా దైవము మనసా ॥వా॥
ఆడినమాటలు తప్పడనుమను
ఆచంద్రార్కముగ కీర్తి గలిగిన ॥వా॥" (త్యా. కీ - 508)

'శోభిల్లు సప్తస్వర సుందరుల భజింపవే మనసా" (త్యా కీ. - 567)

"స్వరరాగ సుధారసయుత భక్తి
స్వర్గాపవర్గమురా ఓ మనసా ॥స్వ॥
పరమానందమనే కమలముపై
బక భేకము చెలగేమి మనసా ॥స్వ॥ (త్యా కీ - 590)

అని తెలిపి భక్తిముఖ్యం, అది ముక్తికి సోపానమని వివరించాడు

అంతకంటే ప్రధానంగా మానసబోధతో సర్వమానవ మానసబోధచేసి నీత్యు పదేశం గావించాడు.

"చక్కని రాజమార్గములుండగ
సందులు దూరగనేలే ఓమనసా ॥చ॥

చిక్కని పాలు మీగడ యుండగ
చీయను గంగాసాగర మేలే ॥చ॥

కంటికి సుందరతరమగు రూపమే ము
క్కంటి నోట చెలగేనామమే త్యాగ రా
జింటనే బాగ నెలకొన్నాది దైవమే యిటు
వంటి శ్రీసాకేత రాముని భక్తియనే ॥చ॥ (త్యా. కీ. - 181)

'శాంతము లేక సౌఖ్యము లేదు సారసదళ నయన ॥శాం॥
దాంతునికైన వేదాంతునికైన ॥శాం॥

దారసుతులు ధనధాన్యము లుండిన
సారెకు జపతప సంపద గల్గిన ॥శాం॥

యాగాది కర్మములన్నియు జేసిన
భాగవతులనుచు బాగుగ పేరైన ॥శాం॥

ఆగమ శాస్త్రము లన్నియు జదివిన
బాగుగ సకల హృద్భావము దెలిసిన ॥శాం॥

రాజాధిరాజ శ్రీరాఘవ త్యాగ
రాజ వినుత సాధురక్షక తనకుప ॥శాం॥

(త్యా. కీ. - 537)

ఇలాగే నీతిబోధ నసన్య సామాన్యంగా చేసిన మహాత్ముడీ త్యాగరాజు. ఆనాటి సమాజంలోని కుళ్ళును సైతం దుయ్యబట్టిన మహనీయుడు. సోమయాజి కావడం విశేషమే, కాని సోమిదమ్మ మనసు పరులపై నుంచే నదుచింతగాదని నిష్కర్షగా నిర్ద్వంద్వంగా నిరూపించాడు మనోనిగ్రహం అత్యంతావశ్యక గుణం. దుర్మ దాంధుడై మునిగే పుణ్యనదులేమి చేయగలవు ?

"మనసునిల్ప శక్తిలేకపోతే
మధురఘంట విరుల పూజేమిజేయును ॥మ॥

ఘనదుర్మదుడై తామునిగితే
కావేరి మందాకిని యెటు బ్రోచును ॥మ॥

సోమిదమ్మ సొగసుగాండ్రగోరితే
సోమయాజి స్వర్గార్హుడౌనో
కామక్రోధుడు తపంబొనర్చితే
గాచి రక్షించునో త్యాగరాజనుత ॥చ॥ (త్యా కీ - 388)

కామక్రోధాది అరిషడ్వర్గాన్ని త్యజించి, సత్వగుణ సంపన్నుడై తేనే చేసే కర్మ కాండకు ఫలితం లేకపోతే చేసే పనులవల్ల ప్రయోజనం లేదని స్పష్టంచేశాడు

కలియుగంలో నరులకు భగవన్మహిమలు తెలిపినా ప్రయోజనంలేదని ఒక దృష్టాంతం చూపాడు త్యాగరాజు ఎంకుల రుచి ఎద్దులకేమి తెలుస్తుందంటాడు

"కలి నరులకు మహిమలు దెలిపేమి ఫలమనలేదా ॥క॥

ఇలనువెలయు పర వృషరాజుల కటు
కులరుచి తెలియు చందముగా నీ ॥క॥

దారసుతులకై ధనములకై యూరు
పేరులకై బహుపెద్దతనముకై
సారెకు భక్తివేసము కొనువారికి
తారకనామ శ్రీ త్యాగరాజార్చిత ॥క॥ (త్యా కీ 146)

ఇందులో దొంగ సన్యాసులను గూర్చి, భక్తుల వేషంలో ధనధాన్యాలు, పేరు ప్రఖ్యాతులు, అందరిలో గౌరవాన్ని పొందాలన్న ఆకాంక్షతో చేసే పెద్దమనుషుల ఎ ఎ లన్నిటినీ ఖండించాడు ఇలాగా ఎన్నో విధాలుగా నీత్యుపదేశం చేశాడు

పరమాత్ముడు సర్వాంతర్యామి, సర్వజీవాత్మకుడని నిరూపించాడు త్యాగరాజు అత్యంత సులభంగా. పరతత్వ స్వరూపనిరూపణం చేశాడు.

"పరమాత్ముడు వెలిగే ముచ్చట బాగతెలుసుకోరె ॥ప॥

హరియట హరుడట సురలట నరులట
అఖిలాండ కోటులట యందరిలో ॥ప॥

గగనానిల తేజోజల భూమయమగు
మృగఖగ నగతరుకోటులలో
సగుణములలో విగుణములలో
సతతము సాధు త్యాగరాజార్చితు డిలలో ॥ప॥(త్యా కీ 329)

పరమాత్మని సగుణ నిర్గుణత్వాన్నిగూర్చి, షణ్మాతాలు, అష్టసిద్ధుల మర్మాన్ని, వగలనుగూర్చి, వినిపించే చరిత్రలపే వారున్నారేగానీ భగవంతుని - రాముని - భజన గాన రసికులను మాత్రం చూడలేదనీ వివరించాడు త్యాగరాజు.

"నీభజనగాన రసికుల నేనెందుగానరా రామ
శ్రీభవ సరోజాసనాది శచీ మనోరమణ వంద్య ఇలలో ॥నీ॥

సగుణనిర్గుణపు నిజ దబ్బరలను
షణ్మతముల మర్మ మష్టసిద్ధుల
వగలుమూప సంతసిల్లి గంటిని
వరానన త్యాగరాజ వినుత ॥నీ॥ (త్యా కీ. 307)

ఇంతకుమించి హృదయాన్ని గూర్చి త్యాగరాజు అత్యంత మనోహరంగా ప్రబోధించాడు. అతి సామాన్య జననికి నీత్యుపదేశం చేశారు. కరుణ అంటే భగవంతుని విధమే అన్నాడు

"కరుణ ఏలాగంటే నీ విధమే కల్యాణ సుందరరామ ॥క॥

పరమాత్ముడు జీవాత్ముడు యొకడై
బరగుచుండు భక్తవరాధీనుని ॥క॥

అనృతం బాడడు అల్పుల వేడడు
సునృపుల గొలువడు సూర్యుని మరవడు ॥క॥

మాంసము ముట్టడు మధువును త్రాగడు
పరహింసల సేయడు యెరుకను మరవడు ॥క॥

మూడీషణముల వాడడు జీవ
న్ముక్తుడై తిరుగు మదమును జూపడు ॥క॥

వంచన సేయడు పరులతో బొంకడు
చంచల చిత్తుడై సౌఖ్యము విడువడు ॥క॥

సాక్షియని దెలిసి యందు లక్ష్యము విడువడు కం
జాక్షుని త్యాగరాజ రక్షకుడైన వాని ॥క॥ (త్యా.కీ. 155)

ఈ సుగుణాలను సంపాదించిన మహనీయుడు-భక్తుడు అంటే జీవాత్మ పరమాత్మగా ప్రకాశిస్తాడని త్యాగరాజు సత్య నిరూపణం పూర్వోక్తమైనట్లు ఆంధ్ర

వివాన్ని సంకీర్తనల ద్వారా అన్నమాచార్యులందించగా, త్యాగరాజు తన కృతుల ద్వారా త్యాగ బ్రహ్మోపనిషత్తుగా నిరూపించాడు

మానస బోధలో అన్నమాచార్య త్యాగరాజులలో సామ్యం గోచరిస్తుంది

అన్నమాచార్యులు

"భావములోనా బాహ్యము నందును
గోవింద గోవింద యని కొలువరో మనసా" (అధ్యా సం. 9-272)

"మాయల బొదలగ నేటికి మనసా" (అధ్యా సం. 9-115)

"పారకుమీ వో మనసా
ఎంతము విడువకుమీ మనసా" (అధ్యా సం. 2-177)

త్యాగరాజు

"చక్కని రాజ మార్గములుండగ
సందుల దూరనేల ఓ మనసా" (త్యా కీ 235)

"మనసా ఎటు లోర్తునే నా మనవి చేకొనవే" (త్యా కీ. 385)

"మనసా శ్రీరామచంద్రుని మరవకే ఏమరకే" (త్యా.కీ 387)

"మనసు నిల్ప శక్తి లేకపోతే
మధుర ఘంట విరుల పూజేమి చేయును" (త్యా.కీ. 388)

"వినవే ఓ మనసా వివరంబుగ నేదెల్పెద
మనసెరిగి కుమార్గమున మరి పోరలుచు చెడవలదె" (త్యా.కీ. 520)

ఇలాగా ఎన్నైనా సాదృశ్యాల్ని నిరూపించ వీలవుతుంది.

అన్నమాచార్యులు తన సంకీర్తన రచనలో ఒక శిల్పాన్ని సాధించారు. అది మనసు తెలుగు పలుకుబడి, నుడికారంతో సాధించాడు తేటతెలుగు దనంతో సాధించాడు కానీ త్యాగరాజు అలాంటి శిల్పరామణీయకానికై తన కృతుల్లో యత్నించలేదు. ధాతు కల్పనా దక్షుడైన ఈ మహనీయుడు తదుచితంగా తన భాషను ప్రయోగించాడు చిక్కటి పదరచన అన్నమాచార్యులలో విస్పష్టరీతిలో ఉన్నంతగా, త్యాగరాజులో ఎంచబోవడం న్యాయమే. అయినా చక్కటి కృతుల రచన గమనించగలం. త్యాగరాజు శ్రీరాముని ప్రార్థించడంలో, వేడుకోవడంలో ఆయన మోహన రూపాన్ని వర్ణించడంలో ప్రత్యేక కృతి రచనను గమనిస్తాము.

"రాకాశశివదన ఇంత పరాకా
నీకా గుణము కారా దపనీకాంతకరుణాస్వాంత ॥రా॥
నమ్మియున్న నిజదాసులకు నమ్మికల నొసగి మరతురా
తమ్మికనుల నొకపారి నను దయజూడరాదా మరియాదా ॥రా॥
పారిపారి నిన్ను నుదినము కోరికోరిన వారిని యీ
దారి బ్రోచితివా మాయాధార ! రారా ఏలుకోరా ॥రా॥
నీవే తెలిసి కొందువనుచు భావించుచును నేను నీ పద
సేవ జేసితి మహానుభావ త్యాగరాజునిపై ॥రా॥ (త్యా కీ 437)

శ్రీరామచంద్రుని సురూపాన్ని, సొగసుని చూసి, చూసి తనవి చెందని త్యాగ రాజు ఇలా వర్ణించాడు

"సొగసు జూడ తరమా నీ
నిగనిగమనుచు గపోల యుగముచే మెరయు మోము ॥సొ॥
అమరార్చిత పదయుగమో అభయ ప్రదకరయుగమో
కమనీయతనుపందితకామ కామరిపునుత నీ ॥సొ॥
వరబింబ సమాధరమో వకుళ సుమంబుల యురమో
కరధృత శరకోదండ మరకతాంగవరమైన ॥సొ॥
చిరునవ్వో ముంగురులో మరి కన్నుల తేటో
వర త్యాగరాజార్చిత వందనీయ ఇటువంటి ॥సొ॥ (త్యా.కీ 623)

ఇది శ్రీరామచంద్రుని వర్ణనకు చక్కటి ఉదాహరణ ఇలాగే

"నను బాలింప నడచి వచ్చితివో నా ప్రాణనాథ
వనజనయన మోమును జూచుట జీ
వనమని నెనరున మనసు మర్మము దెలిసి ॥న॥
సురపతి నీలమణినిభ తనువుతో
ఉరమున ముత్యపు సరుల చయముతో
కరమున శర కోదండ కాంతితో
ధరణి తనయతో త్యాగరాజార్చిత ॥న॥ (త్యా.కీ. 256)

వేదాన్ని సంకీర్తనల ద్వారా అన్నమాచార్యులందించగా, త్యాగరాజు తన కృతుల ద్వారా త్యాగ బ్రహ్మోపనిషత్తుగా నిరూపించాడు

మానస బోధలో అన్నమాచార్య త్యాగరాజులలో సామ్యం గోచరిస్తుంది

అన్నమాచార్యులు

"భావములోనా బాహ్యము నందును
గోవింద గోవింద యని కొలువరో మనసా" (అధ్యా సం. 9-272)

"మాయల దొదలగ నేటికి మనసా" (అధ్యా సం. 9-115)
పారకుమీ వో మనసా
పంతము విడువకుమీ మనసా" (అధ్యా.సం 2-177)

త్యాగరాజు

"చక్కని రాజ మార్గములుండగ
సందుల దూరనేల ఓ మనసా" (త్యా కీ 235)

'మనసా ఎటు లోర్తునే నా మనవి చే కొనవే" (త్యా కీ 385)
'మనసా శ్రీరామచంద్రుని మరవకే ఏమరకే" (త్యా కీ 387)

'మనసు నిల్ప శక్తి లేకపోతే
మధుర ఘంట విరుల పూజేమి చేయును" (త్యా.కీ 388)
"వినవే ఓ మనసా వివరంబుగ నేదెల్పెద
మనసెరిగి కుమార్గమున మరి పోరలుచ చెడవలదె" (త్యా కీ. 520)

ఇలాగా ఎన్నైనా సాదృశ్యాన్ని నిరూపించ వీలవుతుంది

అన్నమాచార్యులు తన సంకీర్తన రచనలో ఒక శిల్పాన్ని సాధించాడు. అది ఆయన తెలుగు పలుకుబడి, నుడికారంతో సాధించాడు తేటతెలుగు దనంతో సాధించాడు. కానీ త్యాగరాజు అలాంటి శిల్పరామణీయకానికై తన కృతుల్లో యత్నించలేదు. ధాతు కల్పనా దక్షుడైన ఈ మహనీయుడు తదుచితంగా తన భాషను ప్రయోగించాడు చక్కటి పదరచన అన్నమాచార్యులలో విస్పష్టరీతిలో ఉన్నంతగా, త్యాగరాజులో ఉండకపోవడం న్యాయమే. అయినా చక్కటికృతుల రచన గమనించగలం త్యాగరాజు శ్రీరాముని ప్రార్థించడంలో, వేడుకోవడంలో ఆయన మోహన రూపాన్ని వర్ణించడంలో చక్కటి కృతి రచనను గమనిస్తాము .

"రాకాశశివదన ఇంత పరాకా
నీకా గుణము కారా దపనీకాంతకరుణాస్వాంత ॥రా॥
నమ్మియున్న నిజదాసులకు నమ్మికల నొసగి మరతురా
తమ్మికనుల నొకపారి నను దయజూడరాదా మరియాదా ॥రా॥

పారిపారి నిన్ననుదినము కోరికోరిన వారిని యీ
దారి బ్రోచితివా మాయాధార ! రారా ఏలుకోరా ॥రా॥

నీవే తెలిసి కొందువనుచు భావించుచును నేను నీ పద
సేవ జేసితి మహానుభావ త్యాగరాజునిపై ॥రా॥ (త్యా.కీ 437)

శ్రీరామచంద్రుని సురూపాన్ని, సొగసుని చూసి, చూసి తనివి చెందని త్యాగరాజు ఇలా వర్ణించాడు

"సొగసు జూడ తరమా నీ
నిగనిగమనుచు గపోల యుగముచే మెరయు మోము ॥సొ॥

అమరార్చిత పదయుగమో అభయ ప్రదకరయుగమో
కమనీయతనుపందితకామ కామరిపునుత నీ ॥సొ॥

వరబింబ సమాధరమో వకుళ సుమంబుల యురమో
కరధృత శరకోదండ మరకతాంగవరమైన ॥సొ॥

చిరునవ్వో ముంగురులో మరి కన్నుల తేటో
వర త్యాగరాజార్చిత వందనీయ ఇటువంటి ॥సొ॥ (త్యా.కీ 623)

ఇది శ్రీరామచంద్రుని వర్ణనకు చక్కటి ఉదాహరణ ఇలాగే

"నను బాలింప నడచి వచ్చితివో నా ప్రాణనాథ
వనజనయన మోమును జూచుట జీ
వనమని నెనరున మనసు మర్మము దెలిసి ॥న॥

సురపతి నీలమణినిభ తనువుతో
ఉరమున ముత్యపు సరుల చయముతో
కరమున శర కోదండ కాంతితో
ధరణి తనయతో త్యాగరాజార్చిత ॥న॥ (త్యా.కీ. 256)

వీటిలో చక్కటి వర్ణనతో పాటు శబ్ద భావచిత్రాలనేకం ఉన్నాయి. తరచి పరిశీలించినకొలకీ త్యాగరాజు మనసు శ్రీరాముని తనివితీరా భావించి వర్ణించి తరించింది.

అలంకారికశైలిమీద అంతగా ఆసక్తిగాని, తత్ప్రయత్నంగాని త్యాగరాజులో కనిపించదు అన్నమాచార్యుల సంకీర్తనల్లో అత్యుత్తమ కవిని దర్శించగలము త్యాగరాజులో ధాతుకల్పనా దక్షుడైన సంగీత వేత్తను చూడగలము. అయినా అక్కడక్కడా అప్రయత్నంగా శబ్దార్థాలంకారాలు త్యాగరాజు కృతులలో కనిపిస్తాయి

అన్నమాచార్యుల వేలకొలది సంకీర్తనల్లో సుమారు పందదాకా సంస్కృతంలో సంకీర్తనలున్నాయి. అలాగే చక్కటి సంస్కృత కృతులు త్యాగరాజులోను ఉన్నాయి ఈ మహావాగ్గేయకారుల ఈ సంస్కృతరచనలవల్ల వీరి సంస్కృతాంధ్రోభయ భాషా పాండిత్య ప్రకర్ష అభిగమ్య మానమవుతుంది

"రామ ఏవ దైవతం రఘు కులతిలకో మే ॥రా॥
విగత కామమోహమదో విమల హృదయ శుభఫలదో ॥రా॥"
(II - 88 త్రివేణి)

అని అంత్య ప్రాసలతో కృతి రచితమైంది తెలుగు కృతులలో లేని ఈ అంత్య ప్రాస సంస్కృత కృతిలో ఉండడం విశేషం

ఇలాగా సంస్కృత కృతుల రచనలోను త్యాగరాజు తన పాండిత్యాన్ని ప్రకటించాడు

అన్నమాచార్యుల సంకీర్తనల్లో జానపద గేయరీతులున్నట్లే త్యాగరాజు కృతులలోను ఉన్నాయి స్వామి మేలుకొలుపుతో ప్రారంభమై పవ్వళింపు సేవ వరకు ఈ రీతి కొనసాగుతుంది. త్యాగరాజు ఉత్సవసంప్రదాయ కీర్తనల్లో ఇవి విదితమవుతాయి. మచ్చుకు ఒకటి రెండు మాత్రం .

ఇతని లాలిపాట అంత్య ప్రాసలతో లలిత మనోహరంగా సాగింది

"లాలి లాలీయని యూచేరా వన
మాలి మాలిమితో జూచేరా ॥లా॥

దేవదేవయని పిలిచేరా మహాను
భావ భావముల దలచేరా ॥లా॥

రామరామ యని పలికేరా ని
ష్కామ కామరిపునుత రారా ॥లా॥

కోరికోరి నిను గొలిచేరా మాయా
దూర దారి సద్భజనేరా ॥లా॥

రాజరాజ యని పొగడేరా త్యాగ
రాజరాజ యని మ్రొక్కేరా" ॥లా॥

(త్యా కీ ఉ. సం కీ - 13)

మంగళంతో ముగించడం ముదావహ విషయం

'మా రామచంద్రునికి మంగళం ॥మా॥
ఘోరభవనీరనిధి తారకునికి మంగళం ॥మా॥

మారుని గన్న రాజకుమారునికి మంగళం
మారులేని హరికి ముమ్మారు జయమంగళం ॥మా॥

(త్యా కీ ఉ సం. కీ 28)

ఇలాగా త్యాగరాజు మహావాగ్గేయకారసత్తముడై ధాతుకల్పనాదక్షుడై అత్యంత మనోహరమైన కృతి రచనచేసి, సంగీతవేత్తలలో 'నభూతో నభవిష్యతి' అన్నట్లు నిరూపించుకొన్నాడు అన్నమాచార్యులతో కొన్ని పోలికలతో పాటు, స్వతంత్ర మైన లక్షణాలు కలిగి ఉన్నట్లు పై పరిశీలనవల్ల విదితమవుతుంది ఆయినా ఎంత చెప్పినా ఇంకా చెప్పవలసిందే ఉంటుంది అందుకు త్యాగరాజే ప్రమాణం!

"సొగసుగా మృదంగతాళము జతగూర్చి నిను
సొక్కజేయు ధీరుడెవ్వడో ॥సొ॥

నిగమశిరోర్థము గల్గిన నిజవాక్కులతో స్వరశుద్ధముతో ॥సొ॥

యతివిశ్రమ సద్భక్తి విరతి ద్రాక్షారస నవరస
యుతకృతిచే భజియించే
యుక్తి త్యాగరాజుని తరమా శ్రీరామ ॥సొ॥" (త్యా కీ - 622)

తెలుగులో వెలసిన ప్రముఖ వాగ్గేయకారుల, అన్నమాచార్యుల తులనాత్మక అధ్యయనమిది ఆయా వాగ్గేయకారుల జీవితాల్లోని అంశాలు వారి వారి రచనల్లో

ఎలా ప్రతిబింబింపాయో విదితమవుతుంది ఈ తులనాత్మక అధ్యయనంవల్ల. అన్నమాచార్యులు నిష్కామకర్మతో శ్రీ వేంకటేశ్వరునికే జీవితం అంకితంచేసి దినానికి ఒక సంకీర్తనం పాడ్వన రచిస్తూ భక్తుడై, ప్రథమవాగ్గేయకారుడై, నీతి వైరాగ్య ప్రబోధకుడై, శ్రీ వైష్ణవ మతానికి పట్టుగొమ్మై ప్రకాశించిన వాగ్గేయకార ప్రథమార వాగ్గేయకారునిగా మనం గుర్తించకపోయినా ప్రార్థనాపూర్వక వచన రచనా ప్రారంభకుడు శ్రీ వైష్ణవ భక్తుడు కృష్ణమాచార్యులు. అన్నమాచార్యుల తరువాత తండ్రి, తాతల మార్గములో ఆతని కుమారుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు జీవితాలను శ్రీ వేంకటేశ్వరస్వామికే అంకితం చేసుకొన్న పదకర్తలు క్షేత్రయ్య మువ్వగోపాలాంకితంగా శృంగార పదరచన చేసి సంగీత సాహిత్యాలకు సమాన గౌరవమిచ్చి, అభినయం జోడించిన మహా వాగ్గేయకార సత్తముడు రామదాసు భజనసంకీర్తన రీతికి తుష్టిని పుష్టిని ఇచ్చిన భక్తవాగ్గేయకారుడు. సారంగపాణి రాజాశ్రయంలో ఉన్నా భక్తి ప్రపత్తుల్ని, నీతి వైరాగ్యాలను - కొంత లౌకికమే అయినా - ప్రజలకు మరీ దగ్గరగా వెళ్ళి రచించిన వాగ్గేయకారుడు. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి ఆధ్యాత్మ రామాయణాన్ని కీర్తనలుగా రచించినా, వాగ్గేయకారుడుగా తన స్థలను నిలబెట్టుకొన్నాడు. త్యాగరాజు నాదోపాసనపైన ధాతుకల్పనాదక్షుడు ఇతని కృతులలో సంగీతానికి ప్రాధాన్యం హెచ్చి సాహిత్యపు బరువు తగ్గింది సంగీత శాస్త్రవేత్తలు తమకు ఓపినంతగా సంగీత ప్రపంచంలో సంగతుల విషయంగా విహరించడానికి అత్యంతామూల్యసేవచేసిన మహా వాగ్గేయకార చక్రవర్తి త్యాగరాజు

వీరందరిలోను 'భక్తి, నీతి, వైరాగ్యాలు, జీవితపువిలువలు సమస్తమూ సామాన్య జనప్రయోజనార్థమేనన్న విషయం స్పష్టమవుతుంది. వీరందరిలోను సామాన్య జనసముద్ధరణమే ధ్యేయమని తెలుస్తుంది పద్యకవులలో లేని సరళత, అందరికీ అందుబాటులో ఉండేరీతి విదితమవుతుంది పదకవుల రచనల్లో. పైపెచ్చు గేయరీతి ప్రజలందరికి సన్నిహితంగా ఉండే అవకాశం లభించింది. ఇదే మనం ప్రముఖంగా ప్రశంసించదగ్గ అంశం

# 7.0 భావసామ్యం :

ఒకే భాషలోని కవుల గూర్చిన తులనాత్మక అధ్యయన మొకరీతి వేర్వేరు భాషల్లో కవులను, రచనలనుగూర్చిన తులనాత్మక అధ్యయనం మరొక పద్ధతి మొదటి దానికి ఒక భాషా జ్ఞానముంటేచాలు. కానీ రెండో దానిలో వివిధ భాషలలో పరిపూర్ణ జ్ఞానముంటే మంచిదె కానీ, కనీసం ఒక భాషావేత్తకు తదితర భాషల్లో ప్రవేశమున్నాచాలు. ఈ తులనాత్మక అధ్యయనం సుందరతమవుతుంది. దాని వల్ల సత్ఫలితాలు ఉంటాయి. ఆ యా భాషల్లోని సామ్యవైషమ్యాలు విదితమవుతాయి భారతీయ భాషల్లో భక్తి సాహిత్యం అనంతమైంది భక్తికి, భక్తితత్వానికి భారతదేశం పుట్టిల్లు అనాది నుంచి దక్షిణదేశంలోను, ఉత్తరభారతంలోను భక్తిభావ బీజాలు మొలకెత్తి, మొక్కలై, వృక్షాలయ్యాయి దక్షిణ భారతంలోని తమిళనాడులో ఆళ్వారులు, కన్నడదేశం పురందరదాసాదులు, తెలుగుసీమలో అన్నమాచార్యులు తదితర ప్రముఖ వాగ్గేయకారులు ఎందరో వెలసి భక్తి ప్రవృత్తుల్ని ప్రకటించారు పైగా వీరందరూ పద్యాన్నిగాక పదాన్ని - గీతి ప్రాధాన్యం గల గేయాన్ని - స్వీకరించి తమ పాటల ద్వారా సామాన్య జనసముదాయానికి భక్తి మార్గం చూపించారు. భక్తితోపాటు, నీతి, వైరాగ్య జ్ఞానం మొదలైన అంశాల్ని ప్రబోధించారు ముక్తికి మార్గోపదేశం చేశారు ముక్తిలభించినా, లభించకపోయినా, ప్రజలందరికీ తెలిసేభాషలో అవసరమైన ఆయా భావాల్ని ప్రకటించారు

7.1 మనదేశంలో ఏ అంశాన్ని గురించి వివరించాలన్నా సంస్కృతానికే ప్రథమ గౌరవం అదేరీతిలో ఈ భక్త కవులలో అందరూ - పదకర్తలు, వాగ్గేయకారులు అయిన వారిసాహిత్య చర్చా సమయంలోను తప్పకుండ సంస్కృత సాహిత్యాన్ని స్పృశించకుండా ఉండలేము. సంస్కృత సాహిత్యంలోని ప్రప్రథమ గీతి కావ్యకర్త జయదేవుడు. అభినయాని కనుగుణంగా రాగ తాళాలతో ఈ కావ్యరచన చేసి తరించిన మహనీయుడు అలాగే లీలాశుకుడు శ్రీ కృష్ణకర్ణామృత కర్త ఇది గీతి కావ్యంకాదు శ్లోకాలే అయినా సంగీత సభలలో ఈ మహనీయుని శ్లోకాలాలపించని సంగీత వేత్తలులేరు ఇందులోను బాలకృష్ణ భక్తి పరిపూర్ణంగా ఉంది సంస్కృతంలోని మరోవాగ్గేయకారుడు ఆంధ్రుడైన నారాయణ తీర్థులు. ఇతని శ్రీకృష్ణ లీలా తరంగిణి భక్తి రసతరంగిణి.

ఆధునిక భారతీయ భాషల్లో, మరాఠీ, బెంగాలీ హిందీ భాషలు ప్రముఖమైనవి అందలి మహాభక్తకవులు నామదేవ, జ్ఞానదేవ, వల్లభ, చైతన్య, సూర, మీరా ప్రభృతి మహాభక్త బృందం అత్యంత వందనీయులు

దక్షిణదేశంలో పన్నిద్దరాళ్వారులు, పురందర, కనకదాసాదులు భక్తి సామ్రాజ్యంలో అత్యున్నత శిఖరాలనధిరోహించిన మహాభాగులు. భక్తవరేణ్యులు

ఈ భక్త కవులందరూ భారతీయ భాషలలో రచనలు చేసిన పదకర్తలు తెలుగులో వెలసిన వాగ్గేయకారులు అన్నమాచార్యాదులు

7.2 అన్నమాచార్యులు పదకవితా పితామహుడు. సంకీర్తనాచార్యుడు అతనికి ముందటి మహాభక్తవరేణ్యుడు కృష్ణమాచార్యులు అన్నమాచార్యుల తదనంతరం అతని పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, పౌత్రుడు చిన తిరుమలాచార్యుడు ఆ మార్గంలోనే పయనించి పదకర్తలై భక్తి ప్రపత్తులను వెలయించిన మహనీయులు. తన పూర్వ వాగ్గేయకారులు కంటె విశిష్టమైన శృంగార పదరచనా ధురీణుడు క్షేత్రయ్య తన మువ్వగోపాల పదాల్లో సంగీత సాహిత్యాలకు సమ ప్రాధాన్యమిచ్చి అభినయం జోడించిన పదకవితా చక్రవర్తి అన్నమాచార్యుల శృంగార పదాలకు ఎంతో వైశిష్ట్యం కొనితెచ్చిన మధురభక్తి పరతంత్రుడు క్షేత్రయ్య. అదే రీతిని అన్నమాచార్యుని అధ్యాత్మ సంకీర్తనలలోని భక్తి, నీతి, వైరాగ్యాలను, భజన సంకీర్తన రీతిని తన కీర్తనల్లో మార్రోగించిన భక్తశ్రేష్ఠుడు రామదాసు. పదాలు, కీర్తనలతోపాటు, దేశీయ జాతీయ పదరచనచేసి తన విశిష్టతను నిలవెట్టుకొన్న పదకర్త సారంగపాణి ప్రజలకు సన్నిహితంగా రచనచేసిన ప్రజాకవి. అధ్యాత్మ రామాయణ కథను స్వీకరించి ఆఖ్యానరీతిలో 104 కీర్తనలు రచించి ఆధ్యాత్మికతను, వేదాంతాన్ని, భక్తితత్వాన్ని ప్రకటించిన మహాభక్తుడు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి. ఈ వాగ్గేయకారులందరిలో విశిష్ట నాదోపాసనాపరతంత్రుడు, మహాభక్తుడు, ధాతుకల్పనాదక్షుడు త్యాగరాజు పూర్వోక్తమైనట్లు భక్తకవులు అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారుల తులనాత్మక అధ్యయన భవనానికి మూలవిరాట్టు మహావాగ్గేయకార సత్తముడు అన్నమాచార్యులు. వీరందరి తులనాత్మక అధ్యయనమే ఇంతవరకు చేసిన ప్రయత్నం

భారతదేశం భక్తికి పుట్టిల్లన్న అంశం సర్వోక్తం. అందునా మనమీ తులనాత్మక అధ్యయనం సమీక్షిస్తే మనదేశమందలి భక్తితత్త్వమెలా ప్రారంభమై వికాసం పొందిందో విదితమై అవగాహనకు వస్తుంది. క్రీస్తుశకారంభంలోనే భక్తిభావ బీజాలు ఉన్నా, అవి మొలకెత్తి క్రమంగా వికసిస్తూ వచ్చినా 11, 12 శ లలో భక్తి బీజాలు పునః ప్రత్యేకమై, 13 శ లో మొలకెత్తి 14, 15 శ లలో మహావృక్షాలై ఫలవంతమైనట్లు మనం గ్రహించగలిగాము. అందునా భారతదేశమంతటా కృష్ణ భక్తి పాయి పాయలుగా ఒకింత సుమధురమంజుల మనోజ్ఞభావ పూరితమై క్రమశః సంపన్నమై గీతిసాహిత్యరీతిలో ప్రజల హృదయకుహరాలలోకి చొచ్చుకొనిపోయి, ఆనంద సందోహంతోపాటు భక్తి భావం వెల్లివిరిసి సమస్త ప్రజలను సమైక్యపరచగలిగిందని చెప్పడంలో ఎంతైనా వాస్తవముంది. ఆ భక్తి ముక్తికి సోపానమైంది.

ఆళ్వారుల భక్తి ప్రపత్తి దక్షిణ దేశంలో ప్రారంభమై శంకరుల అద్వైత మతంతో వికాసం పొందింది. 12వ శ లో రామానుజాచార్యుల విశిష్టాద్వైతం అత్యున్నత శిఖరాల నధిరోహించింది. ఇదే సందర్భంలో కర్ణాటక దేశంలో మధ్వాచార్యుల ద్వైతం ప్రాముఖ్యానికి వచ్చింది. అలాగే బెంగాల్‌లో జయదేవుని రాధాకృష్ణ భక్తి ప్రాముఖ్యం వహించింది.

రామానుజ మతానుసారంగా వచనాలు రచించిన మహావిష్ణు భక్తుడు కృష్ణమాచార్యులు. కానీ ఈ సందర్భంలో అత్యున్నత ప్రాముఖ్యానికి వచ్చిన మహాభక్తాగ్రేసరుడు, వాగ్గేయకారుడు అన్నమాచార్యులు. వాస్తవానికి అన్నమాచార్యులు పద్య రచనా ప్రాముఖ్యమున్న కాలంలో అందే పద్యం రాజ్యం చేస్తున్నరోజులలో జన్మించినా, సామాన్య ప్రజాసముదాయాన్ని జాగృతం చేయడానికి, భక్తి ప్రాధాన్యాన్ని వాటి ప్రజలకు తరణోపాయం చూపించడానికి సంకీర్తన రచనచేసి ప్రజాకవిగా నిరూపించుకొన్నవాడు. ఒకప్రక్క పోతన భాగవత భక్తి సైతం వ్యాపిస్తున్న సమయమది. అన్నమాచార్యులకు సాన్నిహిత్యంగలవారైన జ్ఞానదేవ నామదేవాదులు, అంతకంటే ముందటి వారైన జయదేవ లీలాశుకులు ఉత్తర భారతంలోను, సమకాలికులైన

కర్ణాటక దాససాహిత్యకారులైన పురందర దాసాదులు, కాస్త తదనంతర కాలికులైన వల్లభ, చైతన్య, సూర, మీరా మొదలైన మహాభక్తాగ్రేసరులు అత్యంతము కృష్ణ భక్తిని ప్రచారం చేశారు

ఆంధ్రలో అన్నమాచార్యులను పోలిన వాగ్గేయకారులు పెద తిరుమలాచార్యులు, చిన తిరుమలాచార్యులు, క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి, సుబ్రహ్మణ్య కవి, రామదాసు, త్యాగరాజు మొదలైన మహానుభావులన్న అంశం సువిదితమే

వీరందరిలో భక్తి, మధురభక్తి, శృంగారం, ఆధ్యాత్మికత, నీతి, వైరాగ్యాల ప్రబోధం సమానమై ఒప్పుతున్న అంశం వ్యక్తమైంది అందరు భక్త కవుల లక్ష్య మొక్కటే సమస్త మానవాళిని పామరుడు మొదలు పండితుని వరకు ఒక త్రాటిపైని నడిపించడమే ధ్యేయం. అందరిని సమైక్యపరచి విశాలభారతావనిని ఏకంచేయడమే వారందరి పదాల రచనా సారాంశం అదే మన మీ తులనాత్మక అధ్యయనంలో చవిచూశాము ఆయా వాగ్గేయకారుల, పదకర్తల మతాలలో కించిద్భేదముండవచ్చు గాక. కానీ ధ్యేయమొక్కటే సమైక్యం, సమభావం, చివరికి ముక్తి ఇందు భిన్నత్వంలోని ఏకత్వాన్ని గుర్తించాము

7.3 సంస్కృతంలో రచించబడినా, ఆధునిక భారతీయ భాషల్లో రచితమైనా, దాక్షిణాత్య భాషలైన తమిళ, కన్నడ, తెలుగు భాషల్లో రచితమైనా ఆ మహనీయు లందరిలోని భావమొక్కటే. భావన ఒక్కటే. భక్తి ఒక్కటే

ఆవులెన్నిరకాలైనా పాల వర్ణమొక్కటే. పూవులెన్ని విధాలైనా పూజ ఒక్కటే. భాషలువేరైనా భావమొక్కటే. భావనఒక్కటే. అందలి భక్తి ఒక్కటే ఆ మహాభక్తకవులందరూ ప్రబోధించిన భక్తి ఒక్కటే ఆమహనీయులందరూ వందనీయులు

"పని తొడవులు వేరు బంగార మొక్కటి
పరగ ఘటలువేరు ప్రాణమొకటి
అరయ తిండ్లువేరు యాకటి యొక్కటి
విశ్వదాభిరామ వినురవేమ"

"పసుల వన్నె వేఱు పాలేకవర్ణమౌ
పుష్పజాతివేరు పూజ యొకటి
దర్శనంబువేరు దైవంబు యొక్కటి
విశ్వదాభిరామ వినురవేమ"

"ఆరు రుచులు వేరు సారంబు యొక్కటి
సత్యనిష్ఠ వేరు సత్యమొకటి
పరమ ఋషులు వేరు భావ్యుండు యొక్కడు
విశ్వదాభిరామ వినురవేమ"

(వేమన పద్యాలు 190, 189, 122)

వివిధ విషయ వివరణాత్మకమై, పర్యాప్తమైన ఈ తులనాత్మక అధ్యయనానికి కేంద్ర బిందువు, మూలవిరాట్టు అయిన పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అయిన అన్నమాచార్యులు పిపీలికాది బ్రహ్మపర్యంతమూ అంతా ఒకటేనని ముక్తసరిగా ప్రబోధించిన ఆధ్యాత్మ సంకీర్తనమే సమస్తమందలి సమానత్వాన్ని నిరూపిస్తుంది

"తందనాన అహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥పల్లవి॥

బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె పర
బ్రహ్మమొకటే పరబ్రహ్మమొకటే ॥తంద॥

కందువగు హీనాధికములిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకుల మింతా నొకటే
అందరికి శ్రీహరె అంతరాత్మ ॥తంద॥

నిండారరాజు నిద్రించు నిద్రయునొకటే
అండనే బంటు నిద్రదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే
చండాలుడుండేటి సరిభూమి యొకటే ॥తంద॥

అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు

అనుగు దేవతలకును అల కామ సుఖమొకటే
ఘనకీటపశువులకు కామ సుఖమొకటే
దిన మహోరాత్రములు తెగి ధనాఢ్యున కొకటే
వొనర నిరుపేదకును వొక్కటే అవియు ॥తంద॥

కొరలి శిష్టాన్నములు గొను నాక లొకటే
తిరుగు దుష్టాన్నములు దిను నాక లొకటే
పరగ దుర్గంధములపై వాయువు నొకటే
వరుసఁ బరిమళముపై వాయువు నొకటే ॥తంద॥

కడగి యేనుగుమీద గాయు నెండొకటే
పుడమి శునకము మీదఁ బొలయు నెండొకటే
కడు పుణ్యులను పాపకర్ములను సరి గావ
జడియు శ్రీవేంకటేశ్వరు నామమొకటే ॥తంద॥"

(అధ్యా. సం. 2 - 388)

# ఉపయుక్త గ్రంథాలు :


| | |
|---|---|
| అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి | సారస్వతాలోకము 1978 |
| ,, ,, | క్షేత్రయ్య పద సాహిత్యము,<br>సాహిత్యోపన్యాసములు-3 1963 |
| అన్నమాచార్యులు, తాళ్ళపాక | అధ్యాత్మ సంకీర్తనలు, సం 5. 1950<br>(సం) వేటూరి ప్రభాకరశాస్త్రి |
| ,, ,, | అధ్యాత్మ సంకీర్తనలు, సం 6. 1951<br>(సం) ఏము శ్రీనివాసాచార్యులు |
| ,, ,, | అధ్యాత్మ సంకీర్తనలు, సం 7. 1951<br>సం) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.<br>ఏ వి శ్రీనివాసాచార్యులు |
| ,, ,, | అధ్యాత్మ సంకీర్తనలు, సం 8. 1952<br>(సం) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ. |
| ,, ,, | అధ్యాత్మ సంకీర్తనలు, సం. 9 1952<br>(సం) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ |
| ,, ,, | అధ్యాత్మ సంకీర్తనలు, సం 10. 1952<br>(సం) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ |
| ,, ,, | అధ్యాత్మ సంకీర్తనలు, సం 11. 1952<br>(సం) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ |
| ,, ,, | అధ్యాత్మ సంకీర్తనలు, సం 1. 1980<br>(సం) గౌరిపెద్ది రామసుబ్బశర్మ |
| ,, ,, | అధ్యాత్మ సంకీర్తనలు, సం 2. 1981<br>(సం) గౌరిపెద్ది రామసుబ్బశర్మ |
| ,, ,, | అధ్యాత్మ సంకీర్తనలు, సం. 3. 1986 |
| ,, ,, | అన్నమాచార్యుల సంకీర్తనలు, 1977 |
| (కూర్పు) | కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి |

| | |
|---|---|
| అన్నమాచార్యులు, తాళ్ళపాక ద్వి ము (కూర్పు) . | అన్నమాచార్యుల సంకీర్తనలు, 1982, కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి |
| ,, ,, | అన్నమాచార్య సంకీర్తనలు, 1951 (సం) యు శ్రీనివాసాచార్యులు |
| ,, ,, | శృంగార సంకీర్తనలు, సం 3. |
| ,, ,, | శృంగార సంకీర్తనలు, సం. 4. 1947 (సం). వేటూరి ప్రభాకరశాస్త్రి |
| ,, ,, | శృంగార సంకీర్తనలు, సం 12. 1976 (సం) గౌరిపెద్ది రామసుబ్బశర్మ |
| ,, ,, | శృంగార సంకీర్తనలు, సం 13. 1960 (సం) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ |
| ,, ,, | శృంగార సంకీర్తనలు, సం 18. 1964 (సం) సి టి. జగన్నాధరావు |
| ,, ,, | శృంగార సంకీర్తనలు, సం 20. 1970 (సం) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ |
| , ,, | శృంగార సంకీర్తనలు, సం 22. 1975 (సం) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, గౌరిపెద్ది రామసుబ్బశర్మ |
| ,, ,, | శృంగార సంకీర్తనలు (సం) గౌరిపెద్ది రామసుబ్బశర్మ సం 24 . 1977. సం 25 1977, సం. 26 1979. సం. 27 1979, సం 28 1980. సం 29 1980, సం 30 1983. సం 31 . 1984 |

| | |
|---|---|
| అప్పణాచార్య, కె.<br>సుదర్శన్ భట్టాచార్య,<br>వేదవ్యాస శ్రీరంగరాజు | శ్రీవ్యాసరాయలు, 1980 |
| ,, ,, | భక్త పురందరదాసు, 1980 |
| అప్పారావు, గంధం | వేమన సర్వజ్ఞులు |
| అప్పారావు, పి ఎస్. ఆర్ | నాట్యశాస్త్రము 1959 |
| అప్పారావు, విస్సా | వ్యాసావళి, 1956 |
| అశ్వత్థ నారాయణ, షట్టమరాజు<br>సుందరం, ఆర్వీయస్. (సం) | రాళ్ళపల్లి పీఠికలు, 1979 |
| ఆనందమూర్తి, వేటూరి | తాళ్ళపాక కవులకృతులు<br>వివిధ సాహితీ ప్రక్రియలు. 1974 |
| ,, ,, | తాళ్ళపాక కవుల పదకవితలు - భాషాప్రయోగ<br>విశేషములు. 1976 |
| ,, ,, | వైష్ణవాంధ్ర వాఙ్మయము. 1986 |
| ఆరుద్ర | సమగ్రాంధ్ర సాహిత్యం సం॥ 1967 |
| కృష్ణమాచార్య | సింహగిరి వచనములు 1980<br>(సం) డా॥ ఎమ్ కులశేఖరరావు |
| కృష్ణారావు, వైద్యుల | శ్రీజయదేవుని గీతగోవిందము 1985 |
| క్షేత్రయ్య | క్షేత్రయ్య పదములు 1951<br>వావిళ్ళ ప్రచురణ |
| ,, | క్షేత్రయ్య పదములు 1963<br>(సం) విస్సా అప్పారావు |
| ,, | క్షేత్రయ్య పదములు 1952<br>(సం) గిడుగు సీతాపతి |
| ,, | క్షేత్రయ్య పదములు 1966<br>(సం) శ్రీనివాస చక్రవర్తి |

| | |
|---|---|
| గంగప్ప, ఎస్ | క్షేత్రయ్య పదసాహిత్యం 1974 |
| ,, ,, | సారంగపాణి పదసాహిత్యం 1980 |
| ,, ,, | జాతికి ప్రతిబింబం జానపద సాహిత్యం 1984 |
| ,, ,, | తెలుగులో పదకవిత 1983 |
| , ,, | తెలుగు వాగ్గేయకారులు 1980 |
| ,, ,, | పదకవితా పితామహుడు 1986 |
| గోపాలకృష్ణయ్య, వడ్లమూడి | (సం) శృంగార పదములు 1972 |
| చిన తిరుమలాచార్యుడు, తాళ్ళపాక | అధ్యాత్మ శృంగార సంకీర్తనలు సం 16 1962 (సం) ఏ వి శ్రీనివాసాచార్యులు |
| చిన తిరువెంగళనాథుడు, తాళ్ళపాక | శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవితచరిత్రము |
| పరిష్కర్త | వేటూరి ప్రభాకరశాస్త్రి (సం ) గౌరిపెద్ది రామసుబ్బశర్మ తృతీయముద్రణ - 1978 |
| జగన్నాథరావు, మంచాళ | (సం) రామదాసు కీర్తనలు 1975 |
| ,, ,, | అధ్యాత్మ రామాయణ కీర్తనలు 1962 |
| జగన్నాథస్వామి, పారనంది | విమర్శక వ్యాసావళి 1954 |
| జోగారావు, యస్వీ. | ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర 1961 |
| తూము నరసింహదాసు కీర్తనలు | కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, 1954 |
| తెలుగులో పదకవిత | ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ 1973 |
| త్యాగరాజ కీర్తనలు | (సం). టి. వి సుబ్బారావు 1964 |
| నరసింహాచార్యులు. డి టి యస్ | 1983 |

తెలుగు విజ్ఞాన సర్వస్వము-తెలుగు సంస్కృతి. సం 4. తెలుగు భాషాసమితి

నాగయ్య, ఎస్ శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యోత్సవము 1958

పురందరోపనిషత్తు (తెలుగు అనువాదం) సూర్యనారాయణ, పక్కలంక 1984

పెద తిరుమలాచార్యులు, తాళ్ళపాక శృంగార సంకీర్తనలు, సం 23. 1976 (పరిష్కర్త) పి. టి. జగన్నాథరావు

ప్రభాకరశాస్త్రి, వేటూరి సింహావలోకనము

ప్రమీలాదేవి, మంగళగిరి అన్నమాచార్య సంకీర్తనల్లోని జానపదగేయ సంగీత ఛందోరీతులు-(థీసిస్-అముద్రితం)

" " భారతీయకళాతరంగిణి 1982

బాలకృష్ణారెడ్డి, ఎడ్ల జానపద పారమార్థిక గేయసాహిత్యం 1986

" " . విష్ణుభక్తి తత్పరుడు-విప్రనారాయణ 1985

భద్రాచల రామదాసు చరిత్ర సి వి కృష్ణాబుక్ డిపో

" " ఎన్ వి గోపాల్ అండ్ కంపెనీ 1979

భీమ్‌సేన్ నిర్మల్ తెలుగు - ఉత్తర భారత సాహిత్యాలు 1975

రంగనాథాచార్యులు కె కె (సం.) తెలుగులో తొలి సమాజకవులు 1983

రజనీకాంతరావు, బాలాంత్రపు ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము 1975

రమణయ్య, సి తాళ్ళపాక చిన్నన్నకృతులు - సవిమర్శక పరిశీలనము 1984

రాజశేషగిరిరావు, కర్ణ వ్యాసమంజరి 1983

రాధాకృష్ణశర్మ, చల్లా : తెలుగు దాక్షిణాత్య సాహిత్యాలు 1975

" " . (అను)తరతరాల తమిళకవిత 1976

రామకృష్ణ, నటరాజ క్షేత్రయ్య పదములు - అభినయము 1974

రామకృష్ణశర్మ, గడియారం . దక్షిణ భారతసాహిత్య చరిత్ర

రామకృష్ణయ్య, కోరాడ దక్షిణదేశ భాషా సారస్వతములు-దేశి 1949

లక్ష్మీకాంతం, పింగళి · ఆంధ్ర సాహిత్యచరిత్ర

వరదాచార్యులు, ధనకుధరం . ఆళ్వారులు - దివ్య ప్రబంధములు 1970

" " . శ్రీ రామానుజ కీర్తి కౌముది 1981

| | |
|---|---|
| ఎలువరిత్ర - సంగీత సాహిత్యము | ఆం ప్ర.సా అకాడమీ 1974 |
| వీరభద్రశాస్త్రి, కల్లూరి | (వ్యాఖ్యాత) త్యాగరాజకీర్తనలు 1948 |
| ,, ,, | త్యాగరాజ కీర్తనలు, విశేష వివరణము ప్ర సం. 1975 |
| ,, ,, | త్యాగరాజకీర్తనలు, ద్వి సం 1978 |
| వెంకటేశ్వర్లు, పుల్లాభొట్ల | భక్తకవి పుంగవులు 1981 |
| వేంకట నారాయణాచార్యులు | గాంధర్వ వేదామృతం 1957 |
| శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితచరిత్ర 1975 | |
| శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు (సం) | వేటూరి ప్రభాకరశాస్త్రి 1981 |
| సంగమేశం, మున్నూరి | అన్నమాచార్య సాహితీ కౌముది 1981 |
| శమంతకమణి, ఎస్ | త్యాగరాజు కవిత్వము, 1988 |
| సర్వోత్తమరావు, కె | అన్నమయ్య హనుమత్సంకీర్తనలు 1982 |
| ,, ,, | అన్నమయ్య - శ్రీపాదరాయలు |
| | అన్నమయ్య - పురందరదాసు 1982 |
| ,, ,, | అన్నమయ్య - త్యాగయ్య 1983 |
| సాంబశివరావు, గుమ్మా | అన్నమాచార్య సంకీర్తనములలోని వర్ణనలు1990 |
| సారంగపాణి పదములు | రాజమండ్రి 1963 |
| సాహిత్యోపన్యాసములు - 13 | ఆం ప్ర సా. అకాడమీ 1977 |
| సాహిత్యోపన్యాసములు - 16 | ,, 1980 |
| సుందరం, ఆర్వీయస్ | తెలుగు సాహిత్యంలో దేశికగీత 1970 |
| ,, ,, | కన్నడ సాహిత్యచరిత్ర 1977 |
| ,, ,, (సం). | అనంతరాగం 1977 |
| సుబ్బరామ దీక్షితులు | సంగీత సంప్రదాయ ప్రదర్శిని 1975 |
| సుబ్రహ్మణ్యకవి, మునిపల్లె | అధ్యాత్మ రామాయణ కీర్తనలు 1969 |
| హనుమచ్ఛాస్త్రి, ఎ.మూ.వి.కుల | హిందీసాహిత్యం, 1956 |
| హనుమచ్ఛాస్త్రి, జానమద్ది | కస్తూరి (కన్నడసాహిత్య సౌరభం) 1983 |
| హరిహరప్రియ | కన్నడతెలుగు సాహిత్య వినిమయ, 1980 |

పత్రికలు

అన్వేషణ, 1984 తెలుగుశాఖ, నా. వి. వి.

ఆంధ్రపత్రిక - 1942-43, (స్వర్ణోత్సవ సంచిక). 1965

కన్నెర-1953, తెలుగు-1987. భారతి - ఆగష్టు 1971

కన్నడం

| | |
|---|---|
| కేశవదాసరు, బేలూరు | హరిదాససాహిత్య - ఒందు అధ్యయన 1980 |
| కనకదాసర పదగళు చరిత్ర | (సం) కలమదాని గురురాయరు 1979 |
| కనకదాసర హాడుగళు | (సం) కృష్ణశర్మ, బెటగేరి, 1972 |
| పురందరదాసర పదగళు | (సం) ఎస్ ఎస్. కారంత, 1958 |
| పురందరదాసర పదగళు | (సం) ఎస్ టి మహాంతేశశాస్త్రిగళు 1979 |
| భక్త కనకదాసర పదగళు (చరిత్ర సహిత) | (సం) ఎం టి. ప్రశాంత 1976 |
| మరిమప్పభట్ట, ఎం | సంక్షిప్త కన్నడ సాహిత్యచరిత్రె 1960 |
| వ్యాసరాయవ హాడుగళు | (సం) కావ్యప్రేమి 1077 |
| సీతారామయ్య, వి. | శ్రీ పురందరదాసరు, 1971 |

పత్రిక

| | |
|---|---|
| ప్రబుద్ధ కర్ణాటక | సం 46. క్రోధన సం చైత్రసంచికె మైసూరు విశ్వవిద్యాలయ, మైసూరు-1964-65 |

ఆంగ్లం

| | |
|---|---|
| Aurobindo | The Foundations of Indian Culture |
| Archana | Prof Vissa Appa Rao, Birth Centenary Celebrations, Hyd 1984 |
| Barbara Stolen Miller | The Gitagovinda of Jayadev Love songs of the Dark Lord 1976 |
| Chalapathi Rao, G V | Ramadasa of Bhadrachalam 1980 |
| Deshpande P Y | Jnanadeva 1973 |
| Edward C. Dimock Jr, and Demise Levertov | In Praise of Krishna, Songs from the Bengali 1968 |
| Golden Jubilee Souvineer: | T T D Tirupathi 1984 |
| Hanuman Prasad Poddar | Gopis Love for Srikrishna 1965 |
| Keith, A B | A classical Sanskrit Literature, 1958 |
| Krishna Rao, M V | Purandara and Haridasa Movement 1966 |
| Kusumavathi Deshpande | Marathi Sahitya 1966 |
| Leelavathi Bhagwat | Sant Tukaram 1976 |
| The Minor Works of Tallapakam Poets Vol I | (Ed) V Vijaya Raghavacharya and Audinarayana Naidu 1935 |

Moulton, R G — Methods and Materials of Literary Criticism, 1913
" " — The Modern Study of literature 1915
Narasimha Rao V V L — Swamy Veerabramhendra 1989
Raghavan, V — The Great Integraters - Saint Singers of India 1966
Rajani Kantha Rao, B • Kshetiayya, 1981
Rama Krishna Rao, Adapa — Annamacharya, 1989
Ramanath Jha, — Vidyapathi 1983
Ram Avatar — Theory of Indian Ragas
Samba Moorthy — Greet composers Book-I 1962
" " — South Indian Music Book–IV 1963
" " — " " Book V 1963
Seshadri Ayyar, P — Sri Chaitanya and his Sikshashtaka - Prof K V Ranga swamy commemoration Volume 1940
Sitharamayya, V — Purandara dasa 1971
Sukumar Sen : History of Bengali literature 1979
Varadachari K C — Sri Ramanuja s Theory of Knowledge 1980
Venkata Krishna Rao, U — A hand BooK of classical Sanskrit Literature 1967

సంస్కృతం

జయదేవుడు. గీతగోవిందకావ్యమ్ — (హిందీ వ్యాఖ్యాత), కేదారనాథశర్మ, 1973
జయదేవుడు — గీతగోవిందము 1967 వావిళ్ళ ప్రచురణ.
" " — గీతగోవిందకావ్యము. అష్టపదులు 1985 బాలసరస్వతీ బుక్‌డిపో, మద్రాసు.
నారాయణతీర్థులు — శ్రీకృష్ణలీలా తరంగిణి, 1967 వావిళ్ళ ప్రచురణ
భరతముని — నాట్యశాస్త్రము
లీలాశుకుడు — శ్రీకృష్ణకర్ణామృతము, 1958 వావిళ్ళ ప్రచురణ.

హిందీ

ప్రమీలాదేవి, సూర్యకాంతి (అను) — సారంగపాణికా పదసాహిత్య
రామస్వామి [illegible] — మధురరస్ - స్వరూప్ ఔర్ వికాస్
విద్యాపతి పదావలీ-ఏక్ అధ్యయన్



—ooo—